# మానధనులు

[చరిత్రాత్మక నవల]



రచన:
హొవర్డ్ ఫాస్ట్
అనువాదం:
రమణారెడ్డి



విశాలాంధ్ర ప్రచురణాలయం,
బకింగ్‌హాంపేట :: విజయవాడ.

# విషయసూచిక





## అనుబంధం

4



"మూల సిద్ధాంతాలలో తప్పైనది ఏదికూడా ఆచరణలో ఒప్పుకాజాలదని చరిత్ర చాటుతున్నది. ఆ విషయమై ఆ యా కాలాలలో ప్రజలు భ్రమపడ వచ్చునేమో, కాని యీ సూత్రం ఎన్నడూ పొల్లు బోదని అంతిమ ఫలితాలే చాటగలవు. సమానమైన హక్కులను కాలదన్ని, సమానమైన హక్కులే పునాదిగాలేచిన సంస్థలను నిలుపుకోలేము."

— కార్ల్ షర్జ్



# అంకితం



కడచి చనిన అమెరికానే కాక, కదలి రాబోయే
అమెరికానుకూడ ప్రేమించమని నా కుపదేశించిన
మా నాయనకు.

# తొలిపలుకు

ఆరవై రెండేళ్ళనాటి మాట: అప్పుడు నేటి ఓక్లహోమాను ఇండియన్ ప్రదేశమని వ్యవహరించేవారు. పేరుకు తగినట్లే, యీ ప్రదేశంలో ఎండలు మండించేవి; నదులు నిర్జలాలై వుండేవి; దుమ్ము తెగలేచేది; పచ్చగడ్డి వాడిపోయి పసుపువన్నెకు తిరిగేది; కారునల్లని పైన్ వృక్షాలుండేవి.

సముద్రంనుండి సముద్రం పర్యంతం, పర్వత పంక్తినుండి పర్వత పంక్తి పర్యంతం, ఖండం ఖండంమీదుగా, రాక్షస కుమారుడొకడు కాళ్లేతులు పార చాపుకొనేతీరుగా, ఇన్నూరేళ్ళబట్టి, అమెరికా విస్తరించుకొనిపోయింది. ఈ విస్తరణ 1878 నాటికి దాదాపు సాంతమయింది. పర్వతాల నధిరోహించారు, లోయలను జనపదాలతో నించారు, సరిహద్దులను రూపుమాపారు. ఈ అపూర్వ విస్తరణ ప్రస్తుత కథాకాలానికే పాటలలోనూ కతలలోనూ తరచూ వర్ణించే అనుపల్లవిగా మారిపోయింది.

దక్షిణంనుండి ఉత్తరానికి, తూర్పునుండి పడమటికి మైదానాలలో రైలు బాటలు పరచుకొన్నవి. శాన్‌ఫ్రాన్సిస్కోనుండి రెండే రెండు నిమిషాలలో న్యూయార్కుకు తంతిఖబురు ప్రయాణం చేయగలిగింది. మైదానాలను రెండేరెండు రోజులలో రైలుబండి దాటగలిగింది.

టెక్సాస్ ప్రాంతీయులు తమ పసుల మందలను, ఉత్తరంగావున్న వయోమింగులోని రసపుష్టిగల లోయలను తోలుకున్నారు. నాగలి కర్రులు చీల్చగా వెనుకకుపోయే సంపన్నమైన రేగడినేలల తాకిడినికోరి, నార్వేనుండీ స్వీడను నుండీ వలసవచ్చినజనం ప్రెయిరీ మైదానాలలో గుమికూడింది.

జాతికి యవ్వనం ఆసన్నమయింది: థామస్ ఎడిసన్ బంధురాంధకారాన్ని రూపుమాపగల విద్యుద్దీపాన్ని కనిపెడుతూ వుండినాడు. సౌభాగ్యం మరలి రాసాగింది. సామ్రాజ్యవాదులతో సంఘటిల్లిన సంగ్రామాల గాయాలు ఒకటొకటిగా మానిపోతూవుండినవి. జాతికి మంచికాలం వస్తూవుండింది. వీటైన అన్నింటిలో యీనాటి మహోత్కృష్టమైనది. సుదూర గతానికిచెంది విస్మృతమయిపోయినదికాదు-నేడు బ్రతికివున్న అనేకుల స్మృతిపథాన యింకా మసలు

తున్నట్టిది. తన ప్రారంభోపన్యాసాన్ని ముగిస్తూ, రూథర్‌ఫర్డ్‌బర్చర్డ్‌హేయస్ యిట్లా అభిభాషింపగలిగాడు:

"బలాత్కారంమీద కాదు, స్వతంత్రప్రజల ప్రేమమయ శ్రద్ధాభక్తుల మీద ఆధారపడిన సమాఖ్య; 'శాంతీ సౌఖ్యమూ, సత్యమూ న్యాయమూ, మతమూ భక్తీ మననడుమ తరతరాలవరకు నిలకడకలిగి మనేంగాకున, మంచి గుణావర్ధనాలమీద, క్రమబద్ధంగా, నిలుపబడిన సమాఖ్యయిది."

స్వయం పూర్ణమవుతూవుండిన జలరాసివంటి యీ దేశాన ఓక్లహోమా మట్టుకు దీవివలె వుండిపోయింది. ఇతర పరిహద్దులన్నీ రూపుమాసి పోయినా కూడ, ఇండియన్ ప్రదేశముచుట్టూ వలయాకృతిల పరిహద్దొకటి యింకా నిలచి పోయింది. వేర్వేరు ప్రాంతాలతోటి వేర్వేరు దేశాలతోటి నిండి నిబిడీకృతమైన ఈ భూఖండాన్ని దేవుడు అమెరికన్లకు యిచ్చాడు. అమెరికన్లు ప్రపంచానికి యిచ్చారు. ఈ భూమిపై ఒకానొకప్పుడు అమెరికనేతరులు కాపురాలుండే వారు. నేటి వారికంటె నల్లటి ఒంటిచాయ కలిగినవారు. ఈ గోళార్ధాన్ని చేరుకొన్న తొలితెల్లవారు, వీరిని ఇండియన్లని పిలిచారు. కాని భూగోళశాస్త్ర విషయమై వీరి ఊహ అపోహగా తయారయింది. ఇండియన్లని పిలువబడిన వీరు యిండియన్లుగానే వ్యవహరించబడినారు.

ఈ ఇండియన్ల బ్రతుకు సరళసుందర మయినది. వేటాడుతారు, చేపలు పడుతారు, అప్పుడప్పుడూ పంటలు పెంచుతారు, అతిస్వల్పమైన కారణాలను పురస్కరించుకొని తెల్లవారు ఎట్లాగయితే పరస్పర సంహారానికి పూనుకొంటారో అట్లాగే ఇండియన్లుకూడ దురుద్యోగాలకు పాల్పడి పశుప్రవృత్తిని కనుపరచేవారు. వీరెంతోమంది లేరు. గడచిన మూడు శతాబ్దాలలో వీరిసంఖ్య మూడులక్షల కెప్పుడూ పైబడలేదు. అట్లాంటిక్ మహాసముద్రమునుండి పసిఫిక్ మహాసముద్ర పర్యంతం విస్తరించుకొన్న యీ అఖండ భూఖండంలో వీరు తెగలు తెగలుగా వంశాలు వంశాలుగా నివసించేవారు. వీరి గ్రామాలన్నీ ఒక్కచోట వుండేవికావు. ఇక్కడ ఒకటి, అక్కడ ఒకటిగా చెదురుగా వుండేవి.

వీరికొక దుర్గుణం కద్దు - క్షమించరానంతటి గొప్ప దుర్గుణం. ఎంతో కాలంనుండి తాము నివసిస్తున్న యీభూమి తమ సొంతమనే దురభిజాత్యం. ఈ భూమికొరకు, ఈ అభిజాత్యంకొరకు పోరుసలిపి, ప్రాణాలర్పించడం వీరికి మర్యాద. సంగ్రామకళాపండితమ్మన్యులైన శ్వేతవర్ణులు, నల్లవారికి, యీ భయంకర కళను మాత్రమేకాక, తంతోలు ఒలిచే సాధుకళను కూడ బోధించినారు. అయినాకూడ, వీరు తమ నమ్మకాలను మార్చుకోలేరు

అందుకని ఆటవికులమోస్తరు, ఇండియన్లు దెబ్బకు దెబ్బ కొట్టారు. 'మాతృభూమి' అని తాము ప్రియాతిప్రియంగా విశ్వసించే వసుంధరకొరకు పోరు

సాగించారు: తాము "ఆటవికులు" అయినందుచేత, ప్రథమంలోకూడ తమకంటే శత్రువులకు మూకబలం ఎక్కువయినందుచేత, ఓడిపోయారు. ఈ ఓటమికి మరొక కారణంకూడ వుంది. తమ జీవితవిధానం శిలాయుగాన్ని అధిగమించనే లేదు. ఆఖరుకు, కొంతకు కొంత భూమి తమదిగా వుండేందుకు ఒడంబడిక, సంధిపత్రాలమీద సంతకాలుచేశారు. కాని యీ సంధిషరతులను ఉల్లంఘించడం జరిగింది. కనుక భూమికంపెనీలు తమ పొలాలను ఎకరానికి యిరవైసెంట్లు మొదలుచేసికొని యిరవై డాలర్లవరకు ఏదో ఒక ధరకు తెగనమ్మక తప్పలేదు.

వలస భూములలో జాతీయభావం ఉదయించింది. ఉన్నచోటు చాల లేదు. కనుక పశ్చిమాభిముఖంగా అమెరికన్‌జాతి అపూర్వ శీఘ్రగతిలో అంగలు వేసింది. దేనినైతే మనం "సరిహద్దు" అంటున్నామో, అది వుప్పెనలో ఒడ్డున విరిగిపోయే అల అంచువంటిదయింది. అట్లాంటిక్ మహాసముద్ర తీరాన వుప్పతిల్లిన యీ వుప్పెన పసిఫిక్ మహాసముద్రంవరకుగల యావద్భూఖండాన్ని ఆక్రమించు కొన్నది. అప్పుడే అమెరికాకు యవ్వనం ఆసన్నమయింది, బాల్యకౌమార దశలు గతించి.

కాని ఈ విరిగిన అలఅంచులంచుల, యీ "సరిహద్దు" కేవల తమ యిళ్ళ కొరకు తమ జీవితవిధానంకొరకు ఆయుధపాణులైన ఇండియన్లు నిత్యం మసలుతూనేవున్నారు. మొదట మొదట, ఉప్పెన పొంగు ఇండియన్లమీద నిష్కారుణంగా నడచిపోయింది. కాని అటుపిమ్మట అమెరికాకు న్యాయబుద్ధి అనేదొకటి ఏర్పడింది. అది న్యాయబుద్ధి అయినా కావచ్చు. లేకపోతే, అనివార్యమైన దాని కెదురొగ్గి నిరంత సమరమొనర్చే యీ నల్లజనమంటే పుట్టిన విసుగుదల అయినా కావచ్చు.

వీ రెక్కడికో ఒక కడకు పోనిదే యీ సమస్యకు పరిష్కారమంటూ వుండదు. బయళ్ళభూమి అంతటిలోకీ ఓక్లహామాకీత ప్రదేశం. బావురుమనే యీ దిబ్బాసి నేలను ఇండియన్లకు కేటాయించి, యీ ప్రదేశానికి ఇండియన్ ప్రదేశమని శాసనసభ పేరుపెట్టింది. ఇంకా తిరుగుబోతులుగా స్వతంత్రంగా బ్రతుకుతున్న ఇండియన్ తెగలను ఓక్లహామాలో స్థిరపరచే పథకాన్ని తయారు చేసింది.

ప్రస్తుత కథ ఒక గొప్ప జాతి చరిత్రలో అతి స్వల్పసంఘటనను గురించినది. ఇదే దాని నాంది.

13

# డార్లింగ్టన్ సంఘటన

## జూలై 1878

ఓక్లహామాలో నడివేసవిరోజు. లోహనిర్మితమైనట్లున్నది నిర్మేఘగగనం. ఈక్షణమో మరుక్షణమో మరగకాచిన ఉష్ణద్రవాన్ని వదలిపెట్టేందుకు సిద్ధపడినట్లు అనిపిస్తున్నది. ఆకాశంనుండీ, సూర్యునినుండీ, దక్షిణపవనాలు రేగొట్టిన టెక్సాస్ ఎడారినుండీ, కడకు భూమినుండికూడా, ఉడుకు ఎగుస్తూఉంది. పొడి పొడిఅయిననేల అందమైన ఎర్రదుమ్ముగా కరిగిపోతూవుంది. పైనా, లోనా ప్రతిఒక్కదానిమీదా, ఎర్రదుమ్ము విస్తరింపుకుంటూవుంది. ఎదుగుదల ఆగిపోయిన నల్లని పైన్ చెట్లుమీద, పసుపువన్నె పచ్చికమీదా పేళ్ళ కట్టుతూవుంది. రంగులయినా పూయని ఇళ్ళమీద పడుతూవుంది. రూపుచెడిన పెంకులమీద వ్రాలి, అవియిటీవలే ఎందునుండి యేర్పడినాయో, ఆ భూమికీ, పెంకులకూ చుట్టరికం కల్పుతూవుంది

మిడిమేలపు ఎండలో ప్రతిదానికీ అసహజమైన వికారాకారం యేర్పడినట్లే ప్రతిదీ మిలమిలలాడుతూవుంది. చెట్లులేనిచోట గంతులువేస్తూపోయే ఎలుక, వేడిగాడ్పు కెగిరివచ్చిన గోధుమవన్నె గుడ్డపేలికవలె వుంది. ఏజన్సీ భూములను తణిఖీచేసేందుకు ప్రొద్దుట బయలుదేరిన ఏజంటు, జాన్ మైల్స్, కాస్త ఆగినాడు. తాను ఆరేళ్లుగా ఇండియను ప్రదేశంలో వుంటున్నాడు కాని తనకింకా ఓక్లహామా వేసవి మామూలు కాలేదు. నిరుటి వేసవికంటే ఆగామివేసవి మరింత తీవ్రమవుతూవుంది. నేటి ఎండధాటి చూశాక, నిరుటి ఎండధాటి మరచిపోయాడేమో లేకుంటే.

గంజిపెట్టిన మెడపట్టీలోపల వ్రేలుదూర్చి, జాగ్రత్తగా చుట్టూ తడిమి చూచుకొన్నాడు. పదకొండుగంట లయిందప్పుడు. ప్రొద్దు నెత్తిమీదికి వచ్చేసరికి గంజిలోని చివరిబిగువు సడలిచ్చిపోతుంది; కాలరు తొక్కుతొక్కుగా తయారవుతుంది మామూలుగా. అసలు ఎండలున్నంతకాలం యీ గంజిపెట్టిన తెల్లటికాలరు వాడడమంత తెలివితక్కువపని మరొకటిలేదని, అని లూసీఅత్త పదేపదే చెప్పింది. లూసీఅత్త యీయనగారి భార్య. దానికిందులు మెడరుమాలు

కనుక వాడితే, అది చేరుమాలుగాకూడా పనికివస్తుందట, యింతకంటె బాగా వుంటుందట; మరి, ఉద్యోగప్రతిష్ఠకు భంగమూ కలిగించదట.

ఈ చివరిఅంశం విషయమై, అతనికింకా సంశయాలు నివృత్తికాలేదు. స్వల్పమైనవి కొన్ని కలిసికొంటేనే, ఉద్యోగప్రతిష్ఠ అనేది, అధికారి హోదా అనేది ఏర్పడుతుంది. వీటిలో ఏ ఒక్కదానిని విడిచిపెట్టినా, అన్నింటికీ స్వస్తి చెప్పడమే తరువాయి కాక తప్పదు. నాగరకతకు దూరమయ్యేకొద్దికీ యీ స్వల్ప విషయాలకు ప్రాధాన్యత అధికమవుతుంది.

చెయిన్నీ, అరాపహో తెగల ఇండియన్ల ఏజన్సీఅయిన డార్లింగ్టన్‌కంటె నాగరికతకు దూరమైపోయిన ప్రదేశం మరొకటిలేదని అతని ఊహ.

చేరుమాలుతీసి, ముఖం తుడుచుకొన్నాడు. తననెవరైనా చూస్తున్నారో లేరోనని ఒకమారు చుట్టూచూశాడు. తర్వాత వంగి, నల్లజోళ్ళమీద చేరిన ఎర్ర దుమ్మును చేరుమాలుతో తుడిచివేశాడు. ఎప్పుడైనా పదిమంది ఎదుట మళ్ళీచేరుమాలునుతీసే అవసరమొస్తే, ఈ ఎర్రదుమ్ము మరకలు కనుపిస్తాయేమో? అందుకని, మురికిపడిన భాగంమట్టుకు లోపల ఉండేలాగున, చేరుమాలును జాగ్రతగా మడిచి, భద్రపరిచాడు.

ఇండియన్ ఏజంటుగా తనకు ఉద్యోగమయిన పిమ్మట తాను సాధించిన విజయాలలో మొదటిది పాఠశాలస్థాపన. ఇక్కడ తనమూలానజరిగిన అభివృద్ధిని తలచుకొంటె గర్వం పైకొంటుంది. కాని, యీ గర్వం రెప్పపాటులో అణగిపోగల ప్రమాదమున్నదని తానెరుగును. పాపకార్యాలపట్ల తీవ్రవైముఖ్యం, నిరాడంబరత్వం, నిర్గర్వం, హింసాప్రాతికూల్యం ముఖ్యలక్షణాలయిన క్వేకరు కూటమికి చెందినవాడు. కొద్దో, గొప్పో భక్తిపరుడుకూడా. కాబట్టి గర్వాన్ని భద్రంగా దాచుకొన్నాడు. ఈ తీరున దానిని అణగద్రొక్కినందుచేత, నిరాశమట్టుకేకాక, ఒకవిధమైన ఉపశమనాన్ని సంతృప్తినికూడ తాను పొందగలిగినాడు.

పాఠశాలను చూచేసరికి, దానికి తిరుగ రంగువేయవలసిన అవసరమున్నదని గమనించినాడు. శీతకాలపుచలి రంగును తినివేయగా, యీ మిర్రెండ దానిని కరిగించివేస్తూవుంది. పై అధికారులు తిండి దినుసుల సరఫరాలనే మొదలంటిపోయేటట్లు తగ్గిస్తున్నారు కదా, మరి రంగు రేషన్లు ఎక్కువచేస్తారా? అడగడమే అనవసరం ప్రయోజనం శూన్యం అనుకుంటూ తలవూపినాడు.

దుమ్మురువ్వ అడ్డుతగిలింది. దానిని దాటబోయాడు. కాని మడమలవరకూ అందులో కాళ్ళు కూరుకొని పోయాయి. జోళ్ళను ఎన్నిమార్లని శుభ్రపరచడం? ప్రయోజనంలేదు. తన మీదుగా సుడి తిరిగి లేచిన ఎర్రదుమ్ములోపడి దగ్గుకొంటూ మునుసాగి పోయినాడు.

అరాపహో తెగ ఇండియన్ ఒకడు దారికడ్డునిలచి వున్నాడు. పసుపు వన్నె మురికికంబళి కప్పుకొన్నాడు. కాళ్ళకు జోళ్ళులేవు. మెత్తటి ఇండియన్

మాటల ప్రవాహాన్ని అధికారిమీద వదలిపెట్టినాడు. కాలిపోతున్న కాళ్ళను యిట్టటు మార్చిమార్చి నిలబడలేక నిలబడుతూవున్న ఇండియన్‌కూ మైల్స్‌కూ నడుమగా దుమ్ము లేచింది.

ఈ మనిషి మైల్స్‌కు గుర్తెరుకే. ఇతనిపేరు 'రాబర్ట్‌రాంబందు.' కాస్త కాస్త యింగ్లీషుకూడ మాట్లాడగలడు. చెయిన్నీ అరాపహోలభాష ఆరేళ్ళలో మైల్స్‌కు యింకా సరిగా లొంగలేదు. ఆరేళ్లేమిటి అరవైఏళ్లు యిక్కడవున్నా యింతేనని అనుకొన్నాడు మైల్స్.

"ఇంగ్లీషులో మాటాడవోయ్" అన్నాడు ఓపికపోయి.

"మాయింటికి-అదిఅంటుందీ, పెట్టగుణ్ణు పెట్టడం లేదట, పాడుపచ్చిన పెట్ట."

"మంచిది. ఈవిషయమై సెకర్‌గారిని దర్శించు, పో."

"జానీ, గుణ్ణుసంగతి ఆయన పట్టించుకోడే," అన్నాడు ఇండియన్ మూర్ఖంగా.

"నేనే ఆయనతో మాటాడుతానులే," అన్నాడు మైల్స్ ఓపిక తెచ్చిపెట్టుకొని.

"ఆ పాడుపెట్టను కోసిపారేసుకొంటాం."

"అట్లయితే మరి మావద్దనుండి నీకింకొక కోడిపిల్లకూడా రాబోదు," అంటూ ముందుకు సాగినాడు మైల్స్.

పాఠశాల వరండానీడలోకి వచ్చేసరికి, అతనికి ప్రాణం కుదుటపడింది. ఇసుకదుమ్మకు యిల్లు అడ్డుగా వున్నందుచేత, యిక్కడ కాస్త చల్లగావుంటుంది. ఇప్పుడిప్పుడు, కనుబొమలు కలిసికొనేచోట చిరుపోటు మొదలవుతున్నది. అంటే సాయంకాలానికి తలనొప్పి తప్పదు. ఎండలోపడి నడిచినందుకు లూసీదెబ్బలు తప్పవు. వచ్చేటప్పుడు, గొడుగుతీసికొని పొండని సలహానయితే యిచ్చిందికాని, యీకొద్దిపాటి ఎండనుకూడా సహించలేని అధికారినిచూచి ఇండియన్లు నవ్వుకొంటారని లూసీకేం తెలుసు? ఆమె మందలించడం మంచిదే అయింది. ఇది ఒకందుకు పనికివస్తుంది. భోజనానికిముందు హాయిగా చన్నీళ్ళస్నానంచేయడానికి మహా చక్కటి సాకు దొరికింది.

పాఠశాలలోనుండి గొంతుకల సవ్వడి వినిపిస్తున్నది. ఇక కొంచెంసేపు తాళిచేయబోయే చన్నీటిస్నానం గురించి అందమైన ఆలోచనలు వస్తున్నవి. తాను నిలుచున్న చోటునుండి, కెనడియన్‌నది పాడిశయ్యావరకూవున్న భూమి వాలు, ధూళి, వాడిన పచ్చిక, దానిమీద నెలకొల్పరచుకొన్న నల్లపైన్ చెట్ల గుబుర్లు, చూడవచ్చు. నదీశయ్యకింకా పైగాచూస్తే, పసిమీ ఎరుపూ కలగలిసిన ఓక్లహోమా భూదృశ్యం లోహాకాశానికి గంతువేస్తో వున్నట్లుంది. కొసలు కూచిగా వున్న యిళ్ళతోనిండిన ఇండియన్ గ్రామం, తడిలేని నదీశయ్యను నిష్ఫలంగా

చీకుతున్నట్లుంది. తడివూటకోరకు అటూ యిటూ కదలుతూ మారుతూవున్న రాబర్ట్ రాంబందు ఆకృతితప్ప, యీ ఉపరితలమంతటా, మరొక్క వస్తువు కూడా జీవించి వున్నట్లులేదు. ఇండియన్లు దాదాపు యావన్మందీ ఆవరకే బర్రెలవేటకు వెళ్ళిపోయారు. ఉత్తచేతులతో బిక్కముఖాలతో వేటనుండి తిరిగి రావడం వారికి మామూలే. ఇక, కొంపాగోడీ కనిపెట్టుకొనివున్న ఆడజనాభా సూర్యాస్తమయంవరకు యిళ్ళుదాటి బయటికి అడుగు వేయరు.

బడిగంట మ్రోగింది. తలుపులు బారలుగా తెరచుకొన్నవి. ఇండియన్ బాలబాలికలు గోలగోలగా కిలకిలమంటూ బయటపడినారు. హాడ్గిన్స్‌సతి, పాఠశాల మేట్రన్, బయటికి వచ్చేసరికి, వరండాలో మైల్స్‌ఉన్నాడు. అప్పటికే పిల్లలు పచ్చికమీద చెల్లాచెదరుగా పోతున్నారు. హాడ్గిన్స్‌సతి భారీమనిషి: భారీతొడలూ, వెళ్ళబొడుచుకొనివచ్చే వక్షస్థలమూ, దొప్పలవంటి బుగ్గలూ, చిన్ని నీల నేత్రాలూ, నెరసిన శిరోజాలూ ముఖంనుండీ మెడనుండీ అవిరళంగా స్వేదం ధారాప్రాయంగా దిగజారుతున్నది. మైల్స్‌ను చూశాక, పిల్లలవైపు తిరిగి, బిగ్గరగా చప్పట్లుచరిచి, "పిల్లలూ! ఏయ్ పిల్లలూ, ఏజంటుమైల్స్ వచ్చేశారు. ఆయనకు అందరూ గుడ్‌మార్నింగ్ చెప్పండి," అని అరిచింది.

ఏ కొద్దిమందో ఆగారు. మిగతావాళ్ళు పరుగుదీశారు.

"మరేం ఫర్వాలేదు," అన్నాడు మైల్స్.

"నాకెంతో విచారంగావుంది. ఎండకాలంలో ఎంతకష్టమెంతకష్టం! ఏమి ఉడుకు ఏమివుడుకు! ఈ పాడు ఉక్కలో దేనిమీదా మనసునిలిపి పని చేయలేముకదా!"

ఆమె బాధ అతనికి బోధపడినట్లుంది. సానుభూతి పూర్వకంగా మైల్స్ తలవూపినాడు.

"కష్టాలేకరువు పెట్టడంలేదనుకొంటాను" అంది హాడ్గిన్స్ సతి. ఇంతలో మిగత యిద్దరు టీచర్లు వరండాలోకి వచ్చారు. జోషువా ట్రూబ్లడ్, అతనిభార్య మెటిల్డా. వారిద్దరుకూ సా క్వేకర్లే "పిలుపు" నందుకొని ఈ ఇండియన్ ప్రదేశానికి వచ్చేశారే కాని యీ ప్రదేశం వారి రసం పిండివేస్తున్నది. జోషువా ట్రూబ్లడ్ అల్పకాయుడు. నడకలో కాస్త కాలు ఎగురవేస్తాడు. ఎండుగడ్డివన్నె మీసాలు. అతని బ్రతుకును నరకమనవచ్చు. ఇండియన్లంటే అతనికున్న జడుపు, మెటిల్డాకున్న జడుపుకు మట్టుకే తరువాతది. టీచరుగా అతను నిష్ప్రయోజకుడు. అతని భార్య మెటిల్డా చిట్టెలుకంతటిమనిషి. అతనికి నీడవలె కన్పిస్తుంది. ఇన్ని వున్నా కాని, వింతయిన నైతిక మూర్ఖ విశ్వాసంవల్లనే, వారు ఏజన్సీలో వుండిపోగలిగినారు.

"ఈ పాడెండలలో కూడ స్కూలుపెట్టడం ఎంతో అవమానకరం," అన్నాడు జోషువా.

"అవును మరిరెండు రోజులలో శెలవులిచ్చేస్తాం. వేటలలో యీ పిల్లమూకి కూడ పాల్గొంటుందేమోనని భయంచేతనే యిన్నినాళ్ళు స్కూలు పెట్టాను. బట్టలు లేనిచోట వాటికోసం వెదుకులాడుతూ పిల్లల్ని తమతోబాటు లాక్కొనిపోకుండా, మెరక నేలలో పడిపోవడం వీళ్ల తలిదండ్రులకు తగనిపని" అన్నాడు మైల్స్. మెట్కాఫ్ నాలుక చప్పరించింది.

"ఎండకాలంలో ఎంతకష్ట మెంతకష్టం" అన్నది హాడ్జిన్స్ సతి. మైల్స్ తనకుతానే హెచ్చరిక చేసుకొన్నాడు. తలపోటు మొదలయిందిప్పుడు. వరండా నీడను విడిచిపెట్టడానికి మనసు ఒప్పడంలేదు. "పోయివస్తాను భోజనమప్పుడు కలుద్దాం" అన్నాడు.

ఇండియన్ గ్రామం వైపుగానున్న దిగుడు దిగడానికి తనకుతానే బలాత్కరించుకొన్నాడు. ఏజన్సీ రైతుల పర్యవేక్షణలో ఇండియన్లు ధాన్యాన్ని ఉలగడ్డలను కోసుకూరను పండించిన పొలాలు దాటిపోయాడు. శుభ్రపరచిన నేల నొల్లనిదానివలె పొలాలనంతా నిండుకొనివుంది ధూళి. అటువంటి ఎండలో ఇండియన్లను పనికి వంగించడానికి సర్వేశ్వరుడు వచ్చినా నిష్ప్రయోజకుడై తిరిగి పోవలసిందే.

కోడిపిల్లలగుంపుగుండా నడిచిపోయాడు మైల్స్. అవి రేగొట్టిన దుమ్ము అతని ముఖంలోకి కళ్ళలోకి దూరింది. దగ్గినాడు. శిరస్సులో సుత్తిదెబ్బలు కొట్టి నట్టు బాధవేస్తున్నది. పొలాలలో తిరుగుతున్న కోడిపిల్లలను చూస్తూ యిటు తిరిగి నిలుచున్నాడు.

ఇంటికి పోయేదారిలో, కొత్తగా కట్టినకొట్లు వున్నవి. వాటిని చూస్తూ పోయాడు. ప్రస్తుతం ఇండియన్లు నివసిస్తున్న టెపీలనబడే యిళ్ళువిడచి, యీ కొట్లలో వుండాలని అధికారులకాంక్ష. ఇంకా వీటికి రంగు కొట్టలేదు. ఎండలకు పైన్ చెక్కలు పలచబడిపోతున్నవి. ఇదేమీ బాగులేదన్నట్లుగా తలవూపి, మొండిగా ముఖంపెట్టి, మైల్స్ స్వగృహంవైపు సాగిపోయినాడు.

భోజనానికి కూర్చున్నవారు జాన్ మైల్స్, అతని భార్య లూసీమట్టుకే కాదు. జోషువాదంపతులూ, ఏజన్సీ విషయాలలో సర్వకార్యాలు నిర్వహిస్తున్న జాన్ సెగర్ కూడ వచ్చివున్నారు. నల్లటికేశాలు, నల్లటివస్త్రాలు, నల్లటికళ్ళు కల వాడు రాయివంటి యీ సెగర్. ఏజన్సీలోకి మైల్స్ వచ్చిన నాటినుండి సెగర్ సైతం ఉంటున్నాడు. ప్రారంభంలో అడ్డదిడ్డాల పనులన్నీ చేయడమే యితని వుద్యోగం. కాని పోనుపోను, ట్రూస్లెడ్ దంపతులకు పరిస్థితి విపత్కరంగా కనుపించినప్పుడు వారు పాఠశాలకు ఎగగొడితే, పాఠాలు చెప్పడం లగాయతు, విస్కీ దొంగవ్యాపారులనుపట్టి పట్టార్చే పర్యంతమూగల సకల కార్యాలలోనూ దక్షుడయ్యాడు.

3

ఇండియన్లు సెగర్‌ను జానీస్మోక్‌కర్ అని పిలిచేవారు. బడిలో పిల్లలకు యితను నేర్పిన జోలపాటలోని పల్లవినిబట్టి, యీ పేరు అతనికి వచ్చింది: బల్లముందు కూర్చొన్నవారందరిలోనూ, తనపనిపట్ల అభిమానమున్నవాడు యితనొక్కడే. ఇండియన్లను యితను బోధపరచుకొన్నాడు. మరి, వాళ్ళుకూడ యితనిని ఆకళించుకొన్నారు.

కోపంతో ధుమధుమలాడుతూ, చెమ్మటక్రక్కుతూ, భోజనశాల ప్రవేశించాడు. ఏజంటు మైల్స్ తీరుబడిగా సుదీర్ఘంగా అభినందించిన పిమ్మటగాని తనను తాను సముదాయించుకోలేకపోయినాడు. తర్వాత, అరాపహో ఇండియన్ పనిపిల్లవెంబడే వంటమనిషి మిస్టర్ బంక్ వచ్చాడు. ఆ పిల్లచేతిలో వేడివేడి పీసూప్ పాత్రవుంది. దానిని తొణికిస్తుందేమోనని భయంతో జాగ్రతగా చూస్తూ ఆ పిల్లవెంబడే బంక్ నడుస్తున్నాడు.

"ఇట్లాంటి ఎండల్లో వేడిసూప్ చలువచేస్తుందని నా నమ్మకం", అన్నది మైల్స్‌సతి, లూసీ.

"అవునేమో, లూసీ అత్తా," అని బంక్ ఆమోదించాడు, బల్లకు దూరాన నిలువబడి, ఇండియన్ పిల్ల సూప్ పాత్రను దానిస్థానంలో భద్రంగా పెట్టినంత వరకూ కళ్ళప్పగించి చూస్తూ "కావచ్చునేమోకాని, జీసస్, వంటసాల వుడుకెత్తి పోతూవుంది. బయట పడకపోతే పిచ్చెత్తుతుందేమోనని పిస్తూవుంది. వంటవాళ్ళు చాలమంది పిచ్చివాళ్ళవుతున్నారంటే మరి అబ్బురమెందుకు?"

"రేపోమాపో చినుకులు పడవచ్చు మరినువ్వు భగవంతుడిని స్మరించావు. అది ఊరికే పోదులే" అనింది లూసీ, తీయగా నవ్వుతూ.

నడుముచుట్టూ చుట్టుకొని వున్నగుడ్డకు చేతులు తుడుచుకొంటూ, ఇండియన్ పని పిల్లను ముందుకు నెట్టుతూ, బంక్ వంటసాలకు మళ్ళిపోయాడు.

లూసీ సూప్‌ను వడ్డించసాగింది. మరింకొక్క క్షణమైనా తాళలేకపోయిన సెగర్ "బర్రెలు వేటాడు తుండినవారి నిద్దరిని తరిమికొట్టాను," అన్నాడు ఒక్కుమ్మడిగా.

"బర్రెవేట గాళ్ళనా?" అని అడిగాడు మైల్స్ సంకట పడుతూ "ఈ దరి దాపుల బర్రె అనేదే అపురూపం."

మైల్స్‌సతివైపూ, మెటిల్డా ట్రూ్లాడ్‌వైపూచూస్తూ, తల పంకిస్తూ, "వాళ్ళను నేనట్లాగే పిలుస్తాను. వాళ్ళనింకా ఏమని పిలవాలనుకొంటున్నానో భగవంతుడికెరుక. మడ్డిమూక, దగుల్బాజీలు, ముకిలంజకొడుకులు-యీసరుకు బక్‌స్కిన్‌లో నీకు తెలిసే వుంటుంది. వాళ్ళుకూడ ఒకప్పుడు చర్మాలకొరకు వేటాడేవారేమోకాని యిప్పుడదేమీలేదు. మిగత అన్ని రాష్ట్రాలలో వున్నవారి కంటె, యీ ఏజన్సీ ప్రదేశంలో దుర్మార్గులు, నీచులు, పోట్లాటంటే చెవిగోసుకొనేవాళ్ళూ ఎక్కువమంది వున్నారు" అన్నాడు జానీస్మోక్‌కర్.

"ఇక్కడ వాళ్ళకు కావలసిందేమిటి?" అని మైల్స్ అడిగాడు.

ఆడవాళ్ళను నిర్దేసిస్తూ, రహస్యంగా చెప్పినట్లు, "మరింకేమిటి? స్క్వాలు-అంటే ఇండియన్ స్త్రీలు" అన్నాడు సెగర్.

"ఇదేమీ బాగోలేదు."

"నేనెరగనూ? అదీ ఈ ఎండల్లో! పడుకొని, వీరిని విడిచిపెట్టే విషయం ఏదో కలగన్నాను. బర్రెతోలుమీద వెండ్రుకపరకైనా లేకుండా వుత్తచేతులతో తెగలు తిరిగివచ్చినప్పుడు, అప్పుడు కథ ముదురుతుంది."

"త్వరగా భోంచేద్దాం" అన్నాడు మైల్స్ నిదానంగా, మాటలను జాగ్రతగా వాడుతూ, తలపోటుతో వారిమాటలను విన ప్రయత్నిస్తూ. "ఆ తర్వాత, నువ్వు రనోకోటకుపోయి, కలనల్ మిజ్నర్‌నడిగి, యిక్కడికొక సైనికదళాన్ని పంపమందువుగాని. అప్పుడుగాని మనపని కుదుటబడదేమో!"

"అవునేమో మీరనేది" అన్నాడు సెగర్ నిరుత్సాహంగా.

భోజనం దాదాపు పూర్తికావస్తుంది. ఇంతలో కిటికీ కెదురుగా కూర్చున్న మైల్స్‌కు, యిటువైపే స్వారిచేసుకొంటూ వస్తున్న ఇండియన్లు కనుపించారు. కంటిభ్రమేమో, వేడిఎక్కువైనందుచేత పగటికల కంటున్నానేమో ననుకొన్నాడు మైల్స్ ప్రారంభంలో. అర్ధనగ్నశరీరులు, చిత్రవర్ణశోభిత శరీరులూ ఇండియన్లొక యిరవైమంది, అస్థిపంజరాలవలె బక్కచిక్కిపోయిన అశ్వాల పుష్టినిమించిన పుష్టిగలవారు యిటే వస్తున్నారు. ఎర్రదుమ్ము మబ్బులలో గుర్రాల పొట్టలు తేలివస్తున్నట్లున్నవి.

"ఈశ్వరుడు కటాక్షించుగాక!" అన్నాడు నెమ్మదిగా మైల్స్. అతనెటువైపు చూస్తున్నాడో, అటే యితరులు చూపులు పరపినారు.

"ఈశ్వరుడు కటాక్షించుగాక!" అన్నాడు మైల్స్ మళ్ళీ "చిటపాటి చినుకులే రాలవుకాని వున్నట్టుండి కుంభవృష్టి విరిగిపడుతుంది" అన్నాడు సెగర్.

సెగర్ గదినుండి వరండాలోవచ్చి నిలుచున్నాడు. అందరూ అతని వెనుక చేరారు. అప్పటికే ఇండియన్లు యింటిముంగిలి చేరుకొన్నారు. వారి చేతులలో ఆయుధాలేవీలేవు. ఇది చూచి సెగర్ అమ్మయ్య అనుకొన్నాడు. వచ్చినవారు చెయిన్నీతెగ ఇండియన్లు. వీరి నాయకులు సెగర్‌కు తెలిసినవారే. వారిలో ఒకనిపేరు బండకత్తి; మరొకనిపేరు తోడేలు.

ఉత్తరాది చెయిన్నీ జట్టుకు బండకత్తి నాయకుడు. ఈ ఏజన్సీలోకి కట్టకడపటవచ్చి నెలవేర్పరచుకొన్నది వీరే. వీరి స్వస్థానం వయోమింగ్‌లోని నల్లమలలు. స్మృతికి అందనినాటినుండి అదే వారి జీవగడ్డ. బర్రెలను వేటాడడానికి అప్పుడప్పుడూ చిలకేటుగా మాన్టానా బయళ్ళమీదికి, ఉత్తర డకోటాలోనికి దండువచ్చేవాళ్ళు. కాని వచ్చినపని పూర్తికాగానే, కొండలకు మరలిపోయేవాళ్ళు. మిగత చెయిన్నీ జట్లు అన్నీ నాగరికతను స్పృశించిన తర్వాతనే,

యీజట్టు యిక్కడికి వచ్చింది. ఏమేమి కావలెనో, అదిఅంతా తమ కొండలలోనూ, రసపుష్టిగల పౌడరునదీలోయ సారభూములలోనూ లభించేది. మరి ఎంతో కాలానికి తెల్లవారు వచ్చి ఈ భూముల నాక్రమించుకొన్నారు. 1865 లో హార్నీ - సాన్బర్న్ ఒప్పందం కుదిరింది. ఉత్తరాది బయళ్ళలోని ఇండియన్లకు, అంటే, సియూ, చెయిన్నీ, అరాపహో తెగలవారికి, తమ స్వస్థానమైన పౌడరు నదీలోయ యావత్తూ హామీచేయబడింది. చిన్న మిస్సౌరీనదినుండి నల్లమలలువరకు, రాకీపర్వతశ్రేణి పాదగిరులవరకూ కల భూమిని పౌడర్‌నది తడుపుతుంది. ఈ విశాల వసుంధరలోగిట తరతరాలవరకు ఇండియన్లు సుఖమయంగా జీవించగలరని నాడు అందరూ ఊహించారు. వేటజంతువులు మిక్కుటమై వుండేవి. అదీగాక, రైలుదారికి యీ ప్రదేశం అందుబాటులో వుండేదికాదు. పసులదేశం ఇక్కడికి దక్షిణాన పదిహేనువందల మయిళ్ళ కావలవుండేది. ఆ తర్వాత, యూనియన్ పసిఫిక్ రైలుదారి వేయడం జరిగింది. పౌడరు నదీభూములలో గుర్రపు పిరుదలంతఎత్తున పెరిగింది మేలిపచ్చిక. యావత్ప్రపంచంలో యిటువంటి పశుమయ భూమి యింకొకటి లేదనే పేరు వచ్చింది. టెక్సాస్ నివాసులు తమ పసులను ఉత్తరంగా పదిహేనువందల మయిళ్ళ దూరానికి తోలుకొసాగినారు. ఇండియన్ల నుండి వీరిని సంరక్షించడానికి ప్రభుత్వం దుర్గాలు నిర్మించింది. ఇండియన్లు ఎదురు దెబ్బ కొట్టారు. హార్నీ-సాన్బర్న్ ఒప్పందం మట్టిపాలయింది. వేరేసంధిని తయారు చేసేందుకు ప్రభుత్వం తంత్రాంగ దక్షులను పంపింది. మళ్ళీ పాతకథ మొదలయింది. పసులు, రైలు దారులు, భూమి, కంపెనీలు. కనుక విధిలేక ఇండియన్లు వెళ్ళిపోవలసి వచ్చింది.

చాలమంది ఇండియన్లు నిరాశోపహతులై మాతృభూమిని విడచిపెట్టిపోయిన చాల కాలంవరకు, బండకత్తి నాయకత్వాన ఉత్తరాది చెయిన్నీలు పోరుసాగించినారు. 1877 వసంత కాలమప్పటికిగాని, మెకన్జీసేనానికి లోబడిపోయారుకాదు. తమ నివాసభూములను పరిత్యజించి, యిండియన్ తెగలకొరకని దక్షిణాన ప్రభుత్వం కేటాయించిన ఏజన్సీకి వెళ్ళిపోవలసిందని, ఏజన్సీలో వారి యోగక్షేమాలకు ప్రభుత్వం పూచీ పడుతుందని, అక్కడ శాంతిసౌభాగ్యమయ జీవనం నికరంగా వుంటుందని, వీరికి నచ్చచెప్పారు. తమ బంధువులైన దక్షిణ చెయిన్నీ తెగవారు యీ వరకే ఓక్లహామాలో నెలకొని సుఖిస్తున్నారని ప్రభుత్వం చెప్పింది. ఈ అన్ని వాదాల చిట్టచివర, పిడివాదం ఉండనే ఉన్నది. బలప్రయోగం, సంయుక్త రాష్ట్రాల ఆశ్వికదళం. ఈ చివరి వాదమే ఇండియన్లకు బలవత్తరంగా కన్పించింది. ఇప్పటికి ఏజన్సీకివచ్చి ఒక్క యేడాది మాత్రమే కావచ్చింది.

ఈ ఒక్క ఏడాదిలో వారనుభవించిన కష్టనష్టాలను చెప్పనలవికాదు. పౌడి బయళ్ళనుండి, ఉత్తరాది కొండలనుండి, మలేరియా వ్యాపించిన పల్లపుభూములకు, జ్వరాలనూ జాడ్యాలను వెంటబెట్టుకొని, యీగలవలెవచ్చి చేరుకొన్నారు. వేట

ఆట అయిన వీళ్ళు మాంసాహారులు. వన్యజంతు సమృద్ధమయిన భూమినివదలి, జంతువులేకాక సౌందర్యముకూడ లోపించిన ప్రదేశానికివచ్చారు. వీళ్ళురాక ముందునుండికూడ, మైల్సుకు సరిగా రేషన్లు అందేవికావు. ఇప్పుడు యీ క్రొత్త జనంవచ్చినతర్వాత పాతజనానికికూడా సరిగా చాలీచాలని రేషన్లను పెంచడం గురించి దేవుడెరుగును. తోలుకొంపలలో కోపం వెళ్ళగ్రక్కుకునే, దైవభీతిలేని యీ ఆటవికులకొరకు, వున్న రేషన్లను దండుగచేయడం మైల్సుకిష్టంలేదు. ఏడాది నుండి వాళ్ళు మలమల వస్తులు మాడుతున్నారు. అందుచేతనే, బక్కచిక్కిన గుర్రాలనెక్కి బిక్కచచ్చివున్న మనుష్యులు, భూతాలను గుర్తుకుతెస్తున్నారు.

ఏజన్సీ ముంగిటివరకు సవారిచేసి, అక్కడ ఆగినారు. గుర్రాలమీదుగా ముందుకువంగి, వరండాలో నిలుచునివున్న ఐదుమందిని, ఏమాత్రం ఆసక్తిగాని లేక, చూస్తున్నారు. ఎర్రదుమ్ము తెరలు తెరలుగా లేచివచ్చి, పడినచోట్లంతటా గూళ్ళుకట్టుకొంటున్నది.

“మెట్డిండాను లోనికి తీసుకెళ్ళు” అని మైల్సు భార్యతో అన్నాడు. వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు. మరి, జోషువాట్రూబ్లడ్, నరాలు పీకుతున్నట్లు కాలు మార్చి కాలు మీద నిలుచుని బిక్క ముఖంవేసి వున్నాడు. తోడేలూ బండకత్తీ వరండాదగ్గర గుర్రాలనుండి దిగారు.

ఇద్దరూ వయోధికులేకాని బండకత్తి మరింత పెద్దవాడు, మరింత దుర్బలుడు, మరింత ఆత్మవిశ్వాసదార్ఢ్యాలు లోపించినవాడు. కాళ్ళకుతొడిగిన పాతకాలపు పూసలజోళ్ళ రంధ్రాలలో కాలివ్రేళ్లు చొనుపుతూ, కాలిమీదనే చూపాన్చి, యిసుకలో నిల్చున్నాడు. తోడేలు వరండాలోకి వచ్చాడు. అతని వైఖరిలోయేమాత్రం అల్పుడననే కొద్దిభావమేలేదు.

బయళ్ళ జనాలలో కంతటిలోకి పొడగరులయిన చెయన్నీలలో తోడేలు పొట్టివాడుగనే లెక్కపడుతాడు. దాదాపు సెగర్ ఎత్తువుంటాడు. భుజాలు బలిష్టాలుకాని కాస్త వంగిపోయినవి. ముఖం చర్మమయం. తీగలు తీగలుగా నిడుపాటి కేశాలు. ముఖం అందమయినది. దవడ బలమైనదీ, పెద్దదీ-అసలే యిండియన్ల నోళ్ళు వెడల్పు అయినవి. అందులోనూ తోడేలు నోరు మరీ వెడల్పయినది. వంకరతిరిగినవిశాలనాసిక. ఒకదానికొకటి చేరువుగా, చిరుముడుతల గజిబిజిలో చిక్కుపడిపోయిన చిన్ని తెలివైన కన్నుజంట. బ్రతుకు బ్రతుకంతా ఎండవానలకు గాలివిసుళ్ళకు అలవాటైపోయినాడనిపించే ఆకృతి తోడేలుది. భయాలను తరుమగొట్టేది ఏదో వింతశక్తివుంది అతనిలో. వరండామీదికి అతనెక్కివచ్చిన నిశ్చల గంభీరమైన నడకతీరులోనో, మైల్సుకు సెగర్‌కు ట్రూబ్లడ్‌కు తన చేతినందించిన నిర్భయమైన సాభిమానమైన పద్ధతిలోనో, ఎందులోనో చెప్పలేము. అతనిపట్టు బటువైనదీ బిగువైనదీ.

మృదువైన మంజులమైన చెయిన్నీ భాషలో తోడేలు మాట్లాడుతుంటే, ఏదో గొప్ప రహస్యాన్ని గోప్యంగా చెప్పుతున్నాడేమో అనిపిస్తుంది. ఈ వినబడీ వినబడని మాటల భావాన్ని గ్రహించగల భాషాజ్ఞానం చాలినంతగా వారిలో ఎవ్వరిలోనూ లేదు. "ఇంగ్లీషు వచ్చా?" అని సెగర్ అడుగగా, "కొద్దిపాటిగా వచ్చు" నన్నాడు తాబేలు

"వీళ్ళు యిక్కడికి ఎందుకువచ్చారో అడిగి తెలుసుకో, జాన్" అన్నాడు మైల్స్ కలగుండుపడి.

సెగర్ అడపాతడతా చెయిన్నీభాషలో మాట్లాడినాడు. తల ఓరగా పెట్టుకొని, ఆ మాటలకు చెవులప్పగించి, తోడేలు నిలుచున్నాడు.

"పాతవిషయమే. నేను బోధపరచుకోగలిగినంతవరకూ - చాలీ చాలని తిండి, బర్రెలకొరత, జబ్బులూ జాడ్యాలూ, ఉడుకూ ఉక్కా - అంతా పాడిన పాటే. బహుశా నేనే అపార్థం చేసుకొన్నానేమో! ముసలాడు మండిపడు తున్నాడు. వీళ్ళతో సొంతం మాట్లాడేందుకు గురియర్‌ను పిలువనంపు" అని సెగర్, మైల్స్‌తో చెప్పాడు.

ఎడ్మండ్ గురియర్ సంకరజాతి మనిషి. ఏజన్సీలోనే ఉంటూ, భాషాంతరీకరిస్తూ, ఏజంటుకూ తన రక్తబంధువులయిన ఇండియన్లకూ నడుమ రాయబారిగా పనిచేస్తూ, చాల వుపయోగపడేవాడు. ఇతనిని తీసుకొనిరమ్మని ట్రూన్లడ్‌ను పంపాడు మైల్స్. ఇండియన్ పెద్దలను ఏజన్సీ ఆఫీసులో పొగ పీలుద్దురుగాని రండని సెగర్ ఆహ్వానించాడు. ఇంటిలోకి పోయేముందు బండకత్తి తెల్లవారి కరస్పర్శచేసి మరి ప్రవేశించాడు. వారి మంచితనం గురించి తోడేలుకున్న నమ్మికకూడ అతనికిలేదు. ఇంతవృద్ధుడయినా, గంభీరుడయినా, అతను భయపడిన శిశువు మాదిరి అగుపించాడు.

ఆఫీసులో సెగర్, పైప్‌లో పొగాకుకూరి వెలిగించాడు. కాని ఇండియన్ పెద్దలు కూర్చోనూలేదూ, పొగత్రాగనూలేదు. ఉక్కపోస్తున్నా, కంబళ్ళు మట్టుకు దట్టించి కప్పుకొన్నారు. చిన్న గదిగోడలలో ఒకదానికి ఆనుకొని నిలుచుండిపోయారు. గురియర్‌కోసం ఎదురుచూస్తుండిన నిమిషాలు తాపీగా ఒకటొకటిగా గడచిపోతున్నవి. కిటికీలోనుంచి చూశాడు మైల్స్. అశ్వారూఢులై సుస్థిరంగా ఓపికగా కూర్చొనివున్న చెయిన్నీలే కనుపించారు. సెగర్‌కు తెలిసిన చెయిన్నీ బాసలోగానీ, తోడేలుకు తెలిసిన యింగ్లీషులోగానీ, సంభాషణ సాగించి ప్రయోజనంలేదు.

కొద్దిసేపటిలో చక్కెర తినుబండారాలు ప్లేటులో పెట్టుకొని, మైల్స్‌సతి ఆఫీసులోకి వచ్చింది. భర్తగురించి గుండెపీకుతూనే వుందికాని, గదిలో ప్రతివీ ఎంతో ప్రశాంతంగావుంది కనుక ఆమె పెదిమలమీద చిరునవ్వు అంకురించింది.

అతిథుల కిద్దరికి తినుబండారా లీయబోగా, వారు నిరాకరించేసరికి ఆమె దెబ్బతిని పోయినట్లు ఆశ్చర్యం ప్రకటించింది.

"ఇంతకు మునుపేనాడూ వీళ్ళు నేను చేసిన చిరుదిండి నిరాకరించలేదు" అన్నది.

"వీళ్ళు ఉత్తరాది చెయిన్నీలు అడివిసరుకు అనాగరికులు," అని కారణం వివరించాడు సెగర్.

"మరి, ఆకొన్నట్టున్నారే!" అనింది మైల్స్‌సతి.

"ఇంక, యిటు చూడులూసీ," అని మైల్స్ అడ్డువచ్చాడు." ఇది తీవ్రం కావచ్చు. వీళ్ళతో మేం మాట్లాడాలి. ఎడ్మండ్ కోసమని మనిషినిపంపి కూడ చాలసేపయింది. ఇక నువ్వు యింట్లోకెళ్ళి పోతే బాగుంటుంది."

"సరే అట్లాగే. వీటినిక్కడ పెట్టిపోనా?"

పరధ్యానంగా మైల్స్ అంగీకారం సూచించాడు. బల్లమీద ప్లేటు పెట్టి ఆమె లోపలి కెళ్ళింది. జేబునుంచి గడియారం తీసి, ఆలస్యమేమాత్రం తాను సహించనట్లుచూసి, "అతనేడి?" అని సెగర్ నడిగాడు.

తనకు తెలియదన్నట్లు సెగర్ భుజాలెగురవేసి, దమ్ము పీల్చసాగాడు. గదిలో ఉక్క ఎక్కువయింది. సమ్మర్దం ఎక్కువయింది. ఇండియన్ నాయకుల నుండి గుర్రాల వాసనా, పచ్చితోలు వాసనా, కాలినకొయ్య వాసనా వస్తున్నది సెగర్‌లేచి, కిటికీవద్దకు వెళ్ళి కాలిన పొగాకునుసిని బయట కుమ్మరించాడు. తినుబండార ముక్కటి తీసుకొని మైల్స్ కొద్దికొద్దిగా కొరికి తినసాగినాడు. అతని శిరోబాధ యింకా తగ్గలేదు. ఆశించినట్లు, చన్నీటి స్నానం పొసగిందికాదు.

"అదుగో- వచ్చేశారు", అన్నాడు సెగర్.

గురియర్‌ను గదిలోపలికి తీసుకొనివస్తున్న ట్రూబ్లడ్ రొప్పుతూరొజుతూ, "పల్లెకొక్క పరుగున వెళ్ళాను." అంటూ కష్టంమీద నిశ్వసించాడు. "నేనను కున్నా—"

అసమ్మతిని సూచిస్తూ సెగర్ నవ్వినాడు. "నోట్సు తీసుకోగలవా, జోషువా?" అని మైల్స్ అడిగాడు.

ఆమోదపూర్వకంగా తలాడించి, ట్రూబ్లడ్ ఒత్తుఅట్టనూ పెన్సిలునూ సమకూర్చుకొనసాగినాడు. గొప్ప ప్రయత్నముచేసి తన మామూలు నైశ్చల్యాన్ని తిరిగి యేర్పరచుకొనచూస్తున్నాడు. తలటోపీ లోపైపునుండి, తర్వాతముఖంనుండి చెమటను తుడిచివేస్తూ, ఇండియన్‌నాయకుల నిద్దరిని నిర్దేశించి గురియర్ తల పంకించి, చెయిన్నీ భాషలో పలుకరించాడు. ఉద్యోగమర్యాదసూచించే శుష్క గౌరవాలను విడిచిపెట్టి, నేరుగా వ్యాపారసరళిలో, తెల్లవారిమోస్తరు ప్రసంగించాడు.

"వాళ్ళు యిక్కడికి ఎందుకువచ్చారో అడుగు" అన్నాడు మైల్స్.

"తమకు కావలసినది తిండే అయినట్లయితే, శిబిరాలకువెళ్ళి వుండవచ్చు. అదనపురేషన్లు ఏర్పాటుచేస్తాను."

"తిండికాదు. ఇళ్ళకు వెళ్ళిపోవాలంటున్నారు." అన్నాడు గురియర్.

"సరట్లయితే అభ్యంతరమేమిటి? వాళ్ళిక్కడ తిష్టవేయడం నాకూ యిష్టంలేదు. ఇష్టంవచ్చినంత శీఘ్రంగా తిరిగిపోవచ్చునని నామాటగాచెప్పు."

"శిబిరాలకనుకుంటున్నారేమో వాళ్లు పోదలచుకొన్నది... అదికాదు ఇల్లంటే వయోమింగ్ అని వారి భావం" అని గురియర్ విశదీకరించాడు.

"ఆఁ? వయోమింగుకా పోతామంటున్నారు! అది సాధ్యమేకాదు."అని బల్లను చేతితో చరచి అరిచాడు మైల్స్. "వీల్లేదని చెప్పు. నిజానికది పూర్తిగా పొసగదని వీళ్ళూఎరుగుదురు. వాషింగ్టన్‌నుంచి అనుమతిరానిదే, ఒక్కపురుగైనా కాని ఇండియన్ ప్రదేశంవిడచి వెళ్ళలేరనిచెప్పు. అటువంటి అనుమతికూడా రాదని వాళ్ళకు స్పష్టంచెయ్. ఇదే తరతరాల పర్యంతం ఇండియన్లకు యిల్లు. తమయింటిని యేవిధంగా చక్కదిద్దుకుంటారో ఆ బాధ్యత తమదే. సోమరిపోతులై పోతురాజులై, పగలంతా యిళ్ళల్లోనే పడుకొని గుర్రుపెడుతూనే వుంటే, తమకు యింతకంటె మేలిబహుమానం లభించదని తేటతెల్లంగా చెప్పు వీళ్ళకు. వాళ్ళిక్కడ వుండిపోక తప్పదు."

గురియర్ భాషాంతరీకరిస్తున్నాడు. జోషువాట్రూల్లడ్ వ్రాసుకొనిపోతున్నాడు. సెగర్ దమ్ములాగుతున్నాడు. గురియర్ పూర్తిచేసేటప్పటికి, నాయకులిద్దరూ ఒకరిముఖం ఒకరు చూచుకొన్నారు. బండకత్తి ముఖంలో, నిరాశతో కూడిన సందిగ్ధం వ్యాపించింది. నెరసిన తలను అలసిపోయినట్లు పంకించి, యిక పోదామన్నట్లుగా వున్నాడు. కాని తోడేలు అనురాగపురస్సరంగా, బలవత్తరమైన హస్తాన్ని, వృద్ధుని హస్తంమీదవేశాడు. ఇదే ఆ ముదుసలిని నిర్బంధపరచ గలిగింది.

తోడేలు మాట్లాడుతూవుంటే, గురియర్ నేరుగా భాషాంతరీకరిస్తున్నాడు, తానే ప్రధమ పురుషలో చెప్పుతున్నట్లు. చెయెన్నీ భాషను యింగ్లీషులోకి తర్జుమాచేయడం అతనికి సులువు. పదాలను జాగ్రతగా ఏర్చి, నోటుపుస్తకంలో వ్రాస్తున్న ట్రూల్లడ్‌మీద కన్నుంచి, చెప్పుకొని పోతున్నాడు.

గొంతుక చించుకోలేదు, ఉద్రిక్తుడు కాలేదు తోడేలు. పరమశాంతుడై, "ఎంతకాలమని యిక్కడ మేముండిపోవాలి?" అన్నాడు. "యావన్మందిమీ అంతరించిపోయేవరకూనా? ఇళ్ళల్లో గుర్రుపెట్టేవారని మావాళ్ళను మీరు ఎగతాళి చేస్తున్నారు; కాని ఏమి చేయమంటారో మీరే సెలవియ్యండేం? పనా? మాపని వేట. ఆ వృత్తిలోనే మేమంతా బ్రతికాము. ఎప్పుడూ పస్తులు మాడలేదు. మనుషులకు గుర్తున్నదినాళ్ళనుండి బయళ్ళతో, కొండలతో ఎత్తయిన పైన్ అడవులతో కలకలలాడే మా సొంతనేలలో వుంటూవచ్చాము. జాడ్యమనేది

ఎరగము. ఏ ఒక్కరో, కాకుంటే యిద్దరో చనిపోయేవాళ్ళు. కాని ఇక్కడికి వచ్చిననాటినుండి, జాడ్యాలవాతబడి మాలో ఎందరో చనిపోయారు. మా అల్లారు ముద్దుబిడ్డల ప్రక్కఎముకలు బయటపడిపోతుంటే కూర్చున్నాం చూస్తూ. తన యింటికి తాను వెళ్ళిపోతానంటే నేరమా? పోయేదానికి మీరు ఒప్పుకుంటే పోనీ కనీసం మాలో కొందరిని వాషింగ్టన్ కయినా పోనీయండి పైవాళ్లదగ్గర వెళ్లబోసుకొంటాం మా కడగళ్లు. అదీ పొసగదా, తమరే ఎవరినైనా వాషింగ్టన్‌కు పంపి, మాలో మిగిలి వున్నవారుకూడ చనిపోకముందే, యీచోటు విడిచి వెళ్ళేందుకు అనుమతినయినా తెప్పించండి."

సరళ సాత్వికమైన యీ వాగ్ధాటిలోని శక్తి గురియర్ భాషాంతరీకరణలో కొంత ప్రస్ఫుటమయింది. చేతులు బారలుగాచాపి, ముగించాడు. ఈ చిన్ని ఆఫీసులో ఒక క్షణంవరకు తీవ్రమైన నిశ్శబ్దం మనింది. తర్వాతమంత్రప్రభావం పనిచేయుడం మానింది. తలటోపీని చేతివ్రేళ్ళ నడుమ మెల్లగాత్రిప్పుతూ దానిని పరిశీలిస్తున్నాడు గురియర్. తాను వ్రాసిన దానిని ట్రూల్డ్ చదువుకొంటున్నాడు తనలోతాను. ఎంతో ఓపికను తెచ్చిపెట్టుకొని, గమ్మగా కూర్చున్న సెగర్‌వైపు తదేకంగా చూస్తున్నాడు మైల్స్. సెగర్ తీరుచూచి మైల్స్ అసూయ పడినాడు. సెగర్ అట్లాగే కూర్చుని యీ నాటకమంతా తనదేమీ పోనంతటి నిరుద్రేకంగా చూడగలడు. మరి తానో, అమెరికన్ జాతి రాజ్యాంగ విధానాన్ని కిరాతకులకు బోధించడమెట్లా? వీళ్ళకేమో లోతుపాతులు తెలియవు. వారి భావనలో న్యాయాన్యాయాలు మట్టుకే పరస్పర బాహ్యంగా నివసిస్తవి. తమ కోర్కెలు తీరడమొక్కటే కావలసింది. తామిప్పుడు పోదలచుకొన్న ఉత్తరాది భూములను కూడ ఒలిచి వేయడం జరుగుతున్నదనీ, అరణ్యాలనుండి జంతువులను తుడిచిపెట్టుతున్నారనీ, పొలాలూ తోటలూ ఏర్పాటు చేసికొంటున్నారనీ వీళ్ళు తెలిసికోవడంలేదు. డార్లింగ్టన్ ఏజన్సీలో నాగరికతను ప్రవేశపెట్టాలని తాను ఒకప్పుడు కనినకలను వీరికి విప్పి చెప్పినా ఫలంలేనట్లున్నది. ఇండియన్ ఆఫీసును ఈ విషయమై శ్రమపెట్టడానికి వీలేలేదు. పరిస్థితిని తానొక్కడైనా చక్కబెట్టాలి. లేకపోతే, రెనోకోటలో వున్న మెకంజీ సేనాని సహాయమైనా అర్థించాలి. ప్రస్తుతానికి వీరిని మంచిమాటలతో మభ్యపెట్టడమే ఏకైకమార్గంగా మైల్స్‌కు కన్పించింది.

"ఇప్పుడే వాషింగ్టన్‌కు మనిషినంపడం పడదు" అన్నాడతను మెలకువగా "కొన్ని రోజులయ్యాక ఆలోచిద్దాం. ఏజన్సీలో మీరు మరొక్క ఏడాది వుండిపోతారనుకోండి. అప్పటికీ యీ బ్రతుకు మీకు సరిపడకపోతే, వాషింగ్టనులో వుద్యోగులకు యీ విషయం తెలియచేస్తాను—"

తోడేలు శిరఃకంపనం చేశాడు. "మరొక్క ఏడాది అంటున్నారు. ఆలోపల మేమంతా చనిపోతే? మేమిప్పుడే వెళ్ళిపోవాలి. మీరు చెప్పినట్లు

మరో సంవత్సర మిక్కడే వుండేట్లయితే, ఉత్తరానికి మా యిళ్లకు పోయేందుకు ఒక్కడు కూడ ప్రాణాలతో మిగిలివుండడేమో!"

"నేను చెప్పవలసింది నేను చెప్పాను" అన్నాడు మొండిగా మైల్స్. అతని తల ఘంటావలె మ్రోగుతూ వుంది. వేడిముసుగు వెనుక మిలమిలలాడే బొమ్మలవలె కనుపిస్తున్నారతనికి ఇండియన్ నాయకులు. వీళ్లను ద్వేషించ కూడదని అనుకున్నాడు. తనలో తానే తర్కవితర్కాలు చేసుకొన్నాడు. వీళ్ళ కష్టారోపణల వెనుక గల న్యాయాన్ని కొంతైనా చూద్దామని ప్రయత్నించాడు. కాని అంతా గజిబిజి అయిపోయింది. తనని చన్నీళ్ల స్నానం చేయకుండా వీళ్ళు వచ్చి పడ్డారు. చన్నీటి స్నానం చేస్తేనేగాని తల తలనొప్పి విరగడైపోదు. పాడు దుమ్ము. వెధవెండ. క్రొత్తగా కట్టిన కొట్లలో రంగువేయని పైన్ చెక్కలకు కొట్టిన చీలలు అప్పుడే వదలిచ్చి పోతున్నాయి. శేషన్లు చాలడంలేదు. డార్లింగ్టన్‌లో ఎంత ఒంటరి బ్రతుకు! ఏ 'పిలుపు' నందుకొని తానిక్కడకు వచ్చాననుకుంటున్నాడో, దానికి విరుద్ధంగా తనలో పోరాటం జరుగుతున్నది. ఇవి అన్నీ గజిబిజిగా కలగలిసి పోయాయి.

"చెప్పవలసిందేదో చెప్పాను. హామీ యిచ్చాను. ఇంతకుమించి నేనేమీ మాటివ్వలేనని వీళ్ళకుచెప్పు" అని గుర్రియర్ మీద చిటుమటుగా మాట విసిరినాడు.

పెద్దలిద్దరూ విన్నారు. మారు పలుకలేదు. కానున్నది కాకమానదనే తీరుగా తలలూపి, గదిలో వున్న ప్రతి ఒక్కరి కరాలు స్పృశించారు. కరస్పర్శ ఒక్కటే తెల్లవారి మట్టుమర్యాదలలో మిగిలిన తంతు. దీనిని సాంగోపాంగంగా నిర్వర్తించ బూనుకొన్నారు. తోడేలు ముఖం తోణుకూ బెణుకూ లేని ముసుగువేసికొన్నట్లనిపించింది. కాని బండ కత్తి కళ్ళు ఎర్రబడి నిరాశనూ దుఃఖాన్నీ, వెలిపరుస్తున్నై.

గదిదాటి బయటపడ్డారు. మైల్స్ విముక్తి లభించినట్లు నిట్టూర్చాడు. కాని సెగర్ వాళ్లతోబాటు వరండావరకూపోయి, వాళ్ళు అశ్వారోహణ చేయడాన్ని గమనిస్తున్నాడు. తతిమా యిండియన్లు యథాపూర్వంగా పచ్చితోలు జీనులమీద ముందుకు వంగి కూర్చొని వున్నారు. ఎట్లావచ్చారో అట్లాగేవరసగా వెళ్ళిపోయారు. లోతైన ఎర్రదుమ్ములో గుర్రాలడెక్కలు సడిచేయడమేలేదు. వారి వెనుకనే బంకమన్ను చూర్ణమై మెడఎత్తుకులేస్తూవుంది. మరికొంచెందూరంపోయారు. ఇప్పుడు వాళ్ళు భయంగొలిపే ఎర్రమబ్బుల మీదుగా తేలిపోతున్నట్లనిపించింది.

"జాన్, చన్నీళ్ళు పోసుకోబోతున్నాను. కాస్త చూస్తూ వుండేం!" అన్నాడు మైల్స్, వాకిటిగుండా తలవెళ్ళబెట్టి ఇంకా సెగర్ ఆలోచిస్తూ పొగ లాగుతూ పరాయత్తంగా వున్నాడు. కాని మైల్స్ అడిగినదానికి జవాబుగా సరే నన్నట్లు తల ఊపినాడు.

"విషయం కొసముట్టినట్లేనా?" అని సాతురంగా అడిగాడు మైల్స్.

"నాంది మాత్రమే" నన్నాడు సెగర్ నిదానంగా.

# పలాయితులు ముగ్గురు

## ఆగస్టు 1878

ముగ్గురు మనుషుల విషయం ఏజంటైన మైల్స్‌కు తెలియజేసింది జిమ్మీ ఎలుగుబంటు అనే అరాపహో ఇండియన్. వేటాడుతూ జిమ్మీ ఉత్తరంగా పోయివుండినాడు. ఇది జరిగింది మరి కొన్ని వారాల తర్వాత. వాన లింకా పడ లేదు. కనుకనే ఎండలు తగ్గలేదు. మొదటినుండీ ఓక్లహామాలోనే వుంటున్నా, జిమ్మీ ఎప్పుడూ యిటువంటి ఎండలు చూడలేదు. భూమి ధూళిగా మారి, మనిషి గొంతుకనూ ముక్కునూ కళ్ళనూ నొక్కివేసి వూపిరాడకుండా చేయడమనేది యింతకు ముందెప్పుడూ జిమ్మీ చూడలేదు. రెండు దినాలనుండి వేటాడు తున్నాడు కాని ఒక్కగానొక్క జీవినికూడా అతను చూడలేకపోయాడు.

నడిప్రొద్దు మిడసరపు కాకకు తాళలేక పోయాడు. పసుపువన్నె పచ్చిక మీద, గుర్రపు పొట్టనీడలో ముడిగి పడుకొని సెగ తప్పించుకొన్నాడు. పొర బాటున ఎండిపోయిన తెల్లటి బర్రెపుర్రె ఎముక నొకదానిని తాకేసరికి, వ్రేలు చుర్రుమన్నది. లేచి, గుర్రమెక్కి కూర్చున్నాడు. జీను కాలిపోతున్న కత్తి లాగై, అతను కాళ్ళను కోసివేసింది.

“ఈ మిడసరపు ఎండలో వున్నన్ని రోజులు వుండను. త్వరగా చచ్చి పోతాను,” అని బాధతో మూల్గుతూ బిగ్గరగా అన్నాడు జిమ్మీ.

జిమ్మీ క్రిశ్చియన్ మతం పుచ్చుకొన్నాడు. ధాటీగా ఇంగ్లీషు మాట్లాడ గలడు. కనుకనే తోటియిండియన్లు జిమ్మీని గురించి “సొంతబాసను కోల్పోయిన వాడు”, అని నిర్దేశిస్తారు.

ఉత్తరాభిముఖులై గేలప్ చేస్తూన్న గుర్రాల నెక్కి పోతున్న చెయిన్నీలు ముగ్గురితని కంటబడినారు. ఉన్నట్టుండి జిమ్మీ తల తిరిగినట్లయింది. బహుశా ఎండదెబ్బ ఏమో. ఇంత ఒళ్లు తెలియకుండా పరుగులు దీస్తున్న గుర్రాలివి త్వరలో హతమైపోతవి, అని చూచీ చూడడంతోటే అతనను కొన్నాడు. తర్వాత మరొక ఆలోచన తట్టింది. ఈ విధంగా గుర్రాలను తరుముకొని ఉత్తరానికి పోతున్నారు. రేపోమాపో యీ గుర్రాలు నేలకొరిగిపోవుచ్చు. అప్పుడేం చేస్తారు? పట్టుబడతారు. ఆహా, తప్పక పట్టుబడిపోతారు. ఇంకేం ?

ఈ ఆలోచనలతో జిమ్మీ గుర్రాన్ని అదిలించి వారివెంట పడినాడు. అతని నోటినుంచి ఒక్కమాటయినా బయటపడలేదు. ఇంతలో వాళ్లు వెనుదిరిగి చూచారు. గుర్రాలను దక్షిణం మళ్ళించారు. చూపా అది? కాల్చేచెట్టున్నమంట. అతను బేజారెత్తి పోయాడు. వీళ్ళు కాల్చి కుప్పగూలుస్తారేమోనని భయపడ్డాడు. వాళ్ళు తెగించినట్లున్నారు. క్రిశ్చియన్లా, దయతలవడానికి? అడవిమూక. బండకత్తి వూరునుండి వచ్చిన ఉత్తరాది చెయిన్నీలు.

"ఎక్కడి కిటుపడి పోతున్నారు?" అని వారి బాసలోనే జిమ్మీ గొంతెత్తి అడిగాడు.

"ఉత్తరం!" అని జవాబు. "మాసీమకే మరెక్కడికి?" మళ్ళీ గుర్రాలను ఉత్తరం మళ్ళించి, ఉన్మాదుల మోస్తరు, తుర్రున పోయారు.

◆ ◆ ◆ ◆

వాళ్ళు ముగ్గురూ వెళ్ళుతున్న దెక్కడికో, అది చల్లటిసీమ. అందున్న పచ్చని తరుజాలము, పిల్లగాడ్పుల గిలిగింతలు తలచుకొంటే, ఏజన్సీకి తిరిగిపోవడం జిమ్మీకి రుచించలేదు. అతనికికూడ పిచ్చెత్తినట్లయింది.

"నాకే ఎందుకు చెప్పుతున్నాడు వీడు? ముగ్గురుకాదు, వాళ్ళు పదిమంది దయ్యపువాతపడినా నాకేంపోతుంది?" అనుకుంటూనే, బహు జాగ్రత్తగా ఏజంటైన మైల్స్ జిమ్మీని ప్రశ్నించాడు. మరొక గంటలోపల యీ కబురు ఏజన్సీ అంతటా పాక్కిపోతుందని తానెరుగును. ఇటువంటి వార్తలకే ప్రచార మెక్కువ. ఈ ఉక్కలో, ఉమ్మంలో క్రోధాగ్ని రగుల్కొనేందుకు యీ చిన్నిరవ్వే చాలు.

"ఆ ముగ్గురూ బండకత్తి జట్టువాళ్ళని తెలుసా నీకు నిఖరంగా?" అని మైల్స్ అడిగాడు. తెలుసునన్నట్లు జిమ్మీ తలఊపాడు. చేయిపైకెత్తి వేళ్లమీద "ఒకడు, యిద్దరు, ముగ్గురు...ముగ్గురు" అని లెక్కించాడు.

"ఉత్తరం పోతూనా? నిజమేనా?" అని మైల్స్ యింకా అనుమానంగానే ప్రశ్నించాడు.

"దేవుడిసాక్షిగా నేనెరుగుదు. ఉన్మాదుల మోస్తరు దౌడుతీశారు."

"వాళ్ల పేర్లేమిటి?"

తెలియదన్నట్లుగా అరాపహో భుజాలాడించాడు. "వాళ్ళుచుట్టుకు ఉత్తరాది చెయిన్నీలే."

జిమ్మీమాటలపట్ల మైల్స్‌కు యింకా నిండుగా నమ్మిక కుదరలేదు. సెగర్ యిప్పుడిక్కడ వుంటే బాగుండు ననిపించింది. తానొక నిర్ణయానికి భట్టుమని రావడానికి సెగర్ తోడ్పడతాడని కాదు. పొగపీలుస్తూ, నిశ్చలంగా వున్న సెగర్‌ను చూస్తేచాలు ఇండియన్లు బెదురు కొంటారు. తనకంటె సెగరుకు ఇండియన్ త్వరగా నిజంచెప్పి వేస్తాడని మైల్స్ అనుకొన్నాడు.

"వాళ్ళ పేర్లు తెలియవంటున్నావు కదా, మరి వాళ్ళు ఉత్తరాది చెయిన్నీ లని ఎట్లా నిర్ధారణ చేస్తావు?" అని మైల్స్ అడిగాడు. జిమ్మీ మాట్లాడలేదు. ఒంటికి దలికి తే మాట్లాడు తున్నట్లున్నవి. కళ్ళు చిన్నవి చేశాడు. చేసి, నీవుపరమ మూఢుడవన్నట్లు, మైల్స్ వంక చూశాడు జిమ్మీ. పంచదార తినుబండారాలూ, చల్లటి నిమ్మరసమూ పట్టుకొనివచ్చి, బల్లమీద పెట్టింది లూసీ అత్త. చేతులు నలుపు కొంటూ, ఆదుర్దాగా జిమ్మీ ఏజంటువంక చూశాడు. ఆమోద పూర్వకంగా మైల్స్ తలపంకించినదే ఆలస్యంగా, తినుబండారాలను కబళించి, నోటిలో కుక్కుకొని సాగినాడు.

"బాగున్నాయా యేం, జిమ్మీ?" అని నవ్వుకొంటూ లూసీ అత్త అడిగింది. తల ఆడిస్తూనే, తినేస్తున్నాడు. వాములు మ్రింగేవాడికి గుళ్ళు మ్రింగడ మొక లెక్కా? గిన్నె ఖాళీ అయిపోయింది. తియ్యటివన్నీ మ్రింగుడై పోయాయి. నిమ్మరసమంటే లక్ష్యమే చేయలేదు.

"మరి, యీ చల్లటి ఛేషైన నిమ్మరసం పుచ్చుకోవూ?" అని అడిగింది లూసీఅత్త.

వద్దన్నట్లు తలవూపి, లేచి వాకిలివైపు పోయాడు. "అయిపోయింది. మరి నువ్విక వెళ్ళిపోవచ్చు", నన్నాడు మైల్స్. జిమ్మీ వెళ్ళిపోయిన తర్వాత, భార్యతో "లూసీ, వీళ్ళను ఎందుకిట్లా మేపుతావు?" అన్నాడు మైల్స్.

"బాగానే వుంది. తమని మేపడమే నా పని అన్నట్లుగా వాళ్ళు ఎదురు చూస్తుంటే నన్నేం చేయమంటారు?"

"అట్లా ఎందుకనుకోవలసి వస్తుంది? ఆ అవకాశం యివ్వకూడదు. వచ్చిన ప్రతిపర్యాయం మిఠాయిలు ముట్టగలవని వాళ్లు ఆశించకూడదు. రేషన్లు కేటా యించి యిస్తున్నప్పుడు పక్షపాతంగాని, అభిమానంగాని చూపకుండా, ఎవరెవరి అవసరాలకొద్దీ వాళ్ళకు సక్రమంగా, న్యాయంగా ముట్టేటట్లు చూస్తున్నాను కదా!"

"క్షమించు జాన్", అనింది లూసీ.

"సరే...సరే"నని తలాడించాడు మైల్స్ పరధ్యానంగా పెన్సిలు నాడిస్తూ, తనముందున్న కాగితంమీద చిన్ని చిన్ని సున్నాలు గీస్తూ. "సెగర్ ఎక్కడుంటాడో చెప్పగలవా?"

"ధాన్యపు కొట్టుదగ్గర ఉండవచ్చు" ననింది లూసీ.

తలటోపీ చేబూని, మైల్స్ బయటికివచ్చి, కొట్లకేసి పోయాడు. నిన్నటి నిర్లక్ష్యం వలన సంక్రమించిన చిరుమూర్ఛ నేడు గుణపాఠమయింది. తానే చలి జ్వరంతో మంచంపట్టితే, ఏజన్సీ తెడ్డులేని పడవ చందమవుతుంది. కొట్లముందు నీడలో హాయిగా కూర్చొని, తెగిపోయిన జీను సామాను నొకదానిని సెగర్ వేసు

కొంటున్నాడు. ఇతనిలో రాతివంటి చేవవుంది. చలించడు. తొణుకూలేదు. బెణుకూలేదు. అదురుబెదురులే లేవు.

ఇతని మనశ్శాంతినిచూచి, మైల్స్ అసూయపడినాడు. ఏజంటు రావడం చూచి తలఊపి సెగర్ తిరిగి తన పనిలో పడిపోయాడు. జిమ్మీ ఎలుగుబంటు చెప్పిన ఉదంతాన్ని మైల్స్ ఏకరువు పెట్టుతుంటే, వింటూనే పనిచేసుకొంటూన్నాడు. మైల్స్ చెప్పడం పూర్తిఅయింది. "ఆఁ! ముగ్గురుపోతే పెద్ద చిక్కేమీ లేదులే" అన్నాడు సెగర్ మృదువుగా.

"పొగరుమోతు ముగ్గురే పారిపోగలిగినప్పుడు మొత్తంతెగ అనుసరించ లేకేమి?"

"ముగ్గురైనా కాని, పోలేదుగా యింకా?"

"చీకటి పడేసరికి, ఏజన్సీ అంతా యీ సంగతి తెలిసిపోతుంది" అన్నాడు మైల్స్.

"అది నీమీద ఆధారపడివుంది. ఈ ముగ్గురూ నాకు చెప్పి, నా అనుమతి తోనే, వెళ్ళిపోయారని నీవు చెప్పవచ్చుగా?"

"అటయితే, అంతా వస్తారు. మాకూ అనుమతి నీయమని," అన్నాడు మైల్స్, ఆశలన్నీ వుడిగినట్లు నిస్పృహతో. "వచ్చిన చోటికి పోవాలని ఏజన్సీలోని ప్రతియిండియన్ కోరుకొంటాడు."

"నేనైతే ఆ జిమ్మీగాడితల విరగ్గొట్టి వుందును. నోరుమూసికొని వుండే టట్లు బుద్ధిచెప్పి వుందును."

"దానికికూడ సమయం దాటిపోయింది" అన్నాడు మైల్స్... "మోక్షం తప్ప మరి దిక్కు లేనట్లుంది."

"కోటకు పోవాలనా?"

మైల్స్ జవాబీయలేదు. సెగర్ సోమరివాలకం అతనికి చిర్రెక్కించింది. పనిచేసేవాడికీ చెప్పేవాడికీ యిదే తేడా.

రెనో కోటకు అశ్వాసీనుడై పోతూవున్న మైల్స్ ఆలసిపోయాడు. ఇక తనకు భద్రత వుండదనుకుంటూ కలతపడిపోయాడు. నల్లటికోటూ, నల్లటిబౌలర్ హేటూ ధరించివున్నాడు. అశ్వికదళపు దిరుసువేసుకొన్న సైనికులు యింతకు ముందులాగే తనను గేలిచేస్తారేమో, అనుకొన్నాడు. డార్లింగ్టన్కు సామీప్య మందే రెనోకోటవున్నది. అందులో సైన్యదళమున్నది. అంటే, అర్థమేమిటి? ఏజన్సీలోని యిండియన్లను తాను అదుపులో వుంచుకోలేకపోతున్నాననేకదూ? ఇది అవమానకరమే కావచ్చు. కాని సంయుక్తరాష్ట్రాల సైనికస్తోమతు పిలిస్తే వచ్చిపడేటంత దాపులోనే వున్నదని తాను నిశిరాత్రి మేల్కొని గ్రహించి నప్పుడు, తాను ఒకసారికాదు, వందసార్లు, భగవంతునికీ, సైన్యానికీ కృతజ్ఞతాభి వందనాలర్పించుకొంటూ వుంటాడు. కాని, తాను వైరుధ్యాల నడుమబడి నలిగి

పోతున్నాడు. శాంతి కృపాణధారతో తప్ప నెలకొనేటట్లులేదు. తాను పరమ శాంతమూర్తి అయిన క్రైస్తును యావజ్జీవమూ సేవిస్తానని ప్రశ్నచేశాడు. బలాత్కారమందు, సైన్యశక్తియందు నమ్మిక ఒకవైపు, క్రైస్తుఎడల భక్తిప్రమత్తులు మరొకవైపు. యీ వైరుధ్యాల రెంటినీ మైల్స్ సమసింపచేయలేకపోతున్నాడు. ప్రేమపూర్వకంగా చేతులు బారచాపివస్తే, కత్తిని విసరికొట్టవచ్చు. ప్రేమపూర్వకంగాయిస్తే, ప్రేమపూర్వకంగా సేవిస్తే, పరమ బర్బరుడుకూడ నిన్ను ప్రేమపూర్వకంగా స్వీకరిస్తాడు. కాని ఏం ప్రయోజనం? చక్కరతినుబండారాలను అడగనివారికి పంచుతున్న లూసీకూడా తనకంటె ఎంతో మేలు. తనకీసేవలో విశ్వాసమేలేదు నిజానికి.

ఒకసంఘటన గుర్తుకు వస్తున్నది. చెయిన్నీ కుర్రకుంకను ఒకణ్ణి పట్టుకొని, సత్తువు కొద్దీ సెగర్ చావగొట్టుతున్నాడు. కొట్టడానికి ఉద్యుక్తుడై చేయియెత్తివున్న సెగర్ చేయి పట్టుకొని, "జాన్, పిడికిళ్లు బిగించి గుండెల్లో ద్వేషాలు పెంచుకొని మనం సమీపిస్తే, వీళ్లు తిరుగ మనకు మనసు లిస్తారా?" అని తానన్నాడు. సెగర్ ముఖవైఖరిలో మార్పేరాలేదు. నీవు నిష్ప్రయోజకుడివి, చచ్చువాడివి, అన్నట్లుగా సెగర్ తనను చూడసాగినాడు. "మైల్స్, యీ కుర్రలంజ కొడుకు నన్ను కత్తితో పొడవబోయాడు. ఇది నా వ్యవహారం. నువ్వు పోవచ్చు. వీడిపని పూర్తిచేస్తాను. తనపై అధికారి ఎవడో గ్రహిస్తే చాలు, వీడికి నామీద ప్రేమ పుట్టుతుంది - ప్రేమ!", అన్నాడు సెగర్. ఇది గుర్తుకు వచ్చి, మైల్స్ కలతబడి పోయాడు. కాని చివరకు, యీ దఫాపట్టుకు పట్టు సడలకూడదు, అనుకొన్నాడు. ప్రేమకీ, ఊష్మానికీ ఉప్పూనిప్పూ. తాము శాసనబద్ధులు అయినప్పుడు, తమ శ్రేయస్సుపట్ల తనకుగల శ్రద్ధాసక్తు లెట్టివో గ్రహించగలరు ఇండియన్లు. అబ్బ, తల తిరుగ నొచ్చుతున్నది. కాలయూ, పట్టూ చెమటకు తడిసిపోయినై. గుర్రాల డెక్కల తాకిడికి లేచినదుమ్ము అతని నల్లటి వుడుపుల మీద నెలవేర్పరచుకొంటున్నది.

కోటలోపలికి బండి తోలుకొని పోయాడు, మొద్దుకొయ్య వాకిళ్లుదాటి, నిటారుగా నిల్చొని అభివాదం చేసిన ద్వారపాలకుణ్ణి గడచి పోయాడు. తిరిగి అభివాదం చేయడమనేది మైల్స్‌కు అలవాటులేదు. సైనిక వ్యవహారాలంటే అతని మనస్సు ఎదురుతిరుగుతుంది. కళ్లెంసడలించాడు. బండిలోనే కూర్చొని సేదదీర్చుకొన్నాడు. తర్వాత బండి దిగి చేరుమాలుతో ముఖాన్ని, హేటునూ శుభ్రంగా తుడుచుకున్నాడు.

రెనోకోట దీర్ఘచతురస్రాకృతి కలిగినట్టిది. మొద్దుకొయ్యతోటి, బురదతోటి కట్టినవి గోడలూ, సైనికావాస గృహాలూ. సంయుక్తరాష్ట్ర సైనిక కేంద్రాలన్నియింతే. కవాతు కసరతుచేసి, చెమటోడ్చి, అశ్వాలకు మాలీషుచేయడం, సైనికుల దినచర్య. ఇక అధికారులు విస్టు, పెన్నీపోకర్‌వంటి పేకాటలతోనూ,

మలేరియా జ్వరాలతోనూ, విసుగుదలను పైదొలగించుకొని, రాత్రింబవళ్లు గడుపుతారు. ఉన్న స్త్రీ జనం చాలా స్వల్పం. సంఘజీవనమే లేదనిచెప్పవచ్చు. బర్రెలను వేటాడే మురికిమూకనూ, ధర్మాధర్మాలు లెక్కలేని విస్కీ దొంగ వ్యాపారులు యిక్కడికి రావడానికే వీలులేదు. కారణం యిక్కడ వ్యాపార గృహం లేదు. వాళ్ళు వచ్చినా, కొంతకు కొంత కొత్తందనం వుండేది. ఇండియన్ యుద్ధాలు కడముట్టినై. ఇండియన్ ప్రదేశంలోకూడ పశుచోరులు కరువైపోయారు. ఏజన్సీ అధికారులు చోరులను గురించి ఫిర్యాదు చేసికోవడమే అరుదైపోయింది. పశుచోరులు విజృంభిస్తే బాగుండును. తమకు పనిబాటలైనా పుష్కలమౌనై. వారిని వెన్నాడి, వెదకిపట్టి, పెడరెక్కలు విరచికట్టి, కోటకు యీడ్చుకొనివచ్చి కొంతకాలంపాటు కథల్లిచెప్పుకొని కాలక్షేపం చేయనయినా చేయవచ్చు. కాని అయ్యో, యీ కోట బ్రతుకు బండబారిపోయింది. నెలనెలా శెలవుతీసుకొని, సెయింట్ లూయీకి పోయిరావడంతప్ప మరేదీ కొత్తదేలేదు. ప్రస్తుతం నెల గడవడమేకష్టమైపోతున్నది. రోజురోజుకూ ఎండ ముదురుతున్నది. సైనికులు శాపనార్థాలు పెట్టుకుంటూ కవాతుచేస్తున్నారు. కుర్ర అధికారులు యిళ్ళకు జాబులు వ్రాస్తూ, పురామనోహర యుద్ధ భయంకర ఘటనలను కథల్లి చిరకాల సైనికానుభవం కలవారు చెప్పుతుంటే వింటూ, అప్పుడయినా పుట్టకపోతిమే అప్పుడయినా పోరాడకపోతిమే, అప్పుడయినా ఇండియన్లను హతమార్చి సార్థకతపొందకపోతిమే, ననుకొంటూ వుంటారు.

♦ ♦ ♦ ♦

కల్నల్ మిజ్నర్ సంహృష్టాంతరంగుడై మైల్స్‌కు అభివాదం చేశాడు. సైనికాధికారులకూ ఏజన్సీ అధికారులకూ కొన్నినాళ్ళు ఘర్షణ జరిగేది; మరి కొన్నినాళ్ళు అది సద్దుకొనిపోయేది. నెలరోజులనుండి ఒద్దికగా వుంటున్నారు. క్వేకర్లంటే వ్యక్తిగతంగానూ, విశ్వాసపరంగానూ కల్నల్ గారికి సరిపడదు. కాని తన హృదయం సువిశాలమయినదనుకొని అతను గర్వించేవాడు. అనేక ప్రదేశాలలో అనేకానుభవాలు పొందినందుచేత యీ హృదయవైశాల్యం ఏర్పడి వుంటుంది. అంతేకాదు – తనచేయి మీదై యింకొకరిది క్రిందై వుండాలని అతని అభీష్టం: అంటే, తన నితరులాశ్రయించి అర్థించాలి తప్ప, తా నితరుల నర్థించకూడదు. సైనికదుస్తులే అతనికి ప్రత్యక్షదేవుడు, ఆ దుస్తులు ధరించినవారి తోడ్పాటును ఎవరైనా యాచిస్తే, తనదేవుణ్ణే యాచిస్తున్నారని అతని తలంపు. అప్పగించిన విధి నిర్వహణలో ఎందుకు పనికిరానివాడని మైల్స్‌గురించి యితని అంచనా. మైల్స్ క్వేకరు. సహజంగా శాంతిప్రియుడు. కనుక ఈ క్వేకర్లగుంపుకు బదులు సైనికులనే ఏజన్సీలో నియమిస్తే ఏచిక్కూవుండదు. మైల్స్‌లాంటి మెతక సరుకు సైనిక సహాయాన్ని అర్థించరావడం మిజ్నర్‌కు ఎంతో ప్రీతిజనకమయింది. అతను చేసిన అభివాదములో యీ స్వాతిశయ భావము వ్యక్త

మవుతున్నది. మైల్స్‌గారి ఆరోగ్యం గురించి, శ్రీమతి మైల్స్‌గారి ఆరోగ్యం గురించి కుశల ప్రశ్నలు వేశాడు. ఏజంటు ముఖంలో ప్రస్ఫుటమై కన్పిస్తున్న బాధామయమైన ఆవేదనను గమనించి, మిజ్నర్ మరీ సంతోషించాడు.

మిజ్నర్ దీర్ఘకాయుడు. కోలముఖం. అల్పవక్షస్కుడు. చిన్ననోరు. మాటిమాటికి సైనిక దుస్తులను చేతులతో తడుముకోవడం మామూలు. కొంపదీసి నేను బలవడంలేదు కదా, అని పరీక్ష చేసికొని, లేదులే అని తృప్తిపడుతున్నాడా, అనిపిస్తుంది. ఇతరులతో పోల్చి చూచుకొని, వాళ్ళను తృణీకరించడం సరదా. తీరుగా, నిటారుగా, చువ్వలాగావున్న తానెక్కడ? మైదాన ప్రదేశాలలో సోమరిపోతులై ఒళ్లు పెంచుకొనివుండే తోటి అధికారులెక్కడ? యుద్ధ కాలంలో తయారయిన పనికిమాలిన చెత్తసరుకు వీళ్ళంతా. అనుభవించే హోదా వచ్చే భత్యాని కన్నా రేట్లు ఎక్కువ. వెస్ట్‌పాయింట్‌లోని గోడల నన్నిటినికూడ చూచి వుండరు. మరి వీళ్లకు అనుభవం ఎక్కడనుండి వస్తుంది? ఉష్ణోగ్రత నూటపది డిగ్రీలున్నప్పటికి, అరవై మాత్రమే వున్నట్లుగా ఎండను లెక్కించక, నిటారుగా వున్నాడు తాను. తతిమ్మా వాళ్ళయితే కందిపోతామేమో ననుకొంటారు.

"ఈ ఎండ వుండే, అబ్బ" అన్నాడు మైల్స్, దుమ్ము కొట్టుకొని వున్నందుకూ, చెమటకారి పోతున్నందుకు క్షమాభిక్ష కోరుతున్నట్లుగా వుంది. "ఇక్కడ యీ నీడలో కాసింత చల్లగా వుంది."

"అది మనలో వుంటుంది. ఎండ అనుకొంటే యెండ. కాదనుకొంటే కాదు. మైదానాలకు అలవాటు పడిపోయామేమో మరి!......మీ ఎర్రవాళ్ళు ఏమన్నా కత్తులు నూరుతున్నారా ఏమిటి?"

ఎంతో అలసిపోయిన విధంగా మైల్స్ తలవూగించాడు. వరాండా నీడకు పోదామన్నాడు మిజ్నర్. ఆఫీసర్ల భోజనశాల దగ్గర యిద్దరు కుదురుకొన్నారు.

పానీయాలు తెమ్మనమన్నాడు మిజ్నర్. "లెమొనేడ్ మట్టుకే" నన్నాడు మైల్స్. పెరేడ్ ప్రదేశానికేసి చూస్తున్నాడు. అందులో ఎదగడ మాగిపోయిన పైన్ చెట్టు ఒకటి వుంది. దాని ఛాయలో ఇద్దరు యువలెఫ్టినెంట్‌లు పకపక నవ్వుతున్న ఒక చుర్రదానిని చుట్టుముట్టివున్నారు. పొడిగాడ్పులో పకపకలు వికవికలు స్పష్టంగా వినిపిస్తున్నాయి. వేళాపాళాలేదు అనుకొన్నాడు. ఆ యువతిని తానిదివరకు చూడనేలేదు. ముక్కూ ముఖమూ తెలియని యిటువంటి అపరిచిత యువతి ఎవరయినా ఏజన్సీకి వచ్చి, తనతోనూ లూసీతోనూ, ట్రూబ్లడ్ దంపతులతోనూ కలిసి భోజనంచేస్తే ఎంతో బాగుండుననిపించింది. ఆగ్నేయ దిశలోవున్న స్వస్థానాభిముఖుడై పోతున్న రోమన్ కేథలిక్ పూజారి ఒకడు రాత్రికి ఇక్కడే వుండిపోతాడట. అతనిప్పుడు తీరుతప్పిన నల్లటి గద లాగున బావివద్ద నిలుచుని, ఒంటరి చూపులతోను నవ్వుతున్న యువతికి

లగ్నంచేస్తున్నాడు. ఉన్నట్టుండి మైల్స్‌కు యీ పూజారితో ఆత్మీయత, యితరుల కష్టనష్టాలపట్ల సానుభూతి యేర్పడింది.

లెమొనేడ్ కాస్తహుషారిచ్చింది. కాస్తకాస్త రుచిచూస్తూ, తనను చుట్టుముట్టివున్న కష్టపరిస్థితులను మైల్స్ సంగ్రహపరచి, మిజ్నర్‌కు తెలిపాడు.

"అయితే, మీ వుద్దేశం, తోడేలు చెడుదారి పట్టుతున్నాడనా?" అని అడిగాడు మిజ్నర్, అంతావిని.

"బహుశా కాకపోవచ్చునేమో కాని ఏదిఎట్లాగున్నా పరిస్థితిని అదుపులో పెట్టుకోవాలి కదా!"

"నిజం. నాకూ అదే అనిపిస్తున్నది. తోడేలు నాకేం కొత్తవాడుకాదు. ఉత్తరాదిన మా యిద్దరికి యుద్ధం జరిగింది. వాడు ఘటికుడు. ఒక పశానలాంగడు వాడొకడే అనేమి, ఇండియన్ ప్రతి ఒకడూ నయాన లొంగడు. వాళ్ళతో వాదించి లాభంలేదు. ఒక్కసారి కనుక ఎదురుతిరిగినారా, తిరిగి వాళ్ళను మార్చడం.కనాకష్టం. వాళ్ళంల్లో మంచివాళ్ళే లేరా, అంటే ఉన్నారు. ఎవరువాళ్ళు, అంటే చచ్చిపోయిన వాళ్ళు. కంగారు పడకండి, మునిగిపోయిందేమీ లేదు. మేము పిలు పేటులోవున్నాం. కరుకైన సైన్యంవుంది. సితూరీ సర్వవ్యాప్తమయినాగాని, అవసరమయితే ఈదుర్గాన్ని నెలరోజులపాటుకూడ నిరపాయంగా రక్షించగలను. నెలేవిమి? రెండునెలలపాటు కూడ," అని సవరణచేసి, మిజ్నర్, "భగవంతుడితోడు, వాళ్ల పప్పులో కాలువేయాలి అని నిజంగా కోరుకొంటున్నాను," అని తనలో అనుకొన్నాడు.

"అదేమీ జరగదు. నా వుద్దేశ్యమేమిటంటే వున్నవారంతా కలసికట్టుగా మూకవుమ్మడిగా తిరుగబడరు. ఏజన్సీలో యిప్పటివరకూ ఏం ఫరవాలేదు. నిజం చెప్పవలసివస్తే, కొన్నినెలలనుండి వారం వారం అభివృద్ధి కనిపిస్తూనేవుంది. అసలువున్న చిక్కు ఏమిటంటే, యీ ఉత్తరాది ఇండియన్లకు బొత్తుగా క్రమశిక్షణ అలవాటులేదు. ముగ్గురు పారిపోయారుకదూ, ఆ నేరానికి వాళ్ళంతా శిక్షననుభవించక తప్పదు. తద్వారా, ఆ చంద్రతారార్కం యీ ప్రదేశంలోనే వుండి తీరవలసిందే, ననివాళ్ళు నేర్చుకోవాలి."

"చిన్న దళాన్ని ఇండియన్ శిబిరానికి పంపుతాను," అన్నాడు మిజ్నర్ కొద్దిగా నవ్వుతూ. "లా పుస్తకాలు అందరికి చదివి వినిపిస్తాం. వాళ్ళ నాయకులను మీ ఆఫీసుకు పిలచి, తాటలు ఒలిపించండి. ఈలోగా, ఏ శిక్ష విధిస్తే బాగుంటుందో నిర్ణయిద్దురుగాని. జరగవలసిన పనియిది. చూడండి, ఏజంటుగారూ, ఖచితంగా వుండాలి. దయాదాక్షిణ్యాలు వల్లకాదు. ఈ మొండి బండ ముండాకొడుకులసంగతి నాకు సొంతం తెలుసు."

"జాగ్రత్తగానే వుంటాను," అన్నాడు మైల్స్, అనిశ్చితంగా.

"నాకు జాగ్రత్తేలేదు. నేను చెప్పింది చేయండి. మీకు నేను దన్ను. ఈ ప్రాంతాల వ్యాధులకు సైన్యమే విరుగుడుమందు..."

మిజ్నర్ పంపిన దళంలో సర్జంట్ జోనాస్ కెల్లీ, ప్రైవేట్ రాబర్ట్ ఫ్రిట్జ్ కాకుండా స్టీవ్ జెస్కీ అనేవాడు కూడ సభ్యుడు. స్టీవ్ జెస్కీ ఉదరపోషణార్థం బహుకృతవేషుడు. నిదురపోయేందుకొక ఇల్లు, తినేందుకు తిండి, వీలుదొరినప్పుడు హస్తలాఘవ విద్యలో ప్రావీణ్యత సంపాదించేందుకు పానీయాలు ఈ మూటికోసం తనకున్న సర్వసామర్థ్యాలనువినియోగించుకుంటూ, యీ దుర్గాన్ని అంటిపెట్టుకొని వున్నాడు. ఎవడన్నా అపరిచితుడు భాగ్యశాలిగా కనుపిస్తేచాలు, పచ్చి విస్కీ సీసాకొని యివ్వగలడనిపిస్తేచాలు, యికగంటలతరబడి అబద్ధాలమీద అబద్ధాలు సృష్టించగలడు జెస్కీ. తాను ప్రభుత్వోద్యోగికాదు. ప్రభుత్వం గుర్తించిన స్కౌట్లలోనూ జమపడడు. అనధికారపు స్కౌట్. పేరులోన ఏమి పెన్నిధి కలదయా ? పేరుకాదు, హోదాకాదు కావలసింది, కడుపు నిండడమే.

జెస్కీ ధరించిన బొచ్చుదుస్తులు మాసి, మరకలుపడి, రోతగబ్బు కొట్టుతున్నవి. పుర్రెకు అంటుకొని పోయినట్లున్న టోపీవుంది. సిద్ధహస్తులైనస్కౌట్లు ఇండియన్ సంహారులు మామూలుగా, తమ ప్రత్యేక లాంఛన చిహ్నంగా పెంచుకొనేటట్లు, యితనూ కేశాలను దీర్ఘంగా పెంచుకొన్నాడు. ముక్కుమీద పెద్ద కణితెవుంది. పొగాకుచార నోటినుంచి బయలుదేరి గడ్డంమీదుగా వక్షంలో సగభాగం వరకు వ్యాపించివుంది. అతను డప్పు కొట్టుకొనే గొప్పలలో చెయిన్నీ భాషాజ్ఞానం ఒకటి.

కాని యిది అత్యంతం, స్వల్పం, పూర్తిగా ప్రాథమికం, అయినా, తాను గొప్ప దుబాసీనని అతని అభిప్రాయం. ఇండియన్లభాష మహాసుందరమయినది, సంపన్నమయినది, సమృద్ధమయినది, ప్రవాహశీలమయినట్టిది. అటువంటిది యితని దృష్టిలో ఆటవికులు మాటాడుకొనే అలగాభాష. ఉద్దేశమే యీ విధంగా వున్నప్పుడు, అనువదించేటప్పుడు ఆభాషకుఅతడుచేసే అన్యాయం ఎన్నవీలులేనిది! నిజం చెప్పవలసివస్తే, ఇంగ్లీషుభాషకూడ అతనికిసరిగారాదు. తెలిసిన యింగ్లీషుపదాలు చాల కొద్ది. ఒకవేళ యితనికి చెయిన్నీ భాష కూలంకషంగా వచ్చుననుకొన్నా, దాని నింగ్లీషులోకి సరిగా అనువదిస్తాడని నమ్మకం ఎట్లు వుంటుంది? అయితే అతని తప్పులు కనిపెట్టేవారేరి ? పరాజితుల భాషనుగురించి సైన్యాలు ప్రపంచంలో ఎక్కడ పట్టించుకొంటాయి, యిక్కడ పట్టించుకోలేదనడానికి! మిగత యిద్దరికంటె రెండడుగులు ముందుగా జెస్కీస్వారిచేస్తూ పోతున్నాడు. కారణం ఉండినందుచేతనే, యితని సామీప్యాన్నికూడ వాళ్ళు సహించలేరు. ఇప్పుడున్న శీతోష్ణస్థితి ఎటువంటిదంటే, దాగివున్న వాసనలను వెలిపరచగలట్టిది. మామూలుగావున్న వాసనలను విజృంభింప చేయగలట్టిది. సర్జెంట కెల్లీ, ప్రైవేట్ ఫ్రిట్జ్, యిద్దరూ ఎండనూ వాననూ లెక్కచేయనంతటి

విశేషానుభవం కలిగినవాళ్ళు; వుక్కు పిండాలు. ఎండలకు వన్నెతగ్గ నప్పటికీ, ఆరోగ్యవంతులు. ఎన్నో సంవత్సరాలనుండి సైనిక వ్యాపార పారాయణులు కావడంచేత, ఎందుకు, ఎక్కడికి అని అడగడమే మరచి పోయారు. సమస్థలే కాక తొట్రుపడనివాళ్ళు. కలహాలను ఆహ్వానించరు కాని వాటంతట అవి మొనచూపితే, వెన్ను చూపే అలవాటులేదు. స్కాటును కాపాడడం తమవిధి; దానిని నిర్వర్తిస్తారు; దానిని మీరి యితరవిషయాలలో జోక్యం కల్పించుకోరు. దాదాపు విరోధులుగా భావించదగిన ఇండియన్లశిబిరానికి పోతున్నామనే ధ్యాసకూడాలేదు. సంయుక్తరాష్ట్రసేనాకర్తవ్యంలో వారికి తిరుగులేనిగురి వుంది. తమను ఆజ్ఞాపించడమే జరిగితే, యింతే నిర్భీక మనస్కతతోటి ఘోర నరకంలోపలికి కూడ గుర్రాలపై పోయి వుందురేమో!

తామిద్దరే మాట్లాడుకొంటున్నారు. ఇటీవలనే ఒక పూజారివద్ద సర్జంట్ కెల్లీ తన పాపకార్యాలనన్నిటిని బయల్పరచుకొన్నాడు. "మతానికిచెందని ఆడది నాకక్కరలేదు. దానిహృదయంకంటె ఆత్మయింకా నల్లగావుంటుంది."

"నీదంతా చాదస్తం. అపాచీలతో ఎప్పుడూ పోలేదన్నమాట నువ్వు! చేతితొడుగులలెవిధంగా మనంలాగి అవతలపారేస్తామో, వాళ్ళు అట్లా రవికెలను తీసి వేస్తారు."

"అంతా అబద్ధం"

"దైవసాక్షిగా చెప్తున్నాను. అసలే లేనిదానికంటె, కొంచెంవుండడమనేది కాస్తనయంకదా! అసలు ఆడదేవద్దనేందుకంటె, ఎర్రదానితోనో, నల్లదానితోనో పోవడం మేలంటాను. ఏం? అవునుగాని, ఎప్పుడైనా స్క్వాతో పోయావా చెప్పు సర్జంట్!"

"ఆ మాటకువస్తే, నువ్వుపోలేదు. ఇదిగో నేను చెప్తున్నా విను: కళ్లు పదిలంచేసుకో. వాళ్ళకేసి చూడకు. ప్రమాదం! జాగ్రత్త!"

"చేతులు పదిలంచేసుకొంటాలే! భగవంతుడా, ఆ శనిగొట్టుదుర్గంలో ఎంతకాలంబట్టి వున్నానోగాని, నాకు మారు నాకళ్ళే పనిచేయవలసి వచ్చేటట్లుంది."

"జాగ్రత్త! మెడ తెగిపోగలదు."

ఫ్రిట్జ్ వుమ్మివేశాడు. "అందరూ ఎర్రముండావాళ్లేనాయిరి. చాలా షోకైన స్క్వాలను చూచాను కాని ఎండిపోయిన ఏపిల్ పండులాగా శీఘ్రంగా ముసలి తొక్కలైపోతారు."

"నేను ఒకదానితో పోయాను" అన్నాడు కెల్లీ, చాలసేపు తాళి.

"ఆఁ! ఎక్కడ?"

"మరచిపోవడం మంచిది" అన్నాడు కెల్లీ. "అంతా ఒక్కటేననిమట్టుకు అనుకోకు. మన మిప్పుడు పోతున్నామే, వాళ్ళు అగ్గిసరుకు. కోమంచీలు,

పానీలు, సియూలు, కియోవాలు — వీళ్ళ రకమనుకొన్నావేమొ. భద్రం! చెయిన్నీలున్నారే అభిమానవంతులు, పులకరు పలకరు. ఐర్లండువాళ్ళకు నకలు."

"నోరుతెరవని ఐరిష్‌వాణ్ణే చూడలేదే నేను?"

"అంటే, నోరుతెరచి మాట్లాడరనికాదు. వాళ్ళ అంతరాంతరాలలో లోతు పాతు తెలియనంత గంభీరమైన నిశ్శబ్దంవుంటుంది. నీ కర్థంకాదులే!"

ఇంతలో స్కౌట్ చేయియెత్తాడు. వాళ్ళు ఆగినారు. ఎదుగుదల ఆగి పోయిన చెట్లు ముందున్నై. వాటిలోనుంచి తోలుకప్పిన ఎత్తయిన యిళ్ళకప్పులవుపిస్తున్నై.

"ఇదీ సంగతి" అన్నాడు జెస్కీ.

"నేను కనుక్కొనివస్తాను. సైనికదుస్తులు చూస్తే వాళ్ళు గౌరవం చూపుతారు" అన్నాడు కెల్లీ.

"గౌరవమూ చట్టుబండలూ," అన్నాడు జెస్కీ.

దళం పైన్ చెట్లద్వారా చొరబడింది. కుక్క ఒకటి మొరిగింది. శిబిరం వైపు పారిపోతున్న పిల్లలు కనుపించారు. సైనికులిద్దరు సాయుధులయ్యారు.

"నువ్వేమీ వెడసరంగా ప్రవర్తించకు." అన్నాడు కెల్లీ, జెస్కీతోటి.

ఎండిపోయిన నదీశయ్యమీద, సి. అనే యింగ్లీషు అక్షరాకృతిలో చెయిన్నీ గ్రామం పన్నబడివుంది. గుర్రాలుకొతాంలోవున్నై. సైనికులు ఇద్దరూ, స్కౌటూ సమీపించడంచూసి, తమ తమ నెలవులనుండి, ఇండియన్ పురుషులు పరుగెత్తుకొని వచ్చారు. కొందరు సాయుధులై వున్నారు. దాదాపు అందరూకూడ బక్కచిక్కివున్నారు. అలసినట్లు కనిపిస్తున్నారు. పొడగరులు విశాల భుజస్కంధులు లోహాముఖులు, సంఖ్య ఏమంత పెద్దదికాదు. పిల్లా జెల్లా ఆడా మగా కలిసి మూడువందలమందికంటె ఎక్కువమంది యీ గ్రామంలోలేరు.

చేతులుపైకెత్తి శిబిరవలయంలోపలికి గుర్రాలపై వచ్చినవారిని యిండియన్లు చుట్టుముట్టారు. వారి ముఖాలలో ద్వేషం పాలుకంటె ఆసక్తి పాలు ఎక్కువగా కన్పిస్తుంది. తొలిజడుపు వదలిపోయిన తర్వాత, పసిపిల్లలు తిరుగమూగినారు. అమ్ముల్లవంటి నల్లటికళ్ళు, చిక్కుపడిన వెంట్రుకలు, అనాచ్ఛాదితమైన రాగివన్నె చర్మమూ చూస్తుంటే, చిననాడు తాను చదివి నేడు సగానికిసగం మరచిపోయిన అల్లీబిల్లీ లోకంనుండి వూడిపడిన చిన్ని భూతాలా, అనిపించింది. ఇంత వేడుకగావున్నాగాని, ఆడవాళ్ళు యిటురానేలేదు. చాల దూరంగానిలిచి చూచేవారు కొందరు. గడపదాటనివారు మరికొందరు.

"వీళ్ల నాయకుడెవరు? అతనితో మాట్లాడు, జెస్కీ. కాస్త జోకొట్టుతూ వుండు, మాటలలో పడవేసి" అన్నాడు కెల్లీ.

జెస్కీ చెయిన్నీ భాష మాట్లాడాడు. ముగ్గురు నలుగురు వయోధికులు కెల్లీ గుర్రాన్ని సమీపించారు.

"తోడేలును రమ్మని చెప్పు" అన్నాడు కెల్లీ.

దృఢ భుజస్కంధుడైన ఇండియన్ ఒకడు తలవూపాడు. ఇది చూచి కెల్లీ గుఱ్ఱం దిగాడు.

"నిన్ను చూడడం సంతోషమయింది" అంటూ కెల్లీ తన చేతిని తోడేలుకు అందించాడు. ఇద్దరూ హస్తచాలనం చేశారు. ఆ పైన సైనికులిద్దరూ, స్కాటూ తతిమ్మా పెద్దలతో కరస్పర్శ చేశారు.

"పరిస్థితులేమీ బాగలేవని చెప్పు" అన్నాడు కెల్లీ. "మాకు కష్టాలిష్టం లేదు కాని ఏం చేస్తాం, పరిస్థితులు విషమిస్తున్నప్పుడు? పారిపోతున్నారాయె. ఏజన్సీలోకి తిరిగి పోవలసిందిగా కల్నల్ గారు ఆజ్ఞాపించారని చెప్పు. అందరూ పోయితీరవలసిందే. అక్కడ ఏజంటుగారితో మాట్లాడుకోవచ్చు. ఏజంటుగారు తమతో మాట్లాడగోరుతున్నారని కూడ చెప్పు."

వచ్చీరాని చెయిన్నీ భాషలో జెస్కీ యీ విషయాన్ని విన్నవించాడు. పెద్దలలో యిద్దరి ముఖాలు కోపాన్ని వ్యక్తం చేసినై. కాని తోడేలు మందహాసం చేశాడు. బండకత్తి ఆపి ఆపి నెమ్మదిగా మాట్లాడసాగినాడు. దీనిని అనువదించేసరికి జెస్కీకి తలప్రాణం తోకకు వచ్చింది.

"ఈ లుచ్ఛా ముండాకొడుకులు నన్ను గేలిచేస్తున్నారట్లుంది. ఏజన్సీకి తిరిగి పోరట. కల్నల్ గారు మరికొంతమందిని పంపించి వుండవలసింది" అన్నాడు జెస్కీ కెల్లీతో.

"చెప్పిందే మళ్ళీ చెప్పు" అన్నాడు కెల్లీ.

"ఏం ప్రయోజనం? వాళ్ళు యితనిని లక్ష్యపెట్టుతున్నట్లు లేదు" అన్నాడు ఫిట్జు.

"అయినా చెప్పు" అన్నాడు కెల్లీ.

పెద్దలు చాల నిదానంగా జవాబిచ్చారు. శిబిరాన్ని ఎత్తివేసి, నదిఒడ్డున్నే పడిపోతారట, అన్నాడు జెస్కీ. ఏజంట్లూ లేదు, గీజంటూ లేదు."

కెల్లీ తలపంకించాడు. "సరే అయితే, దుర్గానికి మరలిపోదాం మనం" అన్నాడు.

◆ ◆ ◆ ◆

మైల్స్ గారు డార్లింగ్టన్‌కు తిరిగిపోయినందుకు కల్నల్ మిజ్నర్ చాల సంతోషించాడు. మొదట్లో మైల్స్ యిండియన్లను అదిరించి బెదిరించి హడలు కొట్టి చూస్తాడేమో కాని చివరకు లాలింపుకు దిగుతాడు. 'బి' కంపెనీకి చెందిన కెప్టన్ ఛార్లెస్ ముర్రే తోటి మాటాడుతూ, మిజ్నర్ యిట్లాగన్నాడు: "ఇండియన్ ఆఫీసువారి విధానం వున్నదే, ఎంత వివేకమైనదని! మరి కొన్నాళ్ళకుగాని యీ వివేకం లోకానికంతా తెలియదు. కాలిపోతున్న పశులశాలలు, విజయచిహ్నంగా వెంట్రుకలతోకూడ తోలు ఒలిచిన తలలు సాక్ష్యాలవుతై.

గజగజ వణకిపోయే క్వేకర్ల ఏజన్సీలలో పెత్తనం చేస్తున్నంతకాలం, మరేం జరుగుతుంది?"

"ఇప్పటివరకు అటువంటిదేమీ లేదుగా?" అన్నాడు ముర్రే సాహసించి.

"ముందున్న దయ్యా ముసళ్ళపండుగ! తొందరదేనికి? ఇండియన్లతోటి నాకు విశేషానుభవంవుంది. వాళ్ళ గుట్టుమట్లు, లోతుపాతులు, ఆలోచనా విధానాలు నేనెరుగుదును. ఇండియన్ ఒకపనికి పూనుకోవాలేగాని అతనిని మళ్ళించడం సృష్టికర్తకు కూడ తరంకాదు. అయితే ఒకటివుంది. జబ్బువచ్చిన తర్వాత నయంచేసి కొనేందుకంటె, ముందుగానే దానిని నివారించుకోవడం మంచిది. అట్లాగే ఇండియన్లు చేయబోయే దుస్సాహసాన్ని ముందుగానే గుర్తెరిగి నివారించాలి."

"అంటే, వీళ్ళను చుట్టుముట్టేందుకు అనుమతించండని వాషింగ్టన్‌కు కబురు పెట్టదలచుకొన్నారా?"

"ఈ ఏజన్సీలో శాంతిభద్రతలను సరిచూచేందుకు యీ వరకే నాకు అధికారంవుంది. అది నా విధ్యుక్తధర్మం. నరహంతలను వున్మాదులను దుండగీళ్ళను నేను విశృంఖలంగా విడచిపెట్టితే, ధర్మాన్ని నేను నిర్వహించడం లేదన్నమాటే. వాళ్ళను కాలు చేతులుకట్టి జైలులో కుక్కితేనే, ధర్మనిర్వహణ చేయడమవుతుంది."

ముర్రే తలపంకించాడు. అతనికి మిజ్నర్ అంటే సరిపడదు. కాని ఏంచేస్తాడు? మిజ్నర్ తనకు పై అధికారి! కనుకనే ఆమోదం సూచించవలసి వచ్చింది. చెయిన్నీల గ్రామాన్ని గ్రామాన్ని జైలు పాల్జేయవలసిన పనికి తనను నియోగించకుంటే బాగుండు ననుకొన్నాడు. న్యాయాన్యాయాలు అతని కెక్కువ పట్టవు. తనక్రింద పనిచేస్తున్న సైనికుల జీవితాలపట్ల మాతృవాత్సల్యాన్ని చూపే ఆఫీసర్లు అత్యంత స్వల్పసంఖ్యాకులు. వారిలో ముర్రే ఒకడు. సమర్థుడైన ఆఫీసరు చేయవలసినపని, క్రిందివారి ప్రాణాలను తృణప్రాయంగా చూడడం కాదు. వాటిని పరిరక్షించి నిక్షేపంగా చూడడమని తాను నేర్చుకొన్నాడు; అంతేకాదు, పరిపూర్ణంగా విశ్వసించాడు. ఇండియన్లతోటి అతను పూర్వం పోరాడక పోలేదు. ఈ దుర్గాన్ని రక్షిస్తున్న యావత్సేన కదలినప్పటికి, ఒక గ్రామాన్ని గ్రామాన్ని జైలుపాల్జేయడమనేది అసంభవమని ముర్రే అభిప్రాయం.

"మీ కంపెనీని వెంటబెట్టుకొని వెళ్ళి, ఇండియన్లను పెడరెక్కలు విరిచి తీసుకురండి" అన్నాడు మిజ్నర్.

"ఏమిటి సర్?"

"చెప్పాను కదా, పట్టుకొని రమ్మని! అవసరమైతేతప్ప బలం ప్రయోగించవద్దు."

"నా కంపెనీ సరిపోతుందా, సర్?"

"శేషుగ్గా సరిపోతుంది, ఆశ్వికదళముండగా, నలుగురు మురికి ముండా కొడుకులను అరెస్టు చేయలేకపోతే, సైనిక వృత్తికే కళంకం, ఘోరావమానం!"

"వాళ్లు చెయిన్నీలు, సర్, మొండి పోటరిగాళ్లు", అన్నాడు ముర్రే అనిశ్చితుడై.

"నాకు తెలియదా, కెప్టన్? నీకు భయంగా వున్నట్లుంది. అయితే"

"కించిత్తుకూడ లేదుసర్", అన్నాడు ముర్రే తీక్షణంగా "నేను పట్టుకొని రావలసింది మొత్తం గ్రామాన్నా? లేకుంటే, ఘటికులను మట్టుకేనా?"

"ఘటికులను మాత్రమే. మైల్స్ చెప్పినదానినిబట్టి చూస్తే, ఏభై మందికి మించరనుకొంటాను. ముసలి వాళ్ళను వదలిపెట్టవచ్చు."

"పోట్లాటకు సిద్ధమయితే?" అని అడిగాడు ముర్రే. "ఊరిలోకి-ఆడవాళ్లూ పసిపిల్లలూ వుండేచోటుకు-పొమ్మంటారా?" మిజ్నర్ భుజా లెగురవేశాడు. "హోవిట్జర్ తీసుకొనివెళ్ళు. నాలుగు గుళ్ళు ప్రేల్పించు. గొరియలోవున్న చీమ కూడ బయటికి వస్తుంది"

"కాని, ఈ మనిషి మగవాడని, ఆ మనిషి ఆడదని, గుండు భేద మెంచు తుందాండి?"

"కెప్టన్, యివ్వవలసిన ఆజ్ఞలు యిచ్చాను," అన్నాడు మిజ్నర్. ముర్రే లేచి నిలుచుని, సెల్యూటుచేసి, వెళ్ళిపోయాడు.

కూడా హోవిట్జర్‌వున్నా, 'బి' కంపెనీ సడీచప్పుడూ లేకుండా, ఇండియన్ గ్రామం వుండిన చోటుకు, వచ్చిచేరింది. ముర్రే అనుకొన్నట్లుగానే, శిబిరం లేవదీసి, ఇండియన్లు పురోగమించారు. కాస్సేపుపాటు యినుకను చెడ ద్రొక్కారు సైనికులు. ఇంతలో చీకటి పడసాగింది. గుర్రాలు దిగి, గుడారాలు నెలకొల్పమని ముర్రే ఆజ్ఞాపించాడు.

ప్రొద్దుటేలేచి, యినుకమీదపడిన గుర్తులనుబట్టి, చెయిన్నీలు పట్టినదారిని వూహించుకోసాగారు. చెయిన్నీల బళ్ళబాట యినుకమీద స్పష్టంగా ఏర్పడి వుంది. ఈబళ్ళుత్వరగా సాగలేవు. కనుక ఇండియన్లను చాల త్వరలోచేరుకోవచ్చు ననుకొన్నాడుముర్రే. నిజానికి, ఏడెనిమిదిమైళ్ళు దూరమయినా పోకముందే, ఒకచోట మిర్రికెక్కే-సరికి, క్రింద యేర్పడివున్న ఇండియన్ గ్రామం కంటబడింది.

ఇండియన్లు విడిసివున్నచోటు చాల యిరుకైనలోయ. పరమ ప్రశాంతంగా వుంది. తరు సమృద్ధమై, ఎండపొడ తగులకుండావుంది. లోయ మధ్యభాగాన చిన్న సెలయేరొకటి ప్రవహిస్తున్నది. ఊపిరి ఆడకుండా చెమటలు క్రక్కు-కుంటూ స్వారి వస్తున్న సైనికులకు యీ ప్రదేశం సంతోష స్వర్గసీమగా, హరిత సముద్రంగా, శాంతకాసారంగా, కనుపించింది. నరకంవంటి భూమిలో యింత చల్లటిపట్టున విడిసిన చెయిన్నీల తెలివితేటలను ప్రశంసిస్తూ, వాళ్ళందరు కొండ చివర కలుసుకొన్నారు.

"ఇంత మంచి పట్టునుంచి, రెనో దుర్గంలోని చెరసాలకు పోవలసి వుంటుంది వీళ్ళు" అనుకొన్నాడు ముర్రే.

భుజాలెగురవేసి, అశ్వాలను అవరోహించవలసిందని సైనికుల నాజ్ఞాపించాడు. ఇండియన్ గ్రామానికి నేరుగా హోవిట్జర్‌ను గురిపెట్టమని ప్రేల్పరులకు చెప్పాడు. నదీశయ్యమీదికి కనుక తోలితే, గుర్రాలకు ముప్పువుండదని, వాటిని తోలించాడు. కొండఅంచు వెలుపల సైనికులు విడివిడిగా విస్తరించుకొన్నారు. ఇండియన్లను రెనోకోటకు మోసుకు పోవడానికని కొనితెచ్చిన రెండు వేగన్లను గుర్రాలను పూన్చి సిద్ధంగా వుంచారు. ఇండియన్లకు ఆలోచించేందుకు కూడ అవకాశమివ్వక, గట్టివాళ్ళనందరిని వేగన్లలోకి త్రోసి, కోటకు తిరిగి పోవాలనుకొన్నాడు ముర్రే.

అందరూ తమ తమ నిర్దిష్ట స్థానాలలో సన్నద్ధులై నిలిచారు. సన్నాహాలు సమగ్రంగా పూర్తిఅయ్యాయి. కాని సైనికులు వచ్చిపడినారని ఇండియన్లు పసిగట్టకపోలేదు. పొట్టిగుర్రాలెక్కి కొందరు, సైనికులను గమనించి చూస్తూ అటూ యిటూ వస్తూపోతున్నారు. కాని తతిమ్మాజనం యధావిధులలో నిమగ్నమై, గుర్రాలను మాలిషుచేస్తూ కూర్చుని మాటాడుకుంటూవుంది. స్త్రీలు, పురుషులు, శిశువులు - యావన్మందీ కలసికట్టుగా, సైనికులువచ్చి వ్యూహంపన్ని, హోవిట్జరును గురిచేసి వున్నారనే విషయాన్ని కావాలని లక్ష్యపెట్టలేదు.

మూడునెలల క్రితమే రెనోకోటకు వచ్చిన లెఫ్టినెంట్ ఫ్రీలాండ్ ఆలస్యాన్ని సహించలేకున్నాడు. "చేతికి పని గులుతుందా సర్?" అని అడిగాడు.

"అవసరం లేదనుకొంటాను" అన్నాడు ముర్రే. "నేను క్రిందికి పోయి వస్తానుగాని, లెఫ్టినెంట్, యిక్కడ నువ్వు జాగ్రత్తగావుండాలి. నీకు అప్పగించి పోతున్నాను సుమీ! నేను తిరిగి వచ్చేవరకూ మీరు తొందరపడి ఏపనీ చేయకూడదు."

"అయితే...అయితే..."

ఏమీ ఖంగారు పడకు. ఇప్పుడే తిరిగి వస్తాను" అంటూ కెల్లీ వైపుకు తిరిగి, "సర్జంట్ నాతోగూడ రా పోదాం. అదిగో ఆ స్కౌటును కూడ పిలువు" అన్నాడు ముర్రే. పొగగొట్టం ముట్టించి, ముందు నడచిపోతున్నాడు. తమనెవరో ఆహ్వానించినట్లు వూరిలోవాళ్లు తమకు ఆతిథ్యమిచేటట్లు వుంది వారి వైఖరి. కెప్టన్‌కు యింతవరకూ ఏకోశానా భయంలేదు, భయం అతనికి క్రొత్త విషయమేమీ కాదు. ధైర్యస్థుడను కానని తానెరుగును. కాని అతని దేహా ఆజ్ఞల నుల్లంఘించదు. అంతేచాలు. తనతోటి ఆఫీసర్లకంటె ఇండియన్ల విషయం తనకు ఎక్కువ బోధపడింది. కాని యిప్పటికి ఇండియన్లు కొరకరాని సమస్య తనకుకూడ. లోకాలన్నీ అడ్డునిలిచినా తొణకనివారు, ఓటమి తప్పదని తెలిసికూడా కొసవరకు నిలచిపోగేవారు, జాతి జాతి నిశ్శేషమై పోగలంతవరకు పోరాడిన

వారు ఇండియన్లు. మరి వీళ్లను బోధపరచుకోవడమంటే తేలికా? శ్వేతవర్ణులకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను గురించి వున్న అభిప్రాయాలవంటివే వీరికి కూడ వున్నవని మట్టుకు అతను ఎప్పుడూ నమ్మాడు. బహుశా అనాగరకులకు జగ మొండితనము, సహజ ప్రవృత్తి ఏమో అనుకొన్నాడు. యుద్ధంలో అనాగరకులకు ఎదుటివారు హతమయేది లక్ష్యంలేనట్లు తాము ధ్వంసమయ్యే విషయం కూడ పట్టదేమో ననుకొన్నాడు. నేడు కూడ అదే అమలుజరుగుతుందేమో ననుకొన్నాడు.

ఇంతలో గ్రామం వచ్చింది. చెయిన్నీలు యీ ఆగంతుకులను పరివేష్టించారు. వారిని ఆపడానికిగాని, రూపుమాపడానికిగాని ప్రయత్నించలేదు. తోడే లెక్క అని జెస్కీ అడిగాడు. తోడేలున్నకడకు వారిని తీసుకొనిపోయారు. మంట వేసుకుంటూ తోడేలు బండకత్తి, చిక్కుతల-కూర్చొనివున్నారు. చిక్కుతలకూడ వయోధికుడే. మొండి పోటరులనబడే యుద్ధవీరుల సమాజానికి చెందినవాడు. ఈ మొండి పోటరులు పోలీసు పనులను, సైనికుల పనులనుకూడ నిర్వహిస్తారు. శిబిర వ్యవహారాలు, రణరంగ వ్యవహారాలుకూడ సరిమాచుకొంటారు. క్రొత్త వారినిచూచి, పెద్దలు ముగ్గురూ లేచారు. వారితో కరస్పర్శ చేశారు. వారిని కూడ చలి కాచుకొనమని ఆహ్వానించారు.

భూవదనంనుండి సమస్త జనపదాన్ని ప్రేల్చివేయాలని సన్నాహాలు కొనసాగుతున్న విపత్సమయానకూడ, గంభీరులై నిరుద్రేకులై నిశ్చలులై కూర్చొన గలిగిన ఆ వృద్ధవీరత్రయాన్ని ముర్రేలో లోపల ఎంతో మెచ్చుకొన్నాడు. ఇండియన్లె వింతయినవాళ్ళు. వారిలోనూ వృద్ధులు మరీని. ముడతలుపడి, రేఖలుతీరి, చర్మమయాలైన మట్టిరంగు ముఖాలు చూచేటట్లయితే, తెల్లవారు కొట్టగలిగిన ముష్టిఘాతలనన్నిటిని మాత్రమే కాక, యికనన్నిటినికూడ సహించగలిగినంతటి దార్ఢ్యం వీరిలో వున్నదనిపించి తీరుతుంది.

పొగ త్రాగుతున్నారు వాళ్లు. ముర్రే మాట్లాడుతుంటే, జెస్కీ భాషాంతరీకరిస్తున్నాడు: "చట్ట ప్రకారం నేను దీనికి పూనకోవలసి వచ్చింది. చట్టమంటే ఏమిటో తెలుసుగదా! అంటే వాషింగ్టన్‌లో వున్నవారి నోటిమాట. వాషింగ్టన్‌లో వున్నారే, వాళ్లు జాతికంతటికి సర్వాధికారులు. ఇండియన్లు యావన్మందీ తమకై కేటాయించబడిన చోటనేవుండిపోవాలి, అని శాసించి వున్నారువాళ్లు. మరి యిప్పుడేంజరిగింది? మీగ్రామంనుంచి ముగ్గురు పారిపోయారు. తతిమ్మవారుకూడ ఏజన్సీవదలిపెట్టిపోతున్నారు. ఇది వుందే, యీ శాసనోల్లంఘన, మంచిదికాదు. అందుకని యీగ్రామస్థులనందరిని నేనుదుర్గానికి తీసుకొనిపోవాలి. మాయమైపోయారుచూడు, ఆ ముగ్గురూ మరలివచ్చేవరకు తిరిగి చట్టాన్ని మీరు అతిక్రమించరని మాకు అనిపించేటంతవరకు, మీరంతా కోటలో నేవుండిపోవాలి."

జెస్కీ తనకలాడిపోయాడు. చెప్పినదానినే తిరిగిచెప్పమని తరచుముర్రేను అడిగేవాడు. అంతేకాదు. ఈఇంగ్లీషుమాటలకు సరిపోయే చెయినీస్మాటలు వెంటనే నోటికిరాక, సతమతమై పోయేవాడు. ఎట్లో ముగించాడు. తల ఓరగా తిప్పి గడ్డం రుద్దుకుంటూ, గ్రుడ్లగూబవలె పొగాకు వుండ నములుకుంటూ, జవాబుకోసం నిరీక్షించాడు.

“ఈ మొండిపోట్లు, కయ్యాలంటే సైమ నేరకం” అన్నాడు ముర్రేతో.

“నీకెట్లా తెలుసు?”

“వాళ్లు మెత్తబడలేదు సరిగదా, చెరసాల పాలుకాగలిగినంత ఘోరాపరాధమేమీ చేయలేదు. ఆ ఏజన్సీ వుక్కను తట్టుకోలేక చల్లగా వుంటుందని హాయిగా వుంటుందని ఇక్కడికి వచ్చాము అంటున్నారు. ఎట్లాగూ ఈ చల్లటి సీమలో బ్రతుకులు వెళ్లబోయగలమనే ఆశ తమకూలేదట. చచ్చిపోవలసివస్తే, తమ తొలిసీమ అందాన్ని గుర్తుకు తెచ్చే యిక్కడే చచ్చిపోవాలని వుందట. తాము పారిపోయి రాలేదట. తమ పాపలు కూడ సునాయాసంగా ఎనిమిది మైళ్ళు నడచి రాగలరట.”

ముర్రే తల పంకించి, తన కోపాన్ని పొగగొట్టంమీద చూపసాగినాడు. “నా కీయబడిన ఆజ్ఞలను నేను నిర్వర్తించక తప్పదని, నాతోబాటు తాముకోటకు రాక తప్పదని, చెప్పు”.

“కారణముంటేనే గాని ఎవడినీ చెరలో పెట్టరాదట. కాని తమ నిర్బంధానికి కారణమేమీలేదట. ఇక్కడే వుండేపోతారటకాని కయ్యాలక్కరలేదట.”

“చెప్పిన మాటవిని, కుదురుగా రాకపోతే, బలం వాడవలసి వుంటుందని చెప్పు” అన్నాడు ముర్రే.

శిలా విగ్రహంవంటి తోడేలు ముఖంమీద అస్పష్టమైన మందహాస రేఖ ప్రసరించింది. ఈ వైనమంతా తనకేనాడో తెలుసునన్నట్లుగా వుంది అతని వైఖరి.

“మీరు చేయవలసిందేదో చేయక తప్పనట్లే తాము చేయవలసింది కూడ చేయక తప్పదట.”

మళ్ళీ కరస్పర్శల తతంగం జరిగింది. ఆమీదట, సైనికులూ స్కౌటూకలసి పర్వతాగ్రానికి మరలి వెళ్ళారు.

“హోవిట్జరు తీసుకొనిరావడం చాలా మంచిదయింది.” అన్నాడు కెల్లీ.

“తమరి అభిప్రాయాలను తమ వద్దనే వుంచుకోండి. పిలవని పేరంటానికి పోవడమెందుకు?” అని ముర్రే కెల్లీమీద విరుచుకొని పడినాడు.

బండకత్తి నాయకత్వంక్రింది ఇండియన్లను రెనోకోటలోని చెరకు కొనిరమ్మని కల్నల్ మిజ్నర్ ఆశ్వికదళాన్ని పంపిన విషయం మైల్స్‌కు తెలిసింది. అతనిలో పరస్పర విరుద్ధాలైన అనుభూతులు రెండు చెలరేగినవి. పెద్ద బరువు

వించినట్లయింది. వ్యవహార భారమిప్పుడు సమర్థులైన సైనికాధికారులే వహించారు. వారే పరిష్కరించుకొంటారు. కాని మిజ్నర్ చర్యకు ఆవశ్యకతలేదు. అది న్యాయమైనదీకాదు. తాను పనికిమాలినవాడని రుజువు చేసేందుకు మిజ్నర్ యీ పనికి పూనుకొనివుంటాడు. ఒక ప్రక్కనేమో విముక్తి లభించిందన్న మనసు తేలిక, మరొకప్రక్కనేమో, అవమానం జరుగుతున్నదనే మనసుబరువు - యీ రెండు అనుభూతులూ మైల్స్‌ను క్షోభింప చేశాయి.

చెయిన్నీలు ఏజన్సీని వదలివెళ్లలేదు. వెళ్ళే ప్రయత్నాలలో వున్నట్లూ నిర్ధరించి చెప్పవీలులేదు. కాబట్టి ఏజంటయిన తన అధికార వలయంలోనే వారుంటున్నారు. తాము నిజంగా చేయని నేరానికి, తనకు తెలిసినంతలో ఘటిల్లవీలులేని నేరానికీ, ఏభై అరవైమంది అమాయకులనుకల్నల్ మిజ్నర్ బంధీకృతుల నొనరిస్తుండగా, ఏజంటైనతానుచూస్తూ కూర్చోవడమెట్లా? బండకత్తి పూరివాళ్ళు ముగ్గురు పారిపోయినారనిజిమ్మీ ఎలుగుబంటుచెప్పిన మాటలుతప్ప, వేరేనిరూపణ ఏది? జిమ్మీ భ్రమించినాడేమో. ఆ నాటి ఎండ జిమ్మీకంటె తెలివిగలవాడిని కూడా భ్రమలపాలు చేయగలిగినంత తీవ్రమైనది. అసలు జిమ్మీ పలాయితులను చూచాడా? లేక మనసులో అక్కసుపెట్టుకొని, అబద్ధాలు చెప్పాడా? ఇదీకాకపోతే, ఆ ముగ్గురూ వేటాడుతూ వుండినారేమో! ఉత్తరానికి పారిపోతూలేరేమో!

ఆలోచించేకొద్దీ శిరోవేదన అతిశయించ సాగింది. అంతరాత్మ బాధపెట్ట సాగింది. అనుమానాలు ప్రబలతరం కాసాగినాయి. తాను కల్లాకపటం తెలియనివాడు. మోసచింతలేనివాడు. ఇండియన్ ఏజంట్ పదవిలో, తన విశ్వాసాలను అనుసరించ ప్రయత్నిస్తున్నాడు. తన అదుపుక్రిందవున్న మానవగణానికి మేలు చేద్దామనే అనుకొంటున్నాడు. కాని తనదారి నిష్కంటకంకాదు. అవరోధాలు దాదాపు దుర్లంఘ్యాలు. రేషన్లు చాలీచాలవు. అవసరాలకు అనుగుణమైనంతటి సామర్థ్యం కలవారి తోడ్పాటులేదు. బడి పంతుళ్ళను, తాపీ పనివాళ్ళను, సీసపు పనివాళ్ళను సరఫరా చేసేసిపోయి, ప్రభుత్వం ఆశ్విక దళాన్ని కాపు నిలిపింది. ఈ అసౌకర్యాలు మైల్స్ పనిని మాన్చలేను; మరింత కష్టభూయిష్టం చేశాయి - అంతే.

తనను వేధిస్తున్న సమస్యలతోటి నొప్పివేస్తున్న తలతోటి, తడిసి ముద్దయి అసౌకర్యంగావున్న షర్టుతోటి, లూసీకడ్డకు వచ్చాడు. ఆమె యిచ్చిన నిమ్మకాయ షర్బతు పుచ్చుకొన్నాడు. ఆమె ఎంతో నేర్పుతో తయారుచేసిన చక్కెర తినుబండారాలు నములుతూ ఆనందిద్దామని ప్రయత్నించాడు.

"నువ్వుచెప్పేది బాగానేవుంది కాని, జాన్, రెనోకోట చెరలో ఇండియన్లు ప్రవేశించడంతోటి, సమస్యలన్నీ విరగడైపోతాయికదా! అప్పుడు నేరస్తులెవరో, ఎవరుకారో నువ్వు సులువుగా తేల్చి చెప్పవచ్చునే" అన్నది లూసీ.

"అంత సులువుగా పరిష్కారంకావు" అన్నాడు మైల్స్ విచారగ్రస్తుడై.

"ఎవ్వరో ఒకరిద్దరు నేరం చేసివుండవచ్చుననే వూహతో, ఏభై అరవై మందిని చెరలో పెట్టడమే! నిజం చెప్పవలసివస్తే వాళ్ళలో ఏ ఒక్కడుగాని నేరం చేసినాడని నా అంతట నేనే చెప్పలేను. కాటర్ క్రీక్ దగ్గరకు తమ గ్రామాన్ని మార్చుకోవడమే నేరమయితే, ఆ నేరంనాది. ఆ పని నేనే చేసివుండవలసింది. కనీసం అక్కడ నీరనేదివుంది. పచ్చిక వుంది. ఈ ముదనష్టపు ఎర్ర దుమ్ములేదు."

"కాని పారిపోయిన ముగ్గురో?" అని గుర్తు చేసింది నెమ్మదిగా.

"నాశనంకానీ! క్షమించు, లూసీ. ఆ ముగ్గురూ పారిపోయారని బల్లగుద్ది చెప్పలేను."

"కాని ఏజన్సీలో అందరికి తెలిసిపోయిన విషయమాయె. బుర్రలో పురుగు చేరి తొలవడమే తడవుగా మనుషులు నిరభ్యంతరంగా పారిపోగలిగితే, సంగతులన్నీ ముదిరిపోతాయేమో!"

"అవును—"

"పారిపోయిన ముగ్గురు తిరిగి రాకుంటే చిక్కులు వస్తాయని నువ్వు తోడేలుకో, బండకత్తికో చెప్పకపోయావా?"

"వాళ్ళతో చెప్పి ఏంప్రయోజనం? పోయినవారిని వాళ్ళు మట్టుకు ఎట్లా తీసుకొని రాగలరు? లూసీ, నీకు బోధపడదులే. ఇదికాదు కీలకం. ఈ కేటాయింపుపద్ధతే పురుగుపట్టిపోయింది. ఒక మహా ప్రజను మూకవుమ్మడిగా చెరలపాల్జు చేయడమేమిటి?" కొద్దిగా సంకోచించాడు. తలపంకించాడు. "ఆ ముగ్గురు పారిపోయినందుకు, మిగిలివున్నవారు శిక్ష ననుభవించవలసిందే. కాని పద్ధతి యిదిమట్టుకు కాదు. మిజ్నర్ తుపాకినిచ్చి పంపాడు. ఇండియన్ గ్రామంలోకి తూటాలు పేల్పించినా పేల్పించగల దిట్ట. మరి నే నేంచేయనిప్పుడు?"

"ఎవరినో ఒకరిని త్వరగా పంపించు. నువ్వింకా డార్లింగ్టన్ ఏజంటువే."

"నిజం నువ్వన్నది. సెగర్ వున్నపాళాన్నే పోయి, నేను ఇండియన్ పెద్దలతో సంప్రదించేవరకు, సైనిక చర్యను ఆపుచేయించవచ్చు. మిజ్నర్ పద్ధతికంటె యిదే మెరుగు," అంటూ హేట్ పెట్టుకొని, సెగర్‌కోసం బయలుదేరిపోయాడు.

అప్పటికప్పుడే తెరిపియిచ్చినట్లయింది. జరుగగలదానిని గురించి మథనపడక, అవశ్యం ప్రస్తుత మవసరమైనపనికి పూనుకోవడం తృప్తికరమైవుంది. సైనికోద్యోగుల విరుద్ధ సెగర్ నేమీ చేయలేవు. ఏజంటుగా, తన ఏజన్సీలో న్యాయాన్ని నిర్ణయించేహక్కు, చట్టాన్ని అమలుజరిపే బాధ్యత, తనదేనను కొన్నాడు.

సెగర్ గుర్రానికి జీను వేస్తూంటే, మైల్స్ సుదీర్ఘోపన్యాస మియ్యసాగినాడు. సెగర్‌కోసమే కాదు, తనను దిగ్భ్రాంతపెట్టే సందిగ్ధాలను వైదొల

గించుకోవడానికే యీ వుపన్యాసమంతా. సెగర్‌ను త్వరపడమన్నాడు. ముప్పాతిక మూడువీసాలు, తోడేలు లొంగుబాటు కాబోదు. తమ వాదం నిస్సారమని, అక్రమమని అనుకొన్నప్పుడు తప్ప, మరెప్పుడు ఏ ఇండియన్ పోటరి ప్రతిఘటన మాని లొంగిపోయాడు? మరొక ఇండియన్ యుద్ధాన్ని కాకున్నా, కనీసం చిత్రవధనయినా ఆపేందుకు త్వరపడమని సెగర్‌ను బ్రతిమాలుకొన్నాడు. మైల్స్ యిచ్చిన వుపన్యాసమంతా సావధానుడై విని, సెగర్ జవాబుగా తల పంకించాడు.

"సాధ్యమయినదంతా చేస్తాను," అన్నాడు.

"బి" కంపెనీ విడిసివున్న కొండగట్టు చేరేసరికి, చీకటిపడింది. అంతా సద్దుమణిగి వుండటం చూచి, జరగవలసినదంతా జరిగిపోయిం దనుకొన్నాడు. తన అంతరాత్మను ఎట్లాగో ఒకలాగు శాంతింపచేయడం తప్ప మైల్స్‌గారికి మిగిలిందేమీ లేదనుకున్నాడు. ఇంతలో, ఆ మసక మసక వెలుతురులో, గట్టు వెంబడి తుపాకులు మోపెట్టి నిశ్శబ్దంగా కూర్చునివున్న సైనికుల నిశ్చలాకృతులు కనవచ్చినై. సైనికులకు దిగువగా లోయలో మిణుగురుపురుగులవలె ఇండియన్ గ్రామంలోని చలిమంటలు కనుపించినై.

అమ్మయ్య, ఫరవాలేదు, కాలం మించిపోలేదు, అని నిట్టూర్చి, ఎదురువచ్చి నీవెవడవని ప్రశ్నించిన గస్తీమనిషిని "దళాధిపతి ఎవరిక్కడ?" అని అడిగాడు.

"కెప్టన్ ముర్రే."

"నేనాయనను చూడాలి. ఏజన్సీనుంచి వచ్చాను. నా పేరు సెగర్."

అపరాహ్నమంతా, యిప్పటివరకూ, ముర్రే సైనికచర్యను వాయిదా వేస్తున్నాడు. తొలుదొల్త సన్నాహాలలో మునిగిపోయాడు. అవి ఒక కొలికికి వచ్చినపిమ్మట, వ్యూహరచనగురించి ఆలోచించసాగినాడు. ఈ విషయంలో పెద్దగా వ్యూహమేమీ అక్కరలేదని, నాల్గు తూటాలు పేల్చి, గ్రామంలోకి చొరబడి, ఖైదీలను చేజిక్కించుకోవచ్చునని, అతనికి తెలియకపోలేదు. ప్రొద్దువాలేకొద్దికి, అతని ఆలోచనల పర్యవసానం ఏమీ లేకపోయేసరికి, అతని మనస్థితి మారిపోయింది. కోపం ముక్కునుంచి జారిపడుతున్నది. అతని కేదైనా చెప్పడానికి సర్జెంటు క్లీకికూడ భయమౌతున్నది. చెట్టుకు చేరగిలబడి, చుట్టూ పొగాకురసం వుమ్మివేస్తున్న స్కాటును చూచేసరికి, ముర్రే భగ్గున మండిపడ్డాడు.

నిజమేమిటంటే, పురుషులలో సగంమందినికూడ ఖైదీలను చేయడం దుష్కరమని ముర్రే గ్రహించాడు. చెయిన్నీలు పోట్లాడుతారు. తన సైనికులలో పన్నెండుగురికి తక్కువ కాకుండా చనిపోవచ్చు. చివరికి ఆడవారి శవాలను, పసికందుల శవాలను పూడ్చిపెట్టడమే మిగిలినపని కావచ్చు. ఈ ఒక్క చర్యఫలితంగా, సత్ఫలమేమీ వుండబోని ఇండియన్ యుద్ధం ప్రజ్వరిల్ల

వచ్చు. ప్రజ్వరిల్లిందా, చల్లారేముందు పల్లపు భూములలో సగభాగం మంటలపాలుగాక తప్పదు. ప్రాణాలు కోల్పోయి, గాయాలుపడి, బ్రతుకులు చెడిన మనుష్యులే యుద్ధభీభత్సానికి సాక్షీభూతులు కావలసివస్తుంది. దీనికంతటికి బాధ్యతను తనమీద రుద్దిన మిజ్నర్ అంటే, ముర్రేలో ద్వేషం జ్వాలవలె రెచ్చిపోతున్నది. ప్రస్తుతస్థితి విషమజటిలమైవుంది; పురోగమన తిరోగమనాలు కూడ ప్రమాదభూయిష్టాలు, అప్రతిష్టాకరాలు. పై అధికారుల చిత్తవృత్తి ననుసరించి, క్రిందివారు నడుచుకోకపోతే, ఉద్యోగిగా రాణించడం సాధ్యపడదు. క్రిందివారిని తేల్చడంగాని, ముంచడంగాని పై అధికారుల చేతులలోనిపని.

కాబట్టి, ముర్రే కటకట పడసాగాడు. మరుగంటలో సైనికచర్య నుపక్రమింప చేద్దామనుకొంటాడు. ఆ గంటవచ్చిపడుతుంది. మరుగంటలో చర్య ప్రారంభిద్దామనుకొంటాడు. ఈవిధంగా గంటనుండి మరొక గంటకువాయిదా వేసుకుంటూవున్నాడు. అంతలోవచ్చిన సెగర్‌ను ఈశ్వరుడే తన సహాయానికి పంపినట్లనుకొన్నాడు. సాతురుడై సెగర్‌కు స్వాగతంచెప్పాడు.

"గుడీవెనింగ్, కెప్టన్" అన్నాడు సెగర్. "పందిగేమో మంటబెట్టారుకాని యింకాతినలేదేసు?"

"ఏ ఖైమంది జగజెట్లను ఖైదీలుచేయడం వనభోజనంకాదు."

"మీ రన్నది నిజం. మీ కల్నల్‌గారు అందనిదానికి అర్రు చాచినాడు. మీ ఉద్దేశమూ అంతే ననుకొంటాను."

"ఓహో?"

"అది నా వుద్దేశం. మైల్స్‌గారిదికూడ. బహుశా ఇండియన్ ఆఫీసువారు కూడ మాతో ఏకీభవించవచ్చు. చూడచక్కని మీ హోవిట్జర్ ఇండియన్ గ్రామంలోకి తూటాలు పేలిస్తే, ఆ తరువాత నరకమే విజృంభించగలదేమో! వాషింగ్టన్ కల దెలిసికొని లేచి కూర్చుని, ఈశ్వర సమానుడ ననుకొంటున్న కల్నల్ మిజ్నర్ అంతటివాణ్ణికూడ పడగొట్టవచ్చు."

"జరుగవచ్చునేమో," అన్నాడు కెప్టన్ ముర్రే గోడమీది ప్లివాటంగా. కాని తన బరువు యావత్తూ వదలిపోయినట్లు నిండుగా వచ్చే నవ్వును ఆపుకోలేకపోతున్నాడు.

"ఇండియన్లు యిప్పటికీ ఏజన్సీ ప్రాంతంలోనే వున్నారు. అంటే, ఏజంటు మైల్స్‌గారి అజమాయిషీలోనే వున్నారు. సైన్యానికి సంబంధమేమీ లేదు. ఏదైనా జరగరానిది జరిగితే, దళంలోని ప్రతి వుద్యోగీ జవాబు చెప్పుకోవలసివుంటుందని మైల్స్ హెచ్చరిస్తున్నాడు. వీళ్లను ఖైదీలనుచేసే హక్కు మీకు లేదు. అది కల్నల్‌గారికి తెలియకపోలేదు. ఈ హెచ్చరికను వ్రాతపూర్వకంగా ఇవ్వనా?"

"అక్కరలేదు" అన్నాడు ముర్రే.

"రాత్రికంతా యిక్కడే వుండదలచుకొన్నారా ?"

"కల్నల్ మిజ్నర్‌గారికి కబురుపెట్టి, తాజావుత్తర్వులు వచ్చేవరకు మేమిక్కడే వుండక తప్పదు. కాని మీ అమూల్య మణిమాణిక్యాలవంటి యీ ఆటవికులను ముట్టుకోము. ఒకకంట కనిపెట్టుతుంటా నంతే."

"ఈ మాటమీద మీతో కరస్పర్శ చేస్తాను కెప్టన్," అన్నాడు సెగర్. "నేను క్రిందికి వెళ్ళుతున్నాను, వెళ్ళి, పెద్దలను శిబిరానికివచ్చి ఏజంటుగారితో సంప్రదించేందుకు ఒప్పించాలి. చీకటిలోనుంచి ఏదో కనుక వెలికి వచ్చిందే తడవుగా, కాల్పులు మాత్రం మొదలెట్టకండి."

"మీరు పోవడం కాస్త ప్రమాదకరమైన విషయమే. మనం దేనికి పూను కొనివున్నామో వాళ్ళకు తెలుసు" అని ముర్రే హెచ్చరించాడు.

"అట్లాగా ? అయినా చూస్తాను. నన్ను కాల్చివేస్తారనుకోను."

"కూడా జెస్కీని పంపనా మాట్లాడను ?"

"అతనా ? అక్కరలేదు. కొద్దో గొప్పో నాకూ వారి భాష తెలుసు. నాతో మీ సైన్యంలో వున్నవారెవ్వరూ రావద్దు."

"మంచిది - అయితే బయలుదేరండి. మీ చర్మంగురించి నేను బాధపడడ మెందుకు ?"

చీకటిలోకి చొరబడి గుర్రంమీద వెళ్ళిపోతున్న సెగర్‌ను చూస్తూ ముర్రే నిలుచున్నాడు. నాలుగడుగులు వేసేసరికి, చీకటిలో కలసి పోయాడు. మరి కొంచెంసేపు గుర్రపుడెక్కల సవ్వడి వినిపించింది. కాని త్వరలో అదకూడ వినిపించలేదు. చాలసేపటివరకు సెగర్ తనను విడచిపెట్టి పోయినచోటనే ముర్రే వుండిపోయాడు. ఇండియన్ గ్రామంలో మిణుకు మిణుకు మంటున్న మంటలను, అస్పష్టంగా కనుపిస్తున్న యిండియన్ గృహాలను చూస్తూ వుండి పోయాడు.

"ఆ పనికిమాలిన సెగర్ తల ఎగిరిపోక తప్పదు. వాడికి అంతేకావాలి" అని చీకటిలో ఎక్కడో చేరి స్కౌటు తిట్టడం వినిపించింది.

మరొక గంటలో సెగర్ వచ్చేశాడు. ఏమిజరిగిందో తెలుసుకోవాలని ఆరాటపడుతున్న ముర్రేతో "ప్రొద్దుటే పెద్దలువస్తారు. వాళ్ళ నడ్డగించవద్దు" అన్నాడు.

"అట్లాగే. చిక్కుపడ్డారా ?"

"చెయెన్నీ భాషరాక చిక్కుపడ్డాను. అంతేగాని మరేచిక్కూలేదు. వాళ్ల పసిపిల్లల మాటలన్నీ కూడ తెలియవే నాకు ?"

మరుసటిదినం ప్రొద్దుటిపూట కల్నల్ మిజ్నర్, లెఫ్టినెంట్ స్టీవెన్సన్ ఏజన్సీకి అశ్వారూఢులై వచ్చారు. తానిచ్చిపంపిన ఆజ్ఞలకు ప్రతి ఆజ్ఞలను యిచ్చినందుకు మిజ్నర్ మైల్సుమీద పొగలుక్రక్కుతున్నాడు. కాని షెరి

తంగా ఆలోచించినమీదట, తాను పూనుకొన్న చర్య ఎంత దారుణంగా పరిణమించి యుండేదో గ్రహించాడు. మంటపాలయిన తన వస్తువులను మైల్స్ మంటలు దాటించాడని తెలుసుకొన్నాడు. వ్యవహారాన్ని మైల్స్ తానే స్వయంగా నిర్వహించబోతున్నాడు కనుక పోయి చూద్దామని వచ్చాడు. వీలైతే సమస్యా పరిష్కారానికి తోడ్పడుదామనుకొన్నాడు. ఈ సమస్యలో తానై వేళ్ళుబెట్టిన మొండిచేతిని వీలైనంత చక్కగా వుపసంహరించుకోవాలని అనుకొన్నాడు.

ఈ ఆఫీసర్లు యిద్దరు వచ్చేసరికి, మైల్స్‌గారి ఆఫీసు, అసలే చిన్నదేమో, కిటకిటలాడుతున్నది. సెగర్, మైల్స్, ట్రూస్లడ్, దుబాసి పనిచేయడానికి ఎడ్మండ్ గురియర్ హాజరైవున్నారు. సరిగా అభివాదనైనా చేయకుండా, ఏజన్సీ మనుషులను చూచి తలపంకిస్తూ ప్రవేశించి, మిజ్నర్ కిటికీప్రక్కనవున్న కుర్చీలో కూర్చున్నాడు. అతని సరసనే లెఫ్టినెంట్ స్టీవెన్సన్ నిలుచున్నాడు. పొగగొట్టంలో ఆకు కూరుకొంటూ, మేజా అంచుమీద సెగర్ కూర్చున్నాడు. బల్లముందు మైల్స్ వున్నాడు. అట్టా పెన్సిలూ చేదాల్చి ట్రూస్లడ్ ఒకమూల కూర్చున్నాడు. తల వంచుకొని వెడల్పాటి అంచుగల గడ్డిహేటును వ్రేళ్ళమీద తిప్పుకొంటూ, ఒక గోడకానుకొని, గురియర్ నిలుచున్నాడు.

ఇండియన్లు మరొక అరగంటలో వచ్చేశారు. అప్పటివరకు ఎవరూ అంతగా మాట్లాడలేదు. ఎవరూ కదలనుకూడాలేదు. కిటికీ తలుపులు బారలుగా తెరుద్దామని సెగర్ ఒక్కసారేమో లేచినాడు. శీతోష్ణస్థితిగురించి వ్యాఖ్యానాలు బహుస్వల్పం. నుదుళ్ళు తుడుచుకోవడంతో సరిపోయింది. బల్లమీదికి వంగి కూర్చుని, మైల్స్ ఏదో నివేదిక తయారుచేస్తున్నాడు. స్థిమితంగా వున్నట్లు లేదు అతనిమనస్సు. ముళ్ళమీద కూర్చున్నట్లు వుంది.

చిట్టచివరకు, కిటికీవైపుచూచి, "అడుగో వచ్చేశారు ?"అన్నాడు సెగర్. ప్రతి ఒక్కరు చూడడానికి యిటుమళ్ళినారు. ఇండియన్లు ముగ్గురు వసారా వైపుకు గుర్రాలమీద వస్తున్నారు. ముందున్న యిద్దరూ వయోధికులు. వెనుక నున్నది మధ్యవయస్కుడైన మహాకాయుడు. అతని కండరాలు లోహనిర్మితాలైనట్లున్నవి; ముఖమంతా గాయాలు మచ్చలు. సావకాశంగా, సాలోచనగా, జీనులమీద వంగి కూర్చుని స్వారీ చేస్తున్నారు- వారి వెనుక ఏజన్సీ కుర్రమూక పరుగెత్తుతున్నది. ఇంటిదగ్గర, వాళ్ళు గుర్రాలు దిగారు. పిల్లలు వాళ్ళను చుట్టేశారు.

"మచ్చల ముఖం వాడిపేరు కాకి" అన్నాడు సెగర్. "పెడకట్టైవాడు కూడా వస్తున్నాడంటే, చిక్కులు తప్పవని నిశ్చయించుకున్నారన్నమాట. ట్విన్ ఫోర్క్స్ పోట్లాటలో యితగాడు వుత్తచేతులతో ఆరుగురు పానీలను కూల్చి చంపినాడట. మిగతా యిద్దరూ తోడేలూ, అడవిపందీ."

సెగర్ పొగగొట్టం ముట్టించి, పెద్దలను లోనికి తీసుకురావడానికి బయిటికి పోయాడు. అతను తిరిగివచ్చేవరకు గదిలోపల నిశ్శబ్దం. మైల్స్ వ్రాతపని నాపివేశాడు. లోనికివచ్చిన చెయెన్నీలు గదిలోని ప్రతి ఒక్కరితోటి కరస్పర్శ చేశారు. చేసి ఒక గోడకానుకొని కూర్చున్నారు.' ఏజంటుగారు మాట్లాడుతాడని వాళ్ళూరకుండిపోయారు. కాని నిశ్శబ్దం తెగిందికాదు, అంతలో తోడేలేదో అన్నాడు. "మీరు తమనెందుకు పిలిపించారో తెలియచెప్పమంటున్నాడు," అని గురియర్ భాషాంతరీకరించాడు.

ఉన్నట్టుండి మిజ్నర్ ముఖంలో చిరునవ్వు వెలసింది.

"నే నెందుకు పిలువనంపిందీ అతనికి తెలియక పోలేదు" అన్నాడు మైల్స్.

"తనకు తెలియదట. తాము శాంతంగా, ఎవ్వరికీ ఏలాంటి హానికలిగించకుండా వుంటున్నారట. శ్వేతసైనికులు తమ గ్రామాన్ని చుట్టుముట్టి, తమమీద ఫిరంగిని మోపెట్టినప్పటికి, తమపాటికి తాము పరమశాంతంగా వుంటున్నారట. శాంతంగా వుండటమే కదా తెల్లవారికి కావలసింది?"

ఇది విని, ఏజంటు తోడేలువైపు తిరిగి, "నీ మనుషులు ముగ్గురు పారిపోయారు. ఉత్తరానికి పోతుండగా ఒక అరాపహోకంట బడినారు. వాళ్ళవరయిందీ అత నెరుగును. నేను అనుమతించనిదే ఏ ఇండియన్ కాని ఏజన్సీదాటిపోవడం చట్టవిరుద్ధమని నీకు తెలుసు. కాబట్టి సిపాయీలు పోయి, పారిపోయిన ముగ్గురిని వెదకి పట్టుకొని వచ్చేవరకూ, నీ వాళ్ళను పదిమందిని నా వద్ద ఖైదీలుగా వుంచవలె. ఆ ముగ్గురు వచ్చేస్తే, మరి నీ పదిమంది ఖైదీలకు స్వేచ్ఛనిస్తాను."

భాషాంతరీకరణం పూర్తికావస్తున్నది. ఇంతలో తోడేలు అడవి పందితో ఏమో గుసగుసమన్నాడు. రెండవవాడు తలపంకించాడు. తోడేలుకూడ తల పంకించి, "వల్లపడదు. మీరు చెప్పింది చేయలేను. వెయ్యిమందిని దాచిపెట్టగలంత పెద్దసీమలో మీరు ముగ్గురిని ఎట్లాగావెదకి పట్టుకోగలరు? ఏజన్సీలో మీకు సాయపడే వాళ్ళెవ్వరు పారిపోయి నట్లయితే, నేను మీ వద్దకువచ్చి మీకు చెందిన వారిని పదిమందిని యివ్వమని అడుగుతానా? ఎవడో చేసిన నేరానికి అమాయకుని బాధలపాలు చేయడమేనా తెల్లవారిన్యాయం? ఈ పదిమందిచేసిన నేరమేమీ లేదు. కాని చెరలో త్రోసి, చనిపోయేవరకు క్రుంగదీస్తామంటున్నారు. ఫ్లారిడాలో ఎంతమంది చెయెన్నీలను చెరలో త్రోశారుకారు? వాళ్ళలో ఒక్కడైనా బ్రతికి బయటపడినాడా? వీలులేదు, వల్లకాదు," అన్నాడు.

మిజ్నర్ యింకా ఆనందించుకొంటూ వున్నాడు. భాషాంతరీకరిస్తున్న గురియర్ యిటు అటు కదులుతున్నాడు. మైల్స్‌కు కోపం వచ్చింది.

"పదిమందిని నాకు అప్పగిస్తావా, అప్పగించు. లేదా, నావద్దనుండి మరి రేషన్లు రాలవు. ఆ పదిమంది చేతబడేవరకూ మీకు తిండీ తిప్పలుండవు. వాళ్లను

అప్పగించివేయాలి, వెంటనే అప్పగించు." తోడేలు తల వూపినాడు. "వీలు లేదు. మా కడుపులు మాడుస్తానని బెదిరించి లాభంలేదు. ఈవరకే పస్తులుంటు న్నాము. ఉంటాము అవసరమైతే. మనుషుల నప్పగించడం మట్టుకు జరగదు. నేను తెల్లవారికి స్నేహితుణ్ణి, చాలనాళ్ళనుండి స్నేహితుణ్ణి. తెల్లవాళ్ళతో పోట్లాడి చనిపోవడంకంటె కలసి పనిచేయడమే మంచిదని గ్రహించాను. నామాటకువస్తే, నా ప్రాణాలు లెక్కలేదు. ముసలివాణ్ణి. కాని మా తెగలో ఏ కొద్దిభాగం మాత్రమో మిగిలి వున్నదని తెలుసుకొన్నాను. జాతి జాతి నశించడం భయంకరమైన విషయం. చావవలసివస్తే, మేము పోట్లాడుతూనైనా చావ సిద్ధపడి వున్నాము కాని మీ తెల్లవారి చట్టానికి లోబడిమట్టుకు చావబోము."

"నేను అజ్ఞానినని అనుకుంటున్నారేమోమీరు, కాని నేను వాషింగ్టన్‌కు పోయివచ్చాను. అధ్యక్షుడితో మాట్లాడాను, కరస్పర్శకూడ చేశాను. మన నడుమ యిక శాంతి వుండవలెనన్నాడాయన. ఆ శాంతిని యింతవరకు రక్షించ జూచాను."

మైల్స్ మొండిగా తలవిదిలించాడు. గురియర్ మాటలను అతను వింటున్నట్లే లేదు. మిజ్నర్ చిరునవ్వునే గమనిస్తూ, చట్టాన్ని అమలుజరుపజాలనివాని పట్ల కల్నల్ తృణీకారభావం వహిస్తాడేమో ననుకొంటున్నాడు.

"పదిమందిని అప్పగించివేయాలి. ఇక్కడకు తీసుకొనిరావాలి. ఈవేళే తీసుకొనిరావాలి." అన్నాడు మైల్స్.

తోడేలు చిత్రంగానవ్వాడు. "మైల్స్‌గారూ, మనం యిప్పటివరకూ నేస్తులమై వుంటున్నాము. కాని మీరు అడిగింది నేను చేయలేను. ఏది న్యాయమనుకొంటానో దానినే చేసి తీరవలె. నాకు గలాటా లక్కరలేదు. ఈ ఏజన్సీలో రక్తపాతం నా కిష్టంలేదు. కాని మీరుకోరింది మట్టుకు నేనుచేయలేను."

"అయితే ఆకటమాడిపొండి!"

మిగత చెయిన్నీ లిద్దరూ తోడేలువంక చూశారు. మచ్చలుపడినవాని ముఖం కోపఘూర్ణితమైనది. కాని తోడేలు అతనిచేతిని నొక్కులు పడేటంతగట్టిగా అదిమిపెట్టాడు. అటుమీదట, ఒక్కొక్కరి దగ్గరకుపోయి కరస్పర్శ చేశాడు.

"పదిమందికోసం ఎదురుచూస్తుంటాను" అన్నాడు మైల్స్.

"శిబిరానికి మరలిపోతున్నాను" అన్నాడు తోడేలు. "మేముగాని మీరుగాని చేయవలసింది చేయక తప్పదు. ఇక్కడ ఈ ఏజన్సీలోవారిని కొందరిని మీరు పోషించారు. కాబట్టి భూమిని నెత్తుట తడిపినంతకంటె అవమానం వుండదు. కాని నావిధి యిదే. విధిని నిర్వహించక తప్పదు. నా వారిని కూడగట్టుకొని నల్లమలలలోని స్వస్థానానికి ఉత్తరాదికి పయనమైపోతాను. శాంతంగా పోవాలని మా అభిలాష. మాదారిని ఎవ్వరూ అడ్డగకుంటే శాంతంగానే పోతాము. కాని మాపైకి మీసైనికులను పంపక తప్పనట్లయితే, మేమీ ఏజన్సీని వదలినంతవరకు

తమాయించండి. మరి అప్పుడుకనక మాతో పోట్లాడబూనుకొంటే, మేమూ తయారుగావుంటాము. అక్కడ నెత్తురు చిందించవచ్చు."

మరు మాటలేకుండా, మైల్స్ అతనివంక తేరిపారచూడసాగినాడు.

"ఇక్కడే యీ ముగ్గురినీ బంధించకపోతే నువ్వు వృత్తి మొద్దువనిపించుకొంటావు మైల్స్" అన్నాడు మిజ్నర్.

"వాళ్ళనుపోనీ, సెగర్" అన్నాడు మైల్స్ మందంగా.

"మైల్స్, ఇక్కడినుండి స్వేచ్ఛగా పోనిస్తావా వాళ్ళను?"

"నేను రమ్మన్నమీదట వచ్చారు" అన్నాడు మైల్స్. "రాకపోకలలో నిర్బంధాలేమీ వుండబోవని హామీ యిచ్చివున్నాను. నేను చేయగలిగింది యింతకంటె మించి మరేమీలేదు" అని, నొప్పిపెట్టుతున్న తలను చేతులలో ఆన్చి, కూర్చుని వుండిపోయాడు. మిగతావారు యింత వుక్కపోయని వరండాలోనికి పోయి, ధూళి మేఘాలలో తేలిపోతున్న గుర్రాలమీద చెయిన్నీలు వెళ్ళిపోతుంటే, చూస్తూ నిలుచున్నారు.

మరలిపోతూ, మిజ్నర్, చిరునవ్వుతో, మైల్స్‌వైపుచూసి, "'బీకం'పెనీని వున్నచోటనే వుంచుతాను. వారి అవసరం యింకా వుండవచ్చునేమో" అన్నాడు.

ఆశలన్నీ వుడిగినట్లయిపోయిన మైల్స్ జవాబీయలేదు.

"ఉత్తరాది చెయిన్నీ నాయకుడైన తోడేలు, మున్నూరుమంది వున్న ముఠాను వెంటబెట్టుకొని, ఉత్తరానికి వెళ్ళిపోతానని బెదిరిస్తున్నాడు. వెంటనే ఏమి చేయమంటారో తెలుపవలసింది", అని లారెన్సులోని ఇండియన్ వ్యవహారాల సూపర్నెంటయిన విలియమ్ నికల్సన్‌కు తంతివార్త పంపినాడు. జవాబు వచ్చేలోపల, మైల్స్ హృదయం కల్లోలితమైపోయింది. లూసీ అతనిస్థితిని గమనించి, క్వేకర్ మతాధికారి అయిన ఎల్కన్నా బియర్డ్సను, అతని భార్యను విందుకు పిలిచింది. ఎల్కన్నా బియర్డ్ శతవిధాల మైల్స్ మనస్సును వూరటబెట్ట ప్రయత్నించాడు. చీటికి మాటికి, ప్రేమమార్గమే పరమోత్కృష్ట మార్గమని, వ్యవహారాలు తమంత తామే సర్దుకోగలవని మానవులందరు విశ్వసించవలెనని, వల్లించసాగినాడు. "అంతరాత్మ శుద్ధిగా ప్రతి ఒక్కడూ నడచుకోవాలి." అని ఉపదేశించాడు.

"ఆటవికుడు మతంపుచ్చుకొన్నాగాని, క్రిశ్చియన్ సంప్రదాయాలను బోధపరచుకోలేడు," అన్నది నిదానంగా లూసీ. "మనం ఓపికపట్టాలి. ప్రేమించాలి, ఈ విషయం మా జాన్‌కు ఎన్నోసార్లు చెప్పాను. చిట్టచివరకు వ్యవహారాలు తమంతట తామే సర్దుబాటవుతాయి."

"తప్పనిసరిగా," అన్నాడు బియర్డ్.

జవాబు వచ్చేసరికి చీకటి పడింది. "ఇండియన్‌లు ఎవ్వరూ ఏజన్సీవదలి పోవీలులేదు. ఉత్తరాది చెయిన్నీలు ఏజన్సీలో వుండిపోవడం ఇండియన్ పునరా

వాస పథకానికంతటికీ ప్రాణప్రదమైన అవసరం. మిజ్నర్‌కు తెలియపరచవలసింది." అని నికల్సన్ తంతివార్త పంపినాడు.

సెగర్‌ను పిలవనంపకముందు, ఆఫీసులో చాలసేపు కూర్చుని, మైల్స్ దానిని పదేపదే చదువుకొన్నాడు. సెగర్ వచ్చాడు. రెనోకోటలో వున్న కల్నల్ మిజ్నర్‌కు దీనిని యిచ్చిరమ్మని నీరసంగా చెప్పాడు మైల్స్.

ఆ రాత్రి మైల్స్ శాంతి చెందలేదు. చాలసేపు ఆఫీసులోనే వుండిపోయాడు. లాంతరుచుట్టూచేరిన ఈగలనూ దోమలనూ గమనిస్తూ, తాను చేసింది సరైనదేనా, వుత్కృష్టమైనదేనా, అని మాటిమాటికి గుచ్చి గుచ్చి ప్రశ్నించుకొంటూవుండినాడు. కాని కల్నర్ మిజ్నర్ క్రియాపరుడు, కార్యశూరుడు. తంతికబురు చదువుకొన్న పది నిముషాలలోనే, "ఏ" కంపెనీ గుర్రాలను సమాయత్తపరచి సాగింది. మరొక అరగంటలో, ముర్రే దళంతో కలిసేందుకు, కెప్టెన్ వింట్ ముందుపోగా, ప్రయాణ మారంభించింది.

మిజ్నర్ పంపిన వుత్తర్వులను వేదాంతివలె ఆమోదించాడు ముర్రే చప్పగా. కొండ తూర్పుగట్టునం దంతట 'ఏ' కంపెనీ సైనికులను వ్యాపింపచేస్తే బాగుంటుందని వింట్‌కు సలహా యిచ్చాడు.

"అంతకంటె దూరం వ్యాపించడం శ్రేయస్కరం కాదు. నేను గాడి కొయ్యలను పాతిస్తాను, కాని నిజానికి యివి అక్కరలేదు. అవిగో, దిగువ వున్నై చూడు, వాళ్ళ శిబిరాలూ, మంటలూ."

"అక్కడికి యీ రాత్రే వెళ్ళిపోవడం గురించి కల్నల్ ఏదో చెప్పారు."

"అంతకంటె అవివేకం వుండబోదు. స్త్రీలూ శిశువులూ క్రిక్కిరిసి వున్నారు. కల్నల్‌గారికి రక్తస్నానం కావలిస్తే, అతనే వచ్చి చేయవచ్చు. ఇది చిత్రవధ కాదు, రక్షణచర్య మట్టుకే. ఉదయమయ్యేవరకు వేచి చూద్దాము."

# ప్రస్థానం మొదలవుతుంది
## సెప్టెంబరు 1878

కెప్టెన్ ముర్రే ఆ రాత్రి నిదురించలేకపోయాడు. మరుసటి ప్రొద్దుటే పోట్లాట వుంటుందని తెలిసినప్పుడు తనకు నిద్ర పట్టకపోవడం యింతకుముందు కూడ అనుభవవేద్యమయింది. గడచినరోజు తానెంత పరిశ్రమించినాగాని, ఉదయముతోటి భూమిపై తన మనుగడ కడముట్టవచ్చునన్న విషయం అతని మనస్సుకు పదును పెట్టి రేగొట్టి కలవరపరచేది. వింట్, ఫ్రీలాండ్, స్టీవెన్సన్లను చూచి అతను అసూయ పడేవాడు. అందరూ వాళ్లు యువకులు, చావును గురించిన ఆలోచనలే తమ మనస్సులకు వెలిమునసంత గాఢంగా జీవిత వ్యాపారాలలో మునిగి తేలుతారు. అంతేకాదు. వాళ్ళు ధైర్యస్థులు; తాను కాదు. పిరికివాడు అనేమాట ధ్వనించగనే, తన గత జీవితమంతటిని పునశ్చరించగలడు. కాని తనకున్నటువంటి భయము సర్వవ్యాప్తమైనదేమోనని, తాను దానిని దాచినట్లే యితరులుకూడ దాస్తారేమోనని, అతను అనుకొనేవాడు. పన్నెండేళ్ళనుంచి సైన్యంలో వుంటున్నాడు. ధైర్యస్తుడని, వుత్తమోద్యోగియని పేరొందాడు.

తొలుదొలుత గంటలు నెమ్మదిగా ప్రాకిపోతున్నట్లనిపించింది. ప్రతి క్రొత్తగంటకూ మునుపటికంటె అతని మనస్సు మరింత జాగ్రతమయ్యేది. ఇక నిద్రించచూచికూడ లాభముండదని ముర్రే లేచి, బూట్లువేసికొని, పొగగొట్టంలో పొగాకు కూరుకొన్నాడు. అగ్గిపుల్ల వెలిగించాడు. గొట్టం మూతినుండి మంట ఎగసింది. ఆర్పి, పొగ పీలుస్తూ మంచంమీద కాలు వేసుకొని పడుకొన్నాడు. పొగగొట్టం రుచించలేదు. చీకటిలో ఎప్పుడూయింతే. ఏమంటే పొగ కనుపించదు.

ఎవరో గుడారాన్ని సమీపించి, తెర ఒత్తిగిలదీసి, నిలుచున్నారు. "ఏవిటి?" అన్నాడు ముర్రే.

వచ్చినది సర్జెంట్ కెల్లీ "అగ్గిపుల్ల వెలిగించడంచూచి వచ్చాను" అన్నాడు. "బహుశా మీరేమైనా—"

"నేను లక్షణంగా వున్నాను." అన్నాడు ముర్రే విరిచినట్లు.

"చిత్తం"

"ఒకనిమిషం వుండు" అన్నాడు ముర్రే. "ఏమీ అనుకోకు. నిద్రపట్టక పోతే, కోపం ముక్కుమీద వుంటుంది."

"నేనుకూడ కునుకలేదండి" అన్నాడు కర్లీ భారంగా. "నేను ఆ స్థలం చూచివస్తున్నాను."

"సద్దణగివుందా?"

"శవాల యిల్లులాగుంది" అన్నాడు కర్లీ. "మంటలు మందమవుతున్నాయి ఇంత వుక్కపోస్తుంటే, వాళ్ళకు చలిమంటలెందుకో, నాకైతే తెలియటంలేదు."

"వెలుతురుకోసమేమో."

"ఏమన్నారండీ?"

"ఏమీలేదు" అని ముర్రే ఆవులించాడు.

"వెలుతురుకోసమనా? నరకానికిపోతున్న తమ నల్లటి అంతరాత్మలకు దారి చూపించడానికేమో!"

"సర్జెంట్, రేపుప్రొద్దుట పోట్లాట వుండవచ్చు. నీకు సంతోషమవుతుందనుకొంటాను. ఏం?"

"ఏమన్నారూ?"

"రేపు ఎందరినో చంపడం నీకు ఆనందకరంగా వుంటుందికదూ?"

"నేను దాని నావిధంగా చూడనండి."

"అయితే మరెట్లా చూస్తావేమిటి?"

"చేయవలసింది చేయకతప్పదు. మనిషి యింతకంటె దారుణాలుకూడ చేయగలడు."

"పోయి, నిదురపో సర్జెంట్" అని ఆవులించాడు ముర్రే. కర్లీ వెళ్ళిపోయిన తర్వాత, కంబళిలో తగులొక్కన్న జోళ్ళను విడదీసి, గుడారంబయటికి పోయాడు. సర్జెంట్ చెప్పినట్లుగానే, మందమందంగా కనుపిస్తున్న 'టెపీ' (ఇండియన్లు వేసుకొనే గుడిసెలాంటి యిల్లు కొసకూచిగా వుంటుంది.) ఆకారాల నుండి మసకగా వెలుతురు మిలమిలమంటుంది. గగనం నల్లగా, చుక్కలులేకుండా వుంది. రేపోమాపో వాన పడకతప్పదన్నంత ఉబ్బగావుంది. కొండగట్టు అంచు మీదుగా, పహారావాళ్ళనుదాటి, ఫిరంగివున్నచోటుకు పోయాడు. మందుగుండు సామగ్రిశకటం క్రింద పడుకొని ఫ్రేక్చేవారు నిదురపోతున్నారు, గురక పెట్టుతున్నారు. తడిగా చల్లగావున్న ఫిరంగి గొట్టంమీద చేయాన్చి, ఆ చేతిని ముఖం మీద పెట్టుకొనేసరికి, నెమ్ము తగిలింది.

ముందుకూ వెనుకకూ పచారుచేస్తూ ముర్రే రెండుసార్లు పొగగొట్టాన్ని ఖాళీ చేశాడు. అప్పుడప్పుడు, మెరుము లురుములు రాత్రిని భేదించేవి. మొదటి రెండు పర్యాయాలు ముర్రే సంసిద్ధుడైలేడు కాని మూడవతూరి మెరుపు మెరిసేటప్పటికే అతను తీరుగా ఇండియన్ గ్రామాన్ని తేరిపారచూస్తున్నాడు: వెనువెంటనే అతనికి,

గ్రామమధ్యాన ఒకే ఒక్కడు ఎవ్వడోగాని అశ్వాసీను డున్నట్లు అనిపించింది. పహారావాడిని అడిగాడు కాని వాడు అసలు చూడనేలేదు. తర్వాత, వాన వస్తుందనుకొంటూ, ముర్రే తన గుడారుకు వెళ్ళిపోయాడు. శయ్యచివర, కాలి మీద కాలాన్చి, కూర్చున్నాడు. వాన రాలేదు. భస్మవర్ణాంచితమూ, ఆర్ద్రమూ నైన ఉదయ సూచన గుడారులోనికి చొరబారినంతవరకూ, ముర్రే అట్లే కూర్చుని వుండిపోయాడు.

ఆ తర్వాత లేచి, వింట్ విడిదికి వెళ్ళి నిదుర లేవగొట్టినాడు. "తెల్ల వారింది" అన్నాడు కఠినస్వరాన. "బయటికిరా" వింట్ లేచి కూర్చుని, కళ్ళు నలుపుకొంటూ, "ఏమైంది? ఏమిటిది? ఇంకా చీకటి చెదరిపోనేలేదు బయట అన్నాడు."

"తెల్లవారిపోయింది. లే! చుట్టూ తిరిగి చూడాలనివుంది. నేను వెళ్ళు తున్నాగాని, యీ లోపల లే! పుణ్యముంటుంది."

"సద్దుమణగివుంది" అన్నాడు వింట్ యింకా తూగుతూ, బూట్లకోసం వెదకులాడుతూ.

"అవును కాని నేను క్రిందికి పోతున్నాను."

"శివమెక్కిందా ఏమిటి? కాస్సేపు ఆగరాదూ?"

ముర్రే భుజాలెగురవేసి, వెళ్ళిపోయాడు. ఊరిలోకి తానొక్కడే వెళ్ళా లని వుద్దేశించలేదు. భయమే అతనిచేత అర్థజాగృతుడైవున్న వింట్ కు సవాల్ చేయించగలిగింది. ఏదో యిప్పుడు త్రాగాలనిపించింది. తన గుడారులోకి వెళ్ళి, సంచీలో సగంమట్టుకే మిగిలివున్న పన్నెండు ఔన్సుల విస్కీ సీసాను వెదకి, దానిని దాదాపు ఖాళీచేశాడు. నోట్లో మింట్ దురిగికొని, సీసాను దుస్తుల్లోదాచి, పహారాజవాను దాటిపోగానే, సీసాను పొదలోకి విసిరివేశాడు. పొద తేమ తేమగా వుంది. దానిగుండా పోతుంటే, ఇజారు తప్పతడసిపోయింది. ఇరుకు సందులో పొగమంచు దట్టమైవుంది. ఇంతలో అతనికి ప్రత్తివలె తెల్లనైన నురుగువంటి పొగమంచుగుండా ఎత్తైయిన 'టెపీ'లు (ఇండియన్ల యిళ్ళు) కన పించాయి. ప్రతి రెండవ టెపీకివుండిన తోలుకప్పు తీసివేయబడింది. సన్నటి బొంగులు ఆధారంగా నిలుచున్న ఇళ్ళ అస్థిపంజరాలుమట్టుకు మిగిలివున్నాయి.

గ్రామం నిర్మానుష్యం కావడం అతనికి వింత కొల్పలేదు. తన పనికి మాలిన తనానికే ముర్రే నివ్వెరపోయాడు. ఇండియన్ల పన్నుగడను కనిపెట్టలేక పోయాడు. సగానికి సగం యిళ్ళలోమండుతున్న మంటలను అట్టేపెట్టి, మిగత యిళ్ళ తోలుకప్పులను తీసివేసి, గుర్రాల డెక్కల చప్పుడు వినిపించకుండా, తరలిపోయారు. ఎంతసేపు అయిందోపోయి? బుట్ట మునిగింది. విస్కీ వాసన తగిలిందేమో వింట్ కు? అతను పైఅధికారులకు తెలియజేస్తే?

ముర్రే, పొగగొట్టాన్ని ముట్టించాడు. విస్కీరుచిని పొగాకు తొలగించ

కలిగింది. వాసనకూడ పోగలదని ఆశించాడు. ఊరిగుండా నడిచాడు. పొగ మంచు సడలిచ్చింది. అలలలలుగా, యీకెలు యీకెలుగా తీగెలు తీగెలుగా విరిగి విడిపోయింది. ఇంకా వెచ్చగానున్న నిప్పులనెగద్రోసి, చెల్లాచెదరైవున్న చెత్తను సకౌతుకంగా చూడసాగాడు. ఇటీవలివరకూ మానవులువుండి, మరి యిప్పుడులేని అచ్చోటి నంటిపెట్టుకొని ఏదో విషాదావృతమైన మానవలక్షణం వున్నది. వాళ్లు సమక్షమం దున్నప్పటికంటె, యిప్పుడు మరింత సజీవంగా, మరింత యథార్థంగా కనుపిస్తున్నారు. ఒక్కొకటిగా వస్తువుల నేరసాగినాడు. విరిగిన విల్లొకటి, జింక తోలుతో చేసిన చిన్ని ఆటబొమ్మ, ఇండియన్లు ధరించే "మొకాసిన్లు" అనబడే జోళ్లజత ఒకటి (జింక తోలుతోనో, మరియే మృదుచర్మంతోనో చేసినవి) అగ్గిపుల్ల ఒకటి కనుపించాయి.

ఇండియన్లే స్వయంగా వెళ్ళిపోయుంటే, ఏమి జరిగివుండేదో అతను వూహించుకోసాగినాడు. హోవిజ్జరు గ్రామంమీద గుళ్ళుకురిపిస్తుంది. అశ్వికులు తీవ్రంగా ముట్టడివేస్తారు. కాల్చుకుంటూ దిగివస్తారు. కాల్పులకు గురి అవుతున్న వారు—యితరసందర్భాలలో సరళవర్తనులు, మర్యాదస్తులు—తెగబడిఎగబడి, ఆగ్రహావేశాన ఒళ్ళుమరచి, గుర్రాలనుగాని, బిడ్డలనుగాని, స్త్రీలనుగాని కనా కండలుగా నరికివేసేందుకుకూడ వెనుకాడరు. శాండ్ క్రీక్ అనేచోట జరిగిన చెయిన్నీలఘోర వధను గురించి కథలు విని వున్నాడు ముర్రే. అటువంటి దారుణచర్యలనుండి బ్రదికి బయటపడినానని అనుకొన్నాడు.

దళాలు రెండూ విడిసివున్న చోటికి తిరిగి వచ్చాడు. తనలో తానే ఏదో పాటను ఆలపించుకుంటున్నానని తెలుసుకొన్నాడు. అలసట పైబడింది. పడుకొని నిద్రపోవా లనుకొన్నాడు.

ఇంతలో వింట్ ఎదురయ్యాడు. మేఘాలు శిథిలీకృతా లయినవి. ఇరుకు సందులో సూర్యరశ్మి సమృద్ధమయింది. వ్రేలితో తన చిన్ని నల్లని మీసకట్టును సరిదిద్దుకొంటూ, మింట్ టెపీలవైపు చూస్తున్నాడు.

"వెళ్ళిపోయారు"అన్నాడు ముర్రే.

"అందరూనా ?"

"ఆహాఁ! కాని గుర్రాలు మూలగనైనా మూలగకుండా, వాళ్ళెట్లా పోగలిగారో నాకు తెలియదు. గుర్రాల విషయంలో వాళ్ళు పిశాచాలు."

"మనం రాత్రేపోయి వుండవలసివుంది" అన్నాడు వింట్ వ్యాకుల పాటుతో.

"ఆడజనాన్నీ పసిబిడ్డలనూ కాల్చి నరకానికిపోయి వుండవలసింది. ఏం ?"

"ఇండియన్లతో మరి వేరే దారిలేదు."

"నివేదిక తయారు చేయడానికి నీకు అభ్యంతరం లేకపోతే, నేను కాస్త నిదరపోతాను. నిన్నరాత్రి నిద్రపట్టలేదు."

కల్నల్ మిజ్నర్ అప్పుడే తిని, గుర్రపు సాలలవైపు పోతూవున్నాడు. కాటర్ క్రీక్ వద్దవున్న 'ఏ', 'బి' దళాల విషయం మేమయిందో కబురులేదు. ఈ పాటికే ఖైదీలను వెంటబెట్టుకొని వచ్చివేయవలసింది. అందుచేత మిజ్నర్ పరి పరి విధాల ఆలోచించసాగినాడు. డార్లింగ్టనుకుపోయి, సూపరింటెండెంటు వద్దనుంచిగాని, వాషింగ్టను నుంచిగాని యింకా ఏమైనా వార్త వచ్చిందేమో ఏజంటు మైల్స్ నడిగి తెలుసుకొందా మనుకొన్నాడు. కాని ముర్రే, వింట్ల వద్దనుంచి కబురు వచ్చిందాకా ఆగి చూద్దామనుకొన్నాడు. గుర్రపుసాలలోని గుర్రాలను తణిఖీచేసి, జెన్నీ అనబడే నల్లటి తన ఆడగుర్రాన్ని ఒక గంటలోపల సిద్ధపరచి వుండమని చెప్పి, తిరిగి వస్తున్నంతలో రొప్పుతున్న గుర్రంమీద కూర్చుని వాకిలిదాటి వస్తున్న ఏంజలస్ అనే సైనికుడు కంటబడ్డాడు. మిజ్నర్ తన కార్యాలయానికి పోసాగినాడు. మనసులోని ఆరాటం పైకి పొక్కకుండా కట్టుదిట్టం చేసుకొన్నాడు. రాత్రి కనక పోరాటం జరిగేవుంటే, ముర్రే యీ వరకే తనకు తెలిపివుంటాడని మిజ్నర్ ఎరుగును. కాని ఆరాటం మట్టుకు అవిరళంగా వుంది. తలవాకిటి వసారాలో కూర్చుని, చుట్టముట్టించి, పరుగునవస్తున్న ఏంజలస్‌ను గమనిస్తున్నాడు. ప్రొద్దుటి కవాతుకు పోతున్న సైనికులు ఏదో మూడిందని అనుకొని, మురాలు మురాలుగా కూడి, కల్నల్ మిజ్నర్‌ను, ధూళిధూసరితాంగుడైన ఏంజలస్‌ను నిదానించి చూడసాగారు.

"కెప్టన్ వింట్ గారి నివేదిక, సర్" అని రొజుకుంటూ ఏంజలస్ అన్నాడు. మిజ్నర్ లేఖను తీసుకొన్నాడు. కాని చదువుకొనేముందు, కెప్టన్ ట్రీబాడీతోటి, "లోగిలిలో తచ్చాడడం ఏమీ బాగాలేదు, కెప్టన్" అన్నాడు.

త్వరత్వరగా చదువుకొన్నాడు. పూర్తి అయిన తర్వాత, ఏంజలస్‌ను చూచి, "ఏదైనా త్వరగాతిని, యిక్కడికిరా, ఇదిగో - ఒకమాట. నిన్నరాత్రి ఇండియన్లను పట్టుకోవడానికి కెప్టన్ ముర్రే ప్రయత్నించాడా?"

"లేదను కొంటానండి."

మిజ్నర్ ఆశ్చర్యపోయి, తిరిగి లేఖను చదువుకొన్నాడు. కోపం మితిమీరసాగింది. ఏ, బి దళాలను తిరిగి రప్పించి, శత్రు సమక్షంలో ప్రమత్తుడైనందుకు కెప్టన్ ముర్రేని అరెస్టు చేయించవలెనని అనిపించింది. కాని దీర్ఘాలోచన చేసిన మీదట, సైనిక న్యాయస్థానంముందు యీ ఆరోపణ నిలువజాలదని నిశ్చయించుకొన్నాడు. అవాంఛనీయాంశాలు ఎన్నో బయల్పడక తప్పవు. వాటిలో ఒకటి తాను చేయవలసింది చెయిన్నీలను అరెస్టు కావించడమా, లేక ఏజన్సీ విడిచిపెట్టే వీల్లు లేకుండా చేయడం మట్టుకేనా, అనేది. ముర్రే కనుక ఇండియన్ గ్రామంమీద శతఘ్నిని ప్రయోగించి వుండినట్లయితే, ఏమిజరిగివుండేది, అనేది మరొక అంశం. చిత్రవధల వుదంతాలు ఏదోఒక విధంగా తూర్పునాటి పత్రికల కెక్కగలవు. ఉన్నత పదవీ కాంక్షులైన సైనికాధికారుల వుద్యోగజీవితాలు

ఎన్నో అంతరించడానికి తూర్పునాటి వారు వాషింగ్టన్ మీద పెట్టే ఒత్తిడి కారణమని మిజ్నర్‌కు తెలియకపోలేదు.

అయినాకాని, యిప్పటి పరిస్థితులలో, యీ వ్యవహారం అత్యంత సరళమయింది. చెయిన్నీలు ఏజన్సీ విడిచి వెళ్ళారు. వాళ్ళను తిరుగుదారి పట్టించడమే తనవిధి. ఇది సులువుగా సూక్ష్మంగా గడబిడ లేకుండా తాను చేయగలిగితే, మరి తాను కల్నల్ మిజ్నర్‌కు మారు మిజ్నర్ సేనాని కాగలడు. ఎంతో జాగ్రత్తగా, ఎంతో నిదానంగా వ్యవహరించ వలసివుంటుంది. మైల్స్‌ను సంప్రదించాలి. ఎందుకంటే, ముందుముందు వ్యవహారాలు కవేళ బెడిసి కొట్టితే, ఆదుష్ఫలితాలనన్నిటిని సైనికేతరాధికారులపై మోపడానికి వీలుంటుంది. అందుచేత, ఏంజలస్ తిరిగి వచ్చేసరికి, మిజ్నర్ అప్పుడే అశ్వారోహణంచేసి వున్నాడు. ఇద్దరూకలిసి డార్లింగ్టన్‌కు పోయారు. కాటర్ క్రీక్‌లో గడచినరాత్రి జరిగిన విషయమంతా కల్నల్ మిజ్నర్‌నోట మైల్స్ విన్నాడు. కల్నల్ మిజ్నర్ చెప్పడం ముగిసింది. తలపంకించి, మైల్స్ "అదిజరిగి వుండకూడదు. వాళ్లు ఏజన్సీ హద్దులు దాటి పో వీలులేదు," అన్నాడు నీరసంగా.

"అట్లయితే ఎన్నో విషయాలు జరిగి వుండనే కూడదు," అన్నాడుమిజ్నర్.

"అయినా కాని-నాకు తెలియకుండావుంది-రెండు దళాలుండికూడ-"

"తమాయించి చూద్దామనేది మీపద్ధతేకదా! చీకటిపూట ఆగ్రామాన్ని క్రేల్చివేసే బాధ్యతను మా ఆఫీసర్లు తీసుకోలేకపోయారు. ఇంతకుముందే ఆ మొండిపోటరులను అరెస్టుచేయమంటే, కాదు కూడదన్నారు. అది జరిగివుంటే యిదంతా అనవసరమైవుండేది. ప్రస్తుత పరిస్థితులను పట్టిచూస్తే వాళ్ళనువెన్నాడి పోయి తిరిగి తీసుకొని రావడమొక్కటే మనం చేయవలసినపని.

"అవును, వాళ్ళనుతీసుకొనిరాక తప్పదు." అన్నాడుమైల్స్ అనిశ్చితంగా.

"ఇది పత్రికల కెక్కితే ఏమిజరుగుతుందో ఆలోచించారా?"

"చేయకలిగింది చేశాను" అన్నాడు మైల్స్ అలసటితోటి. "మరేమి చేయగలను?"

"వాళ్ళ అరెస్టు వుత్తరువులో నాతోబాటు చేవ్రాలు చేస్తారా?"

మైల్స్ నిర్విణ్ణుడై కల్నల్ వైపుచూసి, తర్వాత చూపులను బల్లమీదికి దించి, "వాళ్లు లొంగబోరు" అన్నాడు.

"లొంగరు నిజమే. కాని వాళ్ళనుతీసుకొని రానట్లయితే, మీ ఏజన్సీలోని యితరజనాభా మాటేమిటి?"

"సంతకంచేస్తాను" అని నిట్టూర్చాడు మైల్స్.

"మంచిది!" కల్నల్‌కు హుషారొచ్చింది. వ్యాపారసరళిలో, "వెంటనే ఇండియన్ల జాడవెంబడి దళాలను రెంటినీ పంపుతాను. మరొక వారం రోజులలోపల యీ వ్యవహారం పరిష్కారం కావాలి. ఈలోపల, వాషింగ్టన్‌లోని యుద్ధ

కార్యాలయానికి తంతి కబురు పంపి, మీరిచ్చిన పుత్రికులు ఖాయమయ్యేటట్లు చూస్తాను. మరి బందకత్తి జట్టులో వున్నవాళ్ళు ఎందరూ?" అని అడిగాడు.

"దాదాపు మున్నూరుమంది. ఎనభై అయిదుగురో, తొంభైమందో మగవాళ్ళు; మిగతజనం ఆడంగులూ, పసివాళ్ళూ, కొందరు వ్యాధిగ్రస్తులు, చాలమంది అనుకొంటాను. శీఘ్రంగా వెళ్ళిపోలేరు."

"అయితే రెండుదళాలే చాలు!" అన్నాడు మిజ్నర్ తెగింపుగా.

"మావాళ్ళు విడిసివున్న చోటినుండి బయలుదేరితే, ఎంతో కాలం కలిసి వస్తుంది. ఇండియన్ కార్యాలయానికి తెలియజేసేపని మీకు వదలివేస్తున్నాను. ఆ ఇండియన్లు చెరలో భద్రం కాగానే మీకు వివరాలు తెలియజేస్తాను."

సరేనన్నట్లు ఏజంట్ మైల్స్ తల పంకించాడు. గదినుండి మిజ్నర్ నిదానుగా బయటికి నడిచాడు. అతను వెళ్ళిపోయిన తర్వాత, బల్లముందు కూర్చుని మైల్స్ శూన్యంగా చూడసాగాడు. లూసీ ఒక గంటతర్వాత భోజనం వడ్డించి వున్నదని తెలియచేయడానికి, లోపలికి వచ్చేసరికికూడ, అట్లాగే కూర్చుని వున్నాడు:

"ఏమిటి విషయం?" అని అడిగింది.

"ఏమీలేదు. మరేమీలేదు, లూసీ. చేయగలిగినదంతా చేశాను."

* * *

ముర్రేకి మిజ్నర్ యిచ్చిన ఉత్తర్వులు ఖచితమైనవీ, క్లుప్తమైనవీ. చెయిన్నీలను వెన్నాడిపోయి, అరెస్టుచేయమన్నాడు. ఇండియన్లను దుర్గానికి మోసుకొని వచ్చేందుకు త్వరలో శకటాలు వస్తాయన్నాడు. హోవిట్జర్ సైన్యపురోగతికి ప్రతిబంధకమవుతుంది కాబట్టి దానిని తిప్పి పంపమన్నాడు. శతఘ్ని లేకున్నాగాని, ఏ ప్రమాదాన్నీ మిజ్నర్ ఊహించలేకపోయాడు. అన్నిటికంటే ముఖ్యమైన విషయమేమిటంటే, ఇండియన్లు ఎక్కడ వున్నారో అంతుపట్టడమే. స్టీల్ జెస్కీ కాకుండా, సైన్యంవెంబడి మరొక స్కౌటు, పిశాచి అనే అరాపహో ఇండియన్ కూడా వున్నాడు.

"వాళ్లు ఎదురొగ్గితే?," అని ముర్రే అడిగాడు.

"బ్రతికివున్న వారందరినీ పట్టుకొనిరా. విజయానికి తగిన మన్నన నీకు కలిగేటట్లు చూస్తాను, కెప్టన్. ఉన్నతోద్యోగం కావచ్చు."

ముర్రే స్వల్పంగా తలపంకించాడు. "వీడు మడ్డిగొడ్డు, కాని చేసిరాగలడు," అనుకొన్నాడు మిజ్నర్.

వింట్, ముర్రే వెనుకలెక్క. ముందుండి నడపడానికి తగడుకాని వెంబడి నడవడానికి తగినవాడు ముర్రే ముందుసాగి, మిగిలివున్న ఇండియన్లతో మరలి వస్తాడు. మరి, తనవారి నెమ్మకమునిచ్చి కోల్పోడు. అతనిలో వున్న లోపమంతా అతి జాగ్రత్త.

తాను పరిస్థితిని చక్కబెట్టిన తీరు తృప్తిని కలిగించగా, మిజ్జను రనో దుర్గానికి మరలివచ్చాడు. ఏ, బి దళాలు ఉత్తరంగా సాగిపోయినవి. అశ్వాసీనులై పోతున్న మూడువందలమంది జాడను, పూను, తెగ, జాతి, అనేక ప్రాయాలు వారు, అనేక అభిలాషలుకలవారు, బాలురు, వృద్ధులు, సుందరులు, వికారాకారులు, లౌకికవస్తు సమస్త సమేతులు, — యిటువంటివారి జాడను కనిపెట్టడం దుష్కరమేమీ కాదు. ఎట్లా దాగివుండగలరు? ఎట్లా దాచిపెట్టగలరు? తాము పోతున్న వేగానికి, అశ్వఖురాగ్రఘట్టనలకు చుట్టూవున్న ప్రెయిరీ మైదానాలు వులిక్కిపడి మేలుకొనగలవు. వాళ్ళ మాటలు వినిపించగలవు, ముఖాలు కనపించగలవు, తమను యితరులు ఎత్తిపెట్టి చూపగలరు. తాము రావీలులేనట్లుగా, తలుపులు మూసుకొంటాయి, కిటికీలు మూసుకొంటాయి; తమ బాటనుండి సుదూరానికి పశుసంపద తరలించబడుతుంది. తామిప్పుడు వుత్తర దిశోన్ముఖులై పోతున్న మైదానాలు తమ తండ్రులు తాతలూ గుర్తించ జాలనంతగా మారిపోయినవి. దళ్లూ, కంచెలూ, క్షేత్రాలూ, తోటలూ ప్రిదిలి పోతున్న పీనాడు. బాటలూ, యిళ్లూ, తంతి తీగెలూ, మట్టుకే కాదు, తూర్పునుండి పడమటికి విస్తరించుకొని వున్న మూడు రైలు బాటలూ భూమి తాల్చిన ఉక్కు పటకాలైనవి.

సైన్యదళాలు, ఉత్తరం పోయాయి. ధూళినిబట్టి, చదునుగా త్రొక్కబడిన పొదలనుబట్టి, అనార్ద్రి నదీశయ్యాలలో యేర్పడిన వెడల్పాటి బాటనుబట్టి, ఇండియన్ల పోవిడిని జెస్కీ, పిశాచీ కనిపెట్టేశారు. పొడినేల నుగ్గునుగ్గయివుంది. చెయిన్నీలు మహారభసతో వెళ్ళిపోతున్నారని సూచించడానికి, పిశాచి రెపరెపలాడిస్తూ చేతులను పైకెత్తి పట్టాడు. నిష్కరుణుడైవున్న సూర్యుని ప్రకాశంలో భేరీ ఘోషకు అనుగుణంగా చౌతాక్వా కొండ గుట్టలను జీల్చుకొని పారే యిరుకు వాగుల పొడి యిసుకల మీదుగా, మెళ్ళ మెళ్ళ నడిచింది సైన్యం. ఎర్రటి మురికి దుమ్ము సైనికుల చర్మాలమీద, నోళ్ళలోను, బురదగామారి, ప్రపంచాన్ని మూసివేసింది. చెమటలు కక్కుకొంటూ, రొప్పుతూ రోజుతూ, మాటామంతీమాని, స్వారీచేశారు. అరుణ ప్రకాశంలో అస్తమించిన సూర్యబింబం మండుతున్న బొగ్గుల గుండలాగుంది. ఆరాత్రికి గడ్ ఫోర్కువద్ద విడిశారు.

ముర్రే కిక్కురుమనడంలేదు. ఉడికిపోతున్నాడు. సైనికులు అతనంటే హడలిపోతున్నారు. దుమ్ముతో, చెమటతో అతని ఒళ్ళు మురికి మురికి అయింది. నదిలో నీరులేదు. స్నానం వీలుపడదు. కోపమంతా సైనికులమీద వెళ్ళగ్రక్క సాగాడు. నాలుక అతనిది కొరడా అయింది. వీలైనంతవరకు అతనికి దూరంగా వుండజూచారు సైనికులు.

"ఏమిటీ చీకాకు?" అని వింట్ అడిగాడు.

"అది నా సొంతవిషయం, కెప్టన్."

"సరే. పుడుకు ఎక్కువ అయినాగాని, మాటలు పొదుపుచేసుకొంటే బాగుంటుంది. మేమూ ఉడికిపోయామకదా!"

"క్షమించు" అని ముర్రే, వింట్ వైపు చిత్రంగా చూశాడు.

"రేపు వాళ్ళను కలుసుకోగలమా?"

"బహుశా."

"మొండిపోటరులున్నారే, వాళ్ళు దినానికి నూటయిరవై మైళ్ళుకూడ స్వారీచేయగలరు. నే నెరుగుదును. తీగెలాగా పరుగెత్తిస్తారు. పదిమైళ్ళకు ఒకసారి మారుస్తారు. వాళ్ళనుమించి పరుగెత్తించగల ఆశ్వికదళమేలేదు."

"కాని వీళ్ళకు అదేమీలేదు. బక్కచిక్కిన గుర్రాలు పోతూపోతూనే కుప్పకూలిపోగలవు. అదిన్నీగాక, ఆడవాళ్ళూ పసివాళ్ళుకూడా వున్నారాయె."

"అయినా, పోతారు" అన్నాడు వింట్.

"అది నిజమే కాని, రేపు వాళ్ళను కలుసుకోగల మనుకొంటాను. రేపు కాకుంటే ఎల్లుండి. రేపు ప్రొద్దున నాల్గున్నరకే భేరీ ప్రయోగించి, లేవగొట్టేటట్లు చూడు."

"పాపం, నిద్ర చాలదేమో"

"రెడ్ ఇండియన్ స్త్రీలే నిద్ర నడ్డగలిగితే, మనవాళ్ళూ అడ్డగలరు. మరేమీ ఫరవాలేదు" అన్నాడు ముర్రే.

*　　　*　　　*

లేచారు. మసక మసక చీకటిలో, సైనికులు తమలో తాము నసుగుకొంటున్నారు; ఆఫీసర్లు ముర్రేవైపు చిత్రంగా చూస్తున్నారు. తమ పోవిడి అంతుపట్టకూడదని చెయిన్నీలు కనుక అనుకొని వుంటే, ఆ చీకటిలో జాడ దొరికేదేకాదు. కాని కాకులు ఎగిరిపోయినట్లుగా వుంది చెయిన్నీల ప్రయాణం. తమగడ్డమీదికి మరలి పోవాలని ఆగొన్నట్టుగా వాళ్ళుపడే ఆవేదన అడుగడుగున ముద్రలు వేసింది. వాఙ్మపోయింది ఉత్తరం. తమ తండ్రులు తాతలు పుట్టిగిట్టిన భూమి తమను పిలువగా,. స్త్రీలు, శిశువులు, వృద్ధులు ఏ విధంగా పోతున్నారో సూచించడానికి తిరిగి అరాపహో తెగకు చెందిన పిశాచి అనే స్కౌటు చేతులను రెపరెపలాడించాడు. తెల్లవారితో వుంటున్నాడే కాని స్వజాతీయులంటే గర్వభావం కలవాడు. ప్రెయిరీ తోడేళ్లు పెరికి తినిన, ఈగలు ముసిరి నల్లనైన అశ్వకళేబరాలు కంటబడినప్పుడు, యీ గర్వభావం అతిశయించేది. "చచ్చిందాకా తరిమి తోలినట్లుంది", అని సైనికులు అనుకొన్నారు. గుర్రం చచ్చేవరకు తరిమిన ఇండియన్ తుట్టతుదకు చచ్చేవరకూ తాను పరుగెట్టుతాడని సైనికులు ఎరుగుదురు.

ప్రొద్దుటి ఎండలో గుర్రాలను నడిపిస్తూ, చెమటను తుడుస్తూ, బడలిక ఒత్తుగా తీర్చుకొన్నారు. ఇప్పుడు వాళ్లున్నది మంచిపచ్చికబయళ్ళభూమి. ఎత్తుగా

పెరిగి, గంటలు గంటలుగా ప్రబలి పోయిన పసిమివన్నె పచ్చికబయళ్ళలో, ఒకానొక కాలమందు యిక్కడ వర్ధిల్లిన మహామహిమగణాల స్మృత్యంకాలవలె, ఎండు పేడ గుట్టలు గుట్టలుగా పడివుంది.

"ఎంతో కాలం గడవలేదు," అన్నాడు కర్తీ "పదేళ్ళ క్రిందట, నల్లటి పురుగుల పుట్టిప్రిదిలినట్లుగా వుండేవీ బయళ్ళలో."

అప్పుడే, కొమ్ముపూదమంటున్నాడు ముర్రే, జీనుమీద అంతకాలం కూర్చునివుంటే కలిగేబాధ అప్పుడప్పుడే అనుభవ మవుతున్నది. తిమ్మిరి పోగొట్టుకోడానికి సైనికులు చేస్తున్న ప్రయత్నాలను చూస్తున్నాడు. ఆడవాళ్ళూ, పసివాళ్ళూ ఎట్లా భరించ గలిగినారు? ఇండియన్లనే కావచ్చు, బాధానుభూతి మొరటుపారిన ఆటవికులే కావచ్చు, మంచి చెడ్డలు, న్యాయాన్యాయాలు సుఖ దుఃఖాలు ఎక్కువ పట్టనివాళ్ళే కావచ్చు, కాని వారి ఒళ్లూ ఒళ్ళే. చెయిన్నీలు వాడే పచ్చితోలు జీనును తానొకప్పుడు వాడివున్నాడు. ఆ సుఖం పగవాడికి కూడా వద్దనుకొన్నాడు.

"ఎంతత్వరగా ముగిస్తే అంత మంచిది."అని తనకు తాను చెప్పుకొన్నాడు. కుక్కపడే బాధాతిశయాన్ని చూడలేక కొందరు దానిని కడతేరుస్తారు కదా! అనిపించింది.

పోయారు ముందుకు. సైనికుల వీపులమీద సూర్యుడు కాలేకత్తి. కాని యిక్కడ దుమ్ము సన్నగిల్లింది. బయళ్ళు పసిమి సముద్రం లాగా ముందున్నవి. సాల్టుఫోర్కు దాటిపోయారు. భూములు తనవి కాకపోయినావచ్చి ఆక్రమించుకొని వుంటున్న ఒకనియిల్లుచూచి, రైనీను సడలిచ్చారు.

"ఇండియన్లు?" అని ముర్రే కప్పవలె నోరెత్తి అరిచాడు.

ఆ కొత్తమనిషి పీనుగలాగున్నాడు. పొడగరి. గుర్రపుముఖం. మురికి బట్టలు. నెమ్మదిగా మెడరుద్దుకొంసాగాడు. అతని పెళ్ళామూ, యిద్దరు బిడ్డలూ తలుపుచాటుననక్కి నిలుచున్నారు. తాను చట్టాన్ని ధిక్కరించినందుచేత భయ పడినట్లున్నాడు. ఇండియన్ ప్రదేశానికి తెచ్చివిడిచిన ఒక మహాతరంగపు చివర వున్నాడు. ఇండియన్లంటే ఎంతభయమో, ఎంత ద్వేషమో, సైనికులంటేనూ అంతేవుంది.

"ఇటు పోయారు" అన్నాడు చిరచిరలాడుతూ.

"ఎప్పుడు?"

"ఉదయం"

"ఎందరు? చెప్పు!" అని గద్దించాడు ముర్రే. "మూగవాడివా ఏమిటి, కాదుగదా? ఊఁ చెప్పు!"

"మూఁగవాణ్ణేమోనండీ" అని వీక్షంతీస్తూ అన్నాడతను. "నా సంగతి సందర్భాలడగవలసిన అక్కరలేదు."

"ఎంతమంది, చెప్పు!"

"మీయందరు-లంజాకొడుకుల్లారా, దేవుడు ధ్వంసంచేస్తాడుపొండి!" అని కేక వేశాడు సైనికులు తరలివెళ్ళిపోయిన తర్వాత.

కాన్సాస్ సరిహద్దు దాటింది కాని మరల ఆగిపోయారు. జీనులనుండి దిగడంతోటి, కాళ్ళు తిమ్మిరిపట్టినవాళ్ళు కొందరు నిలువలేక గడ్డిమీద వ్రాలబడిపోయారు. దాపులో ఏరు ఒకటివుంది. ఒకటివెంబడి యింకొకటిగా వరుసగా బురదగుంటలున్నై. గుర్రాలకు నీరు పెట్టబోయారు. తర్వాత, నేలమీద పడుకొని, రేషన్లను నమిలి మ్రింగి, నిండుగా త్రాగారు. ముర్రే, వింట్‌లు కలసి ఒక చిత్రపటాన్ని పరీక్షించసాగారు.

"నీళ్ళు వున్నచోటనే విడిది చేస్తారు," అన్నాడు వింట్. "సాల్ట్‌ఫోర్క్ ఎండిపోయింది. మెడిసన్‌లాడ్జు నదిదగ్గరకు పోతారు."

"అక్కడ నీళ్ళువుంటే. లేకుంటే, యింకా ముందుకు పోతాడు."

"పోలేరు."

"నాకు తెలియదనుకుంటున్నావా ఆ మాత్రం?" అని ముర్రే కోపించి అన్నాడు. "డార్లింగ్టన్ విడిచిపెట్టేసరికే వాళ్ళ గుర్రాలు సగం చచ్చివుండినై."

వింట్ బుజాలెగురవేశాడు.

"డాడ్జు నగరానికి మనిషిని పంపుతాను" అన్నాడు ముర్రే. "కల్నల్ కబురుపెట్టి వుండినట్లయితే, వాళ్ళకీవరకే తెలిసివుంటుంది. ఉత్తరంనుండి ఒకటి రెండు దళాలనుపంపితే, వాళ్ళకు పోయేదేమీవుండదు. శాంటేఫే వెంబడి ఒక రైలుబండికూడ పంపితే, ఎలుకలబోను తయారవుతుంది."

"కల్నల్‌గారు మరొకరకంగా అనుకోవచ్చు."

"ఆయన ఏమనుకొంటాడో నాకు అక్కరలేదు," అన్నాడు ముర్రే.

"దీనిని తుద ముట్టించాలి."

"సరే," అని వింట్ ఆమోదం సూచించాడు. "సరే"

సైనికుడొకడు డాడ్జ్ నగరానికి వెళ్ళిపోయాడు. మిగతావాళ్ళు చెయెన్నీల జాడ ననుసరించి ఉత్తరం పోయారు. కాన్సాస్‌నుంచి పశువుల కొట్టా లెక్కువయ్యాయి. తమ బాటకు పశులసాల అడ్డమైనప్పుడు, ఇండియన్ల బాటజాడ చుట్టు తిరిగివుంది. అదిదాటి సైనికులు పర్వత ప్రదేశానికి వచ్చారు. వాళ్ళకు సజీవమై కనుపించిన దంతా కూడ దూరాన గుర్రాలమీద పోతున్న ఎవరో యిద్దరు మనుషులే.

లెఫ్టినెంట్ ఫ్రీలాండ్ ఒక పర్యాయం తన గుర్రాన్ని అదిలించి, ముర్రే ప్రక్కగా తోలి, "గుర్రాలు తట్టుకోలేవు, సర్," అన్నాడు.

"తట్టుకోలేవా?"

మరిఫ్రీలాండ్ జవాబీయలేదు. గుర్రాలు చచ్చే పర్యంతమవుతున్నాయి.

చెమటలు క్రక్కుతూ, నురుగులు పెట్టుతూ, పరుగెత్తుతుంటే గజగజ కదలి పోతూన్నాయి; ఇది ముర్రే ఎరుగకపోలేదు.

గుర్రాన్ని ఆపి, మిన్నులకెగసే ధూమరేఖను స్కౌట్ జెస్కీ చేయెత్తి చూపేసరికి, ఎంతో పగలు గడిచింది. చేయెత్తి, సైనికులను ముర్రే ఆపుచేశాడు. పొగపలచగా విడివిడిగాపోతూ, తిరిగి ఒకటిగా చేరుతూ, వుంది.

"జాడ తుది" అన్నాడు వింట్. జీనునుండి వ్రేలాడే తోలుసంచిలోని రివాల్వరును బయటికి తీయడానికని సంచిమూత తెరవడం ముర్రే చూచాడు.

సైనికులు గుమికూడినారు. జీనులమీదుగా వంగి, మహాభారంగా నిశ్వసిస్తున్నారు, నీలిదుస్తులు వాళ్ళవి ధూళిధూసరితాలై వున్నై. మూడు రోజుల నుంచి క్షవరంచేసకోనందుచేత, గడ్డం పెరిగివుంది. పొగవంక చూస్తున్నారు. నెమ్మదిగా ముర్రే వాళ్ళను నదివైపు నడిపించాడు. కాని నదిగట్టువ పొదలు గుబురుకొని వున్నాయి. వందగజాలకు ఆవతల ఆగినాడు. వింట్ చేయెత్తి మరింత ఎగువకేసి చూపినాడు. ఒక మైలు దూరాన భూమికి వున్నట్టుండి గూని వచ్చినట్లు, ప్రముఖంగా ఒక కొండవుంది. చెయిన్నీలు అక్కడ విడిసినారని పించింది.

"ఆ పొదలేమీ వుండకూడదు." అన్నాడు ముర్రే.

లెఫ్టినెంటులు ఫ్రీలాండ్, గాట్లో, ఆస్లాండరులు తమ గుర్రాలను కెప్టన్లు యిద్దరు వున్నచోటికి అదలించినారు. వారి మనస్సులు వుద్రిక్తాలై వున్నాయి. పెదిమలు బిగించుకొని పళ్ళతోనొక్కి పట్టి వుంచారు కాని లేకపోతే మాటలు ఒలికిపోయేవేమో. ఇదే తమకు మొట్టమొదటి యుద్ధానుభవం కాబోతుంది. తిరిగి తూర్పునాటికి పోయినప్పుడు, ఇండియన్ యుద్ధాలను గురించి కథలు చెప్పవలసి రావడమంటే ఎట్లుంటుందో ఆలోచిస్తున్నారు. గాట్లో యిరవై రెండేళ్ళ అబ్బాయి. ఎర్రటి బుగ్గలు, మట్టివన్నె కెంద్రుకలు. వాళ్ళనాన్న పూర్వం యుద్ధాలుచేసిన దిట్ట. తండ్రితో సమానమైన హోదాలో, నోటి దురద తీరేటట్లు తాను కథలు చెప్పుతున్నట్లు అనిపించింది. ఆస్లాండర్ గంభీరంగా నిశ్చలంగా వుండాలని ప్రయత్నించాడు. కాని ఫ్రీలాండ్ లేడూ, అతను చంటిపాపవలె నోరువిప్పి నవ్వుకొంటున్నాడు.

"చుట్టూ మూగకండి. మనుషులను బారులు తీర్చండి," అని ముర్రే వాళ్ళతో నెమ్మదిగా చెప్పాడు. అలసిపోయినట్లు కనపిస్తున్నాడు. కళ్లు రుద్దుకొంటూ, ఆవులిస్తున్నాడు. "కెల్లీ, ఓకెల్లీ" అని పిలిచాడు. కెల్లీ వచ్చాడు. నదికేసి చూపి, "స్కౌటునూ మరి ముగ్గురిని తీసుకొనిపోయి, ఆ పొదలు మట్టం చేయించు, సర్జంట్" అని చెప్పాడు. సరేనంటూ కెల్లీ వెళ్ళిపోయాడు.

ముర్రే, వింట్ లు కూర్చుని, పొదలను త్రొక్కివేయడానికిపోతున్న ఐదు గురిని గమనించి చూడసాగినారు. సూర్యుడు అస్తమించబోతున్నాడు. అశ్వికుల నీడలు చదునుగా, నిడివిగా, గాలి కదలికవల్ల నిలిచినచోట నిలువక అడ్డంగా

పడుతున్నాయి. ఉత్తరంనుండి చల్లటిగాలి వీస్తున్నది. పొగ చెదురు చెదురుగా తేలిపోతున్నది. చేతులనూపుతూ, పొదనుండి బయటికి మరలివచ్చి సర్జంట్ కెల్లీ "ఇప్పుడు ఏ అడ్డూ లేదు!" అని అరిచి చెప్పాడు.

ముర్రే దళాన్ని నదిలోకి నడిపించాడు. పొదనిండావుండిన పిట్టలు ఒక్కుమ్మడి పైకెగరి, సైనికులమీదుగా సుడిసినట్లు తిరిగినై. అడుగు లోతు నీటిపాయవుంది. గుర్రాలను మూతివంచకుండా చేసేందుకు అశ్వికులు కళ్లెలను ఒడిసిపట్టారు. అవతలిగట్టున ఆగి క్రమబద్ధంగా నలుగురివెనుక నలుగురిగా తీరి, ధ్వజాన్ని విప్పి పట్టుకొని పోసాగినారు. నీడతో కలగలసిపోయారు. పచ్చికమీద ఎదుగుదల ఆగిపోయిన చెట్లసందున పోయేపాముతీరున పోయారు. గుర్రాలకు పనితగ్గిస్తూ, నెమ్మదిగా నదిగట్టుననే ఎగువకు పోసాగినారు. ఇంతలో కొండమీద మనుషులు, గుర్రాలు విడివిడిగా కనుపించసాగినవి.

"వాళ్ళు చూచారు మనల్ని" అన్నాడు వింట్. ముర్రే కొమ్ము వూదే వాణ్ణి వూదమన్నాడు. స్వరాలు స్పష్టంగా, మదిసంజకాంతిలోనికి విడిచిన సన్నటి అమ్ములవలె వున్నవి. గుర్రాలకు హుషారువచ్చింది. గమనవేగం అతిశయించింది. ఇంతలో చేయెత్తి ముర్రే దళాన్ని ఆగమన్నాడు.

కొండ కొమ్మున నెలకొనివున్న గుంపునుండి విడివడి, కింద పోట్లాటకు సిద్ధమై సైన్యదళమున్న చోటికి, సవ్వడిచేయకుండా గుర్రంమీదజారి ఇండియన్ ఒకడు వస్తున్నట్లుంది. నిటారుగాకూర్చుని, చేతులను తలమీదికెత్తి నిలిపివున్నాడు. తన వెనుక కేశాలు చెదిరి ఆడుతున్నాయి. చిన్నిగుర్రం అతనిది. అప్రయత్నకృత శోభతోటి విచ్చలవిడిగా పరుగెట్టుతున్నది. సూర్యుడు మునకవేస్తున్నాడు. ఉన్నట్లుండి ఆ ఇండియన్ దిగివచ్చిన కొండ కారునీడలో మునిగినట్లయిపోయింది. కొండనెత్తిన అగ్గిబంతి నిలచినట్లయింది. ఆ నీడనుండి బయల్పడినాడు. పరుగు ఆగింది. అతని చేతులింకా తలమీదనే వున్నై. కెప్టన్ ముర్రేకి యిరవై అడుగులలో నిలిపాడు.

"తోడేలు" అన్నాడు వింట్.

నెమ్మదిగా చేతులు యథాస్థానానికి దించుకొన్నాడు. మట్టివన్నె ముఖం అతనిది, కరుణ, పశ్చాత్తాపము కలగలిసిన మందహాసబంధురమయింది. నడుముల వరకు అతని ఒంటిమీద ఏకవ్వూలేదు. చేత ఆయుధ మేదీలేదు. యుగాలు యుగాలు తనలో లీనమైన ధర్మనిర్ణయమే అశ్వారూఢమై వున్నట్లుంది. కాల గర్భానకలసి నిర్జీవమైపోయిన పునర్జన్మయే లేనిదేదో దాని పుంభావమూర్తి తాను. ఇది తనకెరుకే. ఆత్మీయులకూ శ్వేతవర్ణులకూ నడుమ రెండువందలేళ్ళు చెలరేగిన ఘోర దారుణ యుద్ధమంతా ఒక మనిషిగా వచ్చి, నేటికి దుమ్ముకొట్టుకొనివున్న నీలిదుస్తులు ధరించిన కెప్టన్ ముర్రేని, అర్ధనగ్నశరీరుడైయున్న చెయెన్నీ నాయకుని, ప్రతిద్వంద్వులను కావించినట్లుంది. ముర్రే భయంకర

కోపావేశపరవశుడౌతున్నాడు. తనమీద, తోడేలుమీద, తన సైనికులమీద, రెండు దినాలనుంచి ఊపిరిసలుపుకోనీయకుండా శత్రువులను వెన్నాడేటట్లు చేసిన శక్తులన్నింటిమీద ముర్రే అగ్గి అవుతున్నాడు.

"ఏమికావాలో అడుగు", అని ముర్రే స్టీవ్ జెస్కీతో అన్నాడు.

తోడేలు నెమ్మదిగా మాట్లాడసాగినాడు. విశాలవక్షస్థలంనుండి వెలువడు తున్న మాటలకు అనుగుణంగా తలను యిటూ అటూ త్రిప్పుతున్నాడు. అతను మాట్లాడుతుంటే, ఆటవికుడు అనాగరకుడు ఆటవిక భాషలో మాట్లాడుతున్నట్లు లేదు. అతను చెప్పేదంతా సమంజసంగావుంది. అనుభవపరుడూ, విచక్షణాపరు డైన పితామహుడు దుడుకుపడే మనుమడికి చేస్తున్న హితబోధలాగుంది. అతని ప్రతిమాటను సావధానులై సైనికులు గుర్రాలజీనుల మీదుగా ముందుకు వంగి కూర్చుని వింటున్నారు, తమకు బోధపడకున్నప్పటికీ.

"పోట్లాట తనకు యిష్టంలేదట", అన్నాడు జెస్కీ, ముర్రేతోటి.

"మంచిదే. అట్లయితే తనవారినందరినీ కొండదిగి రమ్మను మేము అరెస్టు చేస్తాము. ఏయిబ్బందీ కలగచేయము. రేపు వాగన్లనిండుగా తిండీ గుడ్డలువస్తాయి" అన్నాడు ముర్రే.

"తాను అదిచేయడట. తిరిగి రారట. ఉత్తరాదికి పోతున్నారట. అవసర మయితే, తనవాళ్ళను కెనడీ సరిహద్దు దాటించి తీసుకొని పోతాడట".

"ప్రయోజనం నూన్యం. పైబడబోతున్నామని చెప్పు. తన వారిలో ఒక్కడు ప్రాణాలతో బయటపడకున్నాగాని, మృతానుమృతాను త్రిప్పి తీసుకొని పోతామనిచెప్పు. రేపు డాడ్జినగరంనుండి, ఆ తర్వాత శాంటాఫె రైలుదారి మీదుగానూ సైన్యాలు పరచుకోబోతున్నాయని చెప్పు. కెనడాగాని, వయో మింగ్ కాని చేరుకోడానికి వీలేలేదు. దారులన్నీ బంద్!"

తోడేలు తిరగి మందహాసంచేసి, ముర్రేవైపు తన చేయిచాచాడు. కాని ముర్రే దాని నిప్పృశించ లేదు. "తాను చేయవలసినది తానూ, మీరు చేయవలసి నది మీరూ చేయడమే మిగిలిందట. కాని జీవచ్ఛవాలై బానిసలుగా వుండటం కంటె, కొన్ని సమయాలలో నిర్జీవులు కావడమే మెరుగట," అని అనువదించాడు జెస్కీ.

ముర్రే మండిపడ్డాడు. "పొమ్మను యిక్కడినుంచి, లేకుంటే తలపేల్చి వేయగలను," అన్నాడు.

ఈ సమయానికి కొండ యావలివైపంతా ఛాయామగ్నమై పోయింది. కొండమీద మనుషులు కనుమరుగై పోయారు. కొండ చూడడానికి క్రిశ్చియన్ త్యాగుల సంస్మరణ దినంనాడు చేసిన రొట్టెలాగుంది. సగంమట్టుకే కొండనంటి పెట్టుకొనివున్న కరగిపోతున్న సూర్యబింబం ఆ రొట్టెమీది పలచటి ఎర్రటి మంచుముద్దలాగుంది. తోడేలు గుర్రాన్ని మళ్ళించి నీడలోపలికి వెళ్ళిపోయాడు.

కాని ఇంతలో పోతున్న వాడల్లా ముర్రేతో మాట్లాడడానికేమో, గుర్రాన్ని మళ్ళించాడు. అగ్గిమీద గుగ్గిలం వేసినట్లయింది ముర్రేకి. రివాల్వరును దూసి చెయిన్నీ నాయకుడివైపు ప్రేల్చాడు.

తోడేలు తొణకలేదు. పొగలు క్రక్కుతున్న రివాల్వరు వైపుచూచి, ముర్రే, "ముందుకు నడిపించు," అని ఫ్రీలాండ్‌తో అన్నాడు.

గుర్రాన్ని మళ్ళించి, తోడేలు పరుగులు తీయించాడు. కొమ్ము స్వరానికి అనుగుణంగా తన గుర్రపు డెక్కలు భేరీ వాద్యం మ్రోగిస్తున్నట్లున్నై. గాలి రొదపెట్టుతున్నది. తాను గుర్రంమీద బలంగా ఎగురుతున్నాడు. ఉన్నట్టుండి గుర్రాలను వాయువేగాన వదలిన అశ్వికులకు ఒక నిట్టూర్పు వినవచ్చింది.

ఇంతలో వింట్ చేయెత్తి కొండ కొమ్మును చూపినాడు. అక్కడ క్షణంలో, అరుణాకాశానికి, కందిపోయిన సూర్యప్రభాంచలానికి అడ్డుగా దీర్ఘమైన అశ్వికపంక్తి కనుపించింది. ఎనబైమందికంటే ఎక్కువే వున్నారు. తెగలోని మగవాళ్ళందరూ పండుముదుసళ్ళూ, బాలకుమారులూ, నిండు యవ్వనంలో తెగువ చేసేవాళ్ళూ వున్నారు. అశ్వికుల కంపెనీలు రెండూ ముందుకు అలవలె సాగినవి. దాదాపు ఒక్క వెయ్యిగుర్రాల డెక్కలత్రొక్కిడి మహా భేరీభాంకృతి కాగా, కొమ్ముస్వరాలు మునిగిపోయాయి. కృపాణాలు మెరుపులయినవి. నీడపడిపోయిన కొండ ఎగుడు చేరుకొనేసరికే, కాంతిఖండాలు గుప్పుమని ఆరిపోయాయి. అయినా కాని గగనానికి అడ్డుగానిలుచున్నవారి ఉన్నతాకృతులు నల్లనివి నిశ్చలంగా వున్నాయి.

ఉండి ఉండి చెయిన్నీలు ఒక్కపెట్టున అంచుమీదుగా పొంగి పొరలి ఉరకలువెట్టే ప్రవాహంవలె దూకిపడి, తమ పొలికేకలతో అపవిత్రమైన అప్పటి మృత్యువాద్య సంగీతాన్ని పూర్తిచేశారు. సైనికులమీద నేరుగా విరుచుకొని పడలేదు, ఒళ్ళుతెలియని ఆవేశంతోటి సైనికులమీద విరుచుకొనిపడినంత పని చేశారు. పైబడివుంటే, దృఢకృపాణాగ్ర సంహతులై పోయి యుందురు. కాని ఉన్నట్లేవుండి, పైబడుతున్నట్టే దూకి అంతలో రెండుగా విడిపోయి, సైనికులను గిరగిరిచుట్టి దూరంపోతుంటే, చిత్ర విచిత్రాకృతులు మారి మారి కనుపించే గొట్టంలాగున్నది. తీగె యెంత సులువో అంత సులువుగా పోయే చిన్నిగుర్రాల మీద నాట్యం చేస్తున్నట్టుంది. తల తొడుగులకన్న నల్లటి ఈకలు గాలికి అల్లల్లాడుతున్నాయి. ఎట్లా వీలయిందో తెలియదుగాని, చెయిన్నీలు సైన్యాన్ని చుట్టుముట్టినట్లున్నారు, సైన్యానికిదూరమై నట్లున్నారు, మరి సైన్యంలో చొచ్చుకొన్నట్లూ వున్నారు.

బిగిళ్ళ మ్రోతతోటి నీలి యూనిఫారములు ధరించిన శ్వేతసైనికులు వెనుదిరిగినారు. ఏ, బీ దళాలు అలసిన గుర్రాలను నిలుపుదల చేశారు. తిరిగి ఒక క్రమములో నిలిచారు. సందెచీకటిలో మునిగిన కొండనెత్తిమునుండి చూస్తే నదీ

గర్భానికి పరుగుపందెము తీస్తున్న యిండియన్లు కనుపిస్తున్నారు. ఈ దాడి ఫలితమని తాము చూపగలిగినది వెళ్ళికిలపడివున్న ఒక చెయిన్నీయే. అతని తల పుర్రె కత్తిపోటుకు బీటపడింది. దయతలచి సందెమసక ఆ గాయాన్ని దాచివేసింది.

ముర్రే రెండుతూర్లు రివాల్వరు కాల్చినాడు. ఇంకా దానిని పట్టుకొని వున్నాడు. పిడికిలి బిగిసేవున్నది. అరచేయి తడిగావున్నది. కెప్టెన్ వింట్ కేసి చేయి నూపుతూ, తన దళముతోబాటు నదీగర్భానికి దౌడుతీసి చెయిన్నీలను అక్కడే హతమార్చమని గొంతెత్తి అరచి చెప్పినాడు. నీలి, పంక్తులు తీరినట్లున్న సైనికులు విస్తరించుకొనసాగినారు. నదివైపు పోసాగినారు. అరుపులతో, ఆర్భాటాలతో వాళ్ళు కత్తికటార్లను మరొకతూరి యెత్తిపట్టి బయలుదేరి పోయారు. హార్డింగు, డ్రేఫే అనే యిద్దరు సైనికులు అందరికంటె వెనుకగా నెమ్మదిగా పోతున్నారు. వారిలో ఒకరికేమో, భుజాన తుపాకిగుండు దూరిపోయింది. మరొకని చేతియెముక యుద్ధగదాహతికి చిట్లిపోయింది.

దళాలు సమతలానికి చేరేసరికే, చెయిన్నీలు నదిని దాటిపోయారు. గుర్రాల డెక్కలక్రింద నదిలోని చిటిపొటి మొక్కలు అణగారి పోయినవి. నదిలోవైపు యిసకమీద వాటి పురోగతి ముద్రపడసాగింది. దినమంతా తెగ పరుగెత్తి అలసిపోయిన గుర్రాలను అదలించికూడ లాభంలేకపోతున్నది. వాటిలో యెక్కువభాగం అవతలిగట్టు యెక్కుడులో కాలుజారి పడసాగినవి. ఈలోపల చెయిన్నీలు కాల్పులు మొదలెట్టినారు. చెయిన్నీల బక్క గుర్రాలకు దాడికిముందు కొన్నిగంటలనుండి కావలసినంత విశ్రాంతి లభించింది. చెయిన్నీలు కాలుస్తూ కాలుస్తూనే తిరిగి నదిని దాటిపోయారు. బురదమరకలతో, అవమానముతో, అలుపుతో అశ్వికులు ఆవలిగట్టున దిగాలుపడి చూడసాగినారు.

అప్పటికి దాదాపు రాత్రిఅయింది. కొండకు వెనుక పాలిన ఎర్రని ఆకసం యింకా అట్లాగేవుంది. అశ్వికులు దిగి రొజుతున్న గుర్రాలవద్ద నిలుచుని, తమ భార్యలూ, బిడ్డలూవున్న చోటికి చేరుకుంటున్న చెయిన్నీలను పరికించసాగినారు.

వింట్ మూర్ఖపు చిరునవ్వుతోటి ముర్రేతో, "ఆడనక్క ఒకటి...", అంటూ ఏదో చెప్పబోయాడు. ముర్రే అడ్డుపడి, "మనం వాళ్ళ శిబిరంలోకి చొచ్చుకొనిపోయి వుండవలసింది. ఆడవాళ్ళూ, పసివాళ్ళూ మన చేతబడివుంటే, యీ శెధవలందరూ చెప్పినట్లు విని వుండేవాళ్ళు. మంచి గుణపాఠం. ఈసారి యిట్లా చేయాలి", అన్నాడు.

"డార్లింగ్టన్ విడిచివచ్చేటప్పుడు వీళ్ళ గుర్రాలు సగం చచ్చివుండినై. కాని అద్భుతం, మనవాటిని పనికిమాలిపించాయి." "మరి పరుగెత్తించబోము," అన్నాడు ముర్రే.

గుర్రాలకు నీళ్లు త్రాగించిన మీదట ముర్రే, అతని బలగమూ నదిని తిరిగి దాటి, కొండకు అరమైలు దిగువగా విడిది చేశారు. ఆరుగురికి గాయాలు తగి

లాయి; కాని ఎవరికీ మోపైన గాయంకాలేదు. క్షతగాత్రులందరూ స్వారీ పోగలిగినస్థితిలో వున్నారు. అంతర్యుద్ధకాలములో, ఆసుపత్రి పనులలో ఆరితేరిన టెంపోర్ తన చేతనైనంతమట్టుకు గాయపడినవారికి సేవచేయసాగాడు. ఇతనికి పెద్దదాడీవుంది. ఆడదానికంటె మెత్తనిగుండె. మంట వెలుగులోనే పనిచేయ వలసివచ్చినా, అదిలేదిదిలేదని ఒక్కమాటకూడ సణగలేదు.

సైనికులు తిండి తినసాగినారు. ముర్రే, వింట్ కలిసి కొండవైపు గుర్రాల మీద పోయారు. చెయిన్నీల చలిమంటలు మరుగున వున్నవేమో కనుపించడం లేదు. కాని గులాబివన్నె వెలుగుమట్టుకు కొండపైన విస్తరించుకొనివుంది. ఈ గులాబి వన్నెవెలుగులో కొండ రాజుకొంటున్న చిట్టి అగ్నిపర్వతం లాగుంది. "వాళ్ళు యేమాత్రం లెక్కస్తున్నట్టులేదు," అన్నాడు వింట్.

ఏదో ఒక పనిమీద మనసునిలిపి, దారిలోని అడ్డంకుల నన్నిటినీ లెక్కించక దానిని కొసముట్ట నిర్వహించ పూనుకొన్న యీ చెయిన్నీల చిత్రమైన విధివాదం ముర్రేకి కొంచెం కొంచెం బోధపడసాగింది. ఇదివరకే వాళ్లు చనిపోయి వున్నట్లూ, మానవులొకేతూరి మరణిస్తారనే యెరుకలోవున్న భయాన్ని అంతటినీ కోల్పోయినట్లూ కనిపిస్తున్నారు. ఈ మనోభావాన్ని మాటలలో యిమిడించలేకపోయాడు ముర్రే. వింట్ కేమీ జవాబీయలేదు.

"వాళ్ళవద్ద తిండి దినుసులు మస్తుగావున్నట్టులేవు," అన్నాడు వింట్. "మైల్స వీళ్ళ కడుపులు బాగా కాల్చినట్లుంది."

"తిండి దినుషులకేమిగాని, నీటి యద్దడి యెక్కువగా వున్నట్లుంది. తిండి కేమి, గుర్రాలనే తినగలరు".

"ఆఁ! ఇండియన్లు గుర్రాలను తినరు. మీకు తెలియదూ?"

"తినరూ? ఎందుకుతినరు? ఈ మొండి పోటుగులుమట్టుకు తింటారు. ప్రతి నిషేధాన్ని వుల్లంఘించినతర్వాతనే వాళ్ళు లొంగుబాటవుతారు."

"ఈ రాత్రి అక్కడికి పోదామా?," అని అడిగాడు వింట్.

"పోవాలనేవుంది. వాళ్ళవద్ద చిన్ని చిన్ని ఆయుధాలు, చాలీ చాలని పిస్తోళ్ళు, ఒకటి రెండు కార్బైన్లను మించివున్నట్టు లేదు. ఈ ప్రదేశానికి వచ్చినప్పుడు కొన్నివందల రౌండ్ల గుండ్లు మాత్రమే వుండినై. వాటితో అట్టేసేపు కాల్పులు సాగించలేరు."

"అసలు కాల్పులకే పూనుకోరేమో! ఆ ముసలివాడు మూర్ఖుడు మట్టుకు కాడు."

"నేను అతనికేసి పిస్తోలు పేల్చివుండవలసింది కాదు. ఓర్పుకోల్పోయాను."

"నే నా విషయంగురించి కాదు ఆలోచిస్తున్నది."

"నీ యిష్టంవచ్చిన వెధవ విషయంగురించి ఆలోచించుకో," అన్నాడు ముర్రే.

"సరే. నిజంగానే నా విషయం పట్టించుకోలేదు. ఆ రకంగా మీకువున్నట్టే వుండి ఓర్మి పోతుందని నాకు తెలుసు."

"నీకెప్పుడూ కోపమే రాదు," అన్నాడు ముర్రే.

"అప్పుడప్పుడు చిలకేటుగా తప్ప. మీరు నిదురపోవాలి. మీరు నిదర పోయినంత కొద్దిగా నేనూపోతే -"

"నోర్ముయ్ !," అని అరిచాడు ముర్రే.

ఇద్దరూ మాటా మంతీమాని గుర్రాలను నడిపించసాగినారు. వింట్ పెదిమలమీద సన్నని చిరునవ్వు దారంవలె సాగింది. "క్షమించు, వింట్," అన్నాడు ముర్రే.

"సరే దానికేమి ? మరచిపోండి."

ఇద్దరూ తిరిగి శిబిరానికి వెళ్ళిపోయారు. గుర్రందిగి, ముర్రేతో చెప్ప కుండా వింట్ నడిచిపోయాడు. ఒకమంటవద్ద కూలబడి ముర్రే పొగగొట్టం నింపుకోసాగినాడు. లెఫ్టినెంట్ ఫ్రీలాండ్ వచ్చినిలుచుని, "సర్," అని పిలిచాడు.

"ఏమిటది ?," అన్నాడు ముర్రే.

"ఈ రాత్రికి మేమేం చెయ్యమని సెలవు ?"

"నిద్రపోదాము. అంతే. గుర్రాలకు కాపు పెట్టండి. రెండుగంటల కొక తూరి కాపు మార్చండి. కొండచుట్టూ గస్తీ తిరగాలి. నీటివైపుపోయే ప్రతిదానినీ కాల్చివేయమని చెప్పు. అంతే !"

చిత్తమన్నట్లు తలవూపి, యింకా అక్లే నిలుచుండి పోయాడా లెఫ్టినెంటు.

"అంతే" అన్నాడు ముర్రే "పోయి నిద్రపో."

వెల్లకిల పండుకొని ముర్రే గగనంకేసి చూడసాగినాడు. ఏమీతినలే దతను. ఆకలిలేదు. తెల్లటికాంతి శకలాలకు పూర్వరంగంగావున్న నల్లనిదానిని తదేకంగా పరికించాడు. తనకిప్పుడు వున్నపళంగా రెండువస్తువులు జరూరుగా కావాలి. ఏదో విధమయిన సారాయి, ఏదోరకమయిన ఆడది - ఆ కొండమీదవున్న 'స్క్వా' అయినా ఫరవాలేదు. అతనికి పెళ్ళికాలేదు. ఈ ముదనష్టపుపీడ విరగ డయిన మీదట తిరిగి తాను ఏ శ్రీమతి కెస్టన్ ముర్రే వద్దకూ పోబోడు. కాని వింట్ శ్రీమతి వింట్ వద్దకు వెళ్ళిపోగలడు.

కొంతసేపటికి ముర్రేకి నిద్రపట్టింది. మూడురాత్రుల నుండి నిద్రలేదు. ఇది సిసలైన నిద్ర. ముఖంమీద చల్లటి వానబొట్లు పడేటప్పటికి మేలుకొని పైకి చూచాడు. ఆకాశం క్రిందికి దిగివచ్చినట్టుంది. నల్లబడింది. రాత్రిపూట ఎవరో తన మీదకంబళికప్పిపోయారు. దానిని తీసివేసినిటారుగా లేచినిలుచున్నాడు. పాదాలు బూట్లలో వుబ్బి బిగుతుగా వున్నాయి. మొదటి నాలుగడుగులూ యమబాధ

కలిగించాయి. చేతిగడియారం చూచుకొన్నాడు. ఇక కొన్ని నిమిషాలకు ఐదు గంటలవుతుంది. ఆరిపోయిన మంటలచుట్టూ, కంబళ్ళుకప్పుకొని సైనికులు నిద్ర పోతున్నారు. దూరంనుండి గస్తీల గుర్రాలచప్పుడు మందంగా వినవస్తున్నది.

వింట్‌కోసందారి తడుముకొంటూ తిరిగాడు. వానకు కొందరు సైనికులు మేల్కొన్నారు. లేచిలేవకమునుపే దళవాయి ప్రత్యక్షమయ్యేసరికి ఖంగారుతో సెల్యూట్ చేయసాగారు. వింట్ కనుపించాడు. ముర్రే అతనిని యిటూ అటూ వూపినిద్రలేపాడు. "లెయ్, తెల్లవారకమునుపే అక్కడికి పోవాలి లెయ్." లేచి వింట్ గడ్డం వెంద్రుకలను చేతివ్రేళ్ళతో సర్దుకోసాగాడు. అతని దాడీ పెద్దది. ముఖమంతా చిక్కిపోయినట్లు కనిపిస్తున్నది. "ఎక్కడికి ?" అని అడిగాడు.

ముర్రే కొండవైపు చూపాడు. వింట్ చీవాట్లు వేస్తాడేమోనని భయపడ సాగాడు. వింట్ తనకు అండగావుంటే మరి భయమక్కరలేదు.

వింట్ తన వెంద్రుకల చిక్కువదిలించు కొంటున్నాడు. "డాడ్జ్ నగరం నుండి పదాతిదళం వస్తున్నదికదా ! అది వచ్చేవరకూ వీళ్ళను నిలుపుదల చేయ గలం" అన్నాడు.

"మొదలు పెట్టినపని ముగించడం నాకిష్టం," అన్నాడు ముర్రే.

"నిన్న మీరు మరోవిధంగా అనుకొన్నారే మరి ?"

"నిన్నటి విషయం వేరు."

వాన ఎక్కువయింది. తలకు తడితగలనీయని హేట్ పెట్టుకొన్నాడు వింట్. "మీ ఆజ్ఞ తప్పదు" అన్నాడు. ముర్రే భుజాలు యెగురవేసి "జనాన్ని లేపు, నడిచేపోదాం. సులువుగా వుంటుంది" అన్నాడు.

"అశ్వికులను నడిపించడం నా కిష్టంలేదు."

"వాళ్ళు హతంకావడం నా కిష్టంలేదు" అంటూ ముర్రే వెళ్ళిపోయాడు. మంటను తిరిగి యెగద్రోయడానికి తంటాలు పడుతున్న కెల్లీ కనిపించాడు. "అక్కడ విషయాలు ఎట్లావున్నాయి సర్జెంట్" అని కెల్లీని అడిగాడు ముర్రే, కొండవైపు చూపుతూ.

"బంగారంగా వున్నాయి."

"మనం నడిచే బోతున్నాం. జనాన్ని నడవమని చెప్పు. గస్తీలను రప్పించు."

"సరేనండి."

"హత్యలు జరగ లేదు. జాగ్రత్త, అందరికీ యిది ముందు తెలియాలి. అక్కడ 'స్క్వా'లూ, పిల్లలూ కలగుమ్మటంగా వున్నారు."

"వాళ్ళు అగత్తలు త్రవ్వివారని నా వూహ."

"నీ వూహాలను అక్కర వచ్చినప్పుడు వెల్లడిద్దువుగాని, ప్రస్తుతానికి దాచి పెట్టు" అన్నాడు ముర్రే.

పేరుకు అశ్వికదళాలైనా, యిప్పుడు మట్టుకు కాలినడకమీద పలచటి పంక్తితీరి, వానలోనే నెమ్మదిగా పురోగమించ సాగినారు. కొండ కుదురుచుట్టూ అర్ధచంద్రాకృతిగా కనుపిస్తున్నారు. వాళ్లు కొండనెక్క మొదలెట్టినాగాని ఇండియన్ శిబిరంలో ఎలాంటి సందడీ వినిపించలేదు. ఉషస్సు మొగ్గబారిన సూర్యరశ్మి పరిణమించింది. కొండ సగ మెక్కినారు. అయినా ఏ అలికిడీ లేదు. దీనినిబట్టి తాము నిరభ్యంతరంగా, ఇండియన్లు ఒక్కసారైనా ప్రేల్చకుండానే, వారి శిబిరంలోకి చొచ్చుకో వచ్చునని ముర్రేకు నమ్మిక కలుగసాగింది.

ఇంతలో, ఇండియన్లు అగడ్తలు త్రవ్వివున్నారని ముర్రే గ్రహించ గలిగినాడు. ఒక ఇండియన్ లేచి నిలుచోవడం కనిపించింది. అతను తోడేలే అయి వుంటాడని ముర్రే తర్వాత తర్వాత దృఢంగా విశ్వసించాడు. చెయిన్నీల కంద కాలనుండి హఠాత్తుగా వెల్వడిన అగ్నివర్షం ఏ, బీ కంపెనీలను చిందర వందరచేసి వేసింది. వాళ్ళకుమస్తుగా మందుగుండు సామగ్రిలేదేమో, ఒక్కతూరే ప్రేల్చారు. అయితేనేం, సైనికులు కొండదిగ సాగినారు. అందరూ కాదు. తడిసిన పచ్చికలో, వంకరలు తిరిగిపోయిన నీలివన్నెదుస్తులు కొన్ని విడిచిపెట్టి వెళ్ళారు. ప్రేల్చ కొంటూ తిరోగమించారు. ముర్రేరోషం, పుక్రోషం పట్టలేక తిట్లకు మళ్ళినాడు. చిందరవందరగా తయారయిన పంక్తులను సంఘటీత పరచ ప్రయత్నించాడు. కాని తమ వెనుక, కొండనెత్తాన, ఒక కందకపు అంచున కూర్చుని నిశ్చలంగా, నిదానంగా పొగగొట్టం త్రాగుతున్న ఒక్కడుతప్ప మరియే యిండియనూ కనుపించలేదు.

కొండ దిగువ తడిపచ్చికలో పడుకున్నారు సైనికులు. వారిగుండా యిటూ, అటూ విసురుగా పోతూ, ముర్రే నష్టాన్ని అంచనా వేయసాగినాడు. వింట్ కళ్ళు ముర్రే నంటిపెట్టుకొనే వున్నాయి. ఒక్క పర్యాయమేమో, కొండకొమ్మున పచ్చికలో పడివున్న నీలివన్నె చిత్రాకృతులను చూడడానికేమో కళ్ళను కొండ వైపు త్రిప్పినాడు.

"ఫ్రీంలాండ్ అక్కడే వుండిపోయాడు," అన్నాడు ముర్రేతోటి. తల నాడించి ముర్రే మునుసాగిపోయాడు. కెల్లీకూడ కనుపించడం లేదు. అతనితో బాటు మరొక విదుగురు పైగ్రివేట్లున్నా, కనీసం ముప్ఫయిమందికి గాయాలు - దారిచూపే స్టీవ్ జెస్కీ తలగుండా గుండు దూసింది. బక్ స్కిన్ ధరించిన అతని దేహం ఆ నిడివి పచ్చికలో దాదాపు అగోచరంగా వున్నది. దయ్యపుమనిషి అనే అరాపహో ఇండియను ఎదురరొమ్ము తెరిచివేసినట్లయింది. నెమ్మదిగా కొండ దిగ్రబాకి రావడానికి తంటాలు పడుతున్నాడు. ముందుపోయిన లెఫ్టనెంటు గాట్లో వెనుకకు పరుగెత్తి వెళ్ళి, ఆ క్షతగాత్రుణ్ణి డించుకొని వచ్చాడు. వానలో శయనించి, అక్కడివారి కెవ్వరికీ బోధపడని చిత్రమైన మృత్యుగీతి నాలపిస్తూనే కొంతసేపటి కతను కన్నుమూశాడు.

వింట్ ప్రక్కన నిలుచుని ముర్రే, "దేవుడా, ఫ్రీలాండ్ దుస్థితికి నన్ను నిందించకు," మన్నాడు.

"మన మందరమూ నింద పడవలసినవాళ్ళమే," నన్నాడు వింట్.

"వాళ్లు స్వదేశానికి మరలిపోతా మన్నారు, అంతే. వాళ్లు కోరింది అంతే" అన్నాడు ముర్రే.

"నాకు తెలుసు. ఇప్పుడేమి చేయాలని మీ వుద్దేశం ?"

"తిరిగి కొండయెక్కడమే," నన్నాడు ముర్రే, ఎంతో అలసట ధ్వనించే గొంతుకతో.

గాయపడినవారిని శిబిరానికి చేర్చారు. మిగిలిన సైనికులు యింకా పలచటి పంక్తిగా విస్తరించారు. ఈసారి, మునుపటివలె నడువలేదు. తడిగడ్డిలో బోర్లా పడుకొని కొండను యెగబ్రాకసాగినారు. అంత శ్రమపడికూడ, సగంకొండకంటే యెక్కువదూరం పోలేకపోయారు. అక్కడ పడుకొని, ఇండియన్ తల కనిపించి నప్పు డంతా తుపాకి ప్రేలుస్తూ వుండినారు. సైనికులు ముందు సాగనంతవరకు చెయినీన్లు వున్నచోటనే నిశ్చింతగా వుంటూ ప్రేలుళ్ళు సాగించారు. ఉదయం, మధ్యాహ్న మయింది. జల్లువెలిసింది. గంధకపు వన్నె సూర్యబింబం మబ్బువిడిచి మండించసాగింది. పచ్చికనుండి ఆవిరి వెలువడుతున్నది. ఒక అడుగు నీరు క్రొత్తగా చేరిన నది మట్టిదిన్నె ఎర్రటి మొద్దుపామువలె ప్రవహిస్తున్నది. ముర్రే యింతలో తన సైనికులను తిరోగమించ వలసిందని ఆజ్ఞాపించాడు.

చిట్టచివరి రేషనుతిండి ముగించుకొని, సైనికులు ఎండలో ఎండుతూ వెలపానా పడుకొన్నారు. ఒకజీనుకు తలనాన్చి ముర్రే తనకళ్ళకు ఒకచేతి రుమాలు అడ్డువెట్టుకొన్నాడు. ఇప్పుడు బాగుంది. కాస్సేపయినా వెర్రిమొర్రి ఆలోచనలను వైదొలగించుకొన్నాడు. ఎండవేడిమీ, పైరియిరీబయళ్ళమీదినుండి తోలుతున్న చల్లగాలితాకిడీ యీ రెంటిగురించి తప్ప తక్కినవేవీ యిప్పు డతనికి పట్టలేదు. నది మొక్కలనుండి పిట్టలు రెక్కలల్లల్లాడుస్తూ కిలకిలమంటూ తమనీడలను భూమిమీద నర్తింపజేస్తూ ఎగురుతున్నవి. తోడేలు మసులుతున్న దేమో, పచ్చిక నిలువెల్లా జలజలా కదలిపోయింది.

అతని ప్రక్కనే కూర్చుని "తిరిగి మరోసారి పైకి పోదామా, కెప్టెన్" అని అడిగాడు వింట్.

ముర్రే చాలసేపువరకు జవాబీయలేదు. ఇంతలో లేచికూర్చుని చేరుమాలు మడిచి, చిత్రంగా వింట్ కేసిచూసి, "నాకు తెలియదు" అన్నాడు.

"వేగన్లతోబాటు హోవిట్జర్ రాగలదు" అని సూచించాడు వింట్.

ముర్రే భుజాలెగురవేసి, "నాకు యిదే బాగుందని పిస్తున్నది" అన్నాడు.

"పోనీండి. ఆపైన వున్నంతవరకూ వాళ్లు చచ్చినవాళ్ళ క్రిందనే జమ."

"వాళ్ళకిదే నచ్చిందేమో."

"అందుకనే మరేమీ ఫర్వాలేదని నేనంటున్నది". హోవిట్జరు వచ్చినంత వరకూ వూరకే వుందాం. డాడ్జ్ నగరం నుండి సేన రాకపోదు," అన్నాడు వింట్.

*　　　*　　　*

వేగన్లూ రాలేదు. హోవిట్జరూ రాలేదు. ఆరుగంటల వరకూ ఎదురు చూశాడు ముర్రే. ఆపైన సరఫరా రైలుబండి బహుశా మెడిసిన్ లాడ్జినదికీ, డార్లింగ్టన్ కూ నడుమ ఎక్కడైనా దారితప్పి పోయిందేమో చూచి తెలిసికొని రావలసిందిగా సార్జెంటు గీటని, ప్రైవేటు హెన్నెసీని పంపినాడు. కల్నల్ మిజ్నరుకు యివ్వవలసిందని ఒక నివేదికను సార్జెంటు చేతబెట్టి వేగన్లు అంతు చిక్కిన తర్వాత ఆ నివేదికను హెన్నెసీ చేతికిచ్చి పంపవలసిందని, సరఫరా బండితోబాటు సార్జెంటు తిరిగి రావలెనని వుత్తర్వుచేశాడు. ఇంతలో మరొక ఆలోచన తట్టగా, గిటీతో యిలా అన్నాడు: "సేనలు తిరిగి పోయివుండినట్లయితే, ఈ గాయపడిన వాళ్ళని వేగన్లకెత్తి కోల్డువాటర్ కు చేర్చవలసింది. అక్కడ వైద్యుడున్నాడను కొంటాను."

"సేనలు తిరిగిపోయివుంటే?," అని గీటీ ప్రశ్నించాడు.

"ఇక బయలుదేరి పోవచ్చును, సార్జెంట్," అన్నాడు ముర్రే. అడుగడుగుకూ లోతవుతున్న నదిని వాళ్ళిద్దరూ దాడుతుంటే చూస్తూ కూర్చుని, ఆ తర్వాత తిరిగి తన సేనవైపు చూపుమరల్చినాడు. అపరాహ్నకాలంలో లభించిన విశ్రాంతి వల్ల సైనికులూ, గుర్రాలూ తేరుకొన్నట్లుంది. ఉదయపు పరాజయభారం వైదొలగినట్లుంది. కాని మూడు రోజులనుంచి కటికి రేపన్లతో సరిపెట్టు కొంటున్నారు. చనిపోయినవాళ్ళు పోగా, గాయాలు తగిలిన వాళ్ళు మినహాగా, కొద్దిమంది మట్టుకే నిలిచారు. గస్తీలు కొండమట్టూ తిరుగు తున్నారు. కాని యింతవరకూ చెయిన్నీలు కందకాలపైనుండిగాని, తుపాకి గుంటలమీదినుంచి గాని దర్శన మీయలేదు. పారిపోవడానికి ప్రయత్నిస్తున్నట్లూ లేదు.

ఓరిగాన్ బాటవెంబడి మైదానాలమీదుగాపోయే తొలివేగన్ రైలుబళ్ళ రోజులు ముర్రే గుర్తు తెచ్చుకోసాగినాడు. ఆరోజుల్లో పరిస్థితి యిప్పటి స్థితికి పూర్తిగా తారుమారు. కాని దేశంవిడిచివేగన్లలో వలసపోసాగిన వాళ్ళెవ్వరూగాని, యెప్పుడూగాని నేడు యీ తోడేలూ, అతని అనుచరులూ యెదుర్కొం టున్నంతటి భయానకమయిన, దారుణమయిన విపత్కర పరిస్థితి నెదుర్కొన్నారా అని ముర్రే సందేహించ సాగినాడు. ఈ వరకే శత్రువులు యిరుకున బెట్టారు; వున్న మనుషులా, శత్రువులు యిద్దరైతే తామొక్కరు; డాడ్జ్ నగరంనుండి వచ్చినసేన వుత్తరపుదారికి అడ్డునిలిచింది; నలువైపులా ఎటుచూచినా సైన్యస్థావరాలూ, దుర్గాలూ వలవలె వున్నాయి. ఈ దిగ్బంధనను భేదించి వెళ్ళగలగడం లక్షమార్ల కొకమారే సాధ్యమవుతుంది.

ఉన్న తిండిదినుసులు అసలే చాలవు; అవికూడ నానాటికీ తీసికట్టుతున్నాయి; రేపోమాపోవున్న మందుగుండు సామగ్రి కాస్తా నిండుకోక తప్పదు; యెడాతెరిపీ లేని పలాయనంవల్ల గుర్రాలూ, మనుషులూ శిథిలమై పోతారు. నాలుగేళ్ళ వయసుకే చెయెన్నీ బాలబాలికలు ఆశ్వాసీను లవుతారని తాను వినివున్నాడు. నిన్నటి రాత్రిపూట, తాను జన్మజన్మాలకు సాధ్యమనుకో నంతటి అద్భుతమయిన ఆశ్వికలాఘవాన్ని చూచివున్నాడు. కాని మానవ మాత్రమైనదే ఒక్కటీ గంట గంటా, రోజురోజూ పరుగెత్తే గుర్రాలముందు తీసికట్టు వలసినదేనని తా నెరుగును. అటువంటి మనుషులు తప్పించుకొని పోవచ్చునేమోగాని శిథిలం కాకమానరు. అయినా తప్పించుకొని పోగలరని తాను నమ్మలేదు.

"మనవాళ్ళు నిశ్చింతగా విశ్రాంతి పుచ్చుకోవచ్చు. రేపు ప్రొద్దుటికి డాడ్జ్‌నగరంనుండి సేన వచ్చేస్తుంది. హోవిట్జర్ కూడ పట్టుకొని వస్తారేమో" నన్నాడు వింటర్‌తో ముర్రే.

"వీళ్ళు యీ రాత్రి రాత్రే పారిపోజూస్తారేమో!"

"కావచ్చు"నని అంగీకరించాడు ముర్రే. "గస్తీ తెల్లవార్లూ జాగారం చేస్తూ కంటికి వత్తులువేసుకొని కాపుండమని చెబుతాను."

"ఈ గాయపడినవాళ్ళందరినీ డాక్టరు దగ్గరకు తీసికొనిపోతే బాగుండును. ఈ వేడిలో గాయాలబాధ యమబాధ."

"తెల్లవారేసరికి వేగన్లు వచ్చేస్తాయి," అన్నాడు ముర్రే.

"నా ఆశ వాటిమీదనే పెట్టుకొన్నాను."

ఆ రాత్రి ముర్రే గాఢంగా నిద్రించాడు. చెయెన్నీలగతి దుర్గతిఅని గ్రహించిన తర్వాత అతను చాలా చిత్రంగా మార్పు చెందాడు. మునుపు లేని ప్రశాంతత యేర్పడింది. సకల మానవుల భవితవ్యాలు తేలియాడే ఒక మహా ప్రవాహినిలో ప్రయాణం మొదలెట్టిన నేకవంటిదీ ఆలోచన.

ఉద్రేకపూరితా లయిన మనోభావాలను మాటలలోగాని, దీర్ఘాలోచనలలోగాని ముర్రే యిమడ్చలేదు. ఎంతో గజిబిజి అవుతాడు. కాని తన భవితవ్యము కూడ యీ అనాగరికుల భావితో భయంకరంగా పెనబడివున్నట్లు తెలుసుకొన్నాడు. కాని యిప్పు డేమాత్రమైనా ఆందోళన లేదు, మథనలేదు. చేతిలో తుపాకి పట్టుకొని, యూనిఫారము ధరించిన భృత్యుడు తాను; అస్పష్టమైన తన కలలనూ, కోరికలనూ మూర్తీభవించిన ఏకైకమైన ఒక దానిని దేనినో విధ్వంసించడమే తనకు నిర్ణయింపబడిన బాధ్యత. తాను ఏమైనగాని బాధ్యతను నిర్వర్తించాలి. చట్టమన్నా, సువ్యవస్థిత సమాజమన్నా, మట్టూ మర్యాదలన్నా ఏమో తెలియని యీ దిగంబర అనాగరకు లేవిధంగా ఒప్పో తనకు స్పష్టంగా తెలియదు.. వారిని విధ్వంసించడమంటే, గుప్పుగుప్పుమని కొట్టుకులాడుతున్న తన ఆత్మజ్యోతిని పూర్తిగా ఆర్పివేసికోవడమని, యింకా ధర్మోప

దేశము చేస్తున్న తన న్యాయదృష్టిని పాతమార్చివేయడమని మట్టుకు తా నెరుగును. “మంచి జీతం, ఇంతకంటె దుష్టకృత్యాలు చేయగలడు మనిషి” అని, చనిపోయిన సార్జెంటు కెల్లీవలె, తానూ ముందు ముందు సమాధాన పెట్టుకో జూస్తాడేమో మననున్నను.

కాబట్టే అతనికి గాఢమైన కూర్కు పట్టింది. రాత్రి సగం గడిచిపోయినా మెలకువరాలేదు. చివరకు గస్తీలున్నచోటునుండి హఠాత్తుగా వినవచ్చిన ప్రేల్పులు అతనికి నిద్రాభంగం కలిగించాయి. లేచేసరికి చుట్టూ గల్లంతు, హడావుడి. జీనులు వేసుకొనేవాళ్ళు, గుర్రాలవైపు పరుగుత్తేవాళ్ళు నానా హంగామాగా వుంది. ఇంతలో ఎంతో హుందాతోటి ఒకవేయి గుర్రాల డెక్కల త్రొక్కిడి జంత్రగాత్ర సంగీతంవలె ఘనంగా వినిపించింది. “బిగిల్ వూదండి, బిగిల్ వూదండి” అని గొంతెత్తి అరిచాడు.

కాని తా నరచి చెప్పకుండానే సైనికులు అశ్వారూఢు లయ్యారు. దళాధిపతులు ఆజ్ఞాపిస్తున్నారు. ఇంతలో గస్తీలు హుటాహుటిగా వచ్చేశారు. వచ్చీ రాకముందే విషయాలు చెప్పబోతున్నారు. “మంటలు వేసుకొంటూ పాటలు పాడుకొంటూ, వున్నట్టేవుండి ఒక్కుమ్మడిగా దూకిపోయారండి.”

“టెంపార్! ఇంకో మనిషిని తోడువుంచుకొని యీ గాయపడిన వాళ్ళను చూస్తూవుండు! రేపు గీటీవచ్చి కలుస్తాడు! కెప్టన్ వింట్, ముందుండి బయలుదేరు!,” అని ముర్రే ఆజ్ఞాపించాడు.

మాయమైపోతున్న చెయిన్నీ గ్రామపు డెక్కలచప్పుడు నాలిస్తూ చీకటిలో పడిపోయారు గుర్రాలమీద. ఇండియన్లకూ, యీసేనకూ నడుమ కొండ, నది అంచున్నే యిరుకు యిరుకుగా వున్న పీకెవెంబడి వింట్ ముందుండి సేనను విశాల ప్రదేశానికి కొనిపోయినంతలోనే డెక్కలచప్పుడు అణగారిపోయింది. ఉన్నట్టుండి, వింట్ ఆగమని వుత్తర్వుచేశాడు. గుర్రాలు కలబడిపోయినై. సకిలించసాగినై. ముర్రే వచ్చేటప్పటికే వింట్ గుర్రందిగి, నేలమీద పడివున్న దానిని దేనినో తదేకంగా వంగి పరిశీలిస్తున్నాడు.

“ఏమిటది?,” అని అడిగాడు ముర్రే.

చేతులతో ఒక యిండియన్ శిశువును యెత్తి పక్కగా నిలుచున్నాడు వింట్. ఆబిడ్డకు ఐదేళ్ళకంటె హెచ్చువుండదు వయసు. చనిపోయాడు. మెడగుండా గుండు దూరిపోయింది. ముఖం గుండ్రంగా చైనావారిముఖం లాగుంది. కళ్ళు నల్లటివి. విప్పారివున్నై.

గస్తీలలో ఒకడైన గార్డన్ మనుషులను త్రోసుకొని దుఃఖపూరిత కంఠంతో, “అయ్యో, నేనుకాల్చిన గుండు అయివుంటుం దేమోనండీ! చీకటిలో ఏమీ కనిపించలేదు - ఆ మూక మొత్తం తప్పు! ఆలోచన లేకుండానే తుపాకి ప్రేల్చేశాను!” అన్నాడు.

"నీవు చేసింది సరిగానే వుంది," అన్నాడు వింట్ నిశ్చలంగా.

"చనిపోయాడు," అన్నాడు ముర్రే.

"పూడ్చి పెడుదా మనుకొంటున్నాను."

"మన వాళ్ళక్కడ చచ్చిపడి వున్నారు. వాళ్ళనెవరు పూడ్చారు?"

"మనం యితన్ని పూడ్చిపెట్టాలి," అన్నాడు వింట్.

ముర్రే వెర్రిగా వింట్ వంక చూశాడు. తర్వాత నెమ్మదిగా తల ఆడించాడు. ఆశ్వికులు కొందరు దిగారు. మాటామంతీ లేకుండా, పలచటి కత్తులతో గోయితోడారు. చాలలోతు తీయలేదు. రెండడుగు లుంటుంది. ఎవరో ఒక కంబళి విసరివేశారు. వింట్ ఆ కంబళిని ఇండియన్ మృతబాలుని చుట్టూ కప్పి గోతిలో పెట్టాడు.

"ప్రయోజనమేమీలేదు. తోడేళ్ళు వెర్రివి కావు" అన్నారెవరోగాని "పది అడుగుల గోయితీసినా తోడేళ్ళు బయటికి లాగగలవు ఆ మాటకువస్తే" నని మరొక రన్నారు.

మట్టినిసెట్టి బూట్లతో అణగద్రొక్కారు. "కెప్టెన్, ప్రార్థన ఏదైనా చేయా లనుకొంటాను తమరు" అని ఎవరో చీకట్లోవుండి యెకసక్కెంగా అన్నారు.

ముర్రేకి కోపం వచ్చింది. "నోర్మూయ్ లేకపోతే తిరిగి తెరుచుకోనంత పదిలంగా మూసేయగలను," అన్నాడు.

"పోనిండి," అన్నాడు వింట్. అతని పలచటి పెదిమలమీద నవ్వువుండీ లేనట్లుంది. "ఈ కుర్రాడు మతం పుచ్చుకోలేదుగా! కనక మరేం ఫరవాలేదు, ప్రార్థన చేయకున్నాగాని."

తిరిగి అందరూ గుర్రాలెక్కారు. రాత్రి ప్రశాంతిలో ఖురాగ్రఘట్టమున అంతర్ధానమై పోయింది. గుర్రాలను తొందరపెట్టించి కూడా లాభమేమీ వుండదనుకొన్నారేమో, వుత్తరదిశాభిముఖంగా మందగతిలో వెళ్ళిపోయారు.

# ౨

# వాషింగ్టన్ అంతర్నాటకం

## సెప్టెంబరు 1878

ఇంతలోపల కల్నల్ మిజ్నర్ వాషింగ్టన్ నగరంలోని యుద్ధ కార్యాలయానికి సమగ్రమైన నివేదిక పంపినాడు. తనకు సంబంధించినంత మట్టుకు ఏజంటు మైల్స్ ఇండియన్ కార్యాలయానికి నివేదించాడు. కాన్సాస్ రాష్ట్రంలోని లారెన్సు నగరంలో ఇండియన్ వ్యవహారాల సూపరింటెండెంటుగా వుంటున్న విలియమ్ నికల్సన్ ఆంతరంగిక వ్యవహారాల కార్యాలయానికి సవివరమైన నివేదికను పంపినాడు. పత్రికా విలేఖరులతో యీ విషయాలను గురించి ఏ విధమైన సంభాషణలుగాని చేయకూడదని మైల్స్‌కు హెచ్చరికకూడ చేశాడు.

అనేక నిర్వచనాలతోటి కొద్ది పాద దీపికలతోటి నిబిడీకృతమైవున్న మిజ్నర్ నివేదిక ఎట్టకేలకు విలియమ్ టెకుమ్సే షెర్మన్ యింటికి – అంటే గమ్యస్థానానికి – వచ్చి చేరింది. సంయుక్త రాష్ట్ర సర్వసైన్యాధ్యక్షుడు యీ షెర్మన్. అతనికి తన సంసారమంటే చెప్పలేనంత మమకారం. పిల్లల తప్పిదాలను మన్నిస్తూ వారిని వారించే తత్వంగల తండ్రిగా షెర్మన్ పేరు దేశమంతటా మ్రోగిపోయింది. అతని ఆఫీసు పనికి భంగం కలిగిస్తూ ఒకరో యిద్దరో పిల్లలు అల్లరి చిల్లరి పనులుచేసినా అతనికి చిరాకుగాని, విసుగుగాని కలగదు. ఆ యింటికి పనిమీద ఎప్పుడు ఏ పత్రికా విలేఖరి వచ్చినా తారసిల్లే దృశ్యమిదే. ఇతనేనా, జార్జియా రాష్ట్రంగుండా దారితొలుచుకొని పోయినంతమేరకు విధ్వంసిస్తూ ఎంతో కీర్తినార్జించిన మహాసేనాని అని విస్తుపోతారు. ఎంతకీర్తి అయినా వుండవచ్చు. ఒక మనిషి యింటి విషయాలు తెలిసికోనంతవరకూ, అతని గురించి మనకేమీ తెలియదు. ప్రసిద్ధ పురుషులు దుర్గర్వంతోటి డాబుసరికిపోరు. వాళ్ళలో మానవ సాధారణ గుణాలు నిండారి వుంటాయి.

ఆకురాలు కాలపు తొలిరోజులలో ఒక ప్రొద్దుటిపూట సాధారణమైన తన నిరాడంబర మందిరంలో కూర్చుని జనరల్ షెర్మన్ మిజ్నర్ నివేదికనుచదువ సాగినాడు. ఇంకా చాలా కాగితాలతో బాటు యిదికూడ మామూలుగావచ్చింది. బయళ్ళ భూములలో సైన్య చర్యలనుగురించి చాల కాగితాలు వచ్చాయి. అపాచీ

యిండియన్లు గడబిడ చేస్తున్నారట. దక్షిణాదిలో కయోంచీ ఇండియన్లు రెండుమార్లు దాడిచేశారట. ఎవడో తప్పత్రాగి ఒక తెల్లవాణ్ణి చంపివేస్తే, హంతకుణ్ణి పట్టుకోవడానికి ఒక అశ్వదళం బయలు దేరిందట. షెర్మన్‌కు విసుగు పుట్టింది. తాగుబోతు ఇండియన్ మనిషిని ఒకణ్ని బంధించడానికి అశ్వికదళమంతా కదలవలసివచ్చిందా? ఎవరో ఒక మేజర్ జేమ్స్ టి. ఫ్రెడరిక్స్ అనే మనిషి విస్కీ-దొంగ వర్తకులను గురించి వుద్రేక పూరితమైన ఖండన వ్రాసిపంపాడు. వేనవేల గేలన్ల విస్కీని చాటుగా చేరవేస్తున్నారట. ఇదంతా పద్మవ్యూహం లాగుంది. గజిబిజి ఈ చిల్లర సంగతులకు అంతు అనేదేలేదు. ఫ్రెడరిక్స్ వ్రాసినలేఖ గురించి షెర్మన్ ఇండియన్ ఆఫీసుకు కోపంతోటి మరొక లేఖ వ్రాశాడు. చింబి, శాంతపరచుకొని, మరొకలేఖ వ్రాశాడు. ఆ తర్వాతి విషయం, కెనడాదేశం నుండి సరిహద్దులనుదాటిన సియోక్స్ ఇండియన్ల వ్యవహారం. రేపోమాపో యీ కెనడా విషయాన్ని తేల్చి చక్కబెట్టగలమని తనకుతాను చెప్పుకొన్నాడు షెర్మన్. అంతర్యుద్ధమయినవెంటనే రాటుదేరిన సైనికులు వేనవేలు వున్నప్పుడే, దీపమున్నప్పుడే యిల్లు చక్కబెట్టుకోమన్నట్లు, ఉత్తరానికి ఒక్క వూపున దాటిపోయి, కెనడాదేశపు ప్రధాన నగరాలైన మాంట్రియల్, క్విబెక్‌లను గట్టి దెబ్బలు రెండు గొట్టివుంటే, యీనాడు ఉత్తరధ్రువంనుండి రియోగ్రేండీవరకు అమెరికన్‌జాతి వ్యాపించి వుండేది. తనతోబాటు సేనాను లనేకులు ప్రభుత్వానికప్పుడు చెవినిల్లు కట్టుకొని శతపోరి చెప్పినా ప్రయోజనం లేకపోయింది. అది యిప్పటికి కూడ మించిపోలేదు. కొంతసేపీవిధంగా ఆలోచనలలో పడిపోయి, కొత్త యుద్ధాలను గురించి కలలుగన సాగినాడు. తలచుట్టూ, గడ్డంచుట్టూ రొదపెట్టుతూ కాగితాలమీద మునికాళ్ళపై నిలిచి నీలుక్కొని ఈగలు నడుస్తున్నా, షెర్మన్ అది గమించలేదు.

చికాగో నగరంలో సమ్మె అట. శాంతి భద్రతలను సంరక్షించేందుకు రెండు దళాలు! ఈ చదివినదానినే తిరిగి చదువుకొన్నాడు. అతనికి సమ్మెలంటే ఒళ్ళుమంట. ఎంతోకోపం వస్తుంది కాని నిష్ప్రయోజకమైన కోపం. రణరంగమయితే శత్రువులను రాచి రంపాన పెట్టగలడు. ఇది యుద్ధంకాదు, సమ్మె. ఇందులో ఎంతటి ప్రమాదం నిండివుందోననుకో సాగినాడు. సమ్మెదారులు సైన్యాన్నికూడ ఖాతరుచేయక, పైపెచ్చు చులకనగా చూడడమనేది షెర్మన్‌కు తలవంపుగా వుంది.

ఆ తర్వాత అసలు నివేదికకు వచ్చాడు. చదువుదామా వద్దా అని మొదట తటపటాయించి, క్రింద ఎవరి సంతకమున్నదో మాద్దామనుకొన్నాడు. ఈకల్నల్ మిజ్నర్ సరిగా గుర్తురావడంలేదు. నాలుగోరెజిమెంటుకాదు. పదకొండోదికూడ కాదు. బహుశా నాలుగోదోయేమో! ప్రతికల్నల్ పేరూ తనకు గుర్తుంటుందని గర్వంగా అనుకొనేవాడు. ఆఁ! మిజ్నర్ వున్నచోట కళ్ళకు కట్టిన

ట్లయింది. ఓక్లహోమా ప్రదేశాన్ని చిత్రించుకో సాగినాడు. వేసవి చాల తీక్షణంగా వుంటుంది. కాలం సులువుగా గడవదు. ఎర్రదుమ్ము, నీలిరంగు యూనిఫారములు దుమ్ముపడి వుతికినా మరకలుపోవు. ఇటువంటి ప్రదేశాలలో యింగ్లీషు వాళ్ళయితే మొద్దురంగు దిరుసు వేసుకొంటారు. అదికూడ దుమ్ము రంగే వుంటుంది. వేడిదేశాలలో తెల్లటి దిరుసు బాగుంటుందని ఎక్కడో తాను చదివినట్లు గుర్తుబహుశా అదిప్రవాసించి బెంజమిన్ ఫ్రాంక్లిన్ మహనీయుడేమో! కాని సైనికుడికే గనక తెల్లటికోటును యిస్తే, వాడెంతసేపటికీ గుడ్డను విదిలించుకోవడం తోటి సరిపోతుంది. నీలం మంచిరంగు. చదువుకో సాగినాడు:

“...రిజర్వేషను నుండి మూడువందలమంది ఉత్తరాది చెయిన్నలు ఇటీవల పారిపోయారు. గౌరవనీయుడైన జాన్ మైల్స్ చేసిన వుత్తర్వులను కూడ లెక్కచేయలేదు. డార్లింగ్టన్‌లో ఇండియన్ ఏజంటు అయిన సదరు జాన్ మైల్స్ యీ అనాగరికుల పొగరుబోతు తనముతో కలతచెంది వున్నాడు. ఏజంటు యొక్క అధికారానికి బాసటగా నుండమని నా వుత్తర్వులున్నాయి. కాబట్టి యిండియన్లను మళ్ళించి తీసికొని రావలసిందిగా రెండు అశ్వికదళాలను నేను పంపమన్నాను. ఇండియన్లు ఉత్తరానికి పోతున్నారు. పౌడర్ నదీ ప్రదేశములో వున్న తమతమ నెలవులకు వెళ్ళిపోబూనుకొన్నట్లు నాకు తెలియవచ్చింది. వారిలో తొంభైమంది సాయుధులు. ప్రతిఘటించ సమర్థులు. వారిని ఆపివేస్తేనే తప్ప, లేకుంటే కాన్సాస్, నెబ్రాస్కా రాష్ట్రాలలోని పౌరులకూ ఆస్తిపాస్తులకూ నిస్సందేహంగా ముప్పురాగలదు. వారు ఆపబడినట్లు కొద్ది రోజులలో మీకు తెలియజేయగలనని ఆశిస్తున్నాను. ఈ లోగా తమ ఆజ్ఞలకొరకు వేచి వుంటాను.”

మంచి నివేదిక అనుకొన్నాడు షెర్మన్. ఏమంటే, వున్న విషయాలు యావత్తూ స్పష్టంచేసింది. ఊరకే నీళ్ళునములుతూ మీనమేషాలు లెక్కించకుండా, వెంటనే కార్యాచరణకు పూనుకొన్నారు. యుద్ధవ్యవహారాలశాఖ షెర్మన్ దృష్టిలో ఎట్లావుండాలంటే, క్రమబద్ధంగానూ, ముక్తసరిగానూ, పనిలో చేవతోనూ, గోడమీది చిత్రపటంవలె వుండాలి. దేశపటంమీద యిక్కడా అక్కడా లెక్కలేనన్ని గుండుసూదులు గ్రుచ్చివుంటాయి. ఎన్నో దారాలుంటాయి. కాని అన్ని దారాలూ ఒక్కమనిషి చేతికి యిముడుతాయి. ఇదే ముఖ్యమైనది. సూత్రధారి ఒకడు కావాలి. రేయింబగళ్ళు ఎక్కడ ఏగుండు సూది ప్రతిక్షణమూ వుంటున్నదో తెలిసికోవాలి. కాని గొప్పవాళ్లు కొందరుంటారు. వారిని అందరితో చేర్చి చూడ వీలులేదు. అట్లాంటానుండి సముద్రానికి తానొకప్పుడు అగ్రేసరుడైవుండి చేసిన సైన్యయాత్ర ప్రత్యేకించి వేరేగా చూడవలసిన సంగతి. ఒక రోజు తాను కూర్చుని వుండగా, వెనకనుండి ఎవడో పసివాడు మెదలడం, తాను అతనివైపు తిరగడం, తనకేసి వాడు కళ్ళార్పకుండా

అబ్బురపడి చూడడం గుర్తుకు రాసాగింది. "ఏమిటట్లా చూస్తున్నావు" అన్నాడు తాను.

"మిమ్మల్నేనండి."

"ఏం ? ఎందుకు ?"

"ప్రపంచంలోకల్లా గొప్ప సేనానాయకులు కదండీ, అందుకని."

"నిజమా ?"

"వాళ్ళందరూ అనంటారు గదండీ మరి."

"వాళ్ళంతా అంటే ఎవరెవరు ?"

"ఎవరెవ రేమిటండి, అందరూ నండి."

ప్రతివాడూ అట్లాంటానుండి సముద్ర పర్యంతం సైన్యయాత్ర చేయడ మంటే, మరేమైనా వుందా, సర్వం అంతరించిపోతుంది. అటువంటి మహా సంఘటన జీవితకాలంలో ఒకక్రపర్యాయమో, పదిజీవితకాలాల కొకక్రపర్యాయమో - యింతేగాని - అనుకొన్నప్పుడల్లా చేయవలసింది కాదు.

నిర్బంధాల నన్నింటినీ తొలగించుకొని వెళ్ళిపోవడ మనేది గొప్పవిషయం. అది చేయగలిగిన మనిషి అరుదు. షెర్మన్ గతాన్ని నెమరు వేసుకొంటున్నాడు. ఇక్కడ గాలీ, ఎండా అంతా సమపాళ్ళలో హాయిగొల్పుతూ వుంది. అతనికి అబ్రహాం లింకన్ గుర్తుకువచ్చాడు. ఒకరిగురించి మరొకరు యెరగరు. లింకన్ విచిత్రమైన వ్యక్తి. ఎంతనెమ్మదిగా, నిరుద్రేకంగా కనుపించేవాడు! ఆయన ఒకొకప్పుడు స్త్రీవలె విలపించేవాడని అందరూ చెప్పుకొనేవాళ్లు. అతని ఆశలు, అశ్రువులు, వూహాలు, స్వప్నాలు అన్నీ శత్రుప్రదేశంలో ఒక సేనాని నడుపుతున్న సైన్యముతోటి చిక్కులలో పడివుండిపోయాయి. ఆ సేనాని షెర్మన్. షెర్మన్ సైనికులు అరవైవేలమంది సముద్రంవైపు పోతుండినారు. తమమీద ఒక జాతి భవితవ్యం, ఒక నాగరికత భవితవ్యం ఆధారపడి వుండింది. అప్పుడు తాము పంగలవలె దేశపు కొవ్వు ఒలిచి తింటూ పోసాగినారు. అది వినోదయాత్ర-యుద్ధం కాదు. కనుక నే జీవితకాలంలో ఒకమారో, పదిజీవితకాలాలలో ఒకమారో యిది చేయదగినది.

తానప్పుడు సర్వాధికారి. సూత్రధారి. నిజానికి 'లీ'సేనానికే యిది తెలిసి వుంటే, తనను సర్వనాశనంచేసి వుండేవాడు. లీసేనాని మహాసమర్థుడు. అప్పటికే దక్షిణాది రాష్ట్రాలపస సాంతమైంది. అయినా, ఆ విపత్కర పరిస్థితిలోకూడ లీతనను నాశనం చేయగలిగి వుండును. ఏముంది? ఇటుమళ్ళి, రిచ్‌మండ్ విషయం పట్టించుకోక, దక్షిణానికి సైన్యాన్ని తరలించివుంటే తాను గిజగిజలాడి వుండే వాడు. లీ సేనానికి స్వాతంత్ర్య యుద్ధకాలంలో వాషింగ్టన్ సేనాని యేమిచేశాడో జ్ఞాపకంలేదు కాబట్టి షెర్మన్ అప్పుడు బ్రతికిపోయాడు.

షెర్మన్ సేనాని "అంతరంగిక వ్యవహార శాఖకు నకలు", అని నివేదిక మీద కలంతో గిలిగినాడు. మరొక యేడాదిలోగా ఇండియన్ గలాటాలన్నీ మరుపున పడిపోవాలి. తర్వాత ఫిల్ షెరిడన్ సేనానికి ఉత్తర్వులు వ్రాయసాగినాడు. "డార్లింగ్టన్ నుండి ఉత్తరానికి వెళ్ళిపోతున్న మూడువందలమంది చెయిన్నీ ఇండియన్ల దారి నడ్డేందుకు డాడ్జ్‌నగరంనుండి తూర్పుగావున్న రైలుబాట మీదుగా సేనలను పంపవలసింది. చట్టాలూ, ప్రభుత్వాలూ ఏమీ లేవన్నట్లుగా విచ్చలవిడిగా వెళ్ళిపోజూచిన ఈ ఇండియన్లను అటకాయించి, జాగుచేయకుండా మళ్ళించుకొని రావాలి. నాయకుల పట్ల సైనిక చర్యలు వాడవచ్చును. వివరాలన్నీ రెనోకోటలోవున్న కల్నల్ మిజ్నర్ అందజేయగలడు. మరింత ముప్పు తెచ్చేలోపల యీ ఇండియన్లకు బేడీలు తగిలించడం అత్యంత అవసరం." సంతకం చేశాడు. మిగతా కాగితాలు చూడజొచ్చాడు. పిండిసరఫరాలో మూడువేల ఆరువందల పౌన్లలోటు. ఈ విధవ వ్యవహారం తన దగ్గరకు ఎందుకు వచ్చింది? తన నెందుకు వేధిస్తున్నట్లు యీ పనికిమాలిన సొదతోటి?

* * *

"ప్రతిఒక్కడూ యితరుల నందరినీ విసిగించడమే వృత్తిగా ఎందుకు పెట్టుకొంటాడో?" ననుకోసాగినాడు కారల్ షుర్జ్. విలియం టెకుమ్సే షెర్మన్ సేనానికి ఎవరో పూరూపేరూలేని కల్నల్ ఇండియన్ ప్రదేశంలో ఎక్కడినుంచో కొందరు ఇండియన్లు రిజర్వేషను వదలిపెట్టి పోయారంటూ పంపిన నివేదిక నకలు చదువుకొంటున్నాడు. తన కార్యదర్శి చదివాడుకదా, మరి తన బల్లమీద ఎందుకుపెట్టి పోయినట్లు? ప్రభుత్వం బురాక్రసీగా తయారవుతున్న దెందుచేత? ఆకాశమంత యెత్తుకు రాశిపడివున్న పనికిమాలిన అల్పనివేదికలబుట్టలోపడి పూడిపోవలసిందేనా? అంతా చెత్త, కుళ్ళు. దీనిని మార్చడానికి ఎంత ప్రయత్నించినా ఏంఫాయిదా? మంత్రివర్గసభ్యుడు కావడమంటే నిలువుసమాధి చేసుకోవడమే! "మిజ్నర్," అని చదివాడు. "ఎవ రీమిజ్నర్? ఏమిటతనిగోల? అయితే నేను చేయాలిసిందేమిటి? నకలుకు మరో నకలు తయారుచేయించి యుద్ధశాఖకూ, ఇండియన్ వ్యవహారాలశాఖకూ పంపుతాను." నకలుకు నకలు, నకలు నకలుకు - బాగుంది. షుర్జ్‌కు నవ్వు వస్తున్నది. ఇదే ప్రభుత్వమంటే. అంతా జర్మన్ దేశీయుల తరహాలో తయారవుతున్నది. వేనవేల నకళ్ళుతీయించి, పంపగలిగిన చోటికంతా పంపితే, ఫలితమే ముంటుంది? ఎందు కుండదు? కనీసం ప్రతి ఒక్కడూ ప్రతి ఒక్కదానినీ చదువుకొంటాడు.

షుర్జ్ ముక్కు పొడుగ్గా చివరకూచి తేలివుంటుంది. అతని కన్నద్దం ముక్కుమీదనుంచి జారిపోయి నివేదికమీద నిలద్రొక్కుకొన్నది. కొన్ని కొన్ని పదాలు చిత్ర విచిత్రంగా కనుపించసాగినవి. చేతిరుమాలు బయటికిలాగి తులోచ

నాలను శుభ్రపరచి ముక్కుమీద పెట్టుకొన్నాడు. మనస్సు క్రమబద్ధంగావుంది. కార్యదర్శిని పిలిచాడు. వచ్చినతర్వాత డార్లింగ్టన్ గురించి ప్రస్తావించాడు.

"నికల్సన్‌గారు ఏదైనా కబురు పెట్టారేమోనండి," అన్నాడా కార్యదర్శి.

" కావచ్చును."

కార్యదర్శి ఒక జాబు పట్టుకవచ్చాడు. కాని యిది అదికాదు.

"డార్లింగ్టనయ్యా డార్లింగ్టన్. అంటే చెయిన్నీ అరాపహో ఇండియన్ల ఏజన్సీ," అని దీర్ఘాలు తీస్తూ వివరించాడు కార్యదర్శికి. ఇవేకాదు, తనకన్నో ప్రదేశాలు బాగా గుర్తెరుకేనని షుర్జ్ గర్వం. అతనికి ఐదు దేశాలు అరచేతిలో వుంటై - కాదు మెదడులో వుంటై. మైదానాల కొకరంగు, కొండల కొకరంగు, ఫీఠ భూముల కొకరంగు - యిట్లా బొమ్మలు బొమ్మలుగా. నదులు తిరిగే మలుపులు, ఎగుడు దిగుళ్ళు, దూరభారాలు, అన్నీ దేశపఠంలో మోస్తరు మెదడులో తయారుగా వుంటాయి. ఫొటోలోవలె అసలుకు నకలుకు కించిన్మాత్రమైనా భేదం లేకుండా, యథాతథంగా విడి విడిగా యీ ఐదు దేశాల గురించి సాకల్యంగా అతనెరుగును. చిననాడు జర్మనీలో మారుమూలల కుగ్రామంలో తాను జలదారిలోగుండా ఎగ్రాకుతూ ప్రాకుతూ చివరకు ప్రాష్యాదేశపు సిపాయి పాదాలకు ముఖాముఖి అయిందీ గుర్తువచ్చింది. ఆ సిపాయి చూడలేదు కనుక సరిపోయింది కాని చూస్తే చంపి వుండేవాడు. ఆ విప్లవకాలంలో ఎందరు చనిపోలేదు? ఆనాడు తాను సిపాయి చేతిలో చనిపోయేవుంటే, జర్మనీ, స్విట్జర్లాండు, ఫ్రాన్సు, స్పెయిను దేశాల గురించి తనకేమీ తెలియకపోయేది. బ్రతికి బయటపడబట్టి యీదేశాల చిత్ర పటాలాన్నీ తన మెదడులో యింకా చెక్కుచెదరకుండా వున్నట్లుంది.

ఆలోచన కంతరాయం కలిగించాడు. తిరిగివచ్చిన కార్యదర్శి ఈసారి కావలసిన లేఖనే పట్టుకవచ్చాడు. దానిని చదివి, యుద్ధశాఖనుండి వచ్చిన లేఖసరసలో పెట్టాడు షుర్జ్. ఇప్పుడంతా చక్కగా సవ్యంగా వుంది. ఇక లేఖ ఫైలులోకి పోవచ్చు. ఆ ఫైలు మరోనూరుఫైళ్ళలో ఒకటై, దుమ్ముకొట్టుకొని బూజుపట్టిపోతుంది.

అనేకానేక సేనానులకు, కల్నళ్ళకు, మేజర్లకు షెర్మన్ సేనానిపంపిన వుత్తర్వులను పరిశీలిస్తూ, "ఇదొక్కటే కాబోలు దారి," అనుకొన్నాడు షుర్జ్. ఎంతకొట్టుకొన్నగాని మిజ్జూర్ గుర్తు రావడంలేదు. చెయిన్నీపలాయితు లెక్కడ వుండవచ్చో కూడ సరిగా వూహించ లేకపోతున్నాడు. తగాదా మనుషులు విచ్చలవిడి బ్రతుకు, కటికిగుండెలు, - మా చెడ్డ మనుషులీ చెయిన్నీలు. యుద్ధం తప్ప వేరొకటి తెలియదంటుంటారు వీళ్ళనుగురించి తరచు, కాని యిది విశ్వసనీయం కాదు. హత్యలతోటే ఎవరూ తృప్తిపడరు. అటువంటి విపరీతమానవులే

వుంటే, వాళ్ళకు ఆటుబిడ్డలమీద మమకారా లుండవు. అటువంటివాళ్ల వంశాలు వాళ్ళతో బాటే గోరిలపా లౌతాయి.

వెయ్యిమైళ్ళ మేరలోవున్న స్వస్థలాలకు పోవలనని దృఢంగా శిశువుల వలె అమాయకంగా సంకల్పించుకొనిన యీ మూడు వందలమంది చెయిన్నీలను గురించి యింకా తెలిసికోవలెననే ఆశక్తి అతిశయించింది. అంత హాడావుడిగా కొంపకొట్టుకొని పోతున్నట్లు షెర్మన్ వుత్తర్వు లిచ్చివేయడం షుర్జ్‌కు ఏమంతనచ్చలేదు. తానూ ఒకప్పుడు సేనలో పనిచేసిన వాడే. సైనిక మనః ప్రవృత్తికూడ తెలియక పోలేదు. కాని తుపాకి గుండు ఒక్కటే సర్వరోగ నివారిణి కాదు. డార్లింగ్టన్ కాగితాల కట్టను ఓపికగా తిరగవేయసాగినాడు. రెండుగంటలపాటు తదేకంగా చదివాడు. కాని చిట్టచివరకు తాను చేయగలిగిందేమీలేదని నిర్ణయించుకొన్నాడు, మరుసటిరోజు వుదయమే షెర్మన్‌గారిని చూడాలనుకొన్నాడు. షెర్మన్ చేసిందే బాగుంది, చట్టాన్ని ధిక్కరించినవాడిని, శాసనోల్లంఘనం చేసినవాడిని శిక్షించక తప్పదు. దండించక తప్పదు.

ఇతర వ్యాపకాలు కారణంగా, అనుకొన్నట్లు షెర్మన్‌ను కలవలేదు. డార్లింగ్టన్ కాగితాలకట్ట బల్లమీదవుంది. మరుసటిరోజు పదకొండు గంటలవరకు వాటిగురించి షుర్జ్ పట్టించుకోనేలేదు. ఇంతలో మంత్రివర్గ సమావేశానికి త్వరగా పోవలసివచ్చింది. పోతూపోతూ, ఆ కాగితాలు గుర్తుకురాగా, ఏదో విధంగా వీలుచిక్కించుకొని షెర్మన్‌తో మాట్లాడవలెననుకొన్నాడు.

మంత్రివర్గ సమావేశం వెంటనే జరగలేదు. అందరూ హాజరయ్యారు. కాని అధ్యక్షుని రాక ఆలస్యమయింది. యుద్ధశాఖ కార్యదర్శి మెక్రారీ వూరికే చేతిగడియారం వైపుచూచుకొంటూ గంటలు లెక్కించుకొంటూ కూర్చున్నాడు. కారల్ షుర్జ్ చుట్ట కొనకొరికి నోటబెట్టుకొన్నాడేగాని అగ్గి ముట్టించలేదు. ఇక పోస్టుమాస్టర్ జనరల్ వెనుక సాగినాడు.

భోజనం వడ్డించారు. ఏవేవో వంటకాలు చేశారు. కాని అమెరికా వారి తిండి షుర్జ్‌కు బొత్తిగా సరిపడలేదు. రుచీపచీ లేదు. ఆకలిని తీరిస్తేనా సరా? ఏదో పరధ్యానంగాతప్పిపోయిన దానిని దేనినో తిరిగి పట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నవాడి ధోరణిలో భోజనం పూర్తిచేసి, కాఫీ సేవిస్తూ, చుట్టముట్టించాడు.

"సాయంకాలం వరకూ యిక్కడే వుండవలసి వచ్చేటట్లుంది," అన్నాడు మేక్రార్ ఎంతో కష్టంగా.

చుట్టమీదనుసి ఎక్కువ అవుతున్నది. ఉన్నట్టుండి షుర్జ్ తన అసంతృప్తికీ, తపనకూ మూలకారణాన్ని వెదకి పట్టుకోగలిగాడు. అట్టార్నీ - జనరల్ అయిన డీవెన్స్‌తో, "మీరు హాక్నీ - సాన్‌బోర్న్ సంధి జ్ఞాపకముందా?" అని అడిగాడు. తన ఆలోచనలకు వేయి యోజనాల దూరానవున్న యిటువంటి విషయాన్ని గురించి తటేల్మని ఎవరైనా అడిగితే, మనం కంటగించుకొంటాము.

డీవెన్సుకూడ కొంత కంటగింపుతోటి తింటున్న వాడల్లా షుర్జువైపుగా తలెత్తి వూరికే అట్టే చూచాడు. డీవెన్సుకు షుర్జ్ అంటేనూ, అతని కలుపుగోలు తన మంటేనూ, చొరవ అంటేనూ, చివరకు షుర్జ్ చూచేతీరు అంటేనూ యిష్టంలేదు.

"మీకు బహుశా అది గుర్తు వుంటుంది. అరవై అయిదులో జరిగింది" అన్నాడు షుర్జ్ తిరిగి.

"ఇండియన్లతో జరిగినదాని విషయమా ?"

"అవునవును, అరవై అయిదులోనే ఆ సంధి జరుగుత" అన్నాడు ఇవాన్స్ సంభాషణలో కల్పించుకొని, ఇవాన్స్ ఆంతరంగిక శాఖామంత్రి !

షుర్జ్ తన ఆలోచనల నన్నిటినీ కూడగట్టు కొంటున్నాడు. అతనికి సంధి చాలమట్టుకు జ్ఞప్తికి రాసాగింది. దాని సారాంశం మరేమీలేదు. పడమట నల్ల మలలూ, రాకీపర్వతాలూ మొదలు చేసికొని తూర్పున ఎల్లోస్టోన్ నదివరకు వుండు కొని, పౌడర్ నదీజలాలచే తడుపబడుతూవున్న సమస్తభూభాగాన్నీ ఇండియన్లు నిరాక్షేపణగా హక్కుభుక్తాలతోటివాడుకో వచ్చునని 1865 లో అమెరికా ప్రభుత్వం అంగీకరించింది. అక్కడవున్న యిండియన్లలో చెయిన్నీలు, సియో క్సులూ అధికసంఖ్యాకులు.

"మీ అభిప్రాయం కావాలి. వివరాలక్కర లేదులెండి. కాస్సేపు కాల క్షేపమైనా అవుతుంది," అన్నాడు షుర్జ్.

డీవెన్స్ భుజాలెగుర వేశాడు. "ఆసంధీగింధీ బుట్టదాఖలా అయిపోయింది" అన్నాడు.

"అదెట్లాగా వీలవుతుంది ?"

"అనాగరకులతోటి ఎప్పుడో పదమూడేళ్ళ క్రిందట చేసుకొన్న సంధి అ ప్రస్తుతమే కాకుండా అ ప్రధానంకూడా."

"సంధి చేసుకొన్నది మనమేకదా!"

"దానికి చెల్లుబడీలేదు, చట్టబద్ధంగా గుర్తింపూలేదు."

"లేదూ ?"

"ఆనాడు ఇండియన్లపట్ల మన వైఖరిని సూచించడానికే పనికివచ్చింది తప్ప అదేమీ శాసనంకాదు."

"అటువంటి సంధి చెల్లదనడానికి న్యాయశాస్త్రానికి చెందినంతమట్టుకు మూడు ముఖ్యమైన వాదాలున్నాయి. సర్వసత్తాక రాజ్య మొకటి మరొక సర్వ సత్తాక రాజ్యంతోటి సంధి చేసుకొన్నప్పుడు, రెండు రాజ్యాలు సర్వసత్తాకాలుగా మనగలిగినంత కాలమే ఆ సంధి ఆయుష్కాలం. సర్వసత్తాకాన్ని గురించి వివరాలలోనికి పోనక్కరలేదు. ఎప్పుడో అనాదికాలంలో తాము వుంటూవచ్చిన భూమిమీద యీ యిండియన్లకు సర్వాధికారాలు వుండినవని మాటవరసకను కొన్నాగాని, వాళ్ళిప్పుడు ఆ భూమిలో సర్వాధికారులు కారు. తమ తమ

నెలవులనుండి తరుమగొట్టబడినారనే సత్యమొక్కటే చాలు, వాళ్ళకు సార్వభౌమాధికారం సర్వసత్తాకం లేదని తేటతెల్లమయ్యేందుకు. ఇంతకంటె సాక్ష్యం వేరక్కరలేదు.

“మరి రెండో వాదం వినండి. మైత్రీ సంబంధాలున్నంత మేరకే ఆ సంధి ఆయుర్దాయం పరిమితమై వుంటుంది. ఇండియన్లు ఏనాడైతే కయ్యానికి కాలు దువ్వినారో, ఆనాడే ఆ సంధి హతమైపోయింది. నిజానికి—”

అటార్నీ - జనరల్ వాక్యం పూర్తిచేసేలోపల అధ్యక్షులవారు విజయం చేశారు. మంత్రులందరూ లేచి నిల్చున్నారు. “దయయుంచి కూర్చోండి, కూర్చోండి,” అన్నాడు అధ్యక్షుడు హేయస్.

ఆ సమావేశంలో యెక్కువసేపు రైలుబాటలు గురించి వ్యయమయింది. అధ్యక్షుడు ఎంతో యిరకాటాన పడివున్నాడు. ఎటుచూచినాగాని దగా, లంచగొండితనం, అవినీతి, యిచ్చినమాట తప్పడం, తప్పుడు నడతలు నడవడమేగాని మరొకటిలేదు. ఈ సందడిలో తిరిగి మరొకసారి కారల్ షుర్జ్ డార్లింగ్టన్ విషయం మరచిపోయాడు. డీవెన్సుగారు చెప్పబోయే మూడవవాదాన్ని వినవలెననే కుతూహలం మాత్రమే మిగిలిపోయింది. తల వేడెక్కి, ముఖంకంది, కోపానికి గొంతుకంపించి, ప్రస్తుత వివాద విషయాలలోపడి తల మునకలయ్యేసరికి, ఆ కుతూహలంకూడ మరపున పడిపోయింది. తిరిగి ఆఫీసుకు వచ్చేటప్పటికి, డార్లింగ్టన్ కాగితాలమడుపు బల్లమీదలేదు. లేదని అతను గుర్తించనూలేదు.

తిరిగీ యీ విషయాన్ని కెలికినవాడు “న్యూయార్క్-హెరాల్డు” పత్రికకు వాషింగ్టన్ నగర ప్రతివేదకుడయిన జాక్సన్. అప్పటికే రెండురోజులు గడచిపోయాయి. ఆంతరంగిక వ్యవహారాలశాఖా కార్యదర్శి యీలోగా సమస్తం మరచిపోయాడు. ఒకప్పుడు షుర్జ్‌కూడ పత్రికలలో పనిచేసినవాడే. ఇప్పటికీ చాలా పత్రికలు తిరగవేసే అలవాటుంది. పత్రిక అనేది ఎట్లావుండాలో షుర్జ్ నడిగితే చాలా చెప్పగలడు. అమెరికాలో పత్రికలు త్రోసివేయ వీలులేనంతటి స్థానాన్ని ఎట్లా గడించుకొన్నాయో, పోనుపోను వాటిశక్తి ప్రబలిపోగలదో ఆలోచించుకొంటేచాలు, షుర్జ్ భయభ్రాంతుడై పోతాడు. అంత పలుకుబడి సంపాదించిన పత్రికలు నిరంకుశత్వానికి, అబద్ధాలకు, ద్వేషానికి, దురభిమాన దుశ్చింతలకు వూడిగంచేసే తొత్తులైనప్పుడు, వాటి సహజ ధర్మమే తీరున వికృతమై భ్రష్టమైనదీ అతనెరుగక పోలేదు. అమెరికాలోనే పుట్టి పెరిగినవారు స్వదేశానికున్న అపరిమితావకాశాలూ మహాద్భుతశక్తులపట్ల అంధులని, తనవలె కాందిశీకులై శిక్షలనుండి నిరంకుశత్వపు బారినుండి పారిపోయి వచ్చినవారికే యివి మానస దృగ్గోచరం కాగలవనీ అతనినమ్మిక, పత్రికాస్వాతంత్ర్యమనేది వారికి మామూలే కాని తన బోటివారికో, అది నిప్పులనెగజిమ్మే ఖడ్గం.

పత్రికలవాళ్ళువస్తే వారితో మాటాడడమంటే యిష్టమే. మరి జాక్సన్ వంటివారితో. అమెరికా మూడువేల మైళ్ళ వెడల్పున విస్తరించుకొని యావత్ప్రపంచమంతా విశాలమైన దనుకొనే వాళ్ళలో జాక్సన్ ఒకడు. "న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్" అంటే షుర్జ్ మెచ్చుకోని రోజులేదు. తప్పులుండవచ్చు; అవి శతాధికాలు కావచ్చు; తొట్టతొలిపుటలోనే అత్యంత నికృష్టమైన ప్రకటన ప్రచురించుకోవచ్చు కాని జేమ్స్‌గార్డన్ బెన్నట్ జరుపుతున్న పత్రికా యుద్ధాలలో నిర్భీతితోబాటు సత్యానురక్తికూడ వున్నది; జాక్సన్‌వంటి ప్రతివేదకులను పంపి, నిండుమనస్సుతో వారు దేనిని వ్రాసిపంపితే దానిని నిర్భయంగా ముద్రించగలిగినది బెన్నెట్ ఒక్కడే. ప్రతివేదకులు నిక్కచ్చిగా, కటికగా నిరుద్రేకంగా పంపినవార్తలు చదవడానికి వుద్రేకజనకాలౌతాయి.

జాక్సన్‌ను చిరునవ్వుతో ఆహ్వానించాడు షుర్జ్. జాక్సన్ పొడగరి, బక్కపలచటివాడు, బట్టతలవాడు, రూపసికాదు: ఇతన్ని చూస్తే అబ్రహాం లింకన్ గుర్తుకు వస్తాడు.

"మీరు నాకోకథ యివ్వగలరు, కార్యదర్శిగారూ; అన్నాడు వచ్చీరాకమునుపే, జాక్సన్. షుర్జ్‌ను కార్యదర్శిగారూ అని పిలవడమితనికొక అలవాటై కూర్చున్నది. షుర్జ్‌కు ఈ పిలుపు బాగానచ్చింది. మాతృదేశ స్మృతులను పునరుజ్జీవింప చేస్తుం దీ సంబోధన. జర్మనీలో పోస్టుమాస్టరును హెర్‌పోస్టు మాస్టరని, పోలీసుజవానును హెర్‌పోలీస్‌మన్ అనీ, ప్రతివాడి వుద్యోగపు పేరుకు ముందొక హెర్‌ను తగిలించి పిలవడమనేది మామూలు.

"అట్లాగా?", అన్నాడు షుర్జ్ చిరుగ్గా నవ్వుతూ.

"ఇండియన్లు తిరిగి యుద్ధపథాన బడినారని మాట్లాడడం మీకు కంటగింపుగా వుంటుందని నాకు తెలుసు. కాని కాన్సాస్ రాష్ట్రంలో యుద్ధపరిస్థితులు రాజుకొంటున్నా యంటున్నాడు బెన్నెట్.

"అయితే యుద్ధశాఖకు వెళ్ళిరండీ" అన్నాడు షుర్జ్, తన హాస్యశక్తికి మురుసుకొంటూ.

"పోయే వస్తున్నాను. వాళ్ళంతా ఏకగ్రీవంగా అంటున్న దేమిటంటే శాంతి సర్వత్రా రాజ్యం చేస్తున్నదట. ఎవరో నలుగురు ఇండియన్లు తప్పత్రాగి అల్లరికి దిగివంత మాత్రాన శాంతికి భంగమేమీ వాటిల్లదట."

"భేష్‌భేష్. ఇంకేం?"

"ఇంకేమంటారా? నాకు వేడివేడి వార్తలు కావాలి. కొన్సాస్‌లో మన సైన్యాలకూ, ఇండియన్లకూ పోట్లాట జరిగిందని నాకు విశ్వసనీయమైన కబురు వచ్చింది.

"సర్వాబద్ధం! అర్థంలేదు!"

"చెయిన్నీలు," అని చెప్పాడు జాక్సన్. షుర్జ్‌కు యిప్పుడు డార్లింక్టన్ వుదంతమంతా గుర్తువచ్చింది.

"ఆఁ? మరేమీ ప్రత్యేకమైన విషయమేమీ కాదు. చెయిన్నీలు కొందరు పారిపోయారు. స్వస్థలానికి ప్రయాణం కట్టారట. బుద్ధిచెప్పి తిరిగి తీసుకొని రావడానికి మిలిటరీ పోలీస్‌బలగం పోయింది. అంతే!"

"ఎందరు వాళ్ళు?"

"మూడు వందలు మట్టుకే. అందులో ఆడంగులూ, పిల్లాపీచూ మినహా యిస్తే పోట్లాట చేయగలిగినవారు బహుకొద్దిమంది అయివుంటారు. మీకు తెలుసు కదూ, వాళ్ళు శరవేగాన పోగలరు."

"మీరు చెప్పింది గుడ్డిలో మెల్లన్నట్లు నాకు కాస్త పనికివస్తుంది".

"గోరంతను కొండంత చేయడమెందుకు గాని తమందరికీ కేటాయించ బడిన రిజర్వేషన్లలో ఏ గడబిడా లేకుండా వుంటున్న వేలాది ఇండియన్లగురించి ఎందుకు రాయకూడదు మీబోట్లు? ఇండియన్ జాతి సమస్తానికీ, ఒక కొత్తజీవిత విధానాన్ని ప్రభుత్వ మేవిధంగా యేర్పాటుచేయడానికి ఒక్కతరంలోనే అనాగరకులను నాగరికులను చేయడానికి ఎన్నితంటాలు పడుతున్నదో వర్ణించడేం? ఇంత పెద్ద ప్రభుత్వ యంత్రాంగంలో ఎక్కడో ఏదో బిస బెడిసి కొట్టిందని యిప్పుడు తాపత్రయపడుతున్న మీలాంటి వాళ్ళందరూ ఇంత వరకూ ఏమైపోయినట్లు? ఇండియన్లను గురించి యిప్పుడు జాలి ఒలకబోస్తున్న వాళ్ళందరూ ఇప్పటివరకూ కిమన్నాస్తిగా వుండినా రెందుకని?"

"మనుషుల కొట్లాటలే మాకు వార్తలు."

"కొట్లాటలా? వాళ్ళు నూర్గురికి మించిలేరు. ఆశ్వికదళాలు వాళ్ళను మరల్చడానికి వెళ్ళాయి, ఇక కొట్లాటలెక్కడ వున్నట్టు!"

"ఇదంతా జరిగి ఎన్నిరోజు లయింది?"

"రెండు - రెండేం, మూడురోజులై పోయింది."

"అయితే యిప్పటికి అంతా సాంతమై వుండాలి."

"ఎంచేతకాదు?" అన్నాడు షుర్జ్ ముసిముసినవ్వు నవ్వుకొంటూ, "పల్లపు భూములలో పోట్లాటలు అని తెలిసీ తెలియడంతోటే, బహుశా మీరు పెద్దపెద్ద రాణువలు దండుపోతున్నట్లు, సైనిక విన్యాసాలు, సంఘర్షణలు, మోహరింపులు, బాహాబాహీ యుద్ధాలు పరంపరగా జరిగిపోతున్నట్లు భావి స్తున్నారేమో. భగవంతుడి దయవల్ల అటువంటి యుద్ధాలు అమెరికాలో మరి వుండవు. అమెరికాకిక యుద్ధా లుండవు. మతితప్పిన ఇండియన్లను మళ్లగొట్టటమే యుద్ధంకాదు. రైలుబండిని దొమ్మీ చేసేవాణ్ణి పోలీసులు వేటాడం వంటిది మట్టుకే. వాళ్ళను రిజర్వేషనుకు తీసుకువస్తాం. యుద్ధాల పొడకిట్టని సేద్య గాళ్ళుగా తయారుచేస్తాం. బాగుందా?"

"లేకపోతే నీటిచుక్క ఒక్కటైనా పుట్టని డ్రై టోర్టుగాస్‌కు పంపి వేస్తాం ?"

"ఛీ ఛీ, మీరు పొరబడుతున్నారు. మేమంత దుర్మార్గులం కాం."

"కాకపోవచ్చు. కాని ఎందరు ఇండియన్లు ఆయన చెరలో ప్రాణాలు విడవలేదు ?"

"ఇండియన్లే యేం ? తెల్లవాళ్ళుకూడ అక్కడ చనిపోయారు. ఇది నిజంగా అవమానకరమైన విషయమే. అటువంటి కటికనరకాన్ని బందిఖానాగా మార్చడం ఘోరావమానకరమని నే నెరగనూ ? కాని అన్నిలోటుపాట్లూ అనుకున్న పళాన్నే తొలగిపోవు. కొంతకాలం పట్టుతుంది. ఒక ముసాయిదా చట్టమని, ఒక తీర్మానమని, కమిటీలో తర్జనభర్జనలనీ, వోటుతీసికోవడమనీ, శాసనమనీ వుండాలి. ఇదే ప్రజాస్వామ్య మంటేను."

జాక్సన్‌కు నవ్వు వచ్చింది.

"పైపు ముట్టించండి. విస్కీపోస్తాను. రావడం కథతో వచ్చి పోయేటప్పుడు కథలేకుండా పోవడమనేది బాగాలేదు" అన్నాడు షుర్జ్ వ్యంగ్యంగా.

"నే నక్కడికి పోయివచ్చాను" అన్నాడు జాక్సన్. విస్కీ త్రాగేశాడు.

"ఎక్కడికి ?" అని అడిగాడు షుర్జ్.

"ఇండియన్ ప్రదేశానికే."

షుర్జ్ అతనివైపు తేరిపార జూచాడు. జాక్సన్ తొణకనుకూడాలేదు.

"వేసవిలో" నన్నాడు జాక్సన్.

"ఊఁ!"

చాలసేపు నిశ్శబ్దం. చివరకు జాక్సన్ పోవడానికి లేచాడు. సులోచనాలు తీసి షుర్జ్ అదేపనిగా తుడవసాగినాడు.

"వాళ్ళ యిళ్ళు చేరాలంటే ఎంతో దూరం పోవాలి" అన్నాడు జాక్సన్.

"వాళ్ళ స్వస్థలమేది ?"

"నల్లమల లనుకొంటాను" అన్నాడు షుర్జ్, తలయెత్తకుండానే.

"ఒకసారి పోయానక్కడికి."

"మీరు సర్వాంతర్యాములు గాదూ ?"

"సర్వాంతర్యామిని కానుగాని యిటూ, అటూ తిరిగినవాణ్ణే. నల్లమలలమీద నాకు బలంగా మోజు పుట్టింది. ఎప్పుడూ పర్వతసీమలో మసలలేదేమో వాటిమీద నాకెంతో యిది. అమెరికాకు దీనివల్ల ఎంతో మంచి కలగనున్నది అనుకొన్నాను."

"అవునవును," అన్నాడు షుర్జ్, యిక పోవచ్చునన్నట్లు కంఠస్వరం మార్చి."

"మీరన్నది వాస్తవం. వాళ్ళు వున్మాదులై వుంటారు. వదలివచ్చిన స్థలానికి పోదలచుకొన్నది వేయి మైళ్ళ యెడాన వుంటుంది."

"ఉన్మాదులేనేమో," అన్నాడు షుర్జ్ కటువుగా. "కథ చెప్పలేకపోయి నందుకు విచారంగా వుంది. ఉన్న వాస్తవమాత్రం యిది: యుద్ధమనేది లేనే లేదు. మీరు యుద్ధంగురించి రాస్తేమట్టుకు బాగుండదు. ఇండియన్లకు మేలు చేయడ మెట్లాగా అనేదే మేము నిత్యమూ పడుతున్న మథన. దీనిగురించి దేశానికి తెలియాలి."

"జాక్సన్ వెళ్ళిపోయాక, షుర్జ్ అట్లాగే కూర్చుని వుండిపోయాడు. జాక్సన్ మీద నేకాదు, తనమీద తనకే కోపం రాసాగింది. మరెందుకోగాదు. సంభాషణలో ఓరిమి కోల్పోయినానే అని. నిజానికి యిదంతా ఒట్టిది. జాక్సన్ చీకటిలో బాణాలు విడుస్తున్నాడు. ప్రతివేదకులకిది మహాదురలవాటయింది. ఎవడైనా మనసువిప్పి మసిలాడా, వాడు బాధపడకతప్పదు. ప్రత్యేకించి యీ సంఘటన గురించి వ్రాయదగిందేమీ లేదు. రేపో మాపో సర్వం సమాప్త మవుతుంది. ఇట్లా సమాధాన పరచుకొన్నాడే గాని, షుర్జ్ అక్కడే అట్లాగే కూర్చునివుండిపోయాడు. కొన్నిగంటల తర్వాత ఒక గుమాస్తావచ్చి నంతవరకూ శూన్యాన్ని చూచుకొంటున్నాడు.

"ఏమైనా పని చెబుతారండి?," అని అడిగాడు గుమాస్తా.

"ఊహూఁ –"

"సెయింట్ లూయీనుండి ఫ్రీలింగ్ గారు వచ్చి కూర్చునివున్నారు."

"అట్లాగా?"

"నిన్న వారిని రమ్మని కబురు పెట్టారండీ తమరు."

"మంచిది. లోపలికి రమ్మను. షెర్మన్ గారితో మాట్లాడడానికి వస్తున్నానని కబురు పెట్టు."

* * *

షెర్మన్ సేనాని నివసిస్తున్న సాధారణ గృహానికి పోతూపోతూ, షుర్జ్ తిరిగి తనలో తానే నవ్వుకొన్నాడు. బహుకొద్దిమంది మాత్రమే షెర్మన్‌తో చనువుగావుంటారు. అత్యధిక సంఖ్యాకులకు అతను జార్జియారాష్ట్ర విజేతగా స్ఫురిస్తాడు. ప్రపంచం సమస్తం యుద్ధ కళావిశారదుడని నమోవాకా లర్పిస్తుంది. కాని షెర్మన్ మహా నిరాడంబర జీవి.

షెర్మన్ ఎదురు వచ్చి షుర్జ్‌తో కరచాలనంచేసి లోపలికి తీసికొని పోయాడు. ఇద్దరూ చుట్టలు ముట్టించి, కాగితాలగుట్ట పడివున్న బల్ల కిటువైపొకరు, అటువైపొకరు ఆసీనులైనారు. పిచ్చాపాటీ మాట్లాడుకొన్నారు. నేల మీదంతా చుట్ట నుసి పడసాగింది. చిట్ట చివరకు, షుర్జ్ ప్రస్తుత విషయానికి సంభాషణను మరల్చినాడు. మిజ్నర్ నివేదిక నకలుప్రతిని పట్టుకొనే వచ్చాడు.

దానిని షెర్మన్‌గారి బల్లమీద వుంచాడు. షెర్మన్ ముఖం సందహాసాంచిత మయింది. "ఓహో, యిదా?", అన్నాడు.

"నన్ను చూచిపోవడానికి యీ వేళ పత్రికా విలేఖరి ఒకడు వచ్చాడు. మహా మేధావి. కాన్సాస్ రాష్ట్రంలో ఇండియన్ యుద్ధం జనుగుతూవుందా అని ప్రశ్నించాడు."

చప్పుడు చేయకుండా నవ్వాడు షెర్మన్.

"ఈ పాటికి అంతా ముగింపై వుంటుందని అనుకొంటున్నాను. అయిపోయి వుండాలి" అన్నాడు నెమ్మదిగా షుర్జ్.

"అయిపోయినట్లే," నన్నాడు షెర్మన్.

"అయితే వాళ్లు లొంగిపోయినట్లేనా ?"

"అనుకొంటాను. అక్కడ, యిక్కడలాగా పదినిమిషాల కొకసారి తంతి వార్త పంపేవాళ్ళు లేకపోయిరి. షెరిడాన్ వద్దనుండి యీ వేళవచ్చింది" అంటూ షుర్జ్‌చేతికి ఒక కాగితం యిచ్చాడు. షుర్జ్ దానిని చదవసాగినాడు:

"ఫిల్ షెరిడాన్ సేనానికి పోప్ సేనాని వ్రాయడం, 1878-సెప్టెంబరు.12;

ఉత్తరాది చెయిన్నీల దారి నడ్డేందుకు ఈ క్రింద పేర్కొనబడిన చర్యలు తీసికోవడమైనది: ఇండియన్లు ఆర్. ఆర్. ను తూర్పునుండిగాని పడమటినుండి గాని దాటబూను కొన్నట్లయితే వాళ్ళను అడ్డుకొనేందుకుగాను, రేపు స్పెషల్ ట్రెయినులో నూర్గురు అశ్వారూఢులైన కాల్బలపు సైనికులు పాలెస్ దుర్గానికి పోతారు. హేస్, వాలెస్‌ల నడుమ కాన్సాస్ - పసిఫిక్ ఆర్. ఆర్. మీద మామూలుగా ఇండియన్లు దాటే రెండు స్థలాలవద్ద కాపుండే నిమిత్తం, రెండు పదాతిదళాలను ఈ వేళ సాయంకాలమే హేస్ దుర్గానికి పంపుతున్నాను. రెనో దుర్గంనుండి బయలు వెడలిన అశ్విక దళాలు రెండు ఇండియన్లను వెన్నాడుతూ వున్నవి. త్వరలో వారికి బాసటగా మరొక అశ్వికదళం పోగలదు. లరూన్ దుర్గంలోని సైన్యాలను తమకు తూర్పు పడమరల బాటలను వేయికళ్ళతో చూస్తుండమని తాఖీదులు పంపడమైనది. ఇండియన్లు కంటబడిన వెంటనే, వాళ్ళు లొంగుబాటు కాని పక్షంలో, దెబ్బతీయమని వుత్తర్వు చేయడమైనది..."

కాగితాన్ని కిందబెట్టి, "ఎలుకలబోను తయారయింది," అన్నాడు షుర్జ్.

"పోప్ ఏ పనిచేయబూనుకొన్నా సమగ్రంగా చేస్తాడు."

"నిజం. పత్రికలవాళ్లు యీ సైనికసంచలనాన్నిబట్టి యుద్ధం వస్తున్నదని వూహించి వుంటారు."

షెర్మన్ భుజాలెగురవేశాడు. "పనీ బాటా లేకపోయినట్లయితే మనుషుల బుద్ధులు వక్రిస్తాయి. నేడో రేపో ఇండియన్ల లొంగుబాటు వింటాం."

"నేనూ అదే ఆశిస్తున్నాను," అన్నాడు షుర్జ్. "ఇంతకూ వాళ్ళు బ్రతికి బయటపడితేగదా?"

"తగినశిక్ష పొందుతారు. మన సైనికులను పదిమందిని చంపగలరేమోగాని, వాళ్లు వంశనాశన మౌతారు. ఇండియన్లంటే నేను దయతలచను. ఏళ్లైఏళ్ళ క్రితమే వీళ్ళను తుడిచిపెట్టివుంటే, దేశం హాయిగా వుండేదన్నాడు."

"బహుశా—"

"జీవాలతో బయటపడగలిగిన ఇండియన్లను స్త్రీలేగాని మగవరుగాని, అందరినీ మందకట్టి డ్రైటోర్టుగాస్ చేరవేయమని సేనాధిపతులందరికీ వుత్తర్వు చేశారు."

"టోర్టుగాసా ?"

"పితూరీని మూలమట్టంగా పెకలించివేస్తే, పీడ విరగడైపోతుంది. కఠిన చర్యలు తప్పవు. కాని అవే సత్ఫలితాల నిచ్చేవి."

"ఊఁ ?"

"లేకపోతే, అగ్గిరవ్వ రాజుకొంటూనే వుంటుంది".

"అవునవును," అన్నాడు. షుర్జ్ మెత్తబడి "ఈ వార్తలు పత్రికల కెక్క నీయ కూడదు. ఇండియన్ల పునరావాస పథకం యీ మూకుమందలమంది దుస్సాహసులవల్ల చెడిపోవ వీలులేదు...ఇక్కడ హాయిగా వుంది."

"చల్లగా వుంటుంది."

"ఏమిటీ నే నంటుండింది ?...ఈ దేశమంటే నాకెంతో అభిమానం. మీరు తెలియకపోలేదు. తిరిగి జర్మనీకి వెళ్ళిపోతారా", అని అడుగుతుంటారు నన్ను కొందరు. ఇరవయ్యేళ్ళ క్రిందటనే ఆ ఆలోచన అంతరించిపోయింది నాలో. అది మీ మాతృదేశంకదా అంటారు. జన్మనిచ్చినంత మాత్రాన ఏదేశమూ మాతృదేశం కాదు. ఏదేశాన తాను స్వేచ్ఛగా మసలగలడో అదే ప్రతివానికీ మాతృదేశ మవు తుందని నా అభిప్రాయం. ముసలివాణ్ణయ్యాను. కాని యీ అభిప్రాయం మార లేదు: సామాన్యంగా వృద్ధాప్యం పైకొనేకొద్దికీ మనుషులలో మంచి క్రమ క్రమంగా అంతరిస్తుంది. స్వేచ్ఛాసౌఖ్యాలపై యవ్వనంలో వుండిన ఆసక్తి వృద్ధాప్యంలో కుళ్ళి పోతుంటుంది."

"మీరు రెండోవైపు చూడటంలేదు. వృద్ధాప్యమే మనిషికి జాగరూకతను, స్థిమితబుద్ధినీ, వివేకదృష్టినీ ప్రసాదిస్తుంది."

"కావచ్చునేమో. కాని అప్పటిలాగ నే నీనాడు బేరికేడ్లమీద నిలిచి పోరు సలపగలనా ? మీ మాటకువస్తే, ఈనాడు మీరు జార్జియా హృదయాన్ని చీల్చు కొని దండు నడపగలరా ? స్వేచ్ఛఅనే అర్థమిచ్చే ఫ్రీడమ్ అనే మాటకు వ్యుత్పత్తి ఏమిటో యెరుగుదురా మీరు ? పురాతన కాలంలో ఇంగ్లాండులో పెత్తనం చేసిన ఆంగ్లో - సాక్సనుల భాషలో పుట్టిందీ 'ఫ్రీడం' అనేమాట. "ఫ్రీ", "డూమ్" అనే రెండు వేర్వేరు మాటలు కలగలిపి "ఫ్రీడం" అయింది. ఫ్రీ అంటే స్వేచ్ఛగా, డూమ్ అంటే నాశనం. దాస్యానికి బదులు ఆత్మవినాశనానికైనా

పూనుకొనే హక్కు అని మొదటి అర్థం. ఏ మానవుణ్ణికూడ దాసుణ్ణి చేయలేము. ఎందుచేతనంటే, దాసుడై బ్రతకడంకంటె స్వేచ్ఛగా మరణించడం మేలనుకోవచ్చు వాడు. తనను తానై చంపుకొనే హక్కును వాడినుంచి తొలగించగలిగిన వాడే వాడు మనకు దాసుడు కాగలుగుతాడు. వాడి ఆస్తిపాస్తులు, మానమర్యాదలు, ఆచారసంప్రదాయాలు అన్నీ నామరూపావశేషాలైనాలేకుండా విధ్వంస పరచవచ్చునేమోగాని, స్వయంవినాశన స్వత్వాన్నిమాత్రం వాడినుంచి వైదొలగించలేము."

"బాగుంది, చాలా బాగుంది. కాని దాస్యమనేది అసలు లేదనగలరా మీరు ?" అని అడిగాడు షెర్మన్.

"నేననేది మరేమీలేదు. ఇండియన్ ప్రదేశంలోనే ఈ వ్యవహారాన్ని మనం చక్కబెట్టుకోవచ్చు. అటువంటప్పుడు వీళ్ళను మూకుమ్మడిగా డ్రైటోర్టుగాస్ చెరపాలుచేయడమెందుకూ అని ?"

"ఇండియన్లు తర్కానికి, హేతువాదానికి సర్దుబాటయ్యే రకంకాదు."

"కారూ ? మనకు వాళ్ళు వుద్రేకులుగానూ, వున్మాదులుగానూ, దుస్సాహసులూ, మూర్ఖులూ, పట్టిన పట్టు విడవని వాళ్ళుగానూ కనిపిస్తారు. కాని మనమనుకొన్నంత మూర్ఖులు కారు. స్వస్థానానికి పోవాలనికోరికయింది - పోతున్నారు. ఉత్తరానికి సుదీర్ఘ ప్రయాణం చేస్తున్నారు. ఇది మనకు అసాధ్యమనిపించవచ్చుగాని వాళ్ళకు సాధ్యమనిపిస్తుంది. ఇంటికి తిరిగిపోవడమెంత దూరభారాలతో కూడిన పని అయితే మట్టుకు, ఇంటికి పోవడం మానుకోగలడా మనిషి అనే వాడు ?"

"ఈసారి మానుకొని తీరాలి." అని షెర్మన్ అనగానే, షుర్జ్ పైకిలేచి, కరచాలనం కావించి, బయలుదేరి పోయాడు. షెర్మన్ కొంచెందూరం సాగనంపినాడు. మెట్లెక్కిపోతూవున్న షుర్జ్‌ను చూస్తూ, ఇతను యింత మెల్లగా అడుగుమీద అడుగుమోపి నడుస్తున్నాడేమా, అని అబ్బుర పడసాగినాడు.

"వాళ్ళ చేతికి బేడీలు పడగానే మీకా సువార్త తెలియచేస్తాను", అన్నాడు షెర్మన్ వెనకనుంచి. కాని కారల్ షుర్జ్ కిది ఏమీ వినిపించలేదు. ఆలోచనా ప్రపంచంలోపడి, సిద్ధాంతరీత్యా అపసవ్యమైనది ఆచరణలో సవ్యమెట్లా కాగలదని ఆశ్చర్యపడసాగినాడు.

# పశుపాలకులూ - ఇండియన్లూ

## సెప్టెంబరు 1878

డ్రాజ్ నగరానికి కెప్టెన్ ముర్రేచే పంపబడిన సిపాయి పంధొమ్మిదిసంవత్సరాల వయసువాడు. న్యూజెర్సీ గ్రామీణ సీమనుండి వచ్చినవాడు. పొడగరి. కేరట్ దుంపవంటి తల. గుర్రానికి మోస్తరు కోలముఖం, ఎండకు కందిపోయి వుంటుంది. అందరూ అతనిని "ఎర్రవాడు" అంటారు కాని అసలు పేరు ఇఛాబాద్. అతని పూర్వీకులు హాలెండు దేశమునుండి యిక్కడికి వలసవచ్చినవాళ్లు. వారిపొలం పేటర్సన్‌కు యింకా అవతలే వున్నది. తరతరాలనుండి యితని వంశీయులు పరమప్రశాంతంగా, సాగుబడి చేసుకొంటూ, పేటర్సన్ దాటి ప్రయాణాలు చేసే అలవాటు లేనివాళ్ళు. రూకలను పోగుచేయడమే జీవితానికి పరమాశయం వారికి. ఎటుపోయి ఎటువస్తుందో ననే భయమేలేదు. ఎందుకంటే పుష్కలంగా కూడబెట్టారు. ఈ కుటుంబంలో పేటర్సన్‌దాటి ప్రయాణించినవాడు యితగాడే. పితూరీదారు, దుస్సాహసి యితడే. చివరకితడుకూడ, తనను సిపాయిగా మార్చగలిగిన మానసికాందోళనను చూచి దిగ్భ్రమ చెందేవాడు.

అతని కిప్పుడూ ఇంటిధ్యాసే. అక్కడయితే హాయిగానూ, ఏలాంటి ప్రమాదం లేకుండానూ వుంటుందని, యిక్కడవలె అరకడుపుతో మాడనక్కర వుండదని అనుకొనేవాడు. నల్లరేగడి నేలతాకిడి ఎంతహాయి గొల్పుతుంది! పంటపైరు వాసన లెంతమత్తు గొల్పుతాయి! ఆహా, జెర్సీ రాష్ట్రవాసుల సహవాసం ఎంత ప్రేమాస్పదం! మాసాలూ, సంవత్సరాలూ క్రమించేకొద్దికీ చూడజూడ మనసవుతూన్న అందకత్తె, తన బందుగురాలు, నీలికళ్ళచిన్నది, నిండారిన అవయవ పరిపుష్టశోభావతి, అయ్యో, చూపునకుకూడ దూరమైపోయిందే! ఒంటరితన మతనిని పోటుబంటును చేసింది; తగవులమారినిగా మార్చింది. పొడవాటి, చదునైన కండరాలతనివి. అందుచేత గాలిమరవలె ఫెళ్లుఫెళ్ళుమనే కొరడా తోలుకొసవలె ఝుళిపించిన పలచటి కత్తివలె అత్యంత లాఘవంతోటి పోరులో యెగబడగలిగేవాడు. గెలుపూ, ఓటమీ రెండూ అనుభవించాడు. తన వెండ్రుకలరంగు ఎర్రన. కనుక తాను విధిగా పోట్లాడవలసిందే.

చెయిన్నీలను ఆశ్వికదళాలు వెన్నాడటంలో కల్లబొల్లి కయ్యాలుకాక, అసలు సిసలు యుద్ధం జరుగుతుందని ఆశించాడు. ఆ వూహాకే భయంపుట్టుకొని రాసాగింది. ఒకరిని చంపడమెందుకు, ఒకరిచేతబడి చావడమెందుకు అనుకోన సాగినాడు. గాయాల బాధతో మూల్గడమంటేనూ, నెత్తురులోద్పృడమంటేనూ సామాన్యమా? పూర్వం ఇండియన్లతోటి పోట్లాడి అనుభవసంపదతో మరలి వచ్చిన ముసలి సిపాయిలు చెప్పిన కథలన్నీ జ్ఞప్తుకు వస్తున్నాయి. భగవంతుని దయ తనపై ప్రసరిస్తున్నందుచేతనే, తాను అకాల మృత్యువునుండి బయటపడి, ముర్రేగారిచేత అనుజ్ఞాతుడై, డాడ్జ్ నగరానికి వస్తుండడం సంభవించినదని నమ్మసాగినాడు. తిరిగి అక్కడికి పోయేటప్పటికి ఇండియన్ల ప్రమాదం పైదొలగి వుంటుందనికూడ నమ్మిక జనించింది.

ఒక్క ఏడాది కిటీవల అతనికి యెటుపోవడానికీ స్వాతంత్ర్యంలేదు. అది యిప్పుడు సంప్రాప్తమయింది. చావు కోరలనుండీ బయటపడి, విశాలమైన మైదానాల సీమలో ఒంటరిగా నిశ్చింతగా రాగలగడమంతా విధి విలాసం! తనకు దారి తెలుసునని అబద్ధాలు చెప్పాడు. పశువుల కాలిబాట వంటిపెట్టుకొని రీడర్ వరకు రాగలిగాడు. కోల్డువాటర్ దగ్గరికి వచ్చేటప్పటికి తిరిగి ధైర్యం రెక్కొన్నది. తన దిరుసు గర్వదాయకమైనది. పదిమందీ తనను గౌరవ దృష్టితో చూస్తున్నారు. మానార్క్ పానశాల బయట గ్లాసెడు బీరు త్రాగి, క్రొత్తగా వుత్పన్నమైన ఇండియన్ యుద్ధాన్నిగురించి సాకల్యంగా, సగర్వంగా, చుట్టూ మూగినవారికి చెప్పుకొని పోతున్నాడు.

“మీకేం భయంలేదు. ఆ ఇండియన్ల మడిమల త్రొక్కుకొని మనవాళ్లు కూడ పోతూవున్నారుగా! వాళ్ళున్నంతసేపూ మీకేం భయంలేదు.”

కోల్డువాటర్ అనే బస్తీలో వుత్సాహోల్లాసాలు ఏ కోశానా కనుపించవు ఇండియన్లు దూకిపడినా చలించని బండసరుకు యిక్కడిజనం. కాని దీనికెగువనున్న రీడర్‌లో తనకథ వినిన వాళ్ళందరూ మండిపడి శివమెత్తి ఇండియన్లను హతమార్చేందుకు రణంచేయ సిద్ధమైనారు. తననెంతో గౌరవించి నాలుగు గదుల యింటిలో బసపెట్టారు. జనసేనను సమీకరించాలని త్వరపడ్డారు. కాని అది మాటలతోటే ఆగిపోయింది. తెల్లవారి, తాను రీడర్‌నుండి బయలుదేరే సమయానికి, యిద్దరు ఆశ్వికులు తనతోబాటు డాడ్జ్‌వరకు పనిమీద వస్తున్నామన్నారు. వాళ్ళవి అగ్గిబంతులవంటి కళ్ళు. తోడుంటారు లెమ్మనుకొన్నాడు. ఒకనిపేరు సట్టన్. వరొకడు మేగ్రాత్. కోల్డువాటర్ దిగువ, ఒక ఆసామీదగ్గర, పశుపాలకులుగా వుంటూవచ్చారు. నౌకరీ వూడిపోయిందో, లేక తామే చాలించుకొని వచ్చేస్తున్నారో తెలియదుకాని, ఆ ఆసామీపట్టుకు లుచ్ఛాముండాకొడుకని యిద్దరూ ఒక్కగొంతుతో నిర్ధారించి చెప్పారు. నడుముచుట్టూ పిస్టళ్లున్నాయి. మురికిగుడ్డలు, మూడురోజులుగా క్షవరంచేయక ఎదిగి మాసినగడ్డాలు

భయంకరస్వరూపులు. ముగ్గురూ జోరుగా గుర్రాలను దౌడు యెత్తించిపోయారు. పోనుపోను సంభాషణ మందగించింది. మధ్యాహ్న సమయాన ఒకచోట సేద తీర్చుకొన్నారు. తన తిండిని వాళ్ళకుకూడ కొంత పెట్టుతానన్నాడు సిపాయి.

"వద్దు వద్దు; కాని తాగేందుకేమైనా యిప్పిస్తే పుచ్చుకొంటాను;" అన్నాడు మేగ్రాత్.

"నాదగ్గర ఏమీలేదే. బహుశా నిన్నరాత్రి కాస్త బలంగా పుచ్చుకొన్నట్టుంది మీరు," అంటూ సిపాయి నవ్వాడు.

"ఏయ్ సిపాయీ! నీ ముక్కు పోనుపోను పొడుగెక్కుతున్నట్టుందే, కాచుకో" అన్నాడు సట్టన్.

కాని వేనెస్ట్ ఇచాబాద్ - అతనే, ఆ సిపాయి! — నవ్వులాటలు మానలేదు. ఈ రకంగా వీళ్ళను మంచిచేసుకోవాలను కొన్నాడు. వాళ్ళతో కయ్యానికి దిగితే ముప్పు. వాళ్ళుచూచే తీరుగాని, పిస్తళ్ళు ధరించిన తీరుగాని అతనికి అదురు పుట్టిస్తుంది. చెయిన్నీలను గురించి జోరుగా మాటలాడసాగాడు.

"ఇండియన్ల పీచమడచేవాళ్ళను నేను చూశాను. దీనికి సేన పనికిరాదు. చిలుంపట్టిన దమ్మిడీవిలువ పనికూడ మీచేతగాదు," అన్నాడు మేగ్రాత్.

వేనెస్ట్ భుజాలెగురవేశాడు. అమ్మయ్య అదిగో డాడ్జ్ నగరం!

"పోదాంపద, సిపాయ్!" అన్నాడు సట్టన్.

మరొక గంటసేపటికి రైలుబాట చేరుకొన్నారు. దానిప్రక్కనే గుర్రాలను పడమటగా పోనిచ్చారు. ఉక్కగావుంది. దక్షిణాన మబ్బులు గుమికూడుతున్నాయి. నేల మిర్రుఅయింది. మిర్రెక్కి దిగితే వున్నదే డాడ్జ్! ఇక్కడి మైదానాలలోని పొట్టి పచ్చికగుండా నగరం వుండీలేని ఎండమావివలె కనుపిస్తున్నది. రైలుబాట ప్రక్కగా ఎన్నో లెక్కలేని యిళ్ళు అరలరలుగా వరసగా వున్నాయి. గోడలుమట్టుకే పూర్తిఅయి, కప్పుగాని, పూతగాని లేనియిళ్ళు. వాన జల్లు కొట్టకుండా వుండేందుకై, ద్వారబంధం నుండి బయటికి ఏటవాలు పలక లున్న యిళ్లు. ఈ ప్రెయిరీ మైదానసీమలోని యితర నగరాలకూ, డాడ్జ్ నగరానికీ వున్న ముఖ్యమైన భేదమేమిటంటే, మనుష్యులు నివసిస్తున్న స్థలమనిపించు కొనేందుకు యిందులో ఏగుర్తులూ కనిపించవు. ఇళ్ళు భవంతులు, వూరి వెలుపల పొలాలు — యివేమీ అగుపించవు కాన్సాస్ రాష్ట్రానికి. పొట్ట అనేది ఒకటివుంటే, ఆ పొట్టమీద లేచిన నల్లని కణిత యీ డాడ్జ్ నగరం. ఒకపెద్ద మచ్చ. మొదటినుండి క్రమక్రమంగా వర్ధిల్లలేదు. రాష్ట్ర సరిహద్దులలో వున్న యితర నగరాలవలె మహావేగంతోటి పైకి వచ్చినదీకాదు. ఒకప్పుడు యిక్కడ ఏమీలేదు. రైలుబాటతోబాటు డాడ్జ్నగరం కూడ పుట్టుకొచ్చింది. తీరూ తెన్నూలేక, క్రమమూ పథకమూలేక, ఎటుబడితే అటు, పీకెలు పీకెలుగా పెరిగింది. మరి, జనం

మాటుకువస్తే, గాలి కబురు మోసుకొని పోతే విని యేగబడినట్లుగా, వచ్చి చేరింది. ఇళ్ళనిపించుకోనేవే! తక్కువగాని బుజాలు రాసుకొంటూ బారు బారుకు ఒక పానశాలలా, జూదపు కొంపలా, సానివాడలా, - ఒక టేమిటి! ఈ డాడ్జ్ నగరాన దిన రాత్రాలభేదమే తెలియదు; అవి పట్టువిడని కౌగిట యిమిడి పోయివున్నా యిక్కడ. ఈ నగరం కూడలి. దక్షిణాదినుండి ఛిషోల్మ్ బాట వెంబడి టెక్సాస్‌రాష్ట్రపుపశువులు యిందాకవచ్చి, సాంతేఫే రైలుబాటమీదుగా తూర్పుకు బదిలీ కావాలి. మరి, టెక్సాస్ రాష్ట్రాన రాటుదేరి చేయి తిరిగిన పోకిరి మూకలు ఎన్నో వందలమార్లు అంతర్యుద్ధాలు చేసిన కజ్జా మారులు వచ్చేటప్పుడు ద్వేషాన్ని వెంటబెట్టుకొని వచ్చి, దాని నిక్కడ నెత్తుటితో, విరిగిన యెముకలతో కలగలిపినారు. కెనడా నుండి మెక్సికో వరకు గల అనంతమైన ప్రెయిరీ బయలు సీమలో యీ టెక్సాస్ దుండగులు అన్ని రకాల అల్లరి చిల్లరి మూకలతో కల గలిసిపోయారు. మురిగి కుళ్ళు కంపుకొట్టే బర్రె తోళ్ళతోటి బర్రెగొడ్డు వేట గాళ్ళు వచ్చేవారు. విస్కీ వ్యాపారులకు డాడ్జ్‌నగరం ప్రధాన కార్యాలయ మయింది. ఇక్కడినుండే ఇండియన్లకు తుపాకులను, తీపి సారాను, వాళ్ళ చేర వేసేవారు. ఇతర దేశాలనుండి వచ్చిన వినోద యాత్రికులు డాడ్జ్ నగరాన్ని దర్శించక తిరిగిపోరు. అమెరికాకు పోయి వచ్చినందుకు యీ నగర సందర్శనం చిరంతన స్మృతులను కలిగిసుంది. పని బాటలుచేస్తూ, నిర్మిస్తూ, కుటుంబ జీవనం గడుపుతూ, గతమనేది ఏదీ లేని కడనే భవిష్యత్తును సృష్టింప కృషిచేస్తూవున్న దృశ్య సంపుటాన్ని దేనినీ చూడకుంటేనేమి, ఢమ ఢమలాడే తుపాకి ప్రోతలనూ, బూట్‌హిల్ వైపు శవపేటికల వెంబడిపోయే జనులనూ - చూసేవుంటారు. కాబట్టి అమెరికాను అంత త్వరగానూ, తేలికగానూ మరచిపోలేరు.

డాడ్జ్‌నగరం ఒక మైలు దూరాన వున్నప్పటికే, ఎర్ర వెంట్రుకల సిపాయికి దాని వాసన రాసాగింది. ప్రెయిరీ బయళ్ళవాసనను పోగ్రోలుతూ, ఘాటుగా వున్న నగరవాసన వ్యాపించింది. కొవ్వువాసన. రుచి సన్నగిల్లిపోయిన బీర్, చెడి పోయిన విస్కీ, రైలుబాట ప్రక్కల యిరవై ముప్ఫై అడుగులెత్తున రాసిపడిన బర్రెతోళ్ల కుళ్ళుకంపు - దుర్భర మనిపిస్తూవుంది. అతనికి దగ్గువచ్చింది. సట్టన్‌కు కక్కువచ్చింది.

"అబ్బబ్బా! దేవుడా, నాకు త్రాగేందుకేమైనా అవసరం," అన్నాడు సట్టన్. ముందు వీధి ఆగభోగంగా వుంది. పానశాలలు కూడ అంతే. పైగా, అపరాహ్నం మొదలయింది కూడాను. అశ్వాసీనులు నగరంలోకి, వెలికి వస్తూ పోతూ, ధూళి రేపుతూ వున్నారు. గుర్రాలొక దానికొకటి సమీపానికి వచ్చి నందువేత, నెమ్మదిగా పోవలసివచ్చింది. వేనెస్ట్‌కు యిదంతా కొత్త ప్రపంచము లాగుంది. భయం వేస్తున్నది. దీని ముందు తాను అల్పుడైనట్లు భావించాడు. కాని సైనిక దిరుసు వున్నంతకాలం ఎలాంటి ముప్పూ వుండదు.

మూడవ పానశాల దగ్గర మేగ్రాత్, సట్టనులు వేసెస్ట్‌దృష్టి నుండి ఎటో తప్పి పోయారు. అమ్మయ్య, అనుకొన్నాడు. అబ్బ, ఎన్నెన్ని పానశాలలు! తాను కనివిని యెరగనన్ని. చూస్తూపోతున్న వాడల్లా ఎవరో పిలిచిన పిలుపుకు వులిక్కిపడి చూచాడు. అలావో పానశాలవద్ద మేగ్రాత్, సట్టన్‌లు గుర్రాల మీదకూర్చుని, పిడోక్కలు మాటలు అంటున్నారు.

ఇంతలో లేడీగే థియేటరు కళ్ళబడింది. థియేటరుగోడమీద ప్రచారపత్రం చదవసాగినాడు. లండన్, పేరిస్, న్యూయార్క్ నగరాలను దిగ్భ్రమలో ముంచెత్తిన ఎడ్డీఫే నృత్యగాన ప్రదర్శనము, అని వుంది. ఒక్కరాత్రి సెలవు దొరికితే ఎంత బాగుండును! ఇవన్నీ మానిపోయి, తన మిత్రులకు రోజుల తరబడి కథలల్లి చెప్పవచ్చుగదా! తానెందుకు హుటాహుటిగా పోవాలి? కొంప ఏం మునుకొని పోతుంది? ఇక్కడినుంచి సేన తరలిపోయే లోగానే, చెయిన్నీల వ్యవహారం అక్కడ పూర్తిఅవుతుంది. కాని తాను వార్తాహరుడు. ఉద్యోగధర్మం వుల్లంఘించరాదు.

వింతలన్నీ చూడకపోతినే అనే విచారములో, వేసెస్ట్ ఇఖాబాద్ డాడ్జ్ నగరాన్ని వదలిపెట్టి, నాలుగుమైళ్ళలో వున్న డాడ్జ్‌దుర్గానికి బయలుదేరి పోయాడు. అదే సైన్యస్థావరం. పోయినంతసేపూ, ఆ రాత్రికి తనకు శెలవు యిస్తారో నిరాకరిస్తారోనని తపనపడ సాగినాడు. ముర్రే గారు కోరిన సైన్యదళం వెనువెంటనే బయలుదేరుతుం దేమో కొంపదీసి! ఆc! సైన్యంసంగతి తనకు తెలియదూ? అంతా మందగొడి వ్యవహారమే గదూ?. అనుకొంటూవుంటే సంతోషాతిశయానికి నవ్వు రాసాగింది. తాను దుర్గాన్ని చేరుకోవడమే బాగా ఆలస్యమైనట్లయితే, రాత్రికిరాత్రికి వాళ్లు కదలబోరు కాబట్టి, ఉదయంవరకూ ఫరవాలే దనుకొన్నాడు.

దుర్గావరణను ప్రవేశించేసరికి, తన ప్రాముఖ్యము తిరిగి గుర్తుకువచ్చింది. తనదగ్గర యీ పరమరహస్యం వున్నంతకాలం తనకు గౌరవం! కాని యీవరకే డాడ్జ్‌దుర్గానికి చెయిన్నీల పలాయన విషయం తంతికబురుద్వారా తెలిసిందని వినేసరికి, సిపాయి గర్వమంతా పటాపంచలైంది. చుట్టూమూగిన సిపాయిలు ఇండియన్లను గురించీ, అతని ఎర్రవెంట్రుకలు గురించీ ఏడిపించ సాగినారు. వీళ్ళకేం తెలుసు, అంతా పదాతిదళమే యిది! తానో ఆశ్వికదళమందలి సిపాయి! వీళ్ళందరూ తనకు తీసికట్టేనని ఖర్రబిగిసినాడు. ఈబిర్రు అట్టేసేపు నిలువలేదు. భోజనశాలలో మెత్తబడి, లేటీగే థియేటరుగురించి ప్రస్తావించాడు. మాటల మధ్య, సానికొంప లున్నాయా, అని ప్రశ్నించాడు. వాళ్లు యీ అలుసు తీసుకొని చిత్రవిచిత్రంగా కథలల్లి చెప్పసాగినారు.

"నీజన్మలో అట్లాంటి చక్కటి యిళ్ళకు, అన్నియిళ్ళకు పోయివుండవు. ఎర్రటి పట్టుతివాసిలూ...."

"నిజం ?," అని ఆత్రంగా అడిగాడు వేనెస్టు.

"ప్రమాణ పూర్తిగా. కాని నీ పాచిరూకలను లాంగుతారనుకొన్నావా యేమిటి ?," అని కవ్వించారు.

"నాదగ్గర యిప్పుడు జీతండబ్బంతా వుంది. శెలవివ్వాలేకాని! ఇవ్వరేమో, కర్మ ! ఎవరి నడగాలో కాస్త చెబుతారా ? ఆ ఆటపాటలు చూడాలని ఎంతో యిదిగావుంది నాకు. రెండేళ్ళబట్టి థియేటర్ ముఖమే కరువైపోయింది మరి."

"అసలెప్పుడైనా పోయివుంటేగా, ?" అన్నాడొకడు.

"ఓశ్ ! చెప్పొచ్చావుమహా," అని నవ్వాడు వేనెస్టు.

భోజనం పూర్తికాకముందే సార్జెంట్ ఒకడు వూడిపడి, భోంచేసిన వెంటనే కల్నల్ లీచ్‌ని కలిసికోవలసిందని హుకుంచేసి పోయాడు. మిగిలిన పదార్థాలను గుటుకు గుటుకున దిగమింగి, నిరుత్సాహముతోటి ఆఫీసర్ల భోజనశాలకు నడచిపోయాడు. అప్పుడే ఎముకలపులుసు వడ్డిస్తున్నారు. అది ముగించిన తర్వాతగాని కల్నల్ లీచ్ అతని రాకను గమనించ దలచుకోలేదు.

"కెప్టన్ ముర్రే దగ్గరనుండి వచ్చింది నువ్వేనా, ?" అని అడిగాడు లీచ్.

"చిత్తమండి."

"పేరు ?"

"వేనెస్టు అండి."

"ఏమని చెప్పాడాయన ?"

"డాడ్జ్ మర్గానికి పొమ్మనిమాత్రమేనండి."

"అక్కడ ఎప్పుడు బయలుదేరావు ?"

"నిన్న ప్రొద్దుటండి."

"ఎక్కడనుంచి ?"

"కాన్సాస్ లైన్ సమీపాన ఎక్కడోగాని ఖచ్చితంగా తెలియదండి."

"అంతే," అని తిరిగి కల్నల్ లీచ్ భోంచేయసాగినాడు. కాలు మార్చి కాలిమీద బరువాన్చి వేనెస్టు నిలుచునే వుండిపోయాడు. సార్జెంట్ వెళ్ళిపోయాడు. కల్నల్ గారు తన విషయమే మరచిపోయినట్లుండె.

ఉండమనిగానీ, పొమ్మనీగాని ఎవరూ చెప్పలేదు. కూర్చుని భోంచేస్తున్న ఆఫీసర్లందరిమీద అతనికి కోపంవచ్చింది. తన విషయమే ఒక్కరికీ పట్టలేదు. ఉన్నట్టుండి అతనికి యింటిగాలి మళ్ళింది. పదిహేనువందలమైళ్ళ దూరానవున్న జెరిసీ రాష్ట్రానికి వెళ్ళిపోవలెనని పిచ్చియెత్తసాగింది. థియేటరు, సానికొంపలు - అన్నీ మరచిపోయాడు. పారిపోవడం గురించే ఆలోచనలు రాసాగినవి. "రాత్రికి శెలవు మంజూరుచేస్తే, చల్లగా తప్పించుకొని, వీలైతే పశువుల రైలుబండియెక్కి వెళ్ళిపోవాలి" అని నిశ్చయించుకొన్నాడు.

కల్నల్ లీచ్‌గారికి వినిపించేలాగా, బల్లకు ఆ చివరకూర్చున్న కెప్టెన్ ఒకాయన గొంతెత్తి "చూస్తుంటే, డాడ్జ్‌నగరానికి ఏదో మూడుతుందేమో ననిపిస్తున్నదండీ" అన్నాడు.

"ఆఁ ?"

"వ్యవహారాలేమీ బాగాలేవండీ" అన్నాడింకొకాయన.

"ఈ పాటికి ముర్రే వాళ్ళను అడ్డివుంటాడు" అన్నాడు కల్నల్‌లీచ్. "లేకపోయినట్లయితే యీ పాటికి అతను కబురుచేసేవాడు. వాళ్ళు యీ వైపుగా వస్తుండి వుంటారు."

"అదే నేనంటున్నది. వాళ్ళు ముర్రేని ఓడించే వుంటే ?"

కల్నల్ భుజాలెగుర వేశాడు. మహాకాయుడు కాస్త మందం. క్రింది ఆఫీసర్ల మాటలుకూడ వినే ఓపికవుంది. "పౌరులు తలదూర్చడం నాకు సరిపడదు. కాని మెడిసిన్ లాడ్జ్ దాపుకు దళాన్ని చేర్చడానికి రెండు రోజులు పడుతుంది. ఏలాగో ఓలాగు, అప్పటికంతా పూర్తిఅయి వుంటుంది. ఇక్కడికి పడమటగా రైలుబాట మీదకూడ సేనలు వున్నాయిగదా మరి !"

"మీరు చెప్పిందంతా సవ్యంగానే వుందిగాని, వాళ్ళు ముర్రేగారి కనుగప్పి తప్పించుకొని వచ్చివుంటేనండీ?" అని సాతురుడైన మరొక కెప్టెన్ ప్రశ్నించాడు. మాంసలుడు. గుండ్రటిబుగ్గలు అతనివి. "నాదళాన్ని కంచరగాడిదలమీద దక్షిణానికి చేరవేస్తాను. వాళ్ళను బంధించకుంటేమానె, కనీసం దారి అడ్డగలం. ఆమాత్రం సాధిస్తే, నిజంగా గర్వించవచ్చు."

ఇతరులామోదించారు. "కాల్బలం కాల్బలంగానే వుండాలిగాని యిదేమిటి?" అన్నాడు కల్నల్ లీచ్.

"ఇంతకుమునుపు జరగనిదాయిది? మన మీపనిచేయకుంటే డాడ్జ్ నగరం మీద పడతారు వాళ్ళు. ఈ నగరంమీదికి వాళ్ళను రాకుండాచేయాలంటే యిదేదారి, అని మీకు తెలును."

"సరే కానీయండి," అని నెమ్మదిగా ఒప్పుకొన్నాడు లీచ్. "ఏమైనాగాని, మీరు ముర్రేనికలవాలి. అతనికెంతో అవసరం. కారణమేమిటో నాకు తెలియదుగాని భగవంతుడికే తెలిసివుండాలి. తనతోబాటు రెండుదళాలుండనే వున్నాయికదా, మరొకటి ఎందుకో అతనికి? అతనిని కలిసేపక్షంలో మీరు అతనికి లోబడి వుండాలి."

తన ఆలోచనలలో నిమగ్నుడై వుండికూడ వేనెస్ట్ యీ సంభాషణను ఆలకించాడు. పలాయన చింత యితోధిక తీవ్రమయింది. ఈరాత్రికే చేయవలెనని నిశ్చయించుకొనే సరికి, భయంతో గుండె సుత్తిదెబ్బలవలె కొట్టుకొనసాగింది. ఇంతలో కల్నల్‌లీచ్ పిలిచాడు, "సిపాయీ, యీరాత్రికేనువ్వు కెప్టెన్ సెడ్‌బర్గ్‌తోబాటు వెళ్ళిపోవాలి, మీ దళానికి చేరుస్తాడాయన నిన్ను."

అలా మోపానశాలలో మేగ్రాత్, సట్టన్‌లిద్దరూ విస్కీ తెమ్మన్నారు. ఒక్కొక్క పాత్రికకు సరిపోయే విస్కీ ఖరీదు ఏభై సెంట్లు. అయినా, ఒక్కొక్కరు సునాయాసంగా మూడు ఖాళీచేసినప్పుడే, నగరోపాంతస్థలంలో వాళ్ళకేర్పడిన అసహ్యాభావం ఉపశమించ మొదలైంది. కొద్దిగా తేలికపడ్డారు. ఎర్ర జున్నూ, కరకరలాడే బిస్కట్లూ మెసవసాగినారు.

"ఆకలిగావుందా?" అని మంచితన ముట్టిపడేటట్లు అమ్మకందారు అడిగాడు. "ఆకలిగావుంటే, పందితొడ మాంసమూ, కోడిగుడ్లూ తేనా?" ఇతగాడు తెగబలిసినవాడు. ఏటవాలు బుజాలు. బట్టతల, కోడిగుడ్డులాగా నున్నగా, రంగుపూసినట్లు తెల్లగావుంది. "లేకుంటే చల్లటి కోడిమాంసముంది" డాడ్జ్‌నగరంలో గొడ్డుమాంసం సర్వసామాన్యమైనదే కనుక అది పేర్కొనదగిన, ప్రత్యేకతగల్గిన కూర అనిపించడంలేదు. "ఇప్పుడే గుర్రాలమీద వచ్చినట్లుంది మిమ్మల్ని చూస్తే."

అవునన్నట్లు మిత్రులిద్దరు శిరఃకంపం చేశారు. మళ్ళీ యింకొకసారి విస్కీ సేవించారు. తిరిగి బిస్కట్లు; అవీ చాలనట్లు జున్ను.

"కోల్డు వాటర్‌నుంచి వస్తున్నారా?" అని అడిగాడు అమ్మకందారు.

"మేమెక్కడినుంచి వస్తే నీకెందుకు?" అన్నాడు సట్టన్.

"క్షమించండి, ఊరికే అడిగానంతే,"నని మెత్తబడ్డాడు.

"ఫరవాలేదు, ఏం ఫరవాలేదు," అని విశాలంగా నవ్వుతూ మేగ్రాత్ సర్దబెట్టినాడు. కంచం ఖాళీ అయినంతవరకు, సీసా ఖాళీ అయినంతవరకు తిని త్రాగినారు. కంచంలో అయిపోయిన వస్తువుల స్థానాన్ని భర్తీచేయడానికి వచ్చిన అమ్మకందారు తిరిగి మాటలకుపక్రమించాడు. "ఆ దారివెంబడి చెయిన్నీలు దాడీచేస్తున్నారని విన్నాను?"

"ఏమో!"

"కోడికూర పెట్టాను. యజమాని వచ్చేలోపల ముగించండి దయచేసి."

"భగవాన్, ఆ ఎర్రముండాకొడుకులను పేల్చివేయ మనసౌతున్నది నాకు," అన్నాడు సట్టన్.

అమ్మకందారు మరొక విస్కీసీసా యిచ్చినాడు. డబ్బు చెల్లించి మేగ్రాత్ బల్లవద్దకు వెళ్ళుతుంటే, "జున్నూ, బిస్కట్లూ తెస్తాను," అన్నాడు అమ్మకందారు.

"వాటికేం? తీసుకురా" అని మేగ్రాత్ వెళ్ళిపోయి సట్టన్ ప్రక్క కూర్చున్నాడు. ఎట్లాగైనా మత్తువస్తే బాగుండుననే పట్టుదలకొద్దీ తాగుతున్నట్లుంది సట్టన్ ధోరణి. కాని మైకం క్రమ్మడంలేదు. అతను రెండు తాగితే, మేగ్రాత్ ఒకదానితో సరిపుచ్చుకొంటున్నాడు. వాకిలిమీదే వున్నాయతని కళ్ళు; లోనికి వచ్చే ప్రతివాణ్ణీ పరకాయించి చూస్తున్నాడు. నెమ్మది

నెమ్మదిగా సట్టన్‌కు తూలుడు రాసాగింది...ఇది తెల్లవాడి రాజ్యంకావాలె. కాని యిప్పుడా విధంగాలేదు;" అన్నాడు.

"నిజం", అని మేగ్రాత్ ఆమోదించాడు. సట్టన్ మహాకాయుడు. అతను తప్ప త్రాగినప్పుడెప్పుడూ మేగ్రాత్ అన్నిటికీ ఔననడం మామూలు.

"సరే", నన్నాడు సట్టన్. మొద్దుబారిన చిరునవ్వుతో, "ఇండియన్ ఎవడైనా తల చొప్పిస్తే ఏంచేస్తానో తెలుసా?"

"ఏమిటి?"

"తల పుర్రె ఒక్కటే వుండేటట్లుకోసి పారేసి, దాన్ని సరిగ్గా నా మోచేతి మీద యిక్కడ కుట్టించి వేస్తాను" అంటూ, సట్టన్ ఖాళీ సీసా చేదాల్చి తిరిగి కొనడానికి పోతున్నాడు. మేగ్రాత్ అతని వెంటబడినాడు.

"కూర్చో యిక్కడ", అన్నాడు మేగ్రాత్.

"దేశమంతా నల్లులు పట్టినట్లు పట్టారు."

"రా! వచ్చి కూర్చో."

ఇంతలో ఎవరో ఒక పొడవాటివాడు, మట్టి వన్నె వెంట్రుకలవాడు, సట్టన్ చేతినితాకి, "ఏమండీ?," అని పిలిచాడు.

నిదానంగా మేగ్రాత్ వైపునుండి యీ వైపుకు మళ్ళినాడు సట్టన్. మేగ్రాత్ యథాస్థానానికి నవ్వుకొంటూ వెళ్ళిపోయినాడు. ఆ దీర్ఘకాయుడు ఎంతో సాతురమయిన కంఠ స్వరముతోటి, "వాళ్ళనెక్కడ చూచారండీ మీరు?" అని ప్రశ్నించాడు.

"ఎవళ్ళని?" అని యెదురు ప్రశ్నవేశాడు సట్టన్.

"చెయిన్నీలని."

"జీసస్ భగవాన్! నేను వాళ్ళను చూళ్ళేదయా, వాళ్ళు డాడ్జ్ వైపే వస్తున్నారు."

"మీకెట్లా తెలుసు?"

"జీసస్ భగవాన్! నాకెట్లా తెలుసూ!"

నలుగురూ చుట్టు చేరారు. వాళ్ళలో దృఢకాయుడు మంచి దుస్తులుధరించిన వాడు, నల్లటి వెంట్రుకలూ, మీసాలు వున్నవాడు, బహుశా ఏ పసులమంద ఆసామీయో, లేక జూదగొట్టో, యింజనీరో అయివుంటాడు, యితరులనుండి కేటాగానిలబడి, చిన్నచూపు ధ్వనించే గొంతుపెట్టి, ఏమయ్యోయ్, ఇండియన్లు నీకంట బడివుంటే, అంతా చెప్పెయ్," అన్నాడు.

"మేమొక సిపాయితోగూడ ప్రయాణం చేశాం. అతడనేచెప్పాడుమాకు" అన్నాడు మేగ్రాత్ తొందరపాటుతో.

"చెయిన్నీలు - ఎంతమంది?"

"వంశనాశనమై పోనూ- తెగ తెగ కదిలి వస్తున్నదట," అన్నాడు సట్టన్. గొంతెత్తి, ఆ మాటలే తిరిగి అన్నాడు.

"మీరెక్కడి నుంచి వచ్చారేమిటి?"

"మీకంత వెధవచచ్చిన అక్కరగావుంటే, రీడర్ నుంచి వస్తున్నాం" అన్నాడు సట్టన్.

"అక్కరేవుండవచ్చు" నన్నాడా మనిషి. సట్టన్‌ను ఆపాద మస్తకం తేరి పారచూస్తున్నాడు. సట్టన్ వురిమి చూచాడు. మేగ్రాత్ అతని కోటు రెట్టపట్టుకొని మెల్లిగా హెచ్చరికగా తాకినాడు. ఇంతలో ఎవడో పలచటివాడు బొత్తాలులేని వస్త్ర ధరించి వున్నాడు. ఏ గుమాస్తాయో, టెలిగ్రాఫ్ ఆపరేటరో అయివుంటాడు. ధైర్యం తెచ్చుకొని "ఇండియన్ల వెధవ వ్యవహారం గురించి రచ్చ చేయడమెందుకు?"అని సాగదీసి మందలింపుగా అన్నాడు. సట్టన్ కు అలుక రెచ్చి, ఒక్కత్రోపు త్రోసేసరికి, ఆ మందభాగ్యుడు అంతదూరాన పడిపోయాడు. అతని చేత తుపాకిగూడ లేదు. ఈ దుష్టులనుండి దూరం తొలగిపోవాలని పైకి లేవబోతుంటే, సట్టన్‌తో మొదట పేచీపడిన మాంసం శరీరుడు ముందుకువచ్చి, పడివున్నవానికి చేయూతనిచ్చి లేవదీసి బయటకు తీసుకొనిపోయాడు. ఆ దుర్బలుడు యింకా కంపించిపోతూ, "కృతజ్ఞుణ్ణి బ్లేక్‌గారూ," అన్నాడు.

"ఇటువంటి దుండగులు డాడ్జ్ నగరానికి యింకా కుళ్లు తెస్తున్నారు; వాళ్ళు చాలా కాలం మనరులెండి," అన్నాడా బలిసివున్న బ్లేక్.

"అతను ఇండియన్లను గురించి చెప్పింది నిజమేనండీ. ఈవేళ ప్రొద్దుటే తంతికబురు వచ్చింది," అన్నాడు దెబ్బతిన్నవాడు.

"యుద్ధ దాహ తోటి వస్తున్నట్టా ?"

"ఏమోగాని, రిజర్వేషన్‌నుంచే తప్పించుకొని పోతున్నారట. ఉత్తరానికి వెళ్ళిపోతున్నారని తెలిసింది. అంతకుమించి, ఎవరికీ ఏమీ అదనం తెలియదు. ఇండియన్ల విషయం వింటేనేచాలు, జనానికి మతిపోయి శివమెత్తుతుంది."

"వేట అంటేకూడ అంతే...ఇక నేను నా మందసాలకు వెళ్ళిపోవాలి."

"మూడు వందలమంది వుంటారు."

"జనసేన పూన్చడం అవసరమవుతుందేమో," అనుకొనసాగినాడు బ్లేక్. తన మందసాల, గుర్రాలు, పశువులు, ఆరువేల డాలర్లుపెట్టి కట్టిన యిల్లు – వీటి ధ్యాస యెక్కువయింది. "ఎటువైపు వస్తున్నారు?" అని అడిగాడు.

"అదే మనకు తెలియదు. పైగా నా వ్యవహారంకూడ కాదు. ఉందిగా దాపున్నే సేన."

"సేన! దగుల్బాజీ సరుకు. శుష్కదండుగ," అన్నాడు బ్లేక్.

"అట్లా అనకండి, బ్లేక్‌గారూ. సేన వుండబట్టే శాంతి భద్రతలు యింత మాత్రమైనా వున్నాయి. శాసనాలనేవి లేకుండడం కంటే ఏదోవక శాసనం

వుండడం బాగు. జనం బయలు దేరుతారనుకోండి. ఇండియన్లను అడ్డుకోందామని. ఏముంటుందంటారు ఫలితం? ఇండియన్లముందు మాకెందుకు పనికి రాగలవు?"

"తమ సంసారాలను తాము పదిలపరచుకోవాలిగదా," అన్నాడు బ్లేక్ పరధ్యానంగా.

"డాడ్జిలో సంసారాలా? సానికొంపలా?"

బ్లేక్ భుజాలెగురవేశాడు. ఇద్దరూ కలిసి వీధివెంబడి నడువసాగినారు. పత్రికా కార్యాలయం సమీపించగానే, టెలిగ్రాఫ్ ఆపరేటర్ శెలవు పుచ్చుకొని వెళ్ళిపోయాడు. బ్లేక్ అదికూడ గమనించనేలేదు.

అప్పటికి మధ్యాహ్నం దాటిపోయింది. డాడ్జినగర మధ్యానికి మనుషులు చేరుకొంటున్నారు. ఒంటరిగానూ, జతలు జతలుగానూ, గుంపులుగుంపులుగానూ గుర్రాలమీద వస్తున్నారు. అనేక ప్రదేశాలనుండి పియానో సంగీతం వినవొతున్నది.

బ్లేక్‌గారు షెరీఫ్ కార్యాలయం ప్రవేశించారు. కుర్చీలో చేరగిలబడి షెరీఫ్ కునికిపాట్లు పడుతున్నాడు. అతని పేరు బాట్ మాస్టర్సన్. లావుపాటిమనిషి. కఠినకాయుడు. తమ పూర్వీకులందరూ చేతులలో తుపాకులతో, బూటుకాళ్ళమీద నిలిచి పోరున చనిపోయిన వాళ్ళని సర్వకాల సర్వావస్థలలో గుర్తుకు తెచ్చుకొని బ్రతికేవాడు. షెరీఫ్ నౌకరి యింత చిన్న నగరంలో చెప్పుకోదగిన పదవికాదు. నగరాన్ని పరిశుభ్రపరిచి, మర్యాదస్తులు నివసించదగినట్లుగా తీర్చిదిద్దుతామని ప్రతియొక షెరీఫ్ డాబులు చెప్పుకొనేవాడు. కాని వయోధికుడైన బాట్ మాస్టర్సన్ ఒక్కడే దీనిని యథార్థ పరుపగలడనిపించేది.

షెరీఫ్ కార్యాలయంలో సంయుక్త రాష్ట్రాల మార్షల్ అయిన ఈర్ప్‌కూడ యీ సమయానికి వున్నాడు. మాస్టర్సన్ నిద్రపోతూవుంటే, ఈర్ప్, బ్లేక్‌లు మాట్లాడుకొన జొచ్చారు. ఇంతలో అతనూ మేల్కొని, చుట్టతీసి, కొసకొరికి వుమ్మివేసినాడు. అతను చేస్తున్న ప్రతి చిట్టిపనీ సాలోచనగానూ, జాగ్రతగానూ చేసినట్లుంది. అతని బ్రతుకే అలాంటిది. రేయింబవళ్లూ ప్రతి దృక్కోణంనుండి కూచినట్లుచూచి, పేర్చబడినట్లు వుంటుంది. వంగి, బ్లేక్ ముట్టించిన అగ్గిపుల్లతో చుట్ట ముట్టించుకొన్నాడు. ఈర్ప్‌గారిది వేరొక తత్వం. పోట్లాడుతున్న కోడిపుంజు ఎంత జాగరూకతతో వుంటుందో ఈర్ప్ అట్లే వుంటాడు. అతని చేతి వ్రేళ్ళు తుపాకిమీద ఆటాడుతున్నవి. మార్కెట్టు పరిస్థితులనుండి సంభాషణ త్వరలో ఇండియన్ల ప్రమాదానికి వచ్చింది.

"మీరుకూడ విన్నట్లుండే," అన్నాడు ఈర్ప్‌తోటి బ్లేక్.

"వినకేం? తప్పుతుందా వినక? చంపడానికి బర్రెగాని, డబ్బు చేసుకోవ

డానికి విస్కీగాని, దొంగిలించడానికి డబ్బుగాని కనుపించని ప్రతి అల్లాటప్పా ఇండియన్లతో పోట్లాడ్డానికి చంకలెగుర వేస్తాడు," అన్నాడు ఈర్ప్.

"ఎవరెవరి ఆస్తిపాస్తులను వాళ్ళు పదిలం చేసుకోవాలిగదా మరి!" అన్నాడు జ్లేక్.

"వాళ్ళింకా ఏ యింటినీ తగలబెట్టలేదుగా!"

"ఈవేళలాగే రేపుండగలదా?"

"సరే సరే! మీరు కావలసిందేమిటి? జనసేనా? ఈ చెయిన్నీ లెక్క డున్నారు? మీరు చూచారా? భగవంతుడా, ఈ రక్కసి బలగం ఎంతవుందో కదా? ఎటువైపు పోతున్నట్టు? అందరితో బాటు తుపాకి పట్టుకొని పోయి, అందిన వాళ్ళందరిని చంపండని నేనూ అరవగలను. కానీ ఎందుకు? ఇటువంటి పనులకు సత్ఫలితాలుండనే వుండవు. శాంతిని కాపాడడమెట్లాగా అనేదే నా ధ్యాస," అన్నాడు ఈర్ప్.

"వాళ్ళు వచ్చి వైబడినదాకా కాపాడండి," అని ఆక్షేపించాడు జ్లేక్.

"డాడ్జ్ నగరంలో శాంతి పరిస్థితులకు భంగంగానీయను, ఏమైనాగాని! ఇండియన్ల పనిబట్టేందుకు సేనలు వెళ్లి కొల్లగా వున్నాయి. మనకెందుకు వచ్చిన గొడవ!"

"సేనలువున్న దెక్కడోగాని ఇండియన్లు యీ పరిసరాల్లోనే వున్నారు" అన్నాడు జ్లేక్.

చాలసేపు మాట్లాడకుండా కూర్చున్నారు. తలుపు వెలుపల గుర్రపు డెక్కల చప్పుడు రాను రాను స్ఫుటమై, వున్నట్టుండి ఆగిపోయింది. రొతు రభటించుకొంటూ దురుసుగా లోపలికి వచ్చాడు. "హెల్లో, జిమ్మీ" అని ఈర్ప్ పలకరించాడు. ఈ ముఖం ఎక్కడోగాని జ్లేక్ చూచినట్లేవుంది.

"ఫుల్లర్ల భవంతి ముట్టడించారు"అన్నాడు రొప్పుతూ, ఆగంతుకుడు.

"ఎవరు ?"అని జ్లేక్ అడిగాడు.

"సేద దీర్చుకొని మరి చెప్పు జిమ్మీ" అన్నాడు ఈర్ప్.

"వాళ్ళే—వంశ నాశనంగానూ—ఇండియన్లు !"

జ్లేక్ ముఖాన చిరునవ్వు అంకురించింది. మాస్టర్ సన్ హుషారయ్యాడు. "కూర్చో జిమ్మీ ! ఏమిటి నువ్వు చెబుతున్నది ?"

"విన్నారుగా ! ఫుల్లర్ల భవంతి ముట్టడించి ప్రొద్దు పగలస్తం ప్రేలుపులు సాగించారు. లోపలివాళ్ళు లోపలే వుండగా, యింటికి నిప్పంటించారు."

"ఎప్పుడు ?"

"నిన్న రాత్రి."

"స్వయంగా చూసే చెబుతున్నావా ? లేక ?"

"నేను చూళ్లేదు. లెన్నీ చూశాడు. మేము మాగుర్రాలను దౌడెత్తించి

వచ్చేశాం. ఫుల్లర్ యింటికి పనిమీద పోతుంటే, లెన్నీకి ప్రేల్పులు వినిపించాయట. ఆగిపోయి, చెవులు పారబెట్టి వినేసరికి, కనీసం వెయ్యి తుపాకులైనా మ్రోగుతున్నట్లు అనిపించిందట. ప్రెయిరీ మంటలాగా యిళ్ళు కాలుతుంటే స్వయంగా మాశాడట."

"ఎక్కడా అది వుంట?" అని అడిగాడు బ్లేక్.

"మెడిసిన్ లాడ్జ్ ప్రక్కనే"

"కావచ్చు. అక్కడేవుంది మరి ఫుల్లర్లభవంతి" అని ఈర్ప ఒప్పుకొన్నాడు. "అయితే ఆ లెన్నీ దగ్గరకుపోయి ఎందుకు చూడలేదు? పాప్ ఫుల్లర్ ముసలివాడు. అతనిని చేజిక్కించుకోవాలంటే వాళ్ళు యుద్ధమే చేయనక్కరలేదే! నిజంగా ప్రేల్పుడు విన్నాడా?"

"దైవసాక్షిగా."

"ముండాకొడుకులు. ఉత్తపుణ్యానికే కాల్పులు సాగిస్తారు" అన్నాడు బ్లేక్.

మాస్టర్సన్ లేచినిలుచున్నాడు. బల్లసొరుగు దగ్గరకుపోయి తుపాకులు నడుముకు తగిలించుకొన్నాడు. "నేనటు పోయివస్తాను. మీరు దుర్గానికిపోయి వాళ్ళతో మాట్లాడండి. ఈపాటికి యీకబురు పాక్కివుంటుంది. తలబిరుసు సరుకంతా తెగబడి ఇండియన్లమీదికి వురకజూస్తుంటారు. వాళ్ళకు అండగా ఒకటి రెండు సైన్యదళాలుండడం మంచిది" అని ఈర్పతో చెప్పి వెళ్ళిపోయాడు.

*           *           *           *

విరిగిన దవడ నొకచేతితో తడుముకొంటూ, పత్రిక కార్యాలయంమందు కూర్చొనివున్న టెలిగ్రాఫ్ ఆపరేటరు, సంపాదకుడు సంపాదకీయాన్ని నేరుగా వ్రాతరూపంగా అచ్చుచేసేవానికి చెప్పుకొనిపోతుంటే వింటున్నాడు ఆపరేటరు పేరు స్టాన్లీగార్బర్గ్. ఈ వుద్యోగముతోబాటు అతను 'న్యూయార్కు టైమ్స్' పత్రికకు కాన్సాస్‌రాష్ట్ర విలేఖరికూడ. ఈ రెండవపని నిఖార్సయిన వుద్యోగం కాకపోవచ్చు. ఏదైనా మంచి ఘాటైనవిషయం తెలిసినప్పుడు, దానిని పత్రికకు పంపుతాడు. ఆ వ్యవహారం అంతటితో ఆగిపోక, చిలవలుపలవలు వేసికొనేటట్లయితే, పత్రికవాళ్లు నిఖార్సయిన పాత్రికేయుణ్ణి యీపనికి నియోగిస్తారు. అంతమాత్రాన, గార్బర్గ్ వ్రాసిన పత్రికావ్యాసాలు తోసిపారవేయ వీలులేదు. వాటి నాతడు అతి భద్రంగా పదస్తుగా చూచుకొంటాడు.

సంపాదకుడు చెప్పుకొనిపోతున్నాడు. అతనిపేరు ఆట్కిన్స్- గుడ్డల దుమ్ము విదిలించే బ్రష్‌వంటి మీసాలతనివి. వింటూ వింటూ, గార్బర్గ్ ఆలోచనలో పడిపోయాడు. ఈ అవకాశంవంటిది తన కితఃపూర్వం లభించలేదు; యికముందు లభించబోదు. అద్భుతమైన కథ పంపవచ్చు పత్రికకు. కాని తనకు యీ యిండియన్ల పలాయన వ్యవహారం నడుమ నడుమ కాలీలు

లేకుండా సాకల్యంగా తెలియదే, ఎట్లాగు? దాడి, ఎదురుదాడి, దెబ్బ, ఎదురుదెబ్బ, బయళ్ళసీమల్లో బొరియలేవీలేనివలవలె, అట్టహాసమేమీ లేకుండా వి విస్తరించుకొంటున్న సైన్యదళాలు - అంతా మహాద్భుతంగా వుంది. ఇండియన్లను గురించి తనకు బాగా తెలియదు. ఈ సమయంలో మనుషులు ఇండియన్లను గురించి తలకొక్కతీరుగా తమతమ యిష్టానిష్టాలు కలిపి కూర్పులు చేర్పులుచేసి కథ చెప్పుతుంటారు. తన వ్యక్తిగత విశ్వాస మేమిటంటే, ఇండియన్ యుద్ధాలనేవి గతకాలానికి చెందిపోయాయి. వాళ్ళ వ్యవహారం ఫైసలా అయింది. ఇప్పుడుప్పతిల్లినది వేరే వ్యవహారమై వుంటుంది, అని... ఇంతలో ఆట్కిన్స్ గొంతు శ్రుతిమించి రాగానపడగా, అతని ఆలోచనల కంతరాయం కలిగింది...

"...ఘోరమైన యీ భీతావహపునీడక్రింద మరెంతకాల ముండగలరు స్వతంత్రులైన అమెరికన్లు? తమ గృహాలు, ప్రియబాంధవులు, స్థిరచరాస్థులు అన్నీ మరెంత కాలమని 'ఎర్రముప్పు' వాతబడిపోతుంటే చూస్తూ వూరకొంటారు? ఇప్పటికే కాలాతీతమయింది! చాలు! విహ్వాలించి గుహవంటి నోరుతెరిచికొని పైబడ చూస్తూన్న ఆటవిక రాక్షసత్వాన్ని మేపడానికి యికపై ప్రియజనులను యేమాత్రము అర్పించబోము! ఉత్తిష్ఠత, జాగ్రత అని హెచ్చరిక చేస్తూ వున్నాము. లేచిరండి, శత్రువులను విధ్వంసించండి అని ప్రబోధిస్తున్నాము. డాడ్జినగరజనులారా, మీ గృహాలను పరిరక్షించుకొనండి, శాంతి స్వాతంత్ర్యాల నిమిత్తమై సాయుధులుకండి అని పిలుపిస్తున్నాము. తిప్పికొట్టండి! ఎదురు దెబ్బతీయండి! సర్వేశ్వరుని కోపానలము తమమీదికి వురికివస్తున్నదని శత్రువులు తెలిసికొనేలాగున వాళ్ళను దెబ్బతీయండి! తమకు కేటాయించబడిన స్థలాల పరిధులను దాటి మరి రానీకుండా మంచి గుణపాఠం నేర్పండి..."

ఈ మాటలకు గార్బర్గ్ మందహాసం చేశాడు. ఇవేమాటలు, ఇవే ఉద్బోధలు, యివే శాపాలు ఆట్కిన్స్ బర్రె వేటగాళ్ళమీద, తుపాకి ముఠాలమీద, విస్కీ వర్తకులమీద, టెక్సాస్ దుండగులమీద శతాధిక పర్యాయాలు ప్రయోగించడం తాను వినివున్నాడు. విషయవైవిధ్యమేలేదు యీ సంపాదకీయాలకు. ఉంటే డాడ్జినగర ప్రజలు శ్రద్ధగా చదివి వుండేవారేమో కాని, లేనందుచేత, ఎవడూ చదవడు.

పూర్తిచేసి, ఆట్కిన్స్ సంతృప్తితో గార్బర్గ్ కూర్చునివున్న చోటికి వచ్చి, "చూశావూ, చెప్పవలసింది చెప్పేశాను," అన్నాడు.

"మీకు ఇండియన్లంటే యింతటి గాఢమైన ద్వేషముందా?" అని గార్బర్గ్ అడిగాడు.

"ద్వేషించడమా? ఇండియన్ అనేవాణ్ణి అసలు చూడలేదు. ఇండియన్ స్త్రీకీ తెల్లవాడికీ పుట్టిన మికీ తప్ప అసలు సిసలు ఇండియన్నే యెరగను. కాని

వాళ్లు ప్రగతిని నిరోధిస్తున్నారు. పూర్వం తుపాకి మోతలలాగా ప్రగతి వీళ్లను చూచి భయపడి స్తంభించదు".

"కావచ్చు, నేనైతే దీనిని అచ్చువేయలేను," అన్నాడు గార్బర్గ్.

"ఎందుకని?"

"అసలే కావలసినంత అల్లరి లేచింది. మనం యింకా రేపడమెందుకు? ఆ యిండియన్లు డాడ్జ్‌వద్దకే రాలేదు. వాళ్ళు అఘాయిత్యాలు చేస్తున్నట్లు మనకే ఆధారాలూ లేవు. బహుశా వాళ్ళకోరిక, తమ తమ సొంత యిళ్ళకు తిరిగి పోవడమే కాబోలు".

"అయితే నెత్తురోడ్చి మనం సంపాదించుకొన్న నేలను విడిచిపెట్టి, వాళ్లు తిరిగి ఆక్రమించుకొంటూవుంటే ఆశీర్వదించడమేనా మనం చేయవలసిందివేళ?"

"అందులో తప్పేమివుంది?"

"ఛీ ఛీ," అని ఘుప్పున వుమ్మేశాడు ఆట్కిన్స్. "వెళ్ళిపో! పిరికితనాన్ని నేను సహించలేను వెళ్ళిపో!".

* * *

డాడ్జ్ కోటనుండి దళాలు చీకటిలో బయలుదేరి, విట్మన్ వైపు దక్షిణానికి పోసాగినవి. రినోకోటనుండి వచ్చివుండిన దళాలు, చెయిన్నీల దారినడ్డి అయినా వుండాలి, లేకుంటే వాళ్ళు యెటుపోయిందీ తెలియకనైనా వుండాలి, అని నిశ్చయించుకొన్నాడు కెప్టెన్ సెడ్బర్గ్. మొదట ఇండియన్లను అటకాయించి, తర్వాత వాళ్ళ పోవిడి తెలియకుండా తికమక పడుతున్నారేమోనని అతను ఊహించలేక పోయాడు. ఇండియన్లు పడమటిబాట పట్టివుంటారనుకొన్నాడు. ఏమంటే యిక్కడ జనసంఖ్య పలచగా వుంటుంది; తమ నెవరూ అడ్డగించే ప్రమాద ముండదు, అని అనుకొని వుంటారనుకొన్నాడు. ఈ దుర్బలమైన వూహా కారణంగానే, తన దళాన్ని దక్షిణోన్ముఖంగా నడిపినాడు. గుర్రాలకూ గాడిదలకూ పుట్టిన సంకరజాతి కంచరగాడిదలపై ఆసీనులైవున్నారు కాల్బలపు సిపాయిలు. ఇండియను లా ఘోరంచేశారు, యీ అఘాయిత్యం చేశారని మొత్తం కాన్సాస్ రాష్ట్రినుండి డాడ్జ్ నగరానికి వస్తున్న వార్తలు పరస్పర విరుద్ధంగానూ, సమన్వయపరుప వీలులేకుండానూ, వున్నవి. దక్షిణానికిపోతేనే వాళ్ళ నెదుర్కొనే అవకాశం వుంటుందని సెడ్బర్గ్ ఆశించసాగినాడు. దక్షిణానికిపోయి, అక్కడ నుండి తూర్పుగా వలయాకృతిగా తిరిగినట్లయితే, మరుగోజుకు ముర్రే జాడ తెలుస్తుందని అతని నమ్మిక.

కూడావుండి దారి చూపించేటందుకు, సంకరజాతికి చెందిన పెతే జామిసన్ అనేవాడున్నాడు. కాన్సాస్ రాష్ట్రంలోని బుతివైపునకల భూభాగం గురించి తన అరచేతి రేఖలకంటె, బాగా తెలిసినవాడు. అదీగాక, వెన్నెల పిండి ఆరబోసినట్లు కాస్తున్నది. సైనికులు ఒకరికొకరు దాపుగా పోతున్నారు. మాట

లెక్కవ సాగలేదు. భోజనమయిన తర్వాత రెండు గంటలపాటు విశ్రాంతి తీసికొని యుండినందుచేత ఎక్కువగా అలసిపోలేదు. దళాగ్రభాగంలో కెప్టెన్ సెడ్బర్గ్‌కు నాలుగడుగులు వెనుకగా వేసెస్ట్ పోతున్నాడు. బాగాఅలసిపోయాడు. కెప్టెన్ అంటేనూ, జామిసన్ అంటేనూ లోలోపల మండిపడ సాగినాడు. ఇండియన్లతోటి పోరువస్తే, సెడ్బర్గ్ సర్వనాశనమైతే బాగుండును, అనుకొన్నాడు. జామిసన్ గొంతు వినబడితేనే భగ్గుమంటున్నారు. "ఆళ్ళు - ఆ చెయిన్నీలు, మా చెడ్డమానులు. దెయ్యాల్లా పోరతారు. గోళ్ళతో గండుబిల్లి బరికినట్లు చెలగతారు. మన దారిలో తగలతారనిపిస్తుండది. జాగర్తగా, గండుబిల్లి గుప్పిటినుండి తప్పించుకోవాలని జూచే ఎలికల్లాగా సడీ చప్పుడూ లేకుండా పోవాలి. లేకుంటే ముప్పు," అన్నాడు జామిసన్, కెప్టెన్ సెడ్బర్గ్ తోటి. "వాళ్ళు కనిపించనీ, వాళ్ళనేంచేస్తానో చూద్దువుగాని, కనిపించనీ" అని సెడ్బర్గ్ ప్రగల్భాలు పలికాడు.

"చేస్తారు చేస్తారు. కానైతే మన జాగ్రత్తలో మన ముండాలి."

పోయారు పోయారు. తెల్లవారవచ్చింది. పొడవాటి గడ్డి తడితడిగా నలనల్లగా ఎత్తెత్తుగా కనుపించసాగింది. గాడిదల గిట్టల చప్పుడు విన్న తోడేళ్లు కూయజొచ్చినై. ఈదండునుచూచి బర్రెలమంద ఒకటి భయాందోళన చెందింది. బయళ్ళను ఖండ ఖండాలుగ విభజించే యినుపముళ్ళ తీగల ప్రక్కనే పోయారు. దూరాన ధాన్యపుకొట్లు, పశులశాలలు, భవంతులు క్రమక్రమాధిక స్పష్టతరంగా కనుపించసాగినవి. ఈవైపు ఒక విదువందల గజాల మేరకు, ఆ వైపు అంతేమేరకు, గస్తీలు విస్తరించుకొని వస్తున్నాగాని, ఇండియన్లెక్కడా తగులలేదు. వాళ్ళెక్కడ మసలుతున్నట్లుగా ఏగుర్తుగానీలేదు. తగలబడే యిళ్ళు కనుపించినా, వాళ్ళవునికి తెలిసేది. లేక, ఆకాశానికి విస్తరించిన సుదూరాగ్ని కాంతి కనుపించినా, వాళ్ళవిడిది ఫలానాఅని తెలిసేది. అవేవీలేవు.

తెల్లవారింది. కాని సైనికులు వాహనరూఢులైకూడ జోగిపోతున్నారు. ఒకవైపుకు సొరిగిన తలలు, వినుగుదల అడుగడుగున కనుపించే మాటలు, రాత్రివలె నల్లనైన నిశ్శబ్దం,-యిట్లా పోతున్నారు. ఇంతలో నీలి సిరావన్నె కలిగిన మిన్నులు నల్లని సిరావన్నెకు, అందునుండి బూడిద వన్నెకు దిగినవి.

"ఏమీ లాభంలేదు"అనిన మరుక్షణమే జామిసన్ నాలుగడుగులు ముందుకు ఒక్కపెట్టున గాడిదను నడిపించి, రికాబులలోనే కాళ్ళుంచి నిలుచుని, చెవుల వెనుక చేతులు దోయిలించి, ఏదో వినవస్తున్నట్లు ఆలకించాడు. ఆగండి, అన్నట్లుగా సెడ్బర్గ్ చేయెత్తినాడు. రాత్రి అంతా తెగతిరిగిన గస్తీలు చెరొకవైపు నుండి వచ్చి చేరారు.

"వారెవా! వారెవా! ఏదో తమాసా చప్పుడు వినిపిస్తుండాది" అన్నాడు జామిసన్ సంతోషాతిశయాన ముఖమంతా నవ్వగా.

"ఏమిటది? అని సెడ్బర్గ్ అడిగాడు.

"తెలవదు. ఏవీఁ లేదేమో! లేకపోతే చానామంది గుర్రాలమీన వస్తుండాలేమో!"

"ఎక్కడ?"

ముందుకు చేయి చాపాడు జామిసన్. సెడ్బర్గ్ ఆలకించ ప్రయత్నించాడు. కంచరగాడిదలు సకిలించసాగినవి. సైనికులు నిదుర విదులించుకొని తుపాకులను చేదాల్చారు. ఇంతలో చప్పుడు మరింత దాపుకు వచ్చింది. దూరంనుండి ఢంకాలు మ్రోగుతున్నట్లుగా వుంది.

"ఎంతో దూరాన లేదు" అన్నాడు జామిసన్.

"ఎంతమంది వుండవచ్చు?"

జామిసన్ భుజా లెగురవేసి "రెండువందలకు పైమాటే" నన్నాడు.

"అయితే ఇండియన్లు అయివుంటారు. కాకుంటే ముర్రే దళమైవుంటుంది" అని సెడ్బర్గ్ అనిశ్చిత మనస్కుడై ప్రదక్షిణాలు చేశాడు. సిపాయీలవైపు చూశాడు. ఒకరినొకరు అంటిపెట్టుకొని యిరుకు యిరుకుగా వున్నారు. రాత్రి అంతా ప్రయాణించినందుచేత నిస్సత్తువ పడినట్లున్నారు. పశువులవలె గాడిదలు కుమ్ములాట పడుతున్నవి. చేయకొనదలచిన గమ్యం హఠాత్తుగా ఎదురయ్యేసరికి, ఏమి చేయడమో కూడ తెలియక సెడ్బర్గ్ తికమక పడుతున్నాడు. పదాతి దళవాయి అయినందుచేత, తన సైనికులందరూ వాహనాలు దిగినట్లయితే, ఒక శ్రేణిగా కూర్చవచ్చు ననిపించింది. కాని అటువంటి కాల్బలం ఇండియన్లముందు పనికిమాలిపోతుందనిపించింది. ఇంతకూ అదిగాని యిదిగాని చేయక, వూరకేవుండి పోయాడు. మహోన్నతమైన అశ్వాన్నియెక్కివున్నందుచేత, వెసెస్ట్ అందరికంటే ముందుగా, ఇండియన్ల దర్శనం చేసికోగలిగినాడు. మంచుతెరలు తొలగించుకొని వస్తున్నట్లుందివాళ్ళు. ఒకచిన్నతిప్పపైనుండి జరజరజారివస్తున్నట్లుంది. సైనికులకు వందగజాల దూరాన ఠకీమని ప్రశ్నార్థక చిహ్నంవలె ఆగిపోయారు. ఆక్షణంలో, ముర్రే వైఫల్యం వెసెస్ట్‌కు బాగా తెలిసివచ్చింది. ఎక్కడో తన సహవాసు లందరూ క్షేమంగావున్నారు. కాని తానొక్కడు మాత్రమే ఇండియన్ల కెదురు పడవలసివచ్చింది. విధి ప్రతినబూని తనపై పగసాధిస్తున్నట్లనిపించిందతనికి.

"చిక్కారు చిక్కారు...కానైతే ఆళ్ళు మనకుచిక్కారా? మనం ఆళ్ళకు చిక్కామా" అన్నాడు జామిసన్.

సెడ్బర్గ్ చేయి వూపినతోడనే కంచరగాడిదలు ముందుకు కదిలినై. ఇండియన్లు నిశ్చలంగా నిశ్శబ్దంగా వున్నారు. అంతలోనే ప్రవాహజల మెంత సునాయాసంగా పాయ చీలగలదో అంత సునాయాసంగా, వున్న యిండియన్లలో సగభాగం పాయ చీలిపోసాగింది.

"ఏయ్ ఓహోయ్ భాకాపూదు! ఆఁ. కానీ, వూదూ" అని అరిచాడు సెడ్బర్గ్.

బాకాధ్వని తరంగాలు మనుషులలోనూ, పశువులలోనూ ఒకే వాంఛలు రేకెత్తించినట్లుంది. గాడిదలు పరుగు లంకించుకొన్నవి. ఇంతలో జామిసన్ సెడ్బర్గ్‌నాపి, "కెప్టన్ సాబ్! అళ్ళు ఆడాళ్లు - మీకు పిచ్చెత్తిందాయేం, యీళ్ళను మగరాయళ్ళ నీడ యిడిచిపెట్టి, ఆడంగులవెంట బడబోతున్నారు!" అని ఆక్షేపించాడు.

సెడ్బర్గ్‌కు యిప్పుడు తెలిసింది. పిల్లలూ, స్త్రీలూ ఆగ్నేయంగా పాయజీలి పోతున్నారు. వచ్చినవైపుకే తిరిగి పోతున్నారు. మగవాళ్ళు అత్యద్భుతమైన లాఘవముతోటి తనపార్శ్వాన్ని దెబ్బతీసేతలపుతో, గిర్రునతిరిగి వలయాకృతిగా, వచ్చేస్తున్నారు. వాళ్ళువస్తున్న వైపుననే తనబలమంతా కేంద్రీకరించవలెననుకొన్న సెడ్బర్గ్ కలద్రొక్కుడిపడుతున్న గాడిదెలను చూచి, గొంతెత్తి ఆగండని పొలికేక పెట్టాడు. ఈపాటికి సూర్యోదయం సూచించే రక్తారుణ కాంతి తూర్పున విస్తరించింది. ఆ కాంతిగర్భం లోపలికే ఇండియన్ స్త్రీలు, బాలబాలికలు వెళ్ళిపోయారు. మంచుతెరలలో మరుగుపడిపోయారు. తమ కుటుంబాలు భద్రంగా వున్నాయనిపించిన వెంటనే ఇండియన్లు ద్విగుణీకృత ధైర్యులయ్యారు. ఇంతవరకు ఎవరూ ప్రేల్చలేదు. సెడ్బర్గ్ ఆశ లంతరించినవి. తన దళాన్ని దిగి తుపాకులు ప్రేల్చమని ఆజ్ఞ యిచ్చాడు. ఇంతవరకు ధిక్కరింపుగా ఎదుట నిలిచిన ఇండియన్లు నృత్యంచేస్తున్నట్లుగా దూరం వెళ్ళిపోయారు.

వాహనాలు దిగిన సైనికులు వాటి నొక వరుసలో నిలపాలని చూచారు. అట్లయితేనే, ప్రేల్పుడు సాగించేందుకు తమకు కావలసినంత జాగా వుంటుంది. వేనెస్ట్ ఒక్కడే యింకా అశ్వాసీనుడై వున్నాడు. అతను అశ్వదళపు సైనికుడు అయినందుచేత, యీ వ్యూహం సమస్తం అతనికి ఆత్మహత్యా సమానంగా కనుపించింది. మిడతలదండువలె ముమ్మరంగా చెయిన్నీలు విరుచుకొనిపడుతారని, అప్పటికికూడ యీ కాల్బలం గాడిదలతో తంటాలు పడుతూవుంటుందని, సరిగా వూహించినవాడు అతనొక్కడే.

ఈకెలతో చేయబడిన విసనకర్రను తెరిచి విప్పితే ఎట్లుంటుందో, ఇండియన్లు సరిగా అట్లాగే రెండుఖండాలుగా విడిపోయి, తుపానుగాలివలె ఝుయ్యిమని రయ్యిమని, బొబ్బలుపెడుతూ, కేకలువేస్తూ కాల్బలంమీద విరుచుకుపడి, గాడిదలను చెదరత్రొక్కుతూ, చెల్లాచెదురుచేస్తూ వున్నట్లేవుండి, హఠాత్తుగా యథాపూర్వవేగంతోటి వెళ్లిపోయారు. ఇక్కడ అంతా నానాగందర గోళ మయింది. సిపాయీలు ప్రేలుస్తూనేవున్నారు. కాని సుడివలె జరజర బిరబిర తిరుగుతూ, విలయనృత్యం సల్పుతున్న ఇండియన్ అశ్వికులు ఆకాశాన ఎక్కడో పక్షచాలన లాఘవాన ఎగురుతూపోయే అడవి పావురాలవలె, చెక్కు-

చెదరలేదు. వాళ్ళ శక్తి మొక్క పోలేదు. ఇండియన్ల కాల్చింది తక్కువే. వాళ్ళ గురి ఈ సిపాయీలు కాదు, ఆ కంచర గాడిదలు. వాటిని భయపెట్టితే తమ లక్ష్యం నెరవేరుతుంది. అది నిర్వర్తించిన వెంటనే వాళ్ళు వెళ్ళిపోయారు. వెళ్ళిపోతున్నవారి మీద సిపాయీలు అనవసరంగా నిష్ప్రయోజకంగా తూటాలు ప్రేల్చారు. తర్వాత వాళ్ళను తిట్టారు.

ఈ సందర్భంలో వేనెస్ట్ వెళ్ళిపోయాడు. ఇండియన్ల దాడికి గుర్రం బెదిరి పరుగు లంకించుకొంది. డొక్కలో తన్ని మరింత దౌడెత్తించాడు వేనెస్ట్. తల గిరగిర తిరుగసాగింది. కత్తితో పొడిచినంత నొప్పి వీపున. భుజపు టెముకదగ్గర ఒక తూటాదెబ్బ తగిలింది. వెనకనుంచి సైనికుడెవడో పెట్టిన గురి అంతచక్కగా వుంది. ఈ బాధకంటె అతని ఉద్రేకం ఎక్కువగా వుంది. తాను పారిపోతున్నాడు! యింటికి తప్పించుకొని పోతున్నాడు! చిరకాల వాంఛితం యీనాటికి యీ తీరుగా సిద్ధించింది!

ఆ విధంగా పిచ్చెత్తినట్లుగా ఇండియన్ల కెదురుబడిగా గుర్రంమీద పోతున్నాడు. కాని వాళ్ళు తూర్పుకు మలుపు తిరిగారు. వేనెస్ట్ కిప్పుడు తోడెవ్వరూ లేరు. అతని గుర్రం పరుగు తగ్గించింది. నెమ్మదిగా నడక మొదలెట్టింది. కొంత సేపటికి అదీ మందగించింది. చివరకు ఆగిపోయింది. జీనుకు ఒకవైపుగా వేనెస్ట్ వ్రాలిపోయివున్నాడు. పచ్చటి వెచ్చటి జెరిసీ రాష్ట్రపు స్మృతులు చాలాసేపటివరకు అతని తలలో నిర్మలంగా స్ఫుటంగా వున్నాయి. ఇంతలో కళ్ళముందు చీకటి కమ్మింది. లోకానికంతా పగలుగాని అతనికిప్పుడు రాత్రి. గుర్రం అటూయిటూ యిచ్చవచ్చినట్లు పోయి పచ్చిక మేయసాగింది. పొడవాటి పచ్చికగుండా వేనెస్ట్ దేహాన్ని ఈడ్చుకొనిపోయింది. అతని పాద మొకటి యింకా రికాబులోనేవుంది.

♦ ♦ ♦

డాడ్జ్‌నగరాన, లేడీగే థియేటరులో, ప్రదర్శనం సగం ముగిసింది. హాస్యనటుడైన ఫ్రాంక్ హెన్రిక్ తెర లాగించుకొని వచ్చి సభాసదులకు నమస్కరించి, చేతులు బిగించి, దీనమైన నిరాశోపహతమైన కంఠస్వరంతో మాట్లాడసాగినాడు.

"సహపౌరులారా, స్వదేశీయులారా, తమతో నేనిప్పుడు హాస్యధోరణిలో కాదు మాట్లాడబోతున్నది. హాస్యానికికూడ వేళపాళలున్నాయి. లేడీ గే థియేటరుకు మీరు డబ్బిచ్చి ప్రవేశం సంపాదించినందుచేత వుత్కృష్టమైన హాస్యాన్ని, శ్రేష్ఠమైన సంగీతాన్ని, నృత్యాన్ని, వినోద ప్రదర్శనల... చూడమనసై వచ్చినారని నేనెరుగుదును. బ్రతుకులోని తీవ్ర విషయాల... ...లు, సమయా సమయాలున్నాయి. వీటిగురించే మీ...
ప్రెయిరీ బయళ్ళలో నిర్నిరోధంగా ప్రబలిపో...
రాష్ట్రింమీద నేడు వర్తిస్తున్న 'ఎర్ర'(...

ముక్కలు చెప్పిపోతాను. తగులబెట్టుతూ, చంపుతూ, నాశనపరిచే ఎర్ర అటవిక రాక్షసులనుగురించి, ముట్టడించిన యిళ్ళలో ఒకవైపున స్త్రీలూ పిల్లలూ మోకరిల్లి యిలవేల్పును ప్రార్థిస్తూవుంటే, వారిప్రక్కన నక్కి సర్వప్రియ వస్తు విధ్వంసకులైన, పశుసమానులైన వైరులను తిప్పికొట్టడానికి కిటికీలగుండా తూటాలను వర్షించే ధీరపురుషులను గురించి నేను మాట్లాడ దలిచాను. డాడ్జనగర సహవాసులారా, ఆత్మీయులక్కడ యమయాతనలకు లోనవుతూవుంటే, మీరిక్కడ వినోదిస్తూ కూర్చుని వుంటారా? మీ మీ హృదయాలలో రోషాలు ద్వేషాలు అంతరించిపోయాయా? ప్రేమ అంటేనూ, క్రైస్తవమతమంటేనూ ఏమీ తెలియక తలలుఒలిచి, మానవులను ఆ మృత్యుహింస పెట్టడమొక్కటే తెలిసిన అనాగరికులను, దయ లేశంకూడ లేనివాళ్లను, జంతుసమానులను రుప్పకూల్చేటందుకు తుపాకులు చేదాల్చి కదలిపోవలెననే ఇంగితజ్ఞానం మీకు కలగడంలేదూ? నిన్నగాక మొన్న కస్టర్ సేనాని నాయకత్వాన ప్రాణాలిచ్చిన ధీరులు, నేడుకూడా నెత్తురులోడుస్తూ పడిపోయిన ఫుల్లర్, క్లాన్సీ, లోగన్‌వంటి ధీరులు మీకు మరపువచ్చారా? ఎట్లా మరచిపోగలరు మీరు వీళ్ళను? జీతభత్యాలకోరకు వినోదమిచ్చే అల్పుణ్ణినేను. మీరు గట్టిగా పోట్లాడగలిగినవాళ్ళు. నామాటలు మీకు పిచ్చివాని ప్రేలాపనలమోస్తరు వుండవచ్చు కాని, మీరు నాకొక గుర్రాన్ని, ఒక తుపాకినీ దయచేస్తే మీతోకలిసి దండుపోవడానికి నేను సందేహించను. ఇంత ఓపికగా వినినందుకు మీకందరికీ వందనాలు."

యుద్ధగీతాన్ని ఆర్కెస్ట్రా వాయించసాగింది. కాని ప్రేక్షకుల కరతాళధ్వనులమధ్య సంగీతం అణిగిపోయింది. ఫ్రాంక్ హెన్రిక్, యీ మెప్పుకోలుకు కృతజ్ఞత సూచిస్తూ, పదేపదే వంగివంగి నమస్కరించాడు. కాని ప్రేక్షకులు శాంతించేటట్లులేరు. వేదికకు దాపులోనే వున్నవాడొకడు బాగా వేడెక్కిన ఫుట్‌లైట్లను వూడలాగినాడు. తాను ప్రారంభింపజేసిన వుద్రేక తరంగభుజాలమీద ఫ్రాంక్ హెన్రిక్ స్వారిచేస్తున్నట్లుగావుంది. లేడీగే థియేటరునుండి కాగడాల వుత్సవం బయలుదేరింది. హెన్రిక్ అగ్రశ్రేణిలోవున్నాడు. థియేటరునుండి ముందువీధికి, అక్కడినుండి లాంగ్‌బ్రాంచ్ పానశాలకు నడిచిపోయారు. ఈ పాటికి, డాడ్జనగరపు మారుమూలలకుకూడ వుద్రేకం ప్రాకిపోయింది. స్త్రీపురుషులు వేనవేలు కదలివచ్చి చేరినారు. పానశాలలో యిసుకవేసినా రాలనంతజనం కూడింది. కేకలు, అరుపులు, వుత్సాహవచనాలు, నానాగలభా అయింది. బాట్ మాస్టర్సన్‌ను రమ్మని కేకలువేశారు.

...న్ వున్నతస్థలానచేరి, "ఒక నిమిషం ఓపికపట్టండి. ఒక్క...
...రుకోశ్చేకపోతున్నాను" అన్నాడు.
...ం" అని కేకలు.
...డాలని వువ్విళ్ళూరుతున్నారు మీరంతా.

బాగుంది, కాన్సాస్‌రాష్ట్రాన్ని నాశనంచేసివేస్తున్నారని కథలు విని కోప వచ్చినట్లుంది చూస్తే. కాని యిది అరవై-ఆరుకాదు; అరవై-ఎనిమిదికూడా కాదు. ఇండియన్‌యుద్ధాలు అయిపోయాయ్. ఏదో ఒకముఠా కట్టుపలుపులు త్రెంచుకొని దాడిచేసేటట్లయిత్తే, వాళ్ళను అణచివేయడానికి సైన్యాలున్నాయ్."

(అపహాసనూచకధ్వనులు - ఆ సైన్యాలేం చేయగలవ్? అంతా దిష్టి విగ్రహాలు—ఆకారపుష్టి, నైవేద్యనష్టి—ఈ సైనికు లెందుకు పనికివస్తారు?— కేకలు)

"సరే, మీకు సైన్యాలంటే ఖాతరుగాని, యిష్టంగానిలేదు. కావచ్చుగాని శాసనాలను రక్షించేవాళ్ళు వాళ్ళే. వాళ్ళే రాజ్యాంగం."

"వాళ్ళుకాదు వాళ్లుకాదు - నువ్వే శాసనకర్తవు! మమ్మల్ని నడుపు!"

"ఒక నిమిషం తమాయించండి! మీలాంటి వుద్రేకపు మూక ఏం సాధించ గలుగుతుంది, అవుపడిన వస్తువునంతా కాల్చడంతప్ప? ఈ పనికి మీరు పూనుకొనేటట్లయితే, నేను చెప్పినట్లు నడవాలి. లేకుంటే యీపీడ నాకెందుకు?"

"సరే, బాట్, సరే నడుపు! మమ్మల్ని నడుపు!"

"అట్లయితే సరే. మీరు యిండియన్లను వేన్నాడబోతున్నారు. ఈరాత్రి పోలేరు. ఒక మాట గుర్తుంచుకోండి. చీకటిపూట ప్రేల్పులు మొదలెట్టారో, ఇండియన్లుకాదు మీచేత చావబోయేది, మన పౌరులే. మరొక సంగతి, ఆ యిండియన్లు ఎక్కడున్నారో మనకు తెలియదు. వచ్చే వార్తల నన్నిటిని నమ్మేటట్లయితే, ఏక కాలంలో వాళ్ళు రాష్ట్ర వ్యాపితంగా యిరవైచోట్ల వున్నా రనుకోవాలి. కాబట్టి వాళ్ళు అంతు చిక్కనిదే, మనం కదలకూడదు. వాళ్ళజాడ తెలుసుకోవడానికి సైన్యదళ మొకటి యింతకుముందే కంచరగాడిదలమీద బయలుదేరిపోయింది. దుర్గంనుండి మనకు వివరాలు తెలిసే టంతవరకు, మనం ఓపికపట్టి వుండాలి. ఈలోగా, పౌరసంఘాన్ని నిర్మిద్దాం. వాళ్ళు జనసేనను పూనుస్తారు. మరి రేపు ప్రొద్దుటికి మీ వుద్రేకం అందాకా నిలిచివుంటే, మీ యావన్మందినీ నేను నడుపుతాను."

మాస్టర్సన్ దిగినాడు. కొందరు చప్పట్లు చరిచారు. మరికొందరు యిప్పటి కిప్పుడే కదలిపోలేదని నసుగుడు మొదలెట్టారు. అత్యధిక సంఖ్యాకులకు మట్టుకు రేపు ప్రొద్దుటివరకు మరేమీ ఫరవాలేదని బరువు దిగిపోయినట్లు మనసులు తేలిక పడినవి. పానశాలనుండి గుంపు పలచబడిపోయింది. కొందరు నృత్యాలు మొదలెట్టినారు. కొందరు చీట్లపేక కలిపినారు. పౌరసంఘం వెనుకగదిలోకివెళ్ళి జనసేనలో చేరేవారి పేర్లు వ్రాయసాగింది.

జనసేన సంఖ్య నిన్నటి రాత్రి మూడువందలుంటే, ప్రొద్దుటికి వందకు దిగిపోయింది. దాని లక్షణాలుకూడ్డ మార్పు చెందాయి. చిన్న చిన్న రైతులు, మందల యజమానులు, గృహస్థులు మటుమాయమయ్యారు. సారానిపాలో యిండి

యన్లతో పోరడం సులభ మనిపించింది నిన్న రాత్రి. కాని వుద్రేకంతగ్గి, ఆలోచన మొదలైనతర్వాత, అకాలమరణానికి లోనుగావడ మెందు కనిపించింది. ఎవరింటికివారు పోయి, ధాన్యాగారాలను భద్రపరచుకొని, తలుపులు బిగించి లోపల కూర్చోడం మేలనిపించింది. ఇండియన్లువచ్చి పైబడేటట్లయితే, ఎవరి నేల మీద వారు నిలిచి పోట్లాడవచ్చు, కాని ఎక్కడికో పోవడ మెందుకు, అనవసరంగా చావడ మెందుకు, అనుకొన్నారు.

క్రమక్రమంగా క్షణం గడిచేకొద్ది క్షీణించి పోతూవున్న పట్టుదల ఇండియన్ల చేతబడి చచ్చిపోయాడని పుకారుపుట్టిన పాప్ ఫుల్లర్ గుండ్రాయివలె కనిపించేసరికి పూర్తిగా మందగించింది. చెయిన్నీలను చంపుదామని తుపాకి ధరించి వచ్చిన ముసలివాణ్ణి తలా ఒక ప్రశ్న వేశారు. సైన్యానికీ చెయిన్నీలకూ మెడిసిన్ లాడ్జ్‌నది దగ్గర ఎక్కడో పోట్లాట జరిగినమాట వాస్తవమేనని, కాని తనకు దానిని గురించి అంతకంటె అదనంగా ఏమీ తెలియదని, ఇండియన్లుమట్టుకు డాడ్జ్‌వైపుగా వస్తున్నట్లు తాను చెప్పగలననీ, అన్నాడు ఫుల్లర్.

పాప్ ఫుల్లర్‌ను ఇండియన్లు చంపలేదు. అయితే, యింకా కొంతమందిని చంపినారనే పుకారుకూడ అబద్ధమై వుంటుంది. ఈ వూహాలతో మరి కొందరు జనసేననుండి తప్పుకొన్నారు. ఇంతటిలో కొందరు టెక్సాస్ దుండగులు ఒక అఘాయిత్యానికి పూనుకొన్నారు. ఇండియన్ తల్లికీ, అమెరికన్ తండ్రికీ పుట్టిన మికీ అనే పరమ అమాయక జీవిని పట్టుకొన్నారు. జన్మతఃమికీకి బుర్రలేదు. సర్వకాల సర్వావస్థలలోనూ విప్పారిన నవ్వు అతని ముఖమందు నర్తిస్తుంటుంది. చిట్టెలుకకంటె కూడ సాధువు. కుక్కలంటే అదురు, జ్వరం కాస్తుంది. ఎంతటి హీనమైన పనికయినా తయారు. చెయిన్నీలకూ యితనికి సహస్ర యోజనాలు దూరం. పైగా వారి పేరెత్తితేనే పారిపోతాడు. ఇప్పుడు డాడ్జ్‌పురజనులు ఇండియన్లంటేమండిపోతున్నారు. అందుచేతఒక దుకాణంలో మికీదాగుకొన్నాడు. కాని టెక్సాస్ నుండి వచ్చివున్న దుర్మార్గులు కొందరు మికీని బయటికిలాగి, ఒంటికంతా తారు జిడ్డు పూసి, టెలిగ్రాఫ్ స్తంభానికి వేలాడదీశారు. తర్వాత ముందు వీధిఅంతా అదిరిపడేలాగున గుర్రాలనుతోలి, తుపాకులు వుత్తపుణ్యానికే అనేక పర్యాయాలు ప్రేల్చారు. పాపభీతిగల పౌరులు కొందరు వచ్చి నిచ్చెనవేసి మికీ దేహాన్ని క్రిందికి దించేటప్పటికే, సగంప్రాణాలు పోయాయి. ఉన్నట్టుండి ఒక్కపెట్టున నెత్తురు తలకెక్కి చిమ్మేసరికి, స్పృహతప్పింది. కాని అతనిముఖంమీద చిరునవ్వు యింకా మాయలేదు. ఇంతలో బాట్ మాస్టర్సన్ అక్కడికివచ్చాడు. కాస్త ముందుగా వచ్చివుంటే యీదారుణం దుర్ఘటిల్లేదికాదు. మికీని తానెన్నేళ్ళనుండో యెరుగును. మాస్టర్సన్ వుగ్రుడైపోయాడు. మికని చంపిన దుండగులు కనుపించినదే తడవుగా చంపి పాతరపెట్టుతానని దేవునిపేరుతో శపథంచేశాడు. టెక్సాన్లకు మాస్టర్సన్ అన్నమాట తప్పడని తెలుసు. అందు

చేత నెమ్మదిగా నగరంనుండి జారుకొన్నారు. శౌరులు కష్టంమీద మాస్టర్సన్ కోపాన్ని వుపశమింపజేశారు.

ఈఘటనవలన జనసేననుండి మరికొందరు తప్పుకొన్నారు. సంయుక్త రాష్ట్రాల మార్షల్ అయిన ఈర్ప్ యీ వ్యవహారంతో తనకిక ప్రమేయంలేదని చెప్పి, మాస్టర్సన్‌గారి కార్యాలయానికి వెళ్ళిపోయాడు. మిగిలివున్న వాళ్ళకు యింకా యిప్పటికికూడా యిండియన్లమీదికి దాడిపోయి చావాలని కోరిక వుంటే, కనీసం తాను వాళ్లతోగూడ పోయి, ఒకరి నొకరు హతమార్చుకోకుండా సర్దబెట్ట గలనని షెరీఫ్ అయిన మాస్టర్సన్ అన్నాడు.

ఈ అంగభోగాలతో వుదయం మధ్యాహ్నమయింది. ఇండియన్లతోటి మేము కూడ పోట్లాడాములే, అని డాబులు చెప్పుకోవలచినవాళ్లు, గుర్రకారు పొగరు బోతు టెక్సాస్‌రౌతులు, చిల్లరకొట్లు గుమాస్తాలు, యిద్దరు యింగ్లీషు గుర్రవాళ్లు షెరీఫ్ అయిన మాస్టర్సన్, పత్రికకు చక్కని వార్తలు పంపవలెనని బయలుదేరిన టెలిగ్రాఫ్ ఆపరేటర్, నలుగురు డిప్యూటీలు, పచ్చికబయళ్ళ సీమనుండి ఎలాగో ఒకలాగు ఇండియన్లను తరిమివేయడానికై ఏమిచేయడానికైనా వెనుదీయని నలుగురు ఆసామీలు - యిదే జనసేనస్వరూపం! చిన్నచిన్న రైతులు, మంద యజమానులు, రైలుపనివాళ్ళు, వకీళ్ళు, వైద్యులు, దర్జీలు, వర్తకులు వైదొలగి పోనే పోయారు. మిగిలినవాళ్లు ఎప్పుడెప్పుడా అని వువ్విళ్లూరుతున్నారు. అలామో పానశాల కెదురుగా గుర్రాల నెక్కేవాళ్లు దిగేవాళ్ళు, తూటాలను లెక్కించే వాళ్ళు, డాబులు గొట్టేవాళ్ళుగా వున్నారు. తమకు తోడుగా కొందరు సైనికులను పంపమని మాస్టర్సన్‌గారు దుర్గానికి కబురు పెట్టారు. సైన్యాధికారులు దీనిని నిరాకరించారు. మాస్టర్సన్ సైన్యాన్ని తిట్టుకొన్నాడు. సైన్యమంటేద్వేషంకాదు, తనపైబడిన యీ బాధ్యతపట్ల నిరసన. ఇండియన్ల వధకై ఘనీభవించిన ప్రబల తృష్ణ తప్ప మరే విషయమూ తెలియని యీ అల్లరి చిల్లరి మూకను నడిపే బరువు తనఒక్కని భుజాలమీదపడినందుకు అతనుకోపగించుకొనసాగాడు. అచ్చికబుచ్చిక కబుర్లతో తొమ్మిదిగంటలనుండి పదివరకు, పదినుండి పదకొండువరకు కాలక్షేపం చేయించాడు. అంతలో, మరొక విశేషం జరిగింది. పానశాలలలో నృత్యగాన విద్యలుచూపి నాలుగు రూకలు సంపాదిస్తూ, దేహాలమ్మి బ్రతికే వెలయాళ్ళు రాత్రిపడిన శ్రమ పోయిన వెంటనే నిద్రలేచి, అలామో పానశాల వరండాలో వరుసదీరి, జనసేనలోని వారిని ఎకసక్కేలు చేయసాగినారు. ఇంకా నిలబడి వున్నారే. జగదేక వీరవరులార! అసహాయశూరులారా! ఇంకా కదనరంగానికి తరలిపోక యిక్కడే గోళ్ళుగిల్లుకుంటున్నారేం?" అని కవ్వించ సాగినారు. ఇవి భరించలేక, జనసేనలో చేరినవాళ్ళు మాస్టర్సన్‌ను బలవంత పెట్టారు.

పదినిమిషాల్లా గడిచింది. ఇంతలో ఒకగుర్రపురౌతురొప్పుకొంటూరోజు కుంటూచేతులు బారిచాపుతూ వచ్చి దూకాడు. "మలుపులోవిడిదిచేసివున్నారు -

రేవుకు పడమటుగా! భగవంతుడా, జీసస్! మరొకగంట సేపట్లో యిక్కడికి వచ్చి పడతారు!" ఇక జనసేన నాపడం ఎవరితరమూ కాదని మాస్టర్సన్ గ్రహించాడు. కేకలతో బొబ్బరింతలతో బయలుదేరారు. రైలుబాట దాటారు. దక్షిణానికి కొందరు, తూర్పుగా కొందరుగా విసనకర్ర ఆకృతిలో విస్తరించారు.

గంటసేపుపోయారేమో నదినంటిపెట్టుకొని, ఇంతలో మాస్టర్సన్ ప్రాధేయపడి వారినాపినాడు. గుర్రాలకు కాస్తయినా విశ్రాంతి నీయకపోతే, రౌతులు దెబ్బతీయడానికిగాని, దెబ్బ నాచుకోడానికిగాని, పోట్లాడడానికిగాని పారిపోవడానికిగాని, పనికిమాలిపోతారని అతనికి తెలుసు. కాని వీళ్ళ నట్టేసేపు ఆపడం బ్రహ్మకార్యమై పోయింది. నవ్వులాటలతో కేరింతాలతో డాబులతో ప్రశ్నలతో మళ్ళీ స్వారిసాగించారు. పదినిమిషాలు తిరిగి గుర్రాల నాపారు. ఎక్కబోతున్నారు. అంతలో ఇండియన్లు కనుపించారు. చిచ్చరపిడుగుపాటులో కలిగే విస్మయం కలిగింది. ఊహలో మెదలినదే ప్రత్యక్షమయింది. ఇండియన్లు అసలు తగులుతారని నిజానికి వీరిలో ఏ ఒక్కడూ హృదయపూర్వకంగా నమ్మలేదు. ఇది వినోదయాత్ర అనుకొన్నారు. చివరకు మాస్టర్సన్ కూడ అనుకోలేదు. అనుకోనిది ఎదురుపడింది.

దక్షిణంనుండి నదిగట్టున్నే వచ్చారిండియన్లు, ఉత్తరంనుండి నదిగట్టున్నే వచ్చింది జనసేన. పల్లంనుండి మిట్టానికి వచ్చారిండియన్లు. అక్కడ యెదురుగా వుంది జనసేన. అకస్మాత్తుగా తారసిల్లారు. ఇండియన్లు మహావేగాన వస్తున్నారు. యోధులు ఒక కట్టుగా ముందున్నారు. వెనక ఆడంగులూ, పిల్లలూ వస్తున్నారు. సామానులు మోస్తున్న గుర్రాలు మధ్య వస్తున్నై. కుక్కలు గుర్రాలతోబాటు పరుగెత్తుతున్నై. అందరికంటె వెనక కొందరు పురుషులు, బాలురూ దళాని కొకప్రక్కగా వస్తున్నారు. వాళ్ళు జనసేనను చూచినప్పుడే జనసేన వారిని చూచింది. కానీ వాళ్ళు మరొకదిక్కు పట్టలేదు, వేగమయినా తగ్గించలేదు. దాదాపు అదృశ్యంగా, యాంత్రికంగా స్త్రీలూ పిల్లలూ పరివేష్టితులైనారు. చుట్టూ యోధులు గుమికూడారు.

టెక్సాస్ సాహసయువకులు పొలికేకలు వేశారు. నీటి గుంటను బాగా కలియబెడితే ఎట్లాగుంటుందో, జనసేన గుర్రాల నెక్కడ మట్లాగుంది. ఇంగ్లీషు యువకులు ఒకరి ముఖమొకరు చూచుకొన్నారు. ఒకడేమో గొర్రెవలె వెర్రినవ్వు నవ్వుతున్నాడు. మరొకడు ఖంగారుపడి వున్నాడు. టెలిగ్రాఫ్ ఆపరేటరు పొట్టలో ఏదో చేయిబెట్టి గెలికినట్లనిపించింది. నాలుక పిడచగట్టి, వుమ్మి చేదనిపించింది. చిల్లరకొట్టు గుమాస్తా ఎక్కిన గుర్రం వెనక కాళ్ళమీద నిటారుగా లేచి సకిలిస్తుంటే, దాని నడుపులో పెట్టడానికి పోరుకాడుతుంటే, వున్నట్టుండి వాంతి వచ్చింది. జనసేన కొండమీదినుండి జారిపోతున్నది. ఎడమైపోతున్నది.

ఎటు బడితే అటు, ఎవరికి తోచినట్లు వాళ్ళు, యిటూ అటూ కదలిపోయే తుపాకులను ప్రేల్చసాగినారు. తుపాకి దెబ్బలు దేనికీ తగలలేదు.

టెలిగ్రాఫ్ ఆపరేటర్ యీ ఘటనంతా ఒళ్ళంతా కళ్ళుచేసి కొనిచూడవలెనను కొన్నాడు. తనకుతానే పదేపదే హెచ్చరికలు చెప్పుకొన్నాడు. "దీనిని తప్పక చూడాలి. బాగా జ్ఞాపకం పెట్టుకోవాలి. ఇంటికిపోయిన వెంటనే కాగితానికెక్కించాలి." కాని మెరుపుమెరిసిన ఆ క్షణం మాత్రం చూడగలిగినట్లు మట్టుకే అతడీ ఘటనను చూడగలిగాడు. ఇండియన్ల గుర్రాల వేగం క్రమక్రమంగా మందగించడం, గోడకట్టినట్లుగా యోధులు స్త్రీలను, బాలబాలికలను రక్షాకవచంవలె బారుతీరడం, పాతబడిన తుపాకుల మీదుగా వంగివున్న గంభీరమైన ముఖాలు, ఎక్కుబెట్టిన విల్లులు, ప్రచలిస్తున్న అమ్ములు, అనాదికాలపు బల్లెములు, చుట్టూ యీకెలు కట్టబడిన డాళ్ళు- స్పష్టంగా కనిపించాయి. వాళ్ళు నిశ్చలంగా నిలుచుని వున్నారు.

ఉన్నట్టుండి ఒక్కవూపున ప్రేల్చారు వాళ్ళు. ఒక్కగా నొక్క దెబ్బకే జనసేన గింగిరాలు తిరిగింది. గుర్రాలు వెనక కాళ్ళమీద చక్కగా నిలుచుని భీకరంగా బాధతో సకిలించాయి. అంతా బీభత్స మైపోయింది. జనసేన దెబ్బ తిన్నది. పారిపోతున్న గుర్రాలను వెనక్కు త్రిప్పడానికి యెవరూ ప్రయత్నించలేదు. మరికొన్ని గుర్రాలు పిచ్చిగా చెయిన్నీలమీదికి దూకిపోతున్నవి. రౌతులు తుపాకులలో తూటాలు భర్తీ చేస్తుంటే, వెనక కాళ్లమీద నిలిచి నడవసాగినవి. సట్టన్ అనేవాడి ఎదురు రొమ్ముగుండా బల్లెందూరి విరిగింది. పశ్చికలో పడిపోయాడు. యాతనలు, తాపత్రయాలు, చిన్నచిన్న యీసులూ, ద్వేషాలు, అక్కసులు - అన్నీ వైదొలగి, బల్లెపుపోటు కారణంగా పరమప్రశాంతి వ్యాపించింది అతనిలో. అంతరాంతరాలలో, ఎవరిమీదా ద్వేషంలేని యింగ్లీషు కుర్రవాడు, ఇండియన్లతోటి యుద్ధమంటే లీలగా యెంచిన అమాయకుడు, పాపం, హతమారిపోయాడు. అమ్ము ములికి శ్వాసకోశాలను మండించసాగింది. జీనును గట్టిగా పట్టుకొని క్రమక్రమంగా మరణిస్తున్నాడు. అత నెక్కివున్న గుర్రం యథేచ్ఛగా చెయిన్నీల గ్రామంలో విహరించసాగింది. అతను తన సోదరుని పిలువలేక పిలువలేక పిలుస్తున్నాడు. మరికొందరు తలలో తూటాదూరి గుర్రాలమీదనుండి క్రిందబడిపోయారు.

ఇదంతా గుర్తుంచుకోవాలని అనుకొంటున్న టెలిగ్రాఫ్ ఆపరేటరు వ్రేలొకటి యెగిరిపోయింది. ఈ చేతిని మరొకచేతితో అదిమి పట్టుకొని, తమ దారి తిరిగిపట్టి పోతున్న ఇండియన్లకేసి తేరిపార చూస్తున్నాడు. బాట్ మాస్టర్సన్ తిడుతున్న తిట్లన్నీ వింటున్నాడు.

ఆశలన్నీ కోల్పోయి బాట్‌మాస్టర్సన్ శతధాశకలితమై, పరాజితమై ఛిన్నాభిన్నమైపోయిన జనసేనను - దాని శిధిలాలను - పరికించాడు. చుట్టూ చూచాడు. అర్కాన్సాస్ నదివైపుగా, అజేయమైన చెయిన్నీ గ్రామం, కాన్సాస్ రాష్ట్రపు పసిమి పచ్చికబయలులో అదృశ్యం కాసాగింది.

# బోసు మూతపడింది
## సెప్టెంబరు 1878

ఇండియన్లు పట్టిపోయిన బాటజాడ తలవనితలంపుగా ముర్రేకి తెలిసింది. అతని సైనికులు తెగ అలిసిపోయి, మురికిమురికిగా వున్నారు. ఇంతకుపూర్వం వారిలోలేని గుణమేదో యిప్పుడు వచ్చి చేరుకొన్నట్లుంది. "ఎప్పుడైనా వేటకు పోయారా మీరు?" అని పోతూపోతూ ఆగి, ముర్రేని అడిగాడు వింట్.

"వేటా ?"

"బాగా పసిపట్టగలిగిన వేటకుక్కను వెంటబెట్టుకొని పరిగపిట్టను వెంబడించిపోయారా ఎప్పుడైనా?", అని వివరించి అడిగాడు వింట్. "ఇటూఅటూ అటూయిటూ పరుగెత్తి పసిచూచే వేటకుక్కను వెంటబెట్టుకొని పోయారా?" "వేటాడడమంటే నాకు కిట్టదు. వేటాడ మనస్సైనవాడిలో ఏదో కొంత చెడు బుద్ధి వుంటుందని నావూహ", అన్నాడు ముర్రే. భుజాలెగురవేసి, వేట నాకు మాచెడ్డ సరదా. నేను దాన్ని గురించి కాదు అంటున్నది. మనవాళ్లను గురించి. చూడండి వాళ్ళని", అన్నాడు వింట్.

"బాగా అలత చెంది వున్నారు."

"పోరుపూద యిప్పుడు మనసైంది వాళ్ళకు-యింతకుముందు అదిలేదు."

"తాము దేనికోసం గాలిస్తున్నారో దాని అంతు తేల్చుకోవాలని పట్టుగా వున్నారు. నువ్వెప్పుడూ యిండియను ముండాకొడుకులను గురించే ఆలోచిస్తుంటావు, ప్రపంచంలో మరేదీ లేనట్లు".

వేట కుక్కలవలెనేవాళ్ళు ఇండియన్లను పసిబట్టడానికి యిటూ అటూ అటూ యిటూ తెగతిరిగారు. "ఇండియన్లు యిటు పోయారా ?" అని కనుపించిన వాళ్ళనందరినీ అడిగేవారు. ఎక్కడైనా రాత్రిపూట ఒంటిగా యిల్లు కనుపిస్తే, దాని కిటికీ తలుపులన్నీ బంధింపబడి వుండేవి. కొత్త మనుషులు కనుపించేసరికి కుక్కలు గోలపెట్టేవి. ఈ గోలవిని పశువులు భయానికి కలద్రొక్కడిపడేవి. "ఎవరయ్యా లోపల ? ఓహోయ్, ఎవరయ్యా యింట్లో ? హల్లో, ఏమండోయ్ !" అని ముర్రే కేకలు పెట్టేవాడు. శయ్యనుండి నిదురిస్తున్నవాడల్లా యజమాని లేచి, వీరాడే తెల్లటిరాత్రి దిరుసులోనే, తుపాకి పట్టుకొని వచ్చేవాడు. "ఈ జనానికి

ఏం పోయేకాలం వచ్చింది? పగటిపూట ప్రయాణంచేసి రాత్రులు నిద్ర పోరేం? సిపాయిలన్నా, వాళ్ళదుస్తులన్నా మంట. నిద్రపోయేవాళ్లని నిద్రపోనీయరేం?" అనుకొనేవాడేమో.

"ఇండియన్లు యిటేమైనాపోయారా?" అని ముర్రే ప్రశ్నించేవాడు.

"లేదయ్యా బాబూ. లేదన్నానుగా ఒకసారి! విదేళ్ళుగా యిండియన్ల అలికిడికూడ వినలేదు."

ఈ విధంగా లక్ష్యంలేకుండా పోవడం యిక యేమాత్రమూ నచ్చలేదు, ముర్రేకి. "దారి చూపేవాడు ఒకడుంటే బాగుండును. వాళ్ళు కుంతలే కావచ్చు గాని తామెక్కడికి పోతున్నారో తమకు తెలును. కాని మనమెక్కడికి పోతున్నట్టు? అని వింట్‌తో అన్నాడు.

"ఉత్తరానికి."

"ఇండియన్లుకూడ ఉత్తరానికే పోతుంటే..."

వింట్ భుజాలెగరవేశాడు. తెల్లవారకముందే వాళ్ళుగ్రీన్స్ బర్గ్ అనే బస్తీ చేరుకొన్నారు. పిశాచాలవలె రాత్రించరులవలె బస్తీనంతటిని కలవరపరిచి నిద్రలేపారు, భయపెట్టారు, ఆశ్చర్యం కలిగించారు; వందలాది తలలు కిటికీలవద్ద చేరాయి. రాజవీధి బారుకూ ఒకే వరుస! షెరీఫ్ కార్యాలయం ముందుఆగినారు. ముర్రే వాళ్ళను దిగి సేదదీర్చుకో మన్నాడు.

"షెరీఫ్!", అని వింట్ కేకపెట్టాడు. ఈ పొలికేకకు బస్తీయేకాదు, ప్రపంచమంతా మేల్కొంటే మేల్కొనీ, అనుకొన్నాడు "షెరీఫ్!."

కార్యాలయానికి వెనుక షెరీఫ్‌గారు నివసిస్తున్నారు. చేత తుపాకితో, రాత్రి దుసు మార్చకుండానే వచ్చాడు. కోడగుడ్డువంటి పుర్రె అంచులండే నిలిచివున్న వెంట్రుకలు గజిబిజిగా వున్నాయి.

"తుపాకి తీసెయ్ షెరీఫ్", అన్నాడు వింట్.

"హాయిగా నిద్రపోతున్న మర్యాదస్తుల నీరకంగా నిద్రలేపడమా మీపని?" అని గదమాయించాడతను.

"అవునులే, ఇండియన్లేవచ్చి లేపివుంటే ఆనందమయ్యేది కాబోలు. ఏం?"

"ఇండియన్లా?"

"అతన్ని నిద్రపోనియ్," అన్నాడు ముర్రే విసుగుపడి. "దారి చూపే వాడొకడు కావాలని చెప్పు. అవతల తన యిష్టం వచ్చినంతసేపు నిద్రపొమ్మను."

సైనికులీ పాటికే కునుకుతీశారు. వీధిలోనే గుర్రాల వెంబడినే కాళ్ళుచాచి గుర్రు తీశారు.

"మాకు దారిచూపేవాడు కావాలి."

బస్తీ సమస్తం మేల్కొన్నది. ఇండియన్లగాలి గాటుగా సోకింది. నిద్ర పోయిండే అని యిప్పుడు బాధపడేవారే కనిపించరు. అంతా పూర్వకాలంలా

గుంది. వీధి కా చివర, యీ చివర అడ్డుగా కుర్చీలూ బల్లలూ వేసి మోహరించాలని సూచనలు వచ్చాయి.

"దారి చూపేవాడు కావాలండీ! అంతకంటె యేమెక్కువ వద్దు."

"పాప్ ఫిల్వే వున్నాడు. అతనికీ యీ పరిసరాలన్నీ క్షుణ్ణంగా సాకల్యంగా ఎత్తుళ్ళు దిగుళ్ళు అన్నీ - అన్నీ తెలుసు" అన్నాడు షెరీఫ్.

"ఎక్కడున్నాడతను ?"

జనం "పాప్"ను గొంతెత్తి పిలువసాగినారు. అతనే వచ్చాడింతలో. నెరిసినగడ్డం, నిద్రకళ్లు.

"మా బంగారుతాతే !" అని నవ్వాడు గాట్లో.

"ఈ దేశమంతా తెలుసా ? ఎప్పుడైనా దారి చూపివున్నావా?" అని అడిగాడు ముర్రే.

"దారి చూపావా - భగవంతుడా, ఏంమాట అడిగావయ్యా కుర్రాడా!"

"మాకు దారిచూపే మనిషి కావాలి. మాతో వున్నవాణ్ణి చెయిన్నీలు కాల్చేశారు."

"మీరు చెయిన్నీల వెంటబడిపోతున్నారా?"

ముర్రే నిట్టూర్పు విడిచాడు. గాట్లో కిలకిల నవ్వాడు. వింట్ అందుకొని, "యిటు చూడు పాప్, మాకు దారిచూపుతావా? ఇండియన్ల జాడ తెలిసికోవాలని ప్రయత్నిస్తున్నాం. మూడువందలమంది వాళ్ళు వుత్తరం పారిపోతున్నారు. ఇండియను ప్రదేశంనుండి వాళ్ళను వెన్నాడుతున్నాము. నిన్ననో మాకళ్ళలో మసి గొట్టి ఎటో వెళ్ళిపోయారు. బహుశా యిక్కడికి దాపులోనే వుంటారు. ఇరవై మైళ్ళకంటె దూరంపోయివుండరు. రోజుకు మూడు డాలర్లిస్తాం. కల్నల్ గారితో చెప్పి బోనస్ యిచ్చేట్లుచూస్తాం. ఏం, నచ్చిందా ?" అని అడిగాడు.

"బాగానేవుంది. సరే! కాని ముందుగా ఒకమాట చెప్పుకోనీ. నన్నాట్టే ఆజ్ఞాపిస్తుంటే మట్టుకు నేనొప్పుకోను" అన్నాడు పాప్ ఫిల్వే.

"సరేలే" అని హామీ యిచ్చాడు వింట్

"అయితే నా గుర్రాన్నీ, తుపాకీనీ తెచ్చుకొంటాను," అనిపోయాడు.

"సైన్యపు డబ్బుదుబారా చేయడంలాగుంది" అన్నాడు వింట్. సైనికులకు గుర్రాల నెక్కమని హుకుమయింది. పదిహేను నిమిషాలలో తిరిగి స్వారీ మొదలయింది. బయళ్ళసీమ తొలిదినాళ్ళలో జరిగిన వీరకృత్యాలను కథలుకట్టి ఫిల్వే, తనలోతాను నవ్వుకొంటూ, కెప్టన్లకిద్దరికీ చెప్పుకొని పోతున్నాడు. ఫిల్వే శుంఠకాదు. సూర్యోదయపు తొలివెలుగులో అతను యిండియన్లు పోయిన జాడను కనిపెట్టాడు. కాని వాళ్ళువెళ్ళి ఎంతసేపయిందో మట్టుకు చెప్పలేక పోయాడు. ఒకగంటో, రెండుగంటలో అయివుంటుం దన్నాడు.

"అయితే మనమిక్కడ కాస్సేపు సేదదీర్చుకొని మళ్ళీ స్వారీసాగిస్తాం" అన్నాడు ముర్రే. సైనికులుదిగి రెండుగంటలసేపు విశ్రమించారు. మెలకువతో బాటు వుత్సాహంకూడ రెక్కొన్నది. గుర్రాలను జోరుగా పోనిచ్చారు. వెనకటి నిస్త్రాణ మటుమాయమయింది. పూర్వం ఇండియన్లపట్ల వాళ్ళకు గౌరవ భావముండేది. వాళ్లు జగదేకవీరులనీ, దుర్గమయమయిన దేశాన్ని లెక్కించక, వేయి మైళ్ళదూరానవున్న పర్వతసీమకు పయనంగట్టిన సాహసులని, స్వేచ్ఛాప్రియులని అనుకొనేవాళ్లు. కాని యీ మెప్పుకు అసలు కారణం ఒకటివుంది. ఈవేళ కాకుంటే రేపైనా యిండియన్లు తమచేత చిక్కిపోతారనే ధీమావల్ల వారు పూర్తిగా శత్రుభావం వహించలేదు. కాని ఇండియన్లు తమందరిని దద్దమ్మలనుచేసి ముప్పతిప్పలుపెట్టి మూడు చెరువుల నీళ్ళు త్రాగించడమూ, పాదరసంవలె పారిపోవడమూ, చూచిన తర్వాత, వాళ్ళకు కసియెక్కువయింది. ఈసారి అటో యిటో పటాపంచలైపోవాలని నిశ్చయించుకొన్నారు. ఇంతలో మైదానాలనతిక్రమించి, మిట్టపల్లాల సయమైవున్న భూమిప్రవేశించారు.

"త్వరలో ఆర్కాన్సాస్ తగులుతుంది" అన్నాడు వింట్.

"పది మైళ్ళుంటుందేమో," నన్నాడు వృద్ధుడైన పాప్ ఫిల్వే. అతనికి నిద్ర ముంచుకొనివస్తున్నది. ముర్రే బాటకేసి చూపాడు. వింట్ నిద్రపోవద్దన్నాడు: "ఏమిటి నాయన్లారా. బాటవెంబడేపోలేరూ? అవసరమైతే కళ్ళుమూసికొని, యీ దారినే కెనడీ సరిహద్దు దాకాపోగలనునుమా!" అన్నాడు ఫిల్వే.

"నువ్వు పోగలవేమో కానీ—"

"అంత అధైర్యమైతే ఎట్లా, నాయనా! ఇండియన్లుకూడా మానవ మాత్రులే కాదూ? వాళ్ళకుగూడా తిండీ తిప్పా, నిద్రా, తీరికా కావాలి. మీరు చెప్పేదాన్నిబట్టి, వాళ్ళ గుర్రాలు యిప్పటికే సగం చచ్చి వున్నాయి. మధ్యాహ్నానికో, సాయంకాలానికో తప్పక మనకంటబడతారు."

అతని వూహ నిరాధారమైనదికాదని త్వరలో తేలిపోయింది. ఏకాకిగా గొర్రెల మందను మేపుకొంటున్నవాడు, దళాన్ని సమీపించి, ఒకగంటక్రితమే ఇండియన్లు వెళ్ళిపోయారని చెప్పాడు. గుర్రాలవేగం అతిశయించింది. రైలుబండి పొగ వదులుతున్నట్లు దూళి తెరలు తెరలుగా రేగసాగింది. అంతటిలో ప్రేల్పులు వినవచ్చాయి. దూరంనుంచి వింటే, చిత్రమయిన పక్షులగుంపు కిలకిలలాడుతున్నట్లుంటుంది. ముర్రే ఆగమని ఆజ్ఞాపించాడు. ఫిల్వే నవ్వు కోడిపెట్ట కంఠధ్వనిలాగుంది.

"దొరికారు, నాయనా, నువ్వు వెతుకుతున్నవాళ్లు!" అన్నాడు.

"ప్రేల్పుడు మోపుగా వుందే" అన్నాడు వింట్.

ప్రేల్పుడు చప్పుడు అణగారి పోయింది. గాట్లోను పిలిచి, యిద్దరు

ముగ్గురిని వెంటబెట్టుకొనిపోయి, ఏమి జరుగుతున్నదో చూచివచ్చి చెప్పమని ముర్రే ఆజ్ఞాపించాడు. అభివాదంచేసి, కొందరిని వెంటబెట్టుకొని, దౌడుతీశాడు గాల్లో. దళమేమో నిదానంగా పోసాగింది. సైనికులకు ఆసక్తి ఎక్కువయింది. అరచేతి తొడుగులు తీసివేసి, తడిగావున్న అరచేతులను తొడలమీద రుద్దుకొన సాగినారు. జీనులలో వంగినట్లు కూర్చుని, కళ్ళకు చేతులడ్డంపెట్టి, దుమ్ముచేరిన పెదిమలను నాల్కలతో తడుపుకొన్నారు. శిథిలమైన డాడ్జ్‌నగర జనసేన అరుచు కొంటూ ఓర్చుకొంటూ వస్తూవున్నది.

◆ ◆ ◆ ◆

"కెప్టన్‌గారూ", అని పిలిచాడు డాడ్జ్ నగరపు షెరీఫ్ అయిన బాట్ మాస్టర్సన్ "మీరు మంచివారులాగా వున్నారు. ఇటు చూడండి—"

"ఇటూలేదు, అటూలేదు. అర్థంపర్థంలేని ఈ పిచ్చిచేష్టకు ఈ విధ్వంసానికి మీరే బాధ్యులు. ఈ పనికిమాలిన మూకతోనటండీ మీరు ఇండియన్లమీదికి దాడి పోయింది? ఇండియన్లతో పోట్లాడడమంటే మజాకా అనుకొన్నారా?"

"నేను ఆపజూచానండీ. ఆగితేగా? సైనికులు కొందరైనా తోడువచ్చి వుంటే, యింత అయ్యేది కాదు".

ముర్రే ధోరణికి జనసేనలో కొందరు కంటగించుకొన్నారు. వారిలో ఒకడు ముర్రేతో, "కొప్పడి లాభంలేదు సిపాయీ, యిష్టంవచ్చినట్లు చేసు కొంటాం. చస్తాం కావాలంటే, మధ్యలో నువ్వెవడివి", అన్నాడు.

"నా సేన నడిచిన చోట్లంతా శాంతి భద్రతలను కాపాడే అధికారం నాకుంది", అని ముర్రే గర్జించాడు.

"అయితే యీ మొండి పిశాచాలను దక్షిణాదినే ఎందుకు నిలిపివేయలేక పోయావ్?"

"మిస్టర్, అదనం మాట్లాడితే మిమ్మల్నందరినీ అరెస్టు చేయగలను, జాగర్త", అన్నాడు ముర్రే.

జనసేన అధికభాగం మాస్టర్సన్ చుట్టూ, ఆఫీసర్ల చుట్టూ మూగింది. ఊదుకుతూ వున్నారు. శివమెక్కుతూ వుంది. ఓటమి మరచిపోయారు. సిపాయీల పట్ల నిరసన, ఇండియన్లపట్ల ద్వేషం ప్రబలమైంది. ముర్రేని నానాదుర్భాషలాడి కోపమంతా వెళ్ళగ్రక్కారు. అశ్వికులు గుర్రాలు దిగి పచ్చికమీద పవళించి, నొప్పిపుడుతున్న కండరాలను కాస్త చాచుకొన్నారు. చేతులనే దిండ్లు చేసికొని వెల్లకిల పడుకొన్నారు. వారికి యీ వాదోపవాదాలు పట్టలేదు.

"కాస్త ఓపికపట్టండి కెప్టన్‌గారూ," అన్నాడు మాస్టర్సన్. "ఎవళ్ళ యిష్టంవచ్చినట్లుగా వాళ్ళు మాట్లాడి వేస్తున్నారు. పసిపిల్లల్లాగా కుమ్ములాడుకొంటే కాగలపని చెడిపోతుంది. కాన్సాస్ రాష్ట్రంలో సైనికశాసనంలేదు. మీ కెవరినీ

అరెస్టు చేయలేరు. మీపని చెయిన్నీలను లోబరచుకోవడం. మనం చేయిచేయి కలిపితే బాగుంటుంది."

"మీరక్కరలేదు నాకు," అన్నాడు ముర్రే. "పౌరులు జాకవసరం లేదంటే."

"మాకసి మాకుంది. మాపగ మేం తీర్చుకోవాలికదా!"

"ఏరకంగా తీర్చుకొన్నారో చూశాంగదా?"

"కావచ్చుకాని మీతోబాటు మేమూ వస్తాము."

"యమదూతల్లా వచ్చేటట్లుంది వెనకాలే."

జనసేనలో సగంమంది మాస్టర్సన్‌ను బలపరిస్తే, మిగిలినసగంమంది నెమ్మదిగా, సైనికులవైపు సాతురదృక్కులుపరుస్తూ, మృతులచుట్టూ, క్షతగాత్రులచుట్టుతూ, గుమిగూడుతూ, లజ్జావనత వదనాలతో జారిపోయారు. టెలిగ్రాఫ్ అపరేటరు గాయపడిన చేతిని మరొకచేతితో అదిమిపట్టుకొని పచ్చికమీద కూర్చునివున్నాడు. సోదరుణ్ణి కోల్పోయిన ఇంగ్లీషు కుర్రవాడు లక్ష్యమే లేకుండా కాలుగాలిన పిల్లివలె తిరుగుతున్నాడు. అతని మృతసోదరుని ముఖం మీద చొక్కాకప్పబడివుంది. గుండెలో దూరిన అమ్ము అట్లాగే వుండిపోయింది.

"వాళ్ళనుకూడా రానీయండి - మరేంచేద్దాం?" అన్నాడు వింట్.

ఇంకా మాస్టర్సన్‌ను తీక్షణంగా చూస్తున్న ముర్రే చివాలునలేచిపోయి గుర్రమెక్కినాడు. అతని వెనువెంటనే యితర సైనికులు అనుకరించారు. పాప్‌ఫిల్వే అసలు దిగనేలేదు. పొగాకు నములుతూ గాలివాలున తుప్పు తుప్పుమని ఎంగిలి వుమ్మేస్తున్నాడు. మాస్టర్సన్, జనసేనలో మిగిలివున్న వాళ్ళు, తమ తమ గుర్రాలనెక్కారు. వెనుదిరిగి చూడకుండా ముర్రే చెయిన్నీలజాడలోనే తన సైనికులను ముందుండి నడిపించాడు.

సైనికులూ పౌరులూ అదృశ్యమయ్యేవరకు వారికంక అదేపనిగా చూస్తుండిపోయారు, యుద్ధరంగాన యింకా నిలుచున్న జనసైనికులు. ఒకటి రెండు నిమిషాలపాటు టెలిగ్రాఫ్ ఆపరేటరు దౌడుతీస్తున్న గుర్రాలవైపు చూచి తటీల్మన్ని గుర్రమున్నచోటికి పరుగుతీసి, యెక్కి తానూ దౌడుతీశాడు. ఎవరో వెనుకనుంచి పిలుస్తున్నట్లుంటే తిరిగి చూచాడు. ఆ యింగ్లీషుకుర్రవాడు కూడ వస్తున్నాడు. అతనువచ్చి చేరుకొనేవరకూ ఆగి, తర్వాత యిద్దరూ కలిసి మరుమాటయినా లేకుండా సైన్యం వెంటబడిపోయారు.

త్వరపడవలసినంత అవసరమేమీ లేదనిపించింది ముర్రేకి. రానున్నది రాకమానదు. కానున్నది కాకమానదు. చెయిన్నీలు తమకంటె మూడుగంటలు ముందుపోయివుండవచ్చు. ఒకటికి మాటికీ అంత తేడాలేదు. ఎక్కడో ఒకచోట వాళ్లు విశ్రమించాలి, భోంచేయాలి, నిద్రించాలికదా, యీ లోపల కలుసుకోవచ్చు ననుకొన్నాడు. యుద్ధరంగానికి మైలుదూరాన ఇండియన్ల

గుర్రమొకటి చచ్చిపడి యీగెలు ముసురుకొనివున్నది. వాళ్ళకు చాలినన్ని గుర్రాలు వున్నట్లులేదు. ఇద్దరిద్దరుగా కొందరు ఒక గుర్రంమీదనే పోవలసి నట్లుంది. తిండితిప్ప లెట్లా చేస్తున్నారో భగవంతుడికే తెలియాలి. బహుశా పస రాలను చంపితింటున్నారేమో! అయితేమాత్రం, మూడువందలమందికి కావలసి నంతమాంసం ఎక్కడ దొరుకుతుంది? ఏ జాతికిచెందిన వారైనా కావచ్చు గాని, స్త్రీలూ పిల్లలూ రోజుకు ఎనిమిది, తొమ్మిది, పది గంటలసేపు నిర్విరామంగా స్వారీ చేయడం కష్టం. వాళ్లుపడే బాధగురించి ముర్రే ఆలోచించదలచుకోలేదు. వాళ్ళను చేత యిరికించుకోవడమే తన వుద్యోగ ధర్మం!

"ఈవేళా?" అని అడిగాడు వింట్.

"ఎప్పుడయినా ఫరవాలేదు ఇవ్వాళగాని, రేపుగాని" అని ముర్రే జవాబు.

ఆట్టే లోతులేని ఆర్కాన్సాస్ నదిలో దిగి బురదనీటినిదాటి రైలుబాటకు పశ్చిమోత్తరోన్ముఖులై వెళ్ళిపోయారు. నిర్భర సంతోషాతిశయాన కిలకిలలాడుతూ పాప్ ఫిల్వే ఇండియన్ల జాడను నీటిలోపలికి, నదినుండి తిరిగి భూమిమీదికి కనిపెట్టినాడు. మరొక మృతాశ్వదేహం కనుపించింది. తోడేళ్లురెండు మాంసాన్ని కొరికి తింటున్నాయి. ఇంత పెద్దదండును చూచికూడా అవి తమ పెన్నిధిని వదలలేదు. రెండడుగులుమాత్రమే వెనుకకుపోయి, అరుస్తూ ఆక్రోశిస్తూ, ప్రాణ్ణా శనం లభించిందనే ధైర్యంతో నిలబడ్డాయి.

రెండుగంటలవేళకు, గోనెపట్ట పైకప్పుగల సైనిక శకటాలు, వాటివెంబడి కొందరు గుర్రపురౌతులు పడమటిదిశనుండి రావడం కనుపించింది. వింట్ వాటికి యెదురుపోయాడు. శకటాలనిండా సైనికులున్నారు. వారి పైవుద్యోగి ముందుకు వచ్చి వింట్‌తో, తనపేరు కెప్టన్‌ట్రాస్క్‌అనీ, తాము డాడ్జ్‌దుర్గంనుండి వస్తున్నామని చెప్పినాడు.

"చాలా సంతోషం చాలా సంతోషం. నాపేరు వింట్. మాపై అధికారి కెప్టెన్ ముర్రే. రెనో దుర్గంనుంచి వచ్చాం మేము. రెండు దళాలు!

"నేనదే అనుకొన్నాను. మీరు సెడ్విర్గ్‌ని కలవలేదా?"

"ఎవరతను? మేమసలు చూడనేలేదే?" అన్నాడు వింట్.

ఇంతలోపల సైనికులువచ్చి చుట్టూమూగారు. మాస్టర్సన్, అతనితోబాటు జనసైనికులుకూడ వచ్చారు. బళ్ళుదిగి బారుతీరమని ముర్రే ఆజ్ఞాపించాడు. శక టాలు నిలిచాయి. ఇరకాటపడుతున్న కాల్బలపు సైనికులు దిగిపోయారు. జనసేన ఒక వైపున్నే గుమికూడింది. ఇంత నిశ్చింతగా తీరుబడిగావచ్చిన సైనికులను చూచేసరికి, పౌరసేనకు మామూలు సైనికులపట్ల వుండిన తూష్ణీభావం తిరిగి రేకొన్నది. ఆశ్విక, పదాతిదళాలు భాయ్‌భాయ్ అనుకొని కలగలసిపోయాయి. సిగరెట్ కాగితంగురించి, పొగాకుగురించి, తీపి తినుబండారాలను గురించి,

కీచులాట మొదలయింది. కనో దుర్గపు సైనికులు కొత్తగా వచ్చిన వారితో సగర్వంగా తమ అనుభవాలను వివరించి చెప్పసాగారు. ధైర్యం ప్రబలింది.

మాస్టర్సన్ ఆఫీసర్లతో జతచేశాడు. ట్రాస్క్ యిచ్చిన చుట్టముట్టించి నెమ్మదిగా పొగపీల్చసాగినాడు. ఇండియన్ ప్రదేశం విడిచినప్పటినుండి ఘటిల్లిన విషయపరంపరను ముర్రే సవివరంగా చెప్పకొనిపోయాడు.

"మిమ్మల్ని కలిసికొనేందుకని సెడ్విర్గ్‌ను దక్షిణంగా పంపారు" అని ట్రాస్క్ చెప్పాడు. "కంచరగాడిదల నెక్కిన సైనికులతో అతను సరిగా దక్షిణానికే పోయివుంటాడు. మీరు పంపిన రాగిజుత్తు సిపాయికూడ అతనితో బాటు వచ్చాడు".

"మేము అతన్ని తప్పిపోయామన్నమాట."

"బహుశా అతను ఇండియన్లను తప్పిపోయాడేమో. ఈ స్థలంనుండి రైలు దారిలోగా ఇండియన్లను అటకాయించమని నాకు పై అధికారులు ఆజ్ఞచేశారు. ఈవేళ ప్రొద్దున్నే బయలుదేరి వచ్చాను. మనమీ విధంగా తారసిల్లుతామనుకోలేదు నేను."

"బాగుంది నాయనా! వెదకబోయిన తీగె కాళ్ళకు తగులుకొన్నదట. నువ్వు పోరాడదలచి వచ్చిన ఇండియన్లు చుట్టుపట్లే వున్నారులే!" అన్నాడు ఫిలీవ్, మామూలు నవ్వుతోటి.

"చూచారూ, డాడ్జినగరంనుండి యీ మాస్టర్సన్‌గారు పౌరసేనను వెంటబెట్టుకొని వచ్చి నదికావల ఇండియన్ల నెదిరించారు. సగం సేన అక్కడే వుండిపోయింది," అన్నాడు ముర్రే.

"హతమై వుండిపోయిందా యేమిటి?" అని ప్రశ్నించాడు.

"ముగ్గురే చనిపోయింది. తతిమ్మా సరుకు యింటిదారి పట్టింది."

"ఫరవాలేదు. ఇండియన్లు మరి తప్పించుకొని పోలేరు. రైలుబాటమీద రెండు దళాలున్నాయి, లార్నెద్‌నుంచి అశ్వికదళం వస్తున్నది. ఇక్కడ మూడు వందలమంది వున్నారు. భారమంతా మీదే కెప్టెన్, మీరు చెప్పినట్లు చేయడమే మాపని," అన్నాడు ట్రాస్క్.

"థేంక్స్," అన్నాడు ముక్తసరిగా కెప్టెన్ ముర్రే. ఇద్దరూ కరచాలనం చేసిన కొన్ని క్షణాలలో సేనలు తిరిగి ప్రయాణం మొదలెట్టాయి.

◆ ◆ ◆

ఆనాటికి పశ్చిమ కాన్సాస్ రాష్ట్రం చాలవరకు దిబాసిగా నిర్జనమై మైళ్ళ పర్యంతం మానవ నివాసమేలేక, బ్రహ్మాండమైన బయలుగా వుండేది. గుర్రంమీద వంగి కూర్చున్న అశ్వికుని యెత్తుకు పెరిగిన పచ్చికమెండు. లోతుపాతులేని నదులు అనేకం సంవత్సరంలో అధికభాగం తడిపొడలేనివి, ఒకొకప్పుడు గర్జిస్తూ మరొకప్పుడు మొద్దుబారి వుండేవి. ఆర్కాన్సాస్‌నదికి దాపులలో కాస్త యెగువగా బోతే యిటువంటి ఏకాంత స్థలం ప్రత్యక్షమయ్యేది. తర్వాత తర్వాత

రైలు బాటలు వ్యాపించి, పశుల మేపరుల స్థానంలో క్షేత్రికులు తుపాకులతో చొరబడినారు, కాని 1878 లో యిది చాలమట్టుకు కన్నె బయలు.

ఈ ప్రదేశాన్ని దృష్టికి కేంద్ర బిందువుగా పెట్టుకొని, డేగ యేదైనా వాయుసీమలలో విహరిస్తున్నట్లయితే, ఆర్కాన్సాస్ నదీ గతిలో ప్రాస్వాతి ప్రాస్వమయిన వంపు మీదుగా అస్తంగత మార్తాండుని అరుణిమ లోనికివుత్తరంగా యింకా వుత్తరంగా, వాయువేగాన పోతున్న చెయిన్నీ గ్రామం కనుపించివుండేది. దూరవ్యాప్త దృష్టితో చూచినట్లయితే, లార్నెడ్ దుర్గంనుండి దక్షిణంనుండి, పడమటినుండి రభటిస్తూన్న అశ్వధాటి కనుపించి వుండేది. ఇండియన్ల జాడనంటి పెట్టుకొని పోతున్న అశ్వికదళాలు రెండూ, కాల్బలపు దళమొకటి గోచరమై వుండేది. ఒక్క చూపునక్రిందికి వచ్చి నిబుతిదిశను పరీక్షించి చూచినట్లయితే, ఉత్తరానికీ, తూర్పుకూ విస్తరించుకొని, కిమర్రాన్ రేవువద్ద ఆర్కాన్సాస్ నదిని దాటి, గాడిదలపై యెక్కివస్తూన్న పదాతిదళం కనుపించేది. డాడ్జ్ దుర్గంనుండి వస్తూన్న సరఫరా రైలుబండి పురోగతి దృగ్గోచరమై వుండేది. జోరుగా వుత్తరోన్ముఖంగా యెగిరిపోయినట్లయితే, వాలస్ దుర్గంనుండి స్మోకీహిల్ నది గట్టు మీదుగాదక్షిణంనుండి, తూర్పునుండి హుటాహుటిగా స్వారీవస్తున్న అశ్వికదళం ప్రత్యక్షమై వుండేది.

డేగచూపు మాటకేమిగాని బయళ్ళసీమలో ప్రతివాడూ కలవరపడ సాగినాడు. ఈ సైన్యదళాలు నిర్విరామంగా బయలుదేరి పోవడంచేత వారికి అస్థిలో జ్వరం కాయసాగింది. కిటికీతలుపులను గట్టిగా బిగించేవాళ్ళు. తుపాకులను తుప్పువదలగొట్టేవాళ్లు. తంతి తీగలు సందేశాలతో ప్రచలింపసాగినై. బయళ్ళసీమలోని శతానేక నగరాలలో రాత్రి మానసికాందోళనా జనకమై, జనులను నిర్నిద్రులను చేసింది. "చెయిన్నీ లెక్కడున్నారు?" అనే భయాకుల ప్రశ్న సహస్రానేక పర్యాయాలు వినవచ్చేది.

◆ ◆ ◆ ◆

అటోయిటో తేల్చుకోనిదే ముర్రేకి మనశ్శాంతిలేదు. కాల్బలాన్ని వెంట బెట్టుకొని పోవడమంటే నత్తనడక నడవడమే. ఏదోఒకటి తేలిపోవాలని ముర్రే త్వరపడుతున్నాడు. భయం అతనిలో రెక్కలు విప్పుకొనసాగింది. ఇప్పుడే గట్టిగా త్వరత్వరగా చెయిన్నీలను దెబ్బతీయాలనే నిశ్చయం ప్రబలంకా సాగింది. "మాపో-రేపో," నని తనకు తానే స్థిరపరచుకొన్నాడు.

"త్వరగా తీరిపోతే బాగుండును," అన్నాడు వింట్ కూడా. "మాపో-రేపో," నన్నాడు ముర్రేసాలోచనగా. "శకటాలు వచ్చాయి. కాల్బలం డాడ్జ్ నగరానికి నడిచిపోగలదు. ఓడించిన తర్వాత మిగిలిన ఇండియన్లందరినీ బళ్ళెక్కించి పట్టుకొనిపోదాం. ఇదే మంచిపని. ట్రాస్కుతో మాట్లాడి, బళ్ళు మనకప్పచెప్పేలా చేస్తాను," అన్నాడు వింట్.

గంటకు ఐదారు మైళ్ళవేగాన, గాడిదలులాగే బళ్ళతోపాటు, ముందుకు పోసాగినారు. ముందు ఆశ్వికులు, తర్వాత శకటాలు, వెనక జనసేన. జన సైనికులు ఆశాభంగం చెందివున్నారు. ద్వేషం నిండివున్నారు. "వీళ్ళు పారిపోనైనా పోతారు. లేకుంటే శిరమెత్తి చేతికందిన వాళ్ళను చంపివేయనైనా వేస్తారు. వీళ్ళను ఇండియన్ స్త్రీలవైపు పోనీయకుండా జాగ్రత్త పడాలి," అనుకొన్నాడు ముర్రే. వింట్ కూడ అతనితో ఏకీభవించాడు. "ఈ వ్యవహార మంతా వాస్తవంలాలేదు. కలలాగుంది. ఎంత త్వరగా ముగిస్తే అంతహాయి - పీడకల!" అన్నాడు వింట్.

వృద్ధుడైన పాప్ షిల్వే అగ్రశ్రేణితోబాటు స్వారిచేస్తున్నాడు. ఆసక్తిగాని ఓపికగాని వీసమెత్తుకూడ క్షీణించలేదు. వేటకుక్కవలె పనిబట్టుతున్నాడు. అప్పుడప్పుడు కునికిపాట్లు పడడమొక్కటి తప్ప, అతనికి అలసట వున్నట్టుగానే లేదు. గాలిని మూమాస్తూ, దిక్కులు పరికిస్తూ వంగి జాడకు కళ్ళాన్చి తదేకంగా పరీక్షిస్తూ అతను జాగిలంవలె సర్వాంగజాగరూకుడై వున్నాడు. "వాళ్ళ దగ్గర పడ్డారా," అని లెఫ్టినెంట్ గాల్లో అడిగాడు.

"వాళ్ళకంపు కొట్టుతూంది నాయనా!"

"ఇండియన్లుకూడ యిదే రకంగా శత్రువాసన కనిపెట్టుతారని విన్నాను. నిజంగా వాళ్ళవాసన కొట్టుతూందా?"

దైవంతోడు - వాళ్ళదాపున్నే వున్నారు."

"బయళ్ళసీమలో చాల రోజులబట్టి వున్నావా తాతయ్యా?"

"చాల రోజులబట్టి? అక్టోబరు తొమ్మిదో తారీఖునాటికి డెబ్బయి ఆరోయేడు వస్తుంది. ఇందులో నలభయ్యేళ్ళు ఈ సీమలో చెడతిరిగాను. కాని ఒక్క యిండియన్ను కూడ చంపలేదు నాయనా! నాకా అవసరమే కలగలేదు. ఎంతో రక్తం చూశాను కాని, నా చేతులార రక్తం చిందించలేదు."

"పోట్లాడవా ఏమిటి తాతయ్యా?"

"లేదు నాయనా, భగవంతుడి దయవల్ల యిప్పటికి యుద్ధం చేయలేదు. పాపమార్గాలు పట్టించకు ప్రభూ, అని మన పరిశుద్ధగ్రంథం చెబుతుంది. నాకే ప్రమాదం లేకుండా, ఒకరి సహాయం లేకుండా, జాగ్రతపడగలను."

కొంత సేపయిన తర్వాత సైనికులు విశ్రాంతి తీసికొని, డాడ్జ్ నగరంనుండి కెప్టన్ ట్రాస్క్ తెచ్చిన తినుబండారాలను పుష్కలంగా, సమృద్ధిగా తిన్నారు. ముర్రే ఆజ్ఞమేరకు, మార్గమెట్లుందో చూచి రావడానికి షిల్వే పోయాడు. అతను తిరిగి వచ్చేటప్పటికి సైనికులు తయారుగా వున్నారు. షిల్వే నిర్భరోద్రేకంతో తొణికిసలాడుతున్నాడు, నవ్వుకొంటున్నాడు, గంతులువేస్తున్నాడు.

"ఉన్నారున్నారు", అని అల్లంత దూరంనుంచే అరిచి చెప్పాడు.

"ఎక్కడెక్కడ?"

"కాసింత యెగువగా-చిన్న యేరుండే అక్కడ. రాత్రికి అక్కడే వుండి పోయేలాగుంది".

"ఎంతదూరం?"

"మూడు మైళ్ళ," అని నవ్వాడు ఫిల్వే." "ఆడాళ్ళేమిటి, బుడతాళ్లేమిటి, తెగయావత్తూ వుంది నాయనా! ఇండియన్లు: అందులోనూ మొండిపోటర్లు! మరేమైనా వుందా? ఆడమక్కల కొట్లాట! భేషుగ్గా వుంటుంది!"

"ఇతనికి మతితప్పింది, కెప్టన్! ముదిమితో వున్న మతితప్పుతుంది. డెబ్భయ్యారేళ్ళట!" అన్నాడు గాల్లో.

"నిజం! నావయసంతే."

"సరే, పాప్! నిజంగా వున్నారా? సందేహమేలేదానీకు?" అని అడిగాడు ముర్రే.

"కళ్ళున్నాయిగా చూడడానికి."

సూర్యుడు దుర్బలుడయ్యాడు. క్రుంగి పోతున్నాడు. పూతపూసినట్లున్న లేత కెంపుకాంతి కళ్ళను కొట్టవచ్చినట్టులేదు. సంజెకాంతిలో, నిర్జనమైన బహిరంగస్థలం దుఃఖమయ గంభీరస్వరూపం తాల్చింది. వింట్ చేతిగడియారాన్ని చూచుకొన్నాడు. ట్రాస్క్ వచ్చి ముర్రే, వింట్‌ల ప్రక్క చేరాడు. చిన్న చిన్న అధికారులు గుమిగూడారు, వాళ్ళవెనక జనసేన కూడింది.

"రాత్రికక్కడే వుండిపోరనుకొంటాను. మనం దాపుకే వచ్చామని వాళ్ళకు తెలుసునేమో" అన్నాడు ముర్రే.

"వాళ్ళంటే మీకు చాలాగౌరవమే", అని వ్యంగ్యంగా అన్నాడు ట్రాస్క్. ముర్రే పిరికిబారి పోతున్నా డనిపించిందికాబోలు. ముర్రే వయోధికుడు. భయస్తుడు. అధికారభారాన్ని వదలివేస్తున్నట్లుగా వుంది ట్రాస్క్‌కు. పరిస్థితి అతనికి నిజంగా బోధపడినట్లులేదు. వింట్ ముర్రేకంటె పసివాడు, మెత్తటివాడు. దాదాపు స్త్రీత్వం పాళ్ళెక్కువగా వున్నట్లుంది అతనిలో. అటువంటి వాళ్ళను ట్రాస్క్ దరిచేరనీయడు. వాళ్ళంటే ఏవగింపు, చులకన.

"గౌరవమా?" అన్నాడు కలతపడి, ముర్రే.

"వాళ్ళు ఇండియన్లు. మీకు తెలుసుగదా! మరి చెప్పనక్కరలేదు" అన్నాడు ట్రాస్క్.

"ఎందుకు తెలియదు?" అన్నాడు ముర్రే.

"ఈవేళ యీరాత్రికే పూర్తికావాలి," అన్నాడు ట్రాస్క్.

"మాపటికో రేపో," అని భుజాలెగురవేశాడు ముర్రే. అతని యుద్ధాసక్తి అంతా యింతలో యెప్పుడు ఎక్కడ కరిగిపోయిందోనని ఆశ్చర్యంగా చూస్తున్నాడు వింట్.

"చీకటి పడబోతూంది. పడకముందే బయలుదేరాలి. చూడముచ్చటగా వుంటుంది- ఆడమక్కల కొట్లాట!" అని నవ్వాడు ఫిల్వే.

"రేపయినా ఒకటే, యిప్పుడయినా ఒకటే," నన్నాడు మాస్టర్సన్.

ముర్రే ఆలోచించసాగినాడు. "చీకటిపూట అత్యంత సులభంగానూ వుండవచ్చు- దుస్సాధ్యమూ కావచ్చు. ఇతను తన మూకను డాడ్జ్‌నగరానికి తీసికొని పోడేమిఖర్మ?" అనుకొన్నాడు. పోకపోతే కాల్చివేస్తామని తా నసలు ఎందుకు బెదిరించలేదు?

"ఆలస్యమవుతూవుంది," అంటూ వింట్ గడియారంవంక చూడసాగాడు.

"అయితే సరే, పోదాం," అన్నాడు ముర్రే, ట్రాస్క్‌తో. "మావు పూతగా కాల్పులాన్ని తీసుకురండి. వాళ్ళు కదలజూస్తే దాడిచేద్దాం". ట్రాస్క్ నవ్వాడు.

"మేముకూడా రామా?" అని మాస్టర్సన్ ప్రశ్నించాడు.

"కాల్పులంతో కూడావుండండి," అన్నాడు ముర్రే. "మీ పాత్రను తర్వాత ముంచుకొందురుగాని. ఈలోగా, నా ఆజ్ఞల నతిక్రమించ వీల్లేదు."

"ఆజ్ఞలు ఎక్కువయితే?" అన్నాడు మాస్టర్సన్.

"అయినాగాని తలదాల్చ వలసిందే, షెరీఫ్! కాల్పులంతో బాటు వుండి పొమ్మంటున్నాను. తెలిసిందా?" అని గద్దించాడు ముర్రే.

ఒకరినొకరు కొరకొర చూచుకొన్నారు. మాస్టర్సన్ అంతలో మెత్తబడ్డాడు. అతని చిరునవ్వు ముర్రేకి కంటకప్రాయంగా వుంది. మొరిగినట్లు గొంతెత్తి ఆజ్ఞలుచేశాడు. ఆశ్వికదళం కదిలింది. ఫిల్వే ముందున్నాడు. ఒకసారికాబోలు. వింట్ ముర్రేచేతిని స్పృశించి తల ఆడించాడు. రాత్రి అయింది. డజనుమంది దళానికి ముందు విసనకర్ర ఆకృతిలో పరుచుకొన్నారు. వింట్ చీకటిని చీల్చుకొనేలాగు చూపులు నిగుడిస్తున్నాడు. బయళ్ళసీమలో రాత్రి తొలిజాము పాటవలె, గాలి ఆలపించే బృందగీతివలె వుంటుంది. ఎత్తుగా ఒత్తుగా పెరిగిన పచ్చిక, వికృతాకారాలతో కనుపించే చెట్లు, దూరమందు లీలగాతోచే దిగ్రేఖ, పాలిన వన్నెతో విలసిల్లే అపారమైన ఆకసం— అంతా చిత్రసుందరమై వుంది. గస్తీలు తిరిగివచ్చి ఏటికావల మిర్రునేలమీద విడిదిచేసి వున్నారని, కందకాలు త్రవ్వకొని తయారులో వున్నారని ముర్రేకి నివేదించారు. ఎదురుగా చూస్తే రవ్వలు నింపుకొన్న వందలాది జ్వాలకాంతి కనుపిస్తున్నది. వాళ్ళెక్కడో నక్కి దాగిపోవాలనుకుంటే మంట లెందుకు వేసుకొంటారు? యావత్ప్రపంచమూ చూడవలెననే ప్రతిరాత్రివేళలోనూ మహాజ్వాలను రగిలిస్తారు.

"కందకాలు త్రవ్వడ మెక్కడ నేర్చుకొన్నారో" అన్నాడు వింట్.

"ఈసారి పారిపోలేరు. ప్రొద్దున్నే దాడిపోదాం" అన్నాడు ముర్రే.

"ట్రాస్క్ విషయం?"

"ఏళ్లో కలకనీ! శిబిరాలు వేసుకోమని చెప్పు మన వాళ్ళతో!"

మరొకప్పుడైతే ట్రాస్క్‌తోటి తన కష్టాల నన్నిటినీ ముర్రే యేకరువు పెట్టివుండేవాడేమో! తన సైనికులు అలసిపోయివున్నారని, రాత్రిపూట దెబ్బ తీయడ మనేది జూదమాడడం వంటిదని, మాస్టర్సన్ మనుషులు ఇండియన్ స్త్రీల నేమైనా చేయగలరని, యిలాంటివి ఎన్నో చెప్పివుండేవాడేమో! కాని శిలవలె అతను నిశ్శబ్దంగా కూర్చుండిపోయాడు. కెప్టన్ ట్రాస్క్ మండిపడి ప్రేలసాగినాడు. అంతా వెళ్ళగ్రక్కినతర్వాత ముర్రే, "కెప్టన్, నీవు పై అధికారులకు నామీద ఏదైనా చెప్పుకోగోరితే, నిరభ్యంతరంగా నివేదిక వ్రాసి పంపుకో వచ్చు"నన్నాడు.

"వ్రాయక ఊరకుంటానా?" అన్నాడు ట్రాస్క్.

"ఏమైనాగాని, ఉదయాన్నే దాడి ప్రారంభమౌతుంది" అని అధికార స్వరంతో అన్నాడు ముర్రే. ట్రాస్క్‌కు రెండే రెండు మార్గాలు. అందరితో బాటు కిక్కురు మనకుండా పడివుండడమో, తన దళాన్ని వెంటబెట్టుకొని యీ చీకటిపూట ఇండియన్లమీదికి యెత్తిపోవడమో! తమాయిద్దామని నిశ్చయించుకొన్నాడు.

ముర్రే సైనికులను గాఢనిద్ర ఆవేశించింది. కిరకిరలాడుతూ మరిపన్నెండు శకటాలు రావడంకూడ వారిని మేల్కొల్పలేకపోయింది. డాడ్జ్ దుర్గంనుండి సరుకు సామగ్రులను తెచ్చినవి ఎనిమిది. మిగత నాల్గు ఇండియన్ ప్రదేశంనుండి కల్నల్ మిజ్నర్ పంపగా దూరభారా లధిగమించి వచ్చినవి. వాటి రాకతో ముర్రే మేలుకొన్నాడు. తన శకటాలలో వైద్యవస్తువులతో బాటు కొంతవిస్కీ కూడ వుంది. తృప్తిదీరా త్రాగి, తిరిగి నిద్రపోజూచాడు. కాని నిద్ర రాలేదు. మరి రాదనుకొన్నాడు. గుర్రానికి జీనువేసి గస్తీలను దాటుకొని ఇండియన్ శిబిరందాపుకు స్వారిపోయాడు. వాళ్లువేసినమంటలు మొదలంటా మండిపోయినవి. కాని మనుషులు మేల్కొని వున్నారు. దుర్బలాగ్ని ప్రభముందు ఛాయా మయ మూర్తులు సంచలిస్తున్నవి. అతనింకా దాపుకు పోయాడు. ఏరుదాటాడు. వాళ్లు అతనిని చూశారు. ఈవిధంగా తాను ఇండియన్ శిబిరాన్ని ప్రవేశించినప్పటికి, తన నెవ్వరూ కాల్చిజూడరేమోననే చిత్రమైన వూహవచ్చింది. నిజానికి సగౌరవాభివాదము చేస్తారేమోననుకొన్నాడు. అక్కడ పదిహేను నిమిషాలసేపు కూర్చుని, తిరిగి వెళ్ళిపోయాడు.

తెల్లవారేసూచన లాకాశమందు కనుపించకముందే, పోయి ట్రాస్క్‌ను లేవగొట్టాడు. "క్షమించండి, కెప్టన్ ట్రాస్క్–రాత్రి దురుసుగా మాట్లాడాను", అన్నాడు. అతివినయం వచ్చింది. "వాళ్ళ శిబిరం దాపులకు వెళ్ళివస్తున్నాను—వాళ్ళు వెళ్ళిపోరు అలసిపోయినారేమో!" నన్నాడు. నిద్రమత్తు పూర్తిగాపోక, చెప్పేదేదీ తలలోదూరక, ట్రాస్క్ అన్నిటికీ తలాడించాడు. "మనం నడిచి

దాడిచేద్దాం. వాళ్ళకు తుపాకులున్నై కాని, కావలసినంత తూటాలున్నట్టులేదు. కాని తుపాకితో ప్రేల్చడమెట్లాగో వాళ్ళకుతెలుసు. వాళ్ళనాయకుడున్నాడు తోడేలని, ఆలాంటిమనిషిని ఇండియన్లలో నే నీవరకు చూడలేదు—మిన్ను విరిగి మీదపడినా తొణుకుబెణుకులేదు—"

"ఆశ్వికులు దెబ్బతీయాలి", అని ట్రాస్క్ ప్రారంభించాడు.

"వద్దువద్దు. లోగడ ఒకసారి రుచిచూచాం. ఒక లెఫ్టినెంటు, ఒక సార్జెంటు, సైనికులు కొందరు చనిపోయారు. నడిచిపోవడమే వుత్తమోత్తమం. గుర్రాలు చొరవజేసికొని దూరగలిగినప్పటికీ, అక్కడ స్త్రీలూ పిల్లలూ వున్నారు. దారుణాలు జరుగకుండాచూడాలి".

ఇండియన్లతో ముఖాముఖిగా రావడం యిది నాకు తొలిదఫాయే నయ్యా" అన్నాడు ట్రాస్క్ విసుగుతో

"నిజమే కాని యీ మొండి పోటరు లున్నారు చూశారూ, వీళ్ళంతా సులువుగా చనిపోరు. చనిపోవాలని నిశ్చయించుకొన్నారు. మీకిది బోధపడాలి. వాళ్ళు వూరకే పాలుబోక షికారురాలేదు స్వస్థలానికి పోతున్నారు. పౌడర్ నదీ లోయవరకు పోవాలి. ఇది దుష్కరమని వాళ్ళెరుగుదురు. అందుచేతనే వీళ్ళకు దేన్నిచూచినా భయంలేదు. ఈవరకే వాళ్ళు చనిపోయారు. ఇది మీకు బోధపడా లంటే చెయిన్నీలతో పరిచయముండి వుండాలి. అక్కడ వున్నవాళ్ళు యీ వరకే చనిపోయి వున్నారు. కాబట్టి అంతకంటే ఘోరమైనదేదీ వారికి ఘటిల్లజాలదు."

ట్రాస్క్ భుజాలెగురవేశాడు. "మీరు చెప్పింది ఎట్లానమ్మడం?" అన్నాడు.

"క్షమించండి."

"నా మనుషులను ముందు పొమ్మంటారా? లేక మీ వాళ్ళను అండగా వుండమంటారా?"

"అండగా వుండాలి. మాస్టర్సన్ గారిని ఆయన జనసేనను మీవద్దేవుంచు కొండి."

సరేనన్నట్లు ట్రాస్క్ తలవూపాడు. ముర్రే తనవారివద్దకు వెళ్ళిపోయి, వింట్ ను, బిగిల్ వూదేవాణ్ణి లేపినాడు. తర్వాత, కాస్సేపు చల్లటి తడి పచ్చికమీద నిలుచున్నాడు. అంతలో తనకు యీ పాటికి బాగా అనుభవానికి వచ్చిన ఘటనలు యథాపూర్వక్రమానుసారంగా, ఒకటవెంబడి ఒకటి మొదలైనవి.

శకటాలను ముందుంచుకొని ఏటిని దాటింది ఆదళం. ఎంత దాపుకు పోగలిగితే అంతబాగుంటుందని, యీ పదహారు బళ్ళను రక్షణశ్రేణిగా వినియోగ పెట్టుకోవచ్చునని, ముర్రేపథకం. బళ్ళను వలయాకృతిగా తీర్పించి ఒకదాని వెంబడి ఒకటి నిలిపించాడు. తాము త్రవ్విన అగడ్తలకావలనక్కి ఇండియన్లు యెదురుచూస్తున్నారు. వాళ్ళకు వెనుక స్త్రీలూ, పిల్లలూ, గుర్రాలూ వున్నవి.

యోధులకు యితరులకూ నడుమ సహజమైన మైత్రొకటివుంది. కొందరు యోధుల ముఖాలు యిక్కడికి కనుపిస్తున్నాయి. బాలసూర్యప్రభ వాళ్ళతుపాకి గొట్టాలమీదపడి తళతళలీను తున్నది. కేకలు, బొబ్బలు, యుద్ధనినాదాలేవీలేవు. వాళ్ళ నాయకుడైన తోడేలు అందరికీ కనుపించేలాగున అగడ్త అంచున తీరికగా కూర్చుని, పొగత్రాగుతున్నాడు. అతని ముఖాన చిరునవ్వు వుండకపోదు, అనుకొన్నాడు ముర్రే. అతనే గనుక మందహాస మొనరిస్తూవుంటే, యిది చాల కాలం మనలేదు. భూమిలో స్వతస్సిద్ధమైన బుడుపువలె, పిడికిలి ఆకృతిలో, తోలుతప్ప ఒంటి మరేదీలేనట్లుగా, ముడుతలు పడినట్లుగా, తనవెనుక వైపునగల తిప్పలెంతముసలివో అంత ముసలితనముతోటి, చిరునవ్వుతో, నిశ్చింతగా కూర్చుని వున్నాడు.

ముర్రే తన సైనికులను శకటాలవెనుక గుమికూడించాడు. బళ్ళకు పూన్చిన గాడిదలు ఖంగారుపడుతున్నవి. ప్రేల్పులు మొదలుకాగానే బళ్ళ జంటలు గిరికీలు కొట్టితిరుతాయని బండి మనుషులెరుగుదురు. కనుకనే రెచ్చిపోయి తమలోతాము తిట్లు మొదలెట్టారు. ఇరవై ముప్ఫై గజాలు వెనుకన, ట్రాస్క్ తనమనుషులను బారుతీర్చాడు. వాళ్ళవెనక, సైనికులను చెయిన్నీలకంటె ఎక్కువగా ద్వేషిస్తూ, రాజుకొంటున్న అగ్గికొండలవలె ఘూర్ణిల్లిపోతూ, విచ్చలవిడిగా విరిగిపడే సమయంకోసం చూస్తున్నారు, జనసేనలో బ్రదికి బయటపడివున్న వాళ్లు. మలుపులు తిరిగి వున్న యేటి నీటికి దాపుగా ఒక్క ప్రక్కగా, పాలిన నీలివన్నెగగనం పూర్వరంగంకాగా జ్వలించిపోతున్నాడు బాలాదిత్యుడు.

వింట్ ముఖాన నెత్తురుబొట్టు ఒకటయినా వున్నట్టు లేదు. అతన్ని చూచిన వెంటనే ముర్రేకి జాలి పొంగిపోయింది. రణదుందుభి సంగీతానికి మంత్ర ప్రభావం లాగున పచ్చిక గుబురునుండి పిట్టలగుంపు పైకి లేచింది. శకటాల నడుమ సైనికులు ఒదిగి, రెండు చేతులతో తుపాకుల నదిమిపట్టుకొని, నిలుచున్నారు. వారికి ముందు ముర్రే; ఒక ప్రక్కన వింట్. ఒరనుండి లాగి చేదాల్చిన ఖడ్గంతోటి వెనుకవారికి నీరవాజ్ఞల నిస్తున్నాడు ముర్రే. కొందరు నవ్వులాడుకుంటున్నారు. మరి కొందరు భయభ్రాంతులై పెదిమలు కొరుక్కొంటున్నారు. కొందరి ముఖాలలో జీవకళ బొత్తిగాపోయింది. మరికొందరు వంగి, నక్కి, జంతువులవలె బహు జాగరూకులై వున్నారు.

నెమ్మదిగా, క్రమం తప్పకుండా, ఒకే నడకతో పురోగమించారు సైనికులు. ఊరకే వెనక్కుతిరిగి చూస్తున్న ముర్రే, "ఇక వెనక్కు తిరగకు-భయపడకు-అయిపోవచ్చిందిలే" అని తనకు తాను ధైర్యం చెప్పుకొంటున్నాడు. గుండె కాదది, అతనిది సుత్తివలె మ్రోగిపోతున్నది. నోరు యెండిపోయింది. కళ్ళు ఆర్ద్రాలైనవి. వేస్తున్న ప్రతి ముందడుగుతోటి, వెనక్కు తిరిగి పారిపోవాలని, పిచ్చికేకలు పెట్టాలనే కోరికను అణచివేయసాగినాడు. ఇప్పుడు వింట్

ముందున్నాడు. వెనక్కు తిరిగి ముర్రేవైపు చూచి మందహాసం చేశాడు. దేనినీ లెక్కిస్తున్నట్లు లేదతను. ముర్రే ముందుకు చూపు సారించాడు. గొట్టంనుండి పొగ పీల్చేటప్పుడు వుబ్బుకొంటున్న తోడేలు బుగ్గలు స్పష్టంగా చూడగలిగినంత సమీపాన వున్నారిప్పుడు. కందకంమీదునుంచి చెయిన్నీల తలలు లేస్తున్నవి.

"ప్రేల్పులు మొదలెట్టండి" అని బొంగురు గొంతుతో అరిచాడు ముర్రే.

రణదుందుభిశబ్దం తుపాకుల ప్రేల్పుడులో అణగిపోయింది. సైనికులు వంగి పరుగెత్తుతున్నారు. ఇంతలో చెయిన్నీలందరూ ఒక్కుమ్మడిగా ప్రేల్చారు. ముసలివాడు వున్నచోటనే వున్నాడు. ముర్రే ఒక్కడే ఎదురుగా నిలుచుని వున్నాడు. వింట్ పొలికేకలువేసి పిలుస్తున్నాడు. చెయిన్నీల కందకానికి యిరవై గజాల దాపులోనే వున్నాడు కాని, ఏకాకి. సైనికులు పచ్చికమీద బోర్లాపడు కొన్నారు. ఇండియన్ నాయకుడు నోటినుండి గొట్టాన్ని తీసి చేతపట్టుకొన్నాడు. తానెట్లాగు యింకా జీవాలతో వున్నాడేనని ముర్రే ఆశ్చర్య పోతున్నాడు. విహారిస్తున్నట్లు నిర్లక్ష్యంగా తిరిగి రాసాగాడు.

"మీరెక్కడో మూర్ఖుల్లా గున్నారే, పడుకోండి! ఊఁ! త్వరగా పచ్చిక మీద పడిపోండి," అన్నాడు వింట్.

మత్తునిద్ర ఒక్కపెట్టున వదలిపోయిన మనిషివలె యీలోకానికివచ్చి ముర్రే గభీల్మని పచ్చికమీద పడిపోయాడు. దొర్లుకొంటూ దొర్లుకొంటూ ఒక సైనికుని మీదికి వచ్చాడు. ఆ సిపాయి కదలలేదు. విల్లువలె వంగిపోయి వున్నాడు. ముఖంలో వేదనారేఖలు కనుపిస్తున్నై. చనిపోయిన సైనికుడు. ప్రాకిప్రాకి ప్రేల్పులు సాగిస్తున్నవారిని గడచి, వింట్ దగ్గరకు వచ్చాడు ముర్రే. అతను మెలిదిరిగివున్నాడు. గాయపడినచేతికి చేరుమాలు కట్టుకొనబోతున్నాడు. "నేను కట్టుతా," నన్నాడు ముర్రే. అతను చేరుమాలు చుట్టుతూవుంటే, వింట్ ఈల వేయసాగినాడు. "కెప్టెన్, కెప్టెన్" అని ఒక సైనికుడు పిలిచాడు.

"ఏం?" అన్నాడు ముర్రే.

"ముందుకు పొమ్మంటారా మమ్మల్ని?"

"వద్దు. ప్రేల్పుడు సాగించండి!"

"ముందుకు-"

"వద్దు!"

జాగ్రతగా పైకిలేచాడు ముర్రే, కందకంమీద తుపాకిమందు పొగ వ్యాపించివుంది. తోడేలు అదృశ్యమయ్యాడు.

"కెప్టెన్ ముర్రే" అని పిల్చాడు లెఫ్టినెంట్ గాల్లో.

"ఆఁ!"

"కెప్టెన్ ట్రూస్కు దగ్గరనుంచి మనిషివచ్చాడు. జనసేన వెళ్ళిపోయిందట!"

"పీడ విరగడైంది."

వింటే కష్టపడి లేచాడు." భగవంతుడా, వాళ్ళు మూర్ఖపుగొడ్లే!" అన్నాడు.

పచ్చికమీద మోకరిల్లివున్న ముర్రే తలెత్తిచూచాడు. తూర్పుగా అరమైలు దూరాన జనసేన ఏరుదాటి, గట్టుయెక్కి, క్షణమాగి చెయిన్నీ శిబిరాన్ని వెనకవైపునుండి దెబ్బకొట్టడానికి యెగబడి రాసాగింది. ఇండియన్లుకూడ యీ కొత్త వుపద్రవాన్ని చూచారు. వెంటనే యోధులు కొందరు జట్టుగాకూడి జనసేనవైపు హుటాహుటిగా గుర్రాలను దౌడెత్తించారు. గిరగిరతిరిగే సుడివలె రెప్పపాటులో జనసేనను గట్టిదెబ్బకొట్టి వెనుకంజవేయించారు. డీల్పడిన శత్రువులమీదికి వుమ్మడిగా విరుచుకపడి, గిరగిర తిరిగి, పరపరకోసే కృపాణాల వలె చెల్లాచెదురు చేశారు.

"అందరూ గుర్రాల నెక్కండి!" అని అరిచాడు ముర్రే. కెప్టన్ ట్రాస్కుగారి కాల్బలం ఏటినడుమ జత కలిసింది. "వీళ్ళకు పని కల్పిస్తూ వుండండి. నేను జనసేన నాదుకోబోతున్నాను. ఇంకా అదనంగా ఇండియన్లు ఆ వైపుకే వస్తే, మరీ మంచిది. పటాపంచలైపోతుంది" అన్నాడు ముర్రే.

ముర్రేసైనికులు వెళ్ళిపోయాక, ట్రాస్కుసైనికులు ఇండియన్ల కందకాని కేసి పరుగు లంకించుకొన్నారు. కాని అంతలో భయంకరంగా చెలరేగిన కాల్పులకు ట్రాస్కుదళం హతమైపోవడం చూస్తున్న ముర్రే హృదయం క్రుంగిపోయింది. తన సైనికు లశ్వారూఢు లవుతున్నారు. ఇంతలో గాడిదలను పూన్చిన శకటాలు గింగిరాలు తిరిగిపడ్డవి. ట్రాస్కుదళంలో జీవాలతో బయట పడిన వాళ్లు శకటాలవెంబడి పరుగుతీస్తున్నారు. జనసేన భగ్నమై పారిపోతున్నది. ఈ పోట్లాటను డాడ్జ్‌పౌరులు యెన్నటికీ మరచిపోలేరు.

ముర్రే అశ్వికదళం చెయిన్నీల కందకం వైపుకు నేరుగా జోరుగా పురోగమించ సాగింది. కాని ఇండియన్లుకూడా యీపాటికి అశ్వారూఢులై ఎదురుగా అత్యద్భుత వేగాన స్వారివస్తున్నారు. దెప్పి పొడుస్తున్నారు. పొలికేకలూ, పెడబొబ్బలూ పెట్టుతున్నారు. ముర్రే మిత్రు చేరుకోగలిగాడు. ఇండియన్ గ్రామం ఆవరకే చాలదూరం గమించింది. అశ్వికయోధు లొక కొందరుమట్టుకు ముర్రే దళాన్ని ఆపివేయడానికి వెనకగా పోతున్నారు.

ఏటికి అరమైలు దిగువగా ఆయుధ సామగ్రి శకటమొకటి ఫట్టీ కొట్టింది. జనసేనను ఛిన్నాభిన్నంచేసిన ఇండియన్ యోధుల జట్టు ఆ శకటంమీదపడి, కావలసినన్ని తూటాలు తీసికొని వెళ్ళిపోయారు.

తన మనుషులను ట్రాస్కు తీర్చిదిద్దుతున్నాడు. మాస్టర్సన్, అతని శిథిలీభూత జనసేన తిరిగి వుంటి నడకతో వచ్చి చేరుకొన్నారు. ట్రాస్కు వారిని నానా తిట్లూ తిట్టసాగినాడు. శకటాల నొకటొకటిగా మరలించుకొని వచ్చారు. కందకం దాకా వెళ్ళిన ట్రాస్కుకు యిద్దరు యిండియన్ల కళేబరాలు కనుపించాయి.

ఆశ్వికదళం మధ్యాహ్నంవరకు ఇండియన్లను వెన్నాడిపోయింది. గుర్రాల మీద చెయిన్నీలు మానవమాత్రులుకాదు. మింటు యెగిరే పక్షులను కొట్టడ మెంత కష్టమో అశ్వాలమీద మనోవేగానపోయే ఇండియన్లను దెబ్బతీయడ మంతకష్టం. గ్రామానికి ముప్పు వుప్పతిల్లినట్లయితే, వాళ్లు అడవి తోడేళ్ళవలె పోట్లాడుతారు. ఇతరవేళలలో వాళ్లు ఎవరికీ అందరు.

మధ్యాహ్న మయ్యేసరికి, ముర్రే ఆశ్వికులను నిలిపివేశాడు. చెయిన్నీలు యీసారి ఒక గుండ్రాళ్ళ తిప్పమీద విడిదిచేశారు. ఆశ్వికులు ఆపసోపాలు పడుతూ, అంగలారుస్తూ, చెమటలు కక్కుతూ వున్నారు. వింట్ చేతికికట్టిన కట్టు వూడిపోయేసరికి, నెత్తురు పిచికారుకొట్టి నట్లయింది. గాల్లో తలటోపీ ఎగిరిపోయింది. పిర్రనుండి మోకాలివరకు అతని పిరుదును బల్లెమొకటి చీల్చివేసింది. ఓహియోనుండి వచ్చిన బెయిలీ అనే పసివాని శ్వాసకోశంలో అమ్ము దిగబడిపోయింది. అంగుళమంగుళంగా మృత్యువు అతని నాక్రమించుకొంటూ వున్నాగాని వాళ్లతో సమానంగా యింతవరకూ రాగలిగాడు. బెయిలీని పచ్చిక మీద పండబెట్టారు. తర్వాత, పేరుకూడా చెక్కని గోరీ-పచ్చికలోనే వూడ్చి వేశారు.

తిరిగి చెయిన్నీ శిబిరాన్ని దాడిచేశారు. తిరిగీ వెనక్కు కొట్టబడ్డారు. పడమటగా వలయాకృతిలో ఇండియన్ల వెనువెంటనే స్వారీసాగించారు. గుర్రాల పని అయిపోయింది. ఇండియన్ల గుర్రాలు చిన్నవి, చలాకీవి, ఓర్మిగలవి. చెయిన్నీలకు ఒక మైలుదూరంలోనో, మరికొంత యెడములోనో పోతూనే వున్నారు. కాని వాళ్ళను లోగొనలేకపోయారు. ఓడిపోయిన ముసలి వేటకుక్క చేసేవిధంగా, పారిపోతున్న చెయిన్నీల జాడను అంటిపెట్టుకొనే, తమవలెనే ఎంతో అలిసిపోయిన సూర్యాస్తమయాన్ని దూరిపోసాగినారు. కుప్పకూలిపోవన వుడుకుబోతుతనాన నిష్ఫలంగా ప్రేల్పులు సాగించారు. నురుగులు క్రక్కుతూ చెమటతో తప్పతడిసిన గుర్రాలను అదిలిస్తూ, శపిస్తూ, బుజ్జగిస్తూ, ప్రాధేయ పడుతూ నడిపించారు.

సూర్యుడు మునకవేశాడు. చెయిన్నీలు మళ్ళీ ఒకచోట విడిశారు. ఆశ్వికులు గుర్రాలుదిగి, నేలమీద వ్రాలి సోలిపడిపోయారు. కాళ్లు మొద్దుబారినవి. నిలిచి గుర్రాలు గుక్కతిప్పుకోలేక వూపిరికోసం సతమతమైనవి.

"వాళ్లు మానవులుకాదు - మానవత్వంలేదు" అన్నాడు వింట్‌తో ముర్రే.

"మళ్ళీ దాడిపోతారా?"

"అనే అనుకొంటున్నాను. కాని రేపుప్రొద్దుటే."

"ప్రొద్దుటివరకు వాళ్ళిక్కడ వుండరు" అన్నాడు వింట్ సందేహమే లేనట్లు. ముర్రే శిరఃకంపంచేశాడు.

సగంరాత్రి గడచింది. చెయిన్నీగ్రామం కదలిపోయింది. బిగిల్ మ్రోతకు సైనికులు మేల్కొని, నిద్రమత్తులో చీకటిలో పడుతూ లేస్తూ, జీనులువేసి, గుర్రాల నెక్కారు. కాని వేగం మందగించింది. నమ్మికలేదు. తిరిగి ముర్రే వారి నాపినాడు. ఈసారి వా రాగినస్థలం శూన్యం - నిర్జనం! తమ గుర్రాలు వెక్కి వెక్కి యేడుస్తున్నట్లున్న యొగశ్వాసతప్ప మరేధ్వనీ వినిపించలేదు. ఎక్కడో దూరాన ఒకే ఒక తోడేలుకూత వినిపించింది.

# ధర్మాధర్మాలు

## సెప్టెంబరు - అక్టోబరు 1878

డ్రాజ్ దుర్గానికి కాలినడకను వచ్చిన మనుషు లారుగురు యీ దిగువ కథ చెప్పారు. ఆపి, ఆపి, నెమ్మదిగా, తూచి తూచి చెప్పారు. వాళ్ళందరూ బర్రెలను వేటాడేవాళ్లు. వాళ్ళకు కావలసినవి తోళ్ళేగాని మాంసంకాదు. మాంసంకోసం వేటాడేవాళ్ళకొక ప్రయోజనమైనా వుంది. జనానికి తిండిపెట్టడమనేది. ఈమహావధల ఫలితంగా బిల్ కోడీవంటి వేటగాళ్లు పేరుమోసిపోయారు. వాడే పనిముట్లలోతప్ప తక్కినవాటన్నింటిలో వీళ్ళకూ, కసాయి దుకాణదారులకూ చెప్పదగిన భేదమేమీ లేదు. వధించడమే వృత్తిగా పెట్టుకొన్నవారికీ, మాంసంకోసం బర్రెలను చంపేవారికీ వున్న తేడా యేమిటంటే, వీళ్ళు కాలు మోపిన ప్రతికడలో ప్రేల్పులు, దుస్సాహసకృత్యాలు, అబద్ధాలు తయారుగా వుంటాయి. వీళ్ళు గొప్ప వీరులుగాను, తుపాకివిద్యలో మహా నిపుణులుగాను చలామణీ అవుతారు.

కాని, బయళ్ళలో చెడ తిరుగుతూవుండిన దశలక్షాధికాలైన బర్రెలసంఖ్య కాలక్రమేణా తగ్గిపోవడానికి కారణం తోళ్ళకోసం జంతువధ చేసేవారే గాని వీళ్ళుకాదు. తమకు మాంసమూ, ఎముకలూ అక్కరలేదు. స్వతస్సిద్ధ భూగర్భ నిక్షేపాలను త్రవ్వేవారివలె భూమినుండి సంపత్తిని మీగడవలె తీసివేసేవారు. వారు కనుపించినచోట మహావిధ్వంసం ప్రత్యక్షమయ్యేది. బటువైన చక్రాలుగల శకటాలతో కదలిపోయి మందలను అనుగమించేవారు. పెద్ద పెద్ద తుపాకులతో బర్రెలను, దున్నలను చంపేవారు. ఇద్దరు చంపితే, నలుగురు తోలు వలుస్తారు. తోలు ఒలవడమనేది వీరి చేతులలో ఒక శాస్త్రమయింది. పొట్టలోగాని కాళ్లలోగాని మొదట కత్తితో ఒక పోటుపొడిచి, అంచునుండి చర్మాన్ని నిలువునా కోస్తారు. తర్వాత దానిని జరజర ఒలిచివేస్తారు. మంచి అనుభవస్థుడయితే ఏడు నిమిషాలలో తోలుతీయగలడు. ఈ తోళ్ళను శకటాలలో పేరుస్తారు.

1860 లో తోళ్ళను వేటాడి మహాసంపన్నులైనవారు అనేకులు. వ్యాపార సంస్థలు తలెత్తినవి. బర్రెలను చంపడానికి గట్టివాళ్ళు బయలుదేరితే, వాటి తోళ్ళు

ఒలవడానికి అంతకంటె గట్టివాళ్ళు తయారు. నలభై, అరవై, నూరు మహోత్కటాలతో మందలవెంబడి పడిపోయేవాళ్ళు ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలమనే విభేదాలు లేకుండా వాళ్ల తుపాకులు రభటిస్తుండేవి. బయళ్ళసీమలో మైళ్ల పర్యంతం నిర్జీవ జంతు మాంసరాశి అక్కడక్కడ మిన్నులంటుపడి కుళ్ళుకంపు గొట్టుతూవుంటే, గొంతుకవరకు తినే తోడేళ్ళకుకూడ అసహ్యం పుట్టేది. ఇటువంటి మహావధలు అమెరికాలో పూర్వ మెపుడూ లేనివి. అసలు మానవచరిత్రలోనే, తినదగిన మాంసం శతలక్షాధిక పౌన్ల బరువుగలది నట్టనడియెండలో యీ విధంగా యెప్పుడైనా పనికిమాలి కుళ్ళిపోయిందా అనేది సందేహాస్పదం. బర్రెజాతిలో యెన్ని జీవాలుంటేమాత్రం, తరుగు మొదలుకాక తప్పలేదు. మొట్టమొదట యీ అఖండ భూఖండంమీద రైలుబాటలువేసే రోజులలో, ఒక్కొక్క పర్యాయం, మందలు రైలుబాటను దాటుతుంటే, బండి ఒక్కరోజు ఆగిపోవలసి వచ్చేది. ఐదేళ్లతర్వాత, బర్రెలనేవి పథ్యప్రాయాలైపోయినవి. పదేళ్ల తర్వాత నిజానికి ఆ జాతి నిశ్శేషమైనదని చెప్పాలి. ఎండకెండి వానకుతడిసి శంఖధవళంగా తయారయిన దశలక్షాధికసంఖ్యగల అస్థిపంజరాలలో జాతి పూర్వసమృద్ధి స్మృతిప్రాయమై నిలచిపోయింది.

ఇండియన్లదృష్టిలో యీ నిష్కరుణ పశుగణవధలు తెల్లవారు చేసిన అనేకానేక నేరాలలో ఒకటి. దీనికిగల కారణాలు వారికి బోధపడలేదు. ఇందుచేత వాళ్ళు దురవస్థకు, దౌర్భాగ్యానికి లోనయ్యారు. స్మృతికందని ఆదికాలమునుండీ, బయళ్ళసీమలో, బర్రెగొడ్డే ఇండియన్ల జీవనాధారం. మాంసం తినేవారు తోళ్లు వస్త్రాలయ్యేవి, గుడారాల కప్పులయ్యేవి, కవచాలయ్యేవి. ఎముకలతో ఆయుధాలు, సూదులు చేసికొనేవారు. దంతాలతో నగలు చేసికొనేవారు. నరాలు దారమయ్యేవి. ప్రేవులు కుండలు తిత్తులుగా మారేవి. చివరకు పేడపిడకలుకొట్టి వంటచెరుకుగా వాడుకొనేవారు. ఎక్కడా వృథాచేయడమే లేదు. చిట్టచివరి నెత్తురుబొట్టువరకు బర్రెను వినియోగ పెట్టుకొనేవారు. తెల్లవాళ్ళు వచ్చి బర్రెతోళ్ళ వేట ప్రారంభించి దానిని మహోచ్ఛదశకు కొనిపోయేసరికి, మందలు రూపుమాసిపోవడం, బయళ్ళలో మాంసరాసి నిరుపయోగంగా పడి చెడిపోవడం చూచిన ఇండియన్లలో వేటగాళ్ళపట్ల దారుణద్వేషాగ్నిజ్వాల భగ్గురుమని మండసాగింది. మాంసాలకోసం మందలనుచంపినా, గుడ్డిలో మెల్లగా వుండేది. కాని విధ్వంసన, నిర్మూలన ఘోరాతిఘోరాపరాధాలు. ఇదీ పూర్వరంగం. ఇక ప్రస్తుతం—

తోళ్ళకోసం బర్రెలను చంపడానికి పోయిన వేటగాళ్ళు ఆరుగురు వచ్చి డాడ్జ్ దుర్గంలోని వాళ్ళతో తమ కథ చెప్పజొచ్చినారు. బాగా పెరిగిన గడ్డాలు, మురికినిండిన ఒడళ్ళు, కంపుగొట్టే గుడ్డలు — వృత్తికి తగినట్లే వున్నవి వారి రూపురేఖలు. పోగాకు అడిగి పుచ్చుకొని, నమిలి, తుప్పు తుప్పు

మని వుమ్మివేస్తూ మాట్లాడుతున్నారు. రెండు శకటాలను వెంటబెట్టుకొని ఆర్కాన్సాస్ నదికి వుత్తరంగా పోతూవుండినారట. మందలు అపురూప వస్తువులైన యీరోజులలో, ఈర్వెనతో పేలుపట్టినంత శ్రమతో, మందలజాడ కనిపెట్టవలసివచ్చింది. ఇంతకష్టపడి తిరిగితే చివరకు ఏశా బర్రెగొడ్లు కనుపించేవి. పూర్వం వచ్చినట్లు లాభాలు రమ్మంటేవస్తాయా ? అందుచేత మునుపు స్థాపింపబడిన వ్యాపారసంస్థలన్నీ మూతబడ్డాయి. మరేవిధమైన ఆర్జనావకాశాలు లేని సాహసులు`రూపాయి కష్టానికి దమ్మిడీ లాభమని తెలిసికూడ వేటకుపోయేవాళ్లు. కాని యీ ఆర్గురి అదృష్టం యీసారి పండినట్లు కనుపించింది. పానీఫోర్క్ దక్షిణాన ఒక పెద్దమంద కంటబడింది. మెక్కాబ్ అనేవాడూ, వార్డ్ అనేవాడూ యీ మందను చుట్టుముట్టి, తమ శిబిరంవైపు మళ్ళించి, తోలుకొని పోయారు. పిచ్చెత్తినవాళ్ళవలె దిక్కులు మార్మోగిపోయేటట్లు గొంతు చించుకొని గావుకేకలువేస్తూ, ఎటుబడితే అటు కాలుస్తూ హంగామా చేయసాగారు. ఈలోగా మిగతా నలుగురు శకటాన్ని వూన్చి, ఎక్కి, మందను అడ్డుకొన్నారు. ఒక్కగానొక్క పసరమైనా తప్పించుకోలేదు. పదిహేడు బర్రెలూ, ఒక్కదున్నా-అన్నీ హతమారిపోయాయి. అరమైలుదూరం వ్యాసరేఖకాగా యేర్పడిన వలయాకృతిలో తీర్చిపేర్చినట్లు అన్నీ పడివున్నాయి. విస్కీత్రాగి ద్విగుణీకృతోత్సాహులై వాటి తోళ్ళు ఒలిచారు. బర్రెమాంసమంటే వీళ్ళకు వెగటు. కావలసినంత ధాన్యపు పిండి, ఉప్పు కూరిన పందిమాంసమూ వుంది. బర్రెమాంసం అంతవుంటే, రెండు నాలుకలుతప్ప ఏదీ తీసికోలేదు. కంకాళాలను వున్నచోటునుండి మార్చనైనా లేదు.

ఇండియన్లువచ్చి పడుతారని వాళ్లు కలలోగూడ అనుకోలేదు. తమకు తెలిసినంతవరకు, ఇండియన్లు వందమైళ్ళలోపున ఎక్కడాలేరు. చిదుగులుతెచ్చి మంటవేసి, బర్రెనాలుకలను నెమ్మదిగా కాల్చుకుంటూ, పిండిపిసికి యెండబెట్టినారు. మధ్యాహ్నం మూడు గంటలై వుండవచ్చు. పొగపీలుస్తూ, విస్కీత్రాగుతూ, నిశ్చింతగా పండుకొని వున్నారు. తమ అదృష్టంగురించి మాట్లాడుకొంటున్నారు. డెక్కల త్రొక్కిడి వినిపించిన తర్వాత గూడ, ఇండియన్లను గురించి వాళ్ళు వూహించనేలేదు. ఎవరో పశుపాలకులై వుంటారనుకొన్నారు.

దిగుడు నుండి మిట్టప్రదేశానికియెక్కి, పసిమివన్నె పచ్చిక గుబుర్లగుండా అలనీటి నురుగువలె విరుచుకపడి, హఠాత్తుగా మున్నూర్గురు ఇండియన్లు ప్రత్యక్షమయ్యేసరికి, తోళ్ళవేట గాళ్ళారుగురు కలదెలిసికొని తుపాకులందుకొని మందుకూరబోయారు. కాని ప్రవాహజలం వారిని చుట్టుముట్టివేసింది. నిస్సహాయులనుగా చేసింది. చేతులనుండి తుపాకులు పోయాయి. ఇండియన్లలోని యోధులు గుర్రాలు దిగారు. పిల్లలు గుర్రాలనుండి నేలకుజారి పెద్దవాళ్ళ కాళ్ళమధ్య తలలు నిక్కబెట్టారు. వింత చూద్దామని స్త్రీలు గుమికూడారు. గుర్రాలు ఈ సందడికి

కలవరపడి కాళ్ళతో నేలను ఘట్టించ సాగాయి. కుక్కలు మోరలెత్తి మొరుగుతున్నాయి. వేటగాళ్ళలో ఆండర్సన్, మెక్కాబ్ లనే వాళ్ళకు కొద్దికొద్దిగా చెయిన్నీ బాస తెలుసు. తామిప్పుడు, ఎన్నడూ ఎరుగనంతటి మృత్యు సామీప్యానికి పోయామని వాళ్ళిద్దరూ ఒప్పుకొన్నారు. పద్దెనిమిది కంకాళాలు బాహాట సాక్ష్యాలవలె చుట్టూ పడివుంటే, శకటాలలో తోళ్ళ పేర్పులు మూకీసాక్ష్యాలవలె వున్నాయి. ఇండియన్లు బక్క చిక్కి, ఆకొని, అన్నాతురులై వున్నారు. పగిలిపోయిన ఆనకట్టనుండి పొంగి దూకే జలంవలె వాళ్ళలో ఆగ్రహావేశం పొంగి వెలికురికింది. ఇండియన్ స్త్రీలు ఆండర్సన్ వేసుకొన్న చొక్కాను చింపి, అతని చర్మాన్ని గోళ్ళతో చీరినారు. మిగతా వేటగాళ్ళకు కూడ అలాంటి దురవస్థ పట్టింది. పిల్లలు నానాతిట్లూ తిట్టుతూ, వంగి కాళ్ళపిక్కలను పళ్ళతో కొరుకసాగినారు. కాని పిల్లలనూ, స్త్రీలనూ వెనక్కులాగి, ఇండియన్ పురుషులు చేతులను లంకెవలె చేర్చి, వేటగాళ్ళచుట్టూ నిలుచున్నారు. ఈ రక్షణ నిజంగా రానున్న చిత్రహింసకు దేనికో నాందిమాత్రమేనని, తమ శిక్ష వాయిదాపడిందే గాని రద్దుకాలేదని వేటగాళ్ళు భావించారు. వార్డ కైపులో వున్నాడు. అందరికంటె ముందు అతని గుండె దిటవు తప్పింది. పసిపాపవలె గావురుమని యేడ్వసాగాడు. ఆండర్సన్ కు కోపం వచ్చింది. "వార్డ నోరుముయ్!" అన్నాడు. ఇండియన్లు దరహాస సుందరముఖులయ్యారు. చిన్నచూపుగాని, వినోదం గాని యిందుకు కారణమై వుండవచ్చు. వాళ్ళకు ఇంగ్లీషు బోధపడినట్టు లేదు. వార్డ వాళ్ళను ప్రాధేయపడజొచ్చినాడు. వాళ్ళకిది అర్థం కాలేదో, వాళ్ళు అసలు అర్థం చేసుకోదలచలేదేమో! మగవాళ్లు తమను వెనక్కు నెట్టివేసినతోడనే, స్త్రీలు యిక తమకు ఆటలు చెల్లనేరవని గ్రహించి, మాంసాన్ని ఖండించుకొనేందుకని వెళ్ళిపోయారు. "వాళ్ళకు ఆకలి వేస్తుండేదేమో పస్తులు మాడుతుండినట్లు అనిపించింది" అన్నాడు మెక్కాబ్.

గబగబ ఆత్రంగా మాంసంకోసం వెళ్ళిన తీరులోనే వాళ్ళ ఆకలి కనపడుతుంది. శకటాలను విరిచివేసి, వంటచెరకుగా వాడుకొన్నారు. పలచటి ముక్కలు ముక్కలుగా మాంసాన్నికోసి, మంటలో ప్రేల్చసాగినారు. మొదట పిల్లలవంతు మాంసాన్ని నములుతూ, పిల్లలు బాధతో మూల్గసాగినారు. తిండి తినడంకూడా బాధాకరమయినదంటే, ఎంత ఆకొనివుంటారో!

ఈలోగా, కులపెద్దలు వచ్చి యీ వ్యవహారాన్ని అదుపులోకి తెచ్చారు. డాడ్జ్ దుర్గంలో తమ కథ చెప్పుకొనిపోతున్న మెక్కాబ్, తోడేలు అనే నాయకుడి నిలువుచిత్రాన్ని మాటలతో అభివర్ణించసాగాడు: "పొడగరి కాదు. కాని చాల అరుదైనమనిషి. నన్ను చిత్రహింస పెట్టుతారనుకోలేదు నేను. నిలువునా చంపివేస్తారనుకొన్నాను?"

తోడేలు ముందుకువచ్చాడు. ఇండియన్లు అతనిని తమ తండ్రిని సగౌరవ సాభిమానంగా చూచేటట్లు చూడసాగినారు. కాని అతనికంటె వయసున పెద్ద మరొకడున్నాడు. "ముగ్గిపోయిన యాపిల్ పండువలె యెండుకొని"న వృద్ధుడు, తోడేలు సరసనే వున్నాడు. ఈ వృద్ధుడు తోడేలుతండ్రి అనిపిస్తాడు. బండకత్తి అనే వాడితడేనేమో! అతగాడే పెద్దలకుకూడ పెద్ద. తోడేలు పేరైతే ఇండియన్లు యెన్నోసార్లు యెత్తుతారుకాని యితనిపేరు అసలు యెత్తనేలేదు. కాని బండకత్తి అయివుంటాడు. చెయిన్నీభాష అడపాదడపా యెరిగిన ఆండర్సన్, మెక్కాబ్ లిద్దరూ అన్నదానినిబట్టిచూస్తే, తమలో తాము మాట్లాడుకొంటున్న ఇండియన్ల ధోరణి ద్వేషభూయిష్టంగా వుండినట్లు తెలుస్తుంది. ఇండియన్ యువకులు అగ్నిహోత్రులైపోయారు. కాని యిది కార్చిచ్చువలె స్వాధీనం తప్పి వుద్రేకవివశమైన దురాగ్రహం కాదు. దుష్టాగ్నిజ్వాలవలె దుస్సహోష్ణ తీవ్రత కలదికూడ కాదు. ఇండియన్ యువకుల హృదంతరాలలోని ఆగ్రహం సంయమితమూ, ప్రయోజకమూ, సకారణమూ అయినట్టిది. కాని కులపెద్దలు అడుగడుగున అడ్డుపడుతున్నారు. ఆండర్సన్‌కు గాని, మెక్కాబ్‌కు గాని యీ విచిత్ర సంఘటనలోని ఆంతర్యం అవగతం కాలేదు. పొగగొట్టం తీసుకొని, దాని నిండుగా ముదుకపొగాకు కూరి, అగ్గికోసం మంట దగ్గరకు వెళ్ళి, ముట్టించుకొని, పొగపీలుస్తూ తోడేలు తిరిగి వచ్చాడు. ఈ వృద్ధుడెంతకాలం వలయంలో చరిస్తూ, పొగపీలుస్తూ, తన వారికి వారి పాలబడిన తమకూ నడుమ తన సాన్నిధ్యమనే గోడ నొకదానిని కట్టుతూ వుంటాడో, అంత కాలం తమకే ముప్పూ రాబోదని వేటగాళ్ళు గ్రహించారు. తోడేలు పీలుస్తున్న పొగగొట్టం చిత్రమైనట్టిది. మొక్కజొన్న కంకితో చేయబడినట్టిది.

పొగ పీలుస్తున్నంతసేపూ తోడేలు ముఖంలో విచారం, ఆలోచన, నిర్విణ్ణత ఒకదాని వెంబడి ఒకటిగా కనుపించసాగినవి. విశాలమై తోలు తోలుగా ముడుతలు పడిన ముఖం అతనిది. తనవారి కోపవచనాలను లెక్కించడం లేదతను. పాతపడి, పేలికలు పేలికలుగా చినిగి వ్రేలాడుతున్న అతని కంబళిలో యీ ఆర్గురి ప్రాణాలు నిలిచినట్లున్నాయి. కుర్రవాళ్ళు శత్రువధను గద్దించి అడుగుతున్నారు. ఇటువంటి దుండగుల కారణంగా అశేషమై అగణ్యమై వుండిన మహిష సంపద యేవిధంగా నిశ్శేషమైపోయిందో చెప్పుతున్నారు. నడుమ నడుమ ఆత్రంగా పక్వమాంస ఖండాలను భక్షిస్తున్నారు. వృద్ధునికి గల అధికార మెట్లాంటిదో మెక్కాబ్‌కు అంతుచిక్కలేదు. "చాల అరుదైన మనిషి—నూటికి కోటికి ఒకడు" అని మాత్రమే అన్నాడు. మృత్యువుకూ వేటగాళ్ళకూ నడుమ దుర్భేద్య వజ్రకుడ్యాన్ని కట్టగలిగినవాడు, ఆక్షేపణను ఆజ్ఞాతిక్రమణను సహించనివాడు, నిరుద్రిక్త మనస్కుడు, సౌమ్యవచస్కుడు, వజ్రసంకల్పుడు, స్థితప్రజ్ఞుడు—అని వేటగాళ్ళందరూ యెన్నికచేశారు. అతనంటే కుర్రవాళ్లకు

జగజెట్లని పేరుపడిన మొండిపోట్లకు భయం. సామాన్యమైన భయం కానే కాదు. మరేదో అలౌకికమైన భయం. "నూటికికోటికి ఒకడు"అని తిరిగి అన్నాడు మెక్కాబ్, ఆ ఒక్కమాటలో తాను చెప్పగలిగినదానినంతా యిమిడ్చివేసినట్లు.

వేడికోళ్ళు, గద్దింపులు, తిట్లు, కోపాలు, శాపాలు—అన్నీ కలిసి తుపాను వలె తోడేలుమీద బ్రద్దలైనాగాని, పొగపీల్చడం సాంతమైనంతవరకూ, అతను దేనినీ ఖాతరుచేయలేదు. పొగపీల్చడమంటే అతను దీర్ఘాలోచన చేయడం. అంతలో పొగ పూర్తిగా త్రాగాడు. గొట్టాన్ని నేలకేసిత్రిప్పి నుసి విదిలించి, నల్లబడినకాడను వేటగాళ్లకేసి త్రిప్పి నిలిపి, మాటల కుపక్రమించాడు. నిశ్శబ్దం సంక్షోభవించింది. స్త్రీలూ, పిల్లలూకూడ దగ్గరకువచ్చి నిలుచున్నారు. తెల్లవారి కెవరికీ అతని మాటలు పూర్తిగా బోధపడలేదు. చెయిన్నీ బాస ', ఒకమాటా మాటే, వాక్యముకూడ మాటే. పదివాక్యాలైనా ఒకొకప్పుడు అనర్గళధారాళత తోటి అవక్రగతితోటి సెలయేటిగలగలవలె ఒక్కమాటవలె వెలికురికి ప్రవ హించగలవు. చిట్టిచిట్టి అలలు తలలెత్తుతున్నట్లు, సంగీతంవలె శ్రుతిబద్ధమై స్వర భేదాలు, ముక్తాయింపులు, ఆరోహణావరోహణలు, చిత్రగతులు, గమకాలు వున్నట్లు వుంటుందీ భాష. కాబట్టి మెక్కాబ్ కొంతకు కొంతమట్టుకే బోధ పరచుకొనగలిగాడు. ఆండర్సన్‌కు ఆమాత్రంకూడ తెలియలేదు. ఇక మిగతావాళ్ళు మృత్యువును యెదురుచూస్తున్నారు. మెక్కాబ్ బోధపరచు కొన్న దేమిటంటే, తోడేలు న్యాయాన్యాయాల చర్చ చేశాడట. నిఖరంగా ఫలానా ఫలానా అని తెలియకపోయినా, మాటల ధోరణినిబట్టి గ్రహించ గలిగాడట. యువకులు ఆలోచించసాగినారు. తాము యెట్లాగూ చివరకు నాశనం కాబోతున్నామనిపించింది. నడుమ, యీ నీచులను చంపడం దేనికి ? తోడేలు వుపన్యాసం పూర్తిచేశాడు. తలవంచి నేలకు కళ్ళార్పి చూస్తున్నాడు. శైలసన్నిభదార్ఢ్యం యిప్పుడు నిగ్రహించింది. వేటగాళ్ళతో, "యీచోటు విడిచివెళ్ళండి" అని చెయిన్నీ బాసలో చెప్పాడు. వలయం దారియిచ్చింది. అగ్గరు వేటగాళ్ళూ కాలికి బుద్ధిచెప్పారు. వారికిదేమీ బోధపడలేదు. చిత్రహింస కిది మొదలేమో అనుకొన్నారు. పిచ్చెత్తినవాళ్ళవలె, కంపించే గుండెలతో, యెగవూపిరితో, నిస్సత్తువతో పరుగుతీశారు. ఇంతలో పరుగు నడకగామారింది. మళ్ళీ పరుగు లంకించుకొన్నారు. స్వేచ్ఛ! ఇదే వాళ్ళు ఆరుగురూ డాడ్జ్‌దుర్గం లోనివాళ్ళకు ఆచిఆచి చెప్పినకథ.

పత్రికా ప్రతినిధులతో షెర్మన్‌సేనాని వాషింగ్టన్‌లోని తన కార్యా లయమందు చెప్పినది వేరొకకథ. ఏభైఎనిమిదేళ్ళ వయసునకూడ చువ్వవలె చలా కీగా, కార్యోత్సాహిగా వుంటా డాయన. పత్రికా ప్రతినిధుల సమావేశమందు ఆతనికి కోపమే వచ్చిందో, కూర్చున్నచోటునుండి పైకిలేచి, శివమెత్తిన సింహం వలె, భూమిదద్దరిల్లేటట్లు యిటు అటు నడవడ మలవాటు. "జాగ్రియాగుండా

దండుపోవడ" మని ప్రతివేదకులు నవ్వులాట కంటారుగాని అమర్యాదగా అనరు. షెర్మన్ సేనాని నిష్కపటి. కాని అతనికి ప్రతిభగాని, భావనాశక్తిగాని తక్కువ.

అతని చుట్టూ మూగి, "ఆనాటి మాట అలెందుకుగానీండి - యీ యుద్ధం సంగతి ఏమంటారు?", అని ప్రశ్నలు వర్షించసాగినారు.

"మీరంతా పెద్ద మనుషులు. ఇట్లాగు మాట్లాడసాగితే మేలుకంటె కీడెక్కువ రాగలదు," అతని జవాబు.

"కానైతే కాన్సాస్‌లో యుద్ధం జరుగుతున్నదిగదండీ?"

"యుద్ధమా? లేదు!"

"ఇండియన్లదాడి కూడ లేదంటారా? డాడ్జినుండి, కోల్డ్‌వాటర్‌నుండి, గ్రీన్స్‌బర్గ్‌నుండి, మెడిసిన్‌లాడ్జినుండి, ప్రాట్‌నుండి ప్రతి ఒక గంటా వార్తలు వస్తూవున్నాయి. ఎనభై మంది పౌరులు హత్య అయినట్లు, పన్నెండు పశుల మంద సాలలు ధ్వంసమయినట్లు, రాష్ట్రమంతటా సేనలు పోట్లాడుతున్నట్లు, ఇండియన్లు యుద్ధపథం త్రొక్కినట్లు వచ్చేవార్తల సంగతి ఏమి సెలవిస్తారు?"

ఈ ప్రశ్నలకే అతనికి కోపంవచ్చింది. లేచి చిరుబురులాడుతూ చిడిముడి పాటుతో గది కలయతిరుగసాగాడు. "ఇది యుద్ధంకాదని మీరు తెలిసికోవాలి. తిరుగుబాటనే గొప్పపేరుకూడ దీనికి తగదు. యుద్ధమని పిలవకండి. ఈ అనాగరకపశువులు హత్యలుచేస్తున్నమాట నిజమే. కాని ప్రతిహత్యకు వాళ్ళు సంజాయిషీ చెప్పుకోనేటట్లు చేస్తాం. పగతీర్చుకొంటాం. ఈదేశం యికముందు మరొక ఇండియన్ దాడివల్ల వచ్చేక్షోభను అనుభవించబోదు. ఇదే చివరిది..." ప్రతివేదకులు వెళ్ళిపోయిన వెనువెంటనే, షెర్మన్ జారీచేసిన ఆజ్ఞల మేరకు జార్జి క్రూక్ సేనాని బయళ్ళసీమలో సకల సైనికచర్యలకు సర్వాధికారిగా నియమితుడైనాడు. ఊరిమీదపడి విచ్చలవిడిగా తిరుగుతున్న తోడేలు నెట్లా హతమార్చవలెనో, ఇండియన్లను అదే విధంగా లొంగదీయవలెనని అతను అనుజ్ఞాతుడైనాడు.

జార్జ్‌క్రూక్ సేనాని ఇండియన్ యుద్ధాలలో రాటుదేరినపోటరి. ఎంతో ప్రత్యక్షానుభవ సంపద కలవాడు. భ్రమలు లేనివాడు. చెయిన్నీల స్వస్థానమైన వయోమింగ్ సీమలోనూ, పౌడర్‌నదిమీదనూ, నల్లమలలలోనూ, బయళ్ళమీదనూ ఇండియన్లతో బాహాబాహీ కయ్యం జరిపినవాడు. నూరుమంది ఇండియన్ మొనగాళ్ళకెదురుబడిగా నూరుమంది సైనికులనుగాని, రెండు ఆశ్వికదళాలనుగాని, మూడింటిని గాని నిలిపించడం సైనికవిషయాలు తెలియని చవట చేయవలసినపని, అని క్రూక్ భావించాడు. తనకు కావలసింది కీర్తికాదు - సత్ఫలితాలు! తన వేటసంచి నిండాలి. తాను వేటాడదలచిన జంతువు చేతికి చిక్కాలి.

కనుక దేశపటంమీద క్రూక్ సేనాని ఒక వలయాన్ని గీశాడు. కాన్సాస్, నెబ్రాస్కా రాష్ట్రాలగుండా కొలరేడోలో కొంత ప్రదేశాన్ని ఆక్రమించ

గలంతటి పెద్ద వలయాన్ని చుట్టాడు. ఈ వలయమం దెక్కడో ఒకచోట, బహుశా కేంద్రానికి దాపుగా, చెయిన్నీలున్నారు. కొన్ని రోజులలో కొన్ని వారాలలో యీ వలయాన్ని దాటిపోగలరు. త్వరపడి లాభంలేదు. వ్యూహం క్రమక్రమేణ, అంగుళి మంగుళం, సర్వవిషయ సుదృఢంగా తయారుకావాలి. అంతా లెక్కవేసిచూస్తే, తనక్రింద, యీ వలయంలో దరిలోగాని, దాపునగాని పన్నెండువేలమందిసైనికు లున్నారు. కేంద్రం వైపుగా అంచులనుండి కొన్ని బాణపుగుర్తులు గీశాడు క్రూక్ సేనాని. తర్వాత, బాణపు గుర్తులను మాటలుగా మార్చి, కాగితపు ముక్కలమీద శుద్ధంగా వ్రాయసాగాడు. మాటలు విద్యుత్ప్రేరణలైనవి. ప్రేరణలు అన్నీ కలిసి తంత్రీచలనమైనవి. ఉత్తరాన రాబిన్సన్ దుర్గంలో యీ చలనం తిరిగి మాటలరూపం ధరించింది. మూడవ అశ్విక సైన్యంలో ఐదు దళాలు గుర్రాలకు జీనులువేసి, చెక్కతలుపులు తెరచి బయలుదేరాయి. ఈ తంత్రీచలనం డకోటా సీమలోని మీడ్ దుర్గంలో కూడ ప్రచలించింది. ఇక్కడ ఏడవ అశ్విక దళముంది. ఈ దళమందే ఒకప్పుడు కస్టర్ సేనాని పనిచేశాడు. రెండేళ్ళక్రితం యీ దళమే లిటిల్ బిగ్ హారన్ దగ్గర ఓడిపోయింది. రెండేళ్లలో పరాజయ పరాభవముద్ర తొలగిపోలేదు. అప్పుడు రెండువందల అరవై అయిదు మంది హతులయ్యారు; ఏభైయిద్దరు గాయపడ్డారు. కస్టర్ సేనాని చెయిన్నీలను, సియోక్స్ ఇండియన్లను పెట్టిన ముప్పతిప్పలకు ఇండియన్లు బాగాపగతీర్చుకున్నారని అందరూ అనుకొనేవారు. వాళ్ళు కస్టర్‌ను చంపలేదు. ప్రాణాలతో విడిచి పెట్టారు. కాని కస్టర్ ఆత్మహత్య చేసికొన్నాడు. ఏడవదళం ఆనాటినుండి ప్రతీకార వాంఛాబద్ధమై వుంది. నేడు ఏడుదళాలు మీడ్ దుర్గంనుండి బయల్వెడలిన క్షణంనుండి పలాయితులైన మున్నూర్గురు చెయిన్నీలను హతమార్చవలెననే సంకల్పం యితోధిక తీవ్రమయింది.

సిడ్నీలో, మేజర్ థార్న్‌బర్గ్ తన సైనికులను కదిలించాడు. వాళ్ళతోబాటు ఒక హోవిట్జరు కూడ తరలిపోయింది.

వేలెస్ దుర్గంనుండి పంథొమ్మిదవ పదాతిదళం కల్నల్ లెవిస్ ఆధిపత్యాన బయలుదేరింది. వేలెస్ దుర్గం డాడ్జినగరాల నడుమ సరళరేఖ నేరుగా గీస్తే, ఆ రేఖకు తూర్పు దక్షిణాలుగా పరచుకొని లెవిస్ సైనికులు దండు వెళ్ళారు. క్రూక్ సేనాని పథకాన్నిబట్టి చూస్తే, ఈ సైనిక చర్యలు నేరుగా ఇండియన్లను దెబ్బకొట్టాలని కాదు. పలువైపులనుండి వస్తున్న ఈదళాలు, అంచులనుండి కేంద్ర బిందువువైపుకు పోయే బాణపు గుర్తులవలె కేంద్రీకృతాలు కాగలవు. ఇటువంటి వ్యూహంలో, పంథొమ్మిదవ పదాతిదళం అడ్డుగా కాక ఒక కంచెగా వుపకరించాలని నిర్దేశింప బడింది. తూర్పున ఏభైమైళ్ళదూరంలో ఇండియన్లు మెదులుతున్నట్లు క్రూక్ సేనాని, లెవిస్‌దళవాయికూడ అనుమానించారు. దారిచూపేందుకు, గస్తీతిరి

గేందుకు అశ్వారూఢులైన అస్సురు పానీ యిండియన్లను లెవిస్ నియోగించాడు. ముఖ్యదళంకంటె కొంచెం ముందుపోతూ, సాధక బాధకాలు వివరించడం యీ గ్స్త్రీ మనుషుల పని. ఆఫీసర్లుకూడ అశ్వారూఢులే. పదాతిదళంవెంట ఒక చిన్న ఆశ్వికదళంకూడ వస్తున్నది. కాల్బలమేమో, నలుగురు నలుగురుగా, పాము మెలికలవలె నడుస్తున్నది. తుపాకులుతప్ప మరేదీ మోయడంలేదు. తతిమ్మా సరంజామా యావత్తూ శకటాలలో వస్తున్నది. కాబట్టి యీ కాల్బలం పగటిపూట ముప్పై మైళ్ళ చొప్పున ప్రయాణం చేయగలిగింది. కల్నల్ లెవిస్ నిశ్చింతగా వున్నాడు. ఇండియన్లు అడ్డుతగిలినా యుద్ధఫలితం తమకు సుముఖమై వుండక తప్పదని అతని ధీమా. కాని యితర విషయాలలో అతనికి యీ చిత్తస్థైర్యం కొరవడింది.

తన చెల్లెలికి చాలరోజులనుండి వుత్తరమే వ్రాయలేదు. గుర్రంమీద పోతూ పోతూ, వ్రాద్దామని అనుకొని మరచిపోయిన లేఖను మనసులో తిరిగి కూర్చుకొనసాగినాడు. అందులో తన డబ్బు చిక్కులను గురించి, మేజర్ క్లేర్‌తో తనకు పడిన తగవుగురించి, తనకు రాబోతున్న ముప్పుగురించి, పేరుకొంటున్న విసుగు వేసటలను గురించి చాలచాల వివరించదలచుకొన్నాడు. వెన్నుపూస మొదలయేచోట తీక్ష్ణమయిన బాధపుడుతున్నది. ఊహాలేఖలో తన మూత్రపిండాలను గురించి, కాలేయం గురించిదీర్ఘంగా వ్రాశాడు. చెల్లెమ్మ తన బాధను అర్థంచేసికొని సానుభూతి చూపుతుంది. వృద్ధాప్యంలో రెండు రోజులు తదేకంగా వెన్నునొప్పులున్నా గాని స్వారీచేయడం తగనిపని. కల్నల్ లెవిస్ ముందుకు తేరిపార చూచాడు. గ్స్త్రీమనుషులు ముగ్గురు ఆటవిక సహజనిర్భరోత్సాహంతోటి చూపరులకు గూడ వుద్రేకాన్ని కలిగిస్తూ, యిటువైపే హుటాహుటిగా గుర్రాలమీద వస్తున్నారు. లెవిస్‌కు ఇండియన్లంటే సరిపడదు. చాల శుచివంతుడు. పానీ యిండియన్ గ్స్త్రీ మనుషులతో కరస్పర్శ చేయడానికి కూడ వెనుకాడుతాడు. వాళ్ళు పసిపిల్లలవలె విశాలమైన నవ్వుముఖాలతో దగ్గరకు వచ్చారు.

"ఏమిటయింది?", అని కల్నల్ లెవిస్ ప్రశ్నించాడు.

"జీసస్‌తోడు, ముండ పోటరులు అక్కడున్నారు."

"నిజంగానా? సరిగా చూచే చెబుతున్నారా మీరు?"

వాళ్లు మళ్ళీ పళ్ళికిలించి నవ్వారు. కొన్ని మైళ్ళ యెగువలో ఒక చిన్న యేటిఒడ్డున కందకాలు త్రవ్వుకొని చెయిన్నీలు విడిదిచేసి వున్నారట. ఫిట్జ్ గెరాల్డ్ మొదలైన అధికారులు ఈ కందకాల విషయం విశ్వసించలేదు. ఫిట్జ్ గెరాల్డ్‌ను తన ఆశ్వికులను తీసికొనిపోయి చూచి రావలసిందిగా లెవిస్ ఆజ్ఞాపించాడు. పోయివచ్చి, ఫిట్జ్ గెరాల్డ్ కూడ గ్స్త్రీమనుషులు చెప్పిన దానిని ధృవపరిచాడు. ఇండియన్లు విశ్రాంతి తీసికొంటూ వంటలు చేసికొంటూ మాత్రమే

వున్నారని తెలియజేశాడు. "వాళ్లు కలతచెందినట్లే లేదండి. మమ్మల్ని చూచాక కూడ చెక్కుచెదరలేదు. అసలు లెక్కజేయనేలేదు" అన్నాడు.

"మొండి పోటుగులేనా", అని లెవిస్ నమ్మకం కుదరనట్లు ప్రశ్నించాడు.

"గస్తీ మనుషులు కనిపెట్టారుగా!"

"నాకేం బోధపడటంలేదు. వాళ్ళకు రెక్కలుండాలి. లేకుంటే, డాడ్జ్ నగరానికి తూర్పున వుండినారని కదా మనం విన్నది. ఇక్కడికి యింతలో యెట్లా రాగలిగారు? కందకా లెందుకు త్రవ్వినట్లు? పోయి వాళ్ళను చుట్టుముట్టి లొంగదీసి డాడ్జ్ నగరానికి శకటాలలో యెక్కించి పంపేద్దాం, పదండి!", అన్నాడు లెవిస్.

దళాధిపతుల ఆజ్ఞలమేరకు, పదాతిదళం తిరిగి నడక సాగించింది. కల్నల్ లెవిస్ మనస్సును తనకిష్టమైన తూర్పుసీమపైనుండి ఇండియన్ మూక మీదికి మరల్చుకొంటున్నాడు. వాళ్ళమీద కోపం రాసాగింది. ఎక్కడ వుండకూడదో అక్కడికి యెందుకు వచ్చిపడ్డారు వీళ్ళు? ఎందుకు కందకాలు త్రవ్వుకొన్నారు? తన సమక్షంలోనే శాసనబహిష్కృతులవలె చట్టాలెందుకు ధిక్కరిస్తున్నారు? ఈ ఆలోచనలలోపడి, కాల్బలాన్ని మరింత త్వరగా నడవమని ఆజ్ఞాపించాడు.

అస్తంగతుడౌతున్న సూర్యుని రశ్మిలో వెలుగొందుతున్న ముఖాలతోటి యిరవైమంది అశ్వాసీనులైన యిండియన్ యోధులు నిశ్చలంగా, సమీపిస్తున్న పదాతి దళాన్ని తదేకంగా చూడసాగారు. పానీయిండియన్ గస్తీమనుషులు తుపాకుల నూపుతూ పిచ్చికేకలు పెట్టుతున్నా, ఇండియన్లు తొణకలేదు.

"చేతులు యెత్తుకొని వచ్చి లొంగిపొమ్మని చెప్పండి," అని లెవిస్, ఫిట్జ్‌గెరాల్డ్‌తో చెప్పాడు. అతను దానిని చాలతూర్లు వల్లించినట్లు అరచి చెప్పాడు. గస్తీమనుషులు హడావుడి చేస్తూవున్నారు. పదాతిదళం రెండు వరుసలుగా తీరి నిలిచింది. కాని చెయిన్నీలింకా నిశ్చలంగా, నిరుద్రిక్త ముఖాల తోటి ప్రశాంతంగా వున్నారు. వెనుకనుండి పొగలేస్తున్నది. ఫిట్జ్‌గెరాల్డ్ వెనక్కుతిరిగి వచ్చేశాడు. వాళ్ళకు యింగ్లీషు తెలియదని వివరించాడు.

"గస్తీమనుషులకు చెయిన్నీ భాష వచ్చా?"

"రాదు. అదీగాక, వాళ్ళు చిందులు త్రొక్కుతున్నారు. వాళ్ళను పంపిస్తే మరి అగ్గి అక్కర్లేదు" అన్నాడు కెప్టన్ ఫిట్జ్‌గెరాల్డ్.

"మీ అశ్వదళాన్ని వెంటబెట్టుకొనిపోయి, వాళ్ళను బంధించివేయండి" అన్నాడు కల్నల్ లెవిస్. ఫిట్జ్‌గెరాల్డ్ తనవాళ్ళను కూడగట్టుకొని బయలుదేరాడు. గస్తీమనుషులకు యీ వ్యవహారం బోధపడింది. గుర్రాలను గిర్రున త్రిప్పి, చెయిన్నీలవైపు సుడిగాలివలె యెగిరి, కేకలుపెట్టుతూ పోయారు. వీరి నడ్డగించాలని ఫిట్జ్‌గెరాల్డ్ తన గుర్రాన్ని అదల్చినాడు. అతనూ, అతని మనుషులూ కత్తులను వొరలనుండి లాగిపట్టుకొనివున్నారు.

జీనులమీదికి ముందుకు వంగి, జాగ్రత్తగా గురిచూచి, చెయిన్నీలు తుపాకులు ప్రేల్చారు. ముగ్గురు గ్తీమనుషులు దెబ్బతిని గుర్రాలమీదినుండి పడిపోయారు. అశ్వికదళం కాల్బలంమీదికి దూకి వచ్చిపడింది. ఒక గ్తీవాడు చెయిన్నీల మీదిమీదికిపోయి, వాళ్ళ బల్లానికి దిగబడిపోయాడు. చెయిన్నీలు తిరిగి శిబిరానికి వెళ్ళిపోయి, అందరు శత్రువుల సమక్షాన, బాహాటంగా నిర్భయంగా గుర్రాలు దిగినారు. ఆడవాళ్ళు ఆ గుర్రాలను నడిపించుకొనిపోగా, యోధులు మిగతవారి సరసను చేరినారు.

ఫిట్జ్ గెరాల్డ్ ఆధిపత్యానగల ఆశ్వికులుకూడ గుర్రాలుదిగి, కాల్బలంలో కలిశారు. అతని ముఖం మొద్దుబారి, హఠాదాశ్చర్యనిర్విణ్ణ మైపోయింది. లెవిస్ ముఖాన కోపం అలలలలుగా వుబుకుతున్నది. కాని యిది ద్వేషభావపూరితం కాదు. అతనుకూడా గుర్రం దిగి, కాల్బలంముందు తిరుగుతున్నాడు. వేసే ప్రతి అడుగుకూ వెన్నుపోటు తీవ్రతరం కాసాగింది. సైనికులు బహు మెలుకువుగా జాగ్రత్తగా వంగివంగి ముందుకు నడుస్తున్నారు.

చేత కత్తి దాల్చి, స్థిరగమనంతోటి, స్థిరసంకల్పంతోటి కల్నల్ లెవిస్ ముందుండి సేనను నడిపిస్తున్నాడు. విరోధులను శిక్షించి బుద్ధిగరపడమే తన లక్ష్యం. కందకం ముందున్న మట్టి గుట్టమీద ముతక పొగగొట్టాన్ని పీలుస్తూ, నిరాయుధుడై, కరుణాభరమైన మందహాసం తోటి నిశ్చలుడై కూర్చుని వున్న వృద్ధుడైన ఇండియన్ పెద్ద పట్ల అతనికి మెప్పు గాని, గౌరవం గాని లేదు. తన సైనికులు సామాన్యులు కారు; రాటుదేరిన వాళ్ళు. ఇండియన్లంటే తనకు భీతి గాని, సానుభూతి గాని, గౌరవభావం గాని లేదు. ముందు నుండి అగ్ని వర్షం ముంచెత్తుకొని వస్తున్నా లెక్కించక లెవిస్ వజ్రసంకల్పుడై నడిచాడు.

చెయిన్నీలు యావన్మంది ఒక్కుమ్మడిగా తుపాకులు ప్రేల్చారు. కందకం అంచున కూర్చున్న వృద్ధనాయకుని కరచాలన మొక్కటే యింతపని చేయించింది. సైనికులు దాని ముందు నిలువద్రొక్కుకొన జూచారు. కాని, ఆ ఘోరాగ్ని ఉక్కు కమ్ముచులైనై వారిని వెనుకకు తరిమి తరిమి కొట్టింది. వృద్ధ నాయకుణ్ణి కాల్చివేయజూచారు కాని అతను యథాపూర్వకంగా కూర్చునే వున్నాడు. ఏ మహోత్పాతానికి కూడ అతను చలించేటట్లు లేదు.

నెత్తురులోడ్చుకుంటూ, మృతులను, క్షతగాత్రులను తమ అధినాయకుణ్ణి వెనుక వదలివేసి పరుగుతీశారు. మోకరిల్లినట్లుపడి, నేలకు చేతులాన్చి లేవజూస్తూ విద్వేషభావమే లేక, కల్నల్ లెవిస్ తిరిగి పడిపోయాడు. వెంటనే వెన్నుపోటు తగ్గిపోయింది. ఫిట్జ్ గెరాల్డ్ స్వయంగా కల్నల్ లెవిస్ దేహాన్ని తీసుకుని రావడానికి ముందుకు పోయాడు.

ఫిట్జ్ గెరాల్డ్ చేయబూనిన కృత్యం సాహసోపేతమైనట్టిది. తన చుట్టు ప్రక్కల మనుషులు భయోపహతులై తల కొకదారిన పరువెత్తి పోతున్నారు.

తానొక్కడే శత్రువుల కభిముఖంగా చావుకెదురుగా నడిచి ముందుకు ముందుకు పోతున్నాడు. చెయిన్నీలతనిని తేరిపార జూస్తున్నారే కాని తుపాకులు ప్రేల్చనే లేదు. వృద్ధనాయకుని చిరునవ్వు అస్తమించింది. కల్నల్ లెవిస్ మృతదేహాన్ని చేతులతో యెత్తిపట్టుకుని, బరువుకు నీల్గినిలుచున్న ఫిట్జ్ గెరాల్డ్ దృష్టికి, వృద్ధుని విశాల వదనాన జాలి, దిగులు గుబులుకొన్నట్లు కనిపించింది. ఇండియన్లకు వీపు త్రిప్పి, తన మనుష్ులవైపు వచ్చేశాడు.

సాయంకాల మాసన్నమయ్యేటప్పటికి, పందొమ్మిదవ పదాతిదళం అర్థ వలయాకృతిగానున్న శకటాల వెనుకకు చేరుకొన్నది. చిన్న చిన్న ఆఫీసర్లు మతి మాలి నిరుత్సాహపడిపోయారు. కల్నల్ లెవిస్ శరీరముంచబడిన శకటంవైపు అప్పుడప్పుడు దృక్కులు పరపుతూ కాలంగడపసాగినారు. ఇండియన్లు దాడి వస్తారేమో కనిపెట్టి వుండేందుకు కాపలావాళ్ళను నియోగించారు కాని ఇండియన్లవైపునుండి చాలసేపటివరకు యేరకమైన సంచలనమే వినిపించలేదు. అంతలో రాత్రి కొంత గడిచేసరికి, హయఖురాగ్రఘట్టన వినిపించింది. చెయిన్నీలు ఉత్తరానికి చీకటిలోకి వెళ్ళిపోతున్నారని యీ చప్పుడు చెప్పకచెప్పింది.

ఈసారి వారి పోకడను తెలిపేజాడ చక్కగాలేక, తిరుగుళ్ళతో, మలుపులతో, మెలికలతో, యిదమిత్థమని వూహింపరాని విధంగా తయారయింది. పన్నెండువేలమంది రాటుదేరి చేవదేరిన పోటరులు, యిదివరకు యిండియన్లతో పోట్లాడినవారు, మున్నూరుమందిని పట్టిపల్లార్చలేకపోయారు. పేరుకు మున్నూరుగురే కాని యిందులో ఎనభై చిల్లరమందిమట్టుకే పురుషులు; అందులో సగభాగమే పూర్ణయవ్వనులైన యోధులు.

నీలివన్నె దిరుసులు ధరించిన సేనలు కాన్సాస్ రాష్ట్రాన్ని గాలించాయి. ఆశ్వికులు, పదాతిసైనికులు, ఆగ్నేయశస్త్ర ప్రయోగ నిపుణులు, తుపాకులు, కృపాణాలు, హోవిట్జర్లూ-యివి నిర్ఛిద్ర నిర్విరామగతిలో పనిచేయసాగాయి. చిల కేటుగా ఇండియన్లతో కయ్యాలుకూడ జరిగాయి కాని గాయపడినవారూ చని పోయినవారూ బయళ్ళ పసిమివన్నె పచ్చికశయ్యలమీద పవ్వళించసాగారు.

అప్పుడప్పుడు చుట్టుముట్టబడి దిక్కుతోచక, యిండియన్లు యిద్దరు ముగ్గురుగా ఒకటిగా విడిపోయేవారు. రెండుమందల పన్నెండు గుర్రాలను అపహరించినమీదట, చావుకు తయారుగావున్న తమ చిన్ని గుర్రాలను విడిచిపెట్టి, కొత్త గుర్రాల నెక్కిపోయేవారు. మందలలోని పశువులను విడగొట్టి చంపి, మాంసం మస్తుగా తిని, మిగిలినది భద్రపరచుకొని, ముందుకు శరవేగాన వెళ్ళి పోయారు.

◆ ◆ ◆

ఈగిల్ బార్ డి అనే పశుల మందశాలనుండి ఒక శకటంతోటి బయలుదేరి పోతుండిన రౌతులు కొందరు మిత్రుస్థలానికి గుర్రాల నెక్కించేసరికి, బర్రెనొక

దానిని చంపి తోలు ఒలుస్తుండిన ఇండియన్ల నిద్దరిని చూశారు. వెంటనే గుర్రాలను తోలి పరుగెత్తించడం చూచిన ఇండియన్లు తమ గుర్రాలున్న చోటికి పరుగు తీశారు. ఒకడేమో అంగలువేసి గుర్రాన్ని చేరి యెక్కి- వుడాయించాడు. కాని రెండవవాడి కాలిలో తూటాదూరేసరికి పడిపోయాడు. తుపాకిని రెండుచేతులతో పట్టుకోనేందుకు నానా తంటాలుపడుతున్న, ఆ అభాగ్యుణ్ణి చుట్టుముట్టివేశారు. మార్క్- రెడీ అనే తలమనిషి తుపాకిని కాలితో తన్నిపారవేశాడు. ఆక్సెల్ గ్రీన్ అనేవాడు పదనైన ముళ్ళ లాడాలు కొట్టిన కాలి బూటుతో భూపతితుడై యున్న ఇండియన్ ముఖంమీద తన్నినాడు.

మూడువందల గజాలదూరం వెళ్ళిపోయిన పిమ్మటగాని, మొదట పోయిన ఇండియన్, గుర్రాన్ని ఆపి, యిటు త్రిప్పి, చూడ సాహసించలేదు. ఇంత దూరంనుంచి అతన్ని కాల్చిజూచికూడ లాభంలేదు. క్లింగ్ అనేవాడూ, శాండర్సన్ అనేవాడు తుపాకి విద్యలో నేర్పరులైకూడ వృధాగా అతనిమీద గురిచేసి ప్రేల్చారు. అతన్ని వెంటబడి పట్టుకోవలెనని గ్రీన్ సూచించాడు. కాని రెడీ ఒప్పుకోలేదు. "ఒకడు పట్టుపడ్డాడు. అంతేచాలు" నన్నాడు. శాండర్సన్ కూడ ఔనంటే ఔనన్నాడు. విరిగిన కాలుతో నెత్తురుచిందే ముఖంతో పడివున్నవానిని చూపుతూ, "వీడు మొండిపోటరి అయి వుంటాడు. సందేహంలేదు. వీళ్ళగుంపు ఈ చుట్టుపక్క- లెక్క-డో వుంటుంది" అన్నాడు. తప్పించుకొనిపోయిన ఇండియన్ నెమ్మదిగా వెళ్ళిపోయాడు. గాయపడిన మనిషి ఒక మోచేతిమీద బరువాన్చి, నిశ్చలంగా పడివున్నాడు. రౌతులకేసి చూడనైనా చూడక, మంద్రస్వరాన వింతపాటేదో పాడుకోసాగినాడు.

"ఏమిటది ?"

"మృత్యుగీతి," అన్నాడు శాండర్సన్. మార్సీ తాతను ఇండియన్లు చంపివేశారట. కనుక ఇండియన్లపట్ల యితరులు చూపే ద్వేషభావంకంటె తాను యెక్కు-వ చూపడం విధ్యుక్తధర్మ మనుకొంటాడు. శాండర్సన్ మాటలకు మార్సీ ముఖం నవ్వుతో వికసించింది.

"ఏం చేద్దాం వీణ్ణి?" అని గ్రీన్ అడిగాడు.

"ఎర్ర లంజకొడుకు" అన్నాడు మార్సీ.

"కావచ్చు. మన కేం పోయింది?" అన్నాడు ఫెర్గసన్ అనేవంటవాడు. ఒక ప్రక్క-కే ఒత్తిగిల్లి పడుకొని, మోచేతిమీదనే ఒంటి బరువంతటినీ ఆన్చి నేలకే చూపులు లంకించి వున్నాడు ఇండియన్. ముప్ఫై యేళ్ళలోపు వయస్సుంటుంది. స్పష్టమైన దేహరేఖలు, పటువైన దీర్ఘకాయం గలవాడు. ఎదురురొమ్ము, భుజాలు పటిష్ఠాలు. ముఖమూ, కాలూ పోటుపెట్టుతున్నాగాని ఆవేదనా చిహ్నలెందునా కానరావు.

"చెట్టు యెక్కడైనా వుందేమో చూద్దాం,"! అని రెడీ నిశ్చయించాడు. "క్రిశ్చియన్‌కు చేసే అంత్యకర్మలే చేద్దాం."

"వద్దువద్దు."

"ఇటు చూడు, రెడీ, యితనిని హింసించేహక్కు మనకు లేదు. మొండి పోటరే కావచ్చు. కాకపోనూవచ్చు. ఇండియన్ల గురించి బాగా తెలిసినమనుషులు మనలో లేరు. కాని యితన్ని హింసించే హక్కు మనకు లేదు," అన్నాడు వంటవాడైన ఫెర్గుసన్.

"కాదట- కాదు. వీడి జోళ్ళకేసి చూడవయ్యా కళ్ళుబెట్టుకొని."

ఆ యిండియన్ యువకుని బలమైన జోళ్ళు, అడుగు బాగా అరిగి చిరిగినా కూడ, పూర్వశోభను యింకా ఛాయాప్రాయంగానైనా సూచిస్తున్నవి. ఇటువంటి కాలిజోళ్ళను ధరించేవాళ్ళు యిండియన్లలో మొండిపోటరు లనబడే మహా వీరు లొక్కరే.

ఫెర్గుసన్ ప్రతిముఖాన్ని పరీక్షగా చూశాడు. సగంమంది కుర్రవాళ్ళు. ఇరవైలోపు వయసువాళ్ళే. అందరూ మంచి వాళ్ళే, స్వార్థరహితులే, సరళ జీవనులేనని తానెరుగును. "అతన్ని హింసించకండి! క్రైస్ట్, అతన్ని చావనీయండి ఎట్లాగూ చచ్చేవాణ్ణి హింసించకండి", అని దీనంగా ప్రార్థించాడు.

"నోరు ముయ్" అన్నాడు మార్సీ.

మరెవ్వరూ కిక్కురుమనలేదు. వలయాకృతిగా నిలిచి పడివున్న వానికేసి చూడసాగారే కాని వంటవాడి నసలు ఖాతరు చేయలేదు. ఫెర్గుసన్ శకటం దగ్గరకు పోయి, చిన్ని చెంబునిండా నీళ్ళు ముంచి, ఇండియన్ చేతి కందించాడు. అతను కళ్ళెత్తి, క్షణంసేపు ఫెర్గుసన్‌ను పారజూచి, చెంబు అందుకొని, త్రాగేశాడు. తన బాసలో యేదో అన్నాడు త్రాగిన తర్వాత.

"కట్టి గుర్రంమీద పడెయ్యండి," అన్నాడు మార్క్ రెడీ. అతనిది విచిత్ర ప్రకృతి. ఒక నిర్ణయం చేయడమే తరువాయి, దానిని వెంటనే అమలుజరుపవలె ననుకొంటాడు. అతని విశిష్టత అదేనని అందరికీ తెలుసు. ఫెర్గుసన్ నిస్సహాయత సూచిస్తూ తలపంకించాడు. వెనక్కు మళ్ళి శకటమెక్కి కూర్చున్నాడు. ఇండియన్ యువకుణ్ణి అతని గుర్రానికే కట్టివేసి, రెండుమైళ్ళు మౌనముద్ర ధరించినట్లు నడిచాకగాని, చెట్టుజాడ కూడ వాళ్ళకు కనుపించలేదు. ఒక యేటి అంచున, వంగి సగంతల నీటిలో ముంచివున్న పత్తిచెట్టు ఎదురయింది. ఇండియన్ మెడకు వురిపోసి ఒకకొస చెట్టుకు మరొక కొస అతని గుర్రపు జీనుకు కట్టివేశారు. ఏదోవిధంగా, ఆ ఇండియన్ ఒంటికాలిమీద చక్కగా నిలుచో గలిగాడు. ఈ దుండగీళ్ళ ముందు తాను లోకువ కాకూడదనేదే అతని పట్టుదల. ఆత్మగౌరవానికి లోటే వుండకూడదు. అతని ముఖంలో ఏవిధమైన భావో ద్రేకం గాని భయచ్ఛాయగాని లేదు. కన్నులు ముకుళించాడు.

"ఏదైనా మాట్లాడితే బాగుండును. ఏదోఒకటి యేడవకుండా పెదిమలు బిగించి చచ్చిపోతున్న వాళ్లని చూస్తే నాకు అరికాలి మంట నెత్తికెక్కుతుంది" అన్నాడు శాండర్సన్.

మార్కరెడీ యింతలో గుర్రాన్ని కమ్చీతో కొట్టాడు. అది పరుగు తీసింది. కాబట్టి ఇండియన్ యిప్పుడు శూన్యంలో వ్రేలాడసాగినాడు. ఫెర్గసన్ వంగి, గుర్రాలను అదిలిస్తూ, "మనం విడిది చూచుకోవాలి. అందుకని బండిని పోనిస్తుంటాను," అన్నాడు.

◆ ◆ ◆

వేలస్‌దుర్గంలో, కెప్టెన్ ముర్రే, వింట్, వారి ఆశ్వికులు గుర్రాలు మార్చారు. ఇండియన్లజాడను అంటిపెట్టుకొని వాళ్ళు కాన్సాస్ రాష్ట్రంలో సగభాగాన్ని తూర్పునుండి పడమటికి, యావద్రాష్ట్రాన్ని దక్షిణంనుండి ఉత్త రానికి తిరిగి చూచారు. వికువందలమైళ్ళు స్వారీచేశారు. గుర్రాల జవసత్వాలను హరించివేశారు. తామే హరించుకపోయారు. వేలస్‌లో ముర్రే, వింట్‌లు స్నానం, క్షురకర్మ చేసుకొన్నారు. వాళ్ళ సైనికులు నిద్రించారు. దేశపటాలను ముర్రే పరీక్షించి పరీక్షించి చూశాడు. కల్నల్ మిజ్నర్ సముఖానికి ఒక నివే దిక, క్రూక్ సేనాని సముఖానికి మరొకటి వ్రాసిపంపి, మత్తునిద్ర వచ్చేవరకు త్రాగాడు. ఈవరకే కాల్బలాన్ని వెంటబెట్టుకొని కల్నల్ లెవిస్ వెళ్ళిపోయాడు. ప్రస్తుతం దుర్గాధిపతిగా వుంటున్న గూడాల్ ముర్రే అంటే చిన్నచూపు దాపరికంలేకుండా చూపేవాడు. రెండుగంటలపాటు మత్తునిద్ర పోయిన ముర్రే మేల్కొన్నవెంటనే, వింట్‌తో, సైనికులను గుర్రాలెక్కమని ఆజ్ఞాపించాడు. వింట్ అవుననలేదు, కాదనలేదు, వాదించలేదు, తిరస్కరించలేదు. ముర్రే అంత రాంతరాలలో జరుగుతూన్న వ్యవహారమంతా వింట్ ఒకకంట కనిపెట్టుతూనే వున్నాడు. వేటాడుతున్న మృగం పట్టుబడేంతవరకు వేటగాడుపడే మధన, తపన ముర్రే పడుతున్నాడని గమనించాడు. సైనికులు కొత్తగుర్రాల నెక్కారు. ముర్రే పాళిటికి తెల్లటిఆడగుర్రంవచ్చింది. పూర్వం తమగుర్రాలన్నీ బూడిదవన్నె ఒంటివి. కానియిప్పుడు తెల్లవీ, నల్లవీ, గోధుమవన్నెవీ అన్ని వన్నెచిన్నెలవి వచ్చిపడ్డాయి. వీటి నెక్కి ఆశ్వికులు రాత్రిఅంతా స్వారీచేశారు. ప్రొద్దున్నే నిద్రపోయారు. మేల్కొని తిరిగీ పయనంసాగించారు. దారిలో ఒక పశుపాలకు డెదురై, తన మందలో పన్నెండుజీవా లంతుచిక్కడంలేదని చెప్పాడు. ఇది యిండియన్లపని అయివుంటుందని గ్రహించి, అటూయిటూ తిరిగి, యిండియన్లు పట్టిపోయిన జాడను తిరిగి పట్టుకొనగలిగారు. అపహృతజంతువులను వధించి మాంసం ఖండిం చిన ప్రదేశం, వెదకకుండానే కనుపించింది. ఆతర్వాత ఒక ఏరు యెదురైంది. ఏటిగట్టున వున్న పత్తిచెట్టునుండి ఒక త్రాడు వ్రేలాడుతున్నది. దాని దాపుననే తాజాగా త్రవ్వి పూడ్చబడిన గోరీ కనుపించింది.

"త్రవ్వి చూడండి" అన్నాడు ముర్రే. మొండిపోటురిగాని శవాన్ని చూడగలనని అతను ఆశించనేలేదు. బయల్పడిన శవాన్ని గోయినుండి పైకి లేవనెత్తారు సైనికులు.

"ఎవరు చేశారో యీపని?" అంటూ వింట్ ఆశ్చర్యం ప్రకటించాడు. తిరిగీ ఆ శవాన్ని యథాపూర్వస్థానానవుంచి గోయిపూడ్చి, వెళ్ళిపోయారు. మరుసటిరోజు మధ్యాహ్నకాలానికి, చెయెన్నీలు తాజాగా విడిసినచోటు కనుపించింది. గంటలతరబడి మండిన మంటలనుబట్టి, యిండియన్లు అక్కడ చాలా కాలం మకాంవేసినట్లు చాంబ్రన్ అనే సార్జెంటు కనిపెట్టాడు. ఇండియన్లు దిగవిడిచిపోయిన బక్రెతోలు డాలును వింట్ చూచాడు. దాని అంచుదాపుననే ఒక తూటా దూరింది రాత్రి సమీపించబోతున్నంతలో, వీళ్ళకు ఇండియన్లు కనిపించారు. కాని అశ్వాలు వివచెడికాలు చచ్చి నడవసాగాయి. "మనం దిగక తప్పదు. మనుషులు ఓర్చుకోగలరేమోగానీ గుర్రాలు యెత్తుబడిపోతై" అన్నాడు వింట్. ఒక గంటసేపు దిగి సేదదీర్చుకొమ్మని ముర్రే సైనికుల కాజ్ఞాపించాడు. తాను మట్టుకు చీకటిలో యిటూ అటూ తిరుగసాగినాడు. ఇది చూచి, వింట్ సమీపించి, ముర్రే భుజంమీద చేయివేసి, "ఇటు చూడు, ముర్రే యీ మధ్య మన మెన్నో మోశాం - అనుభవించాం," అని వుపక్రమించాడు.

"అవును?" అన్నాడు ముర్రే, కొంచెం బిరుసుగా.

"నాకేమనిపిస్తున్నదో చెప్పనా?"

"చెప్పు" అన్నాడు ముర్రే.

"ఇది దైనందిన వ్యవహారం - సైన్యంలో వున్నావు నువ్వు. ఎందుకు చేరావో నాకైతే తెలియదు. ఆఫీసరువయ్యావు. ఎట్లయితేనేమి, యిక్కడ వున్నావు, చేసినపనే చేస్తున్నావు. ఇది ఉద్యోగ ధర్మం. దీనిని నిర్వర్తించిన తర్వాత, మనం మరిచిపోవాలి. మళ్ళీ కొత్తపనులు మొదలౌతుంటాయి."

"అవును ?"

"నీలో యేదో మార్పువస్తున్నది. ఈ వెధవముండా కొడుకులు మొండిపోటరిగాళ్ళు నిన్నేదో చేయక చేస్తున్నారు.

"నాకేకాదు - మనందరికీ వాళ్ళవల్ల యేదో మార్పు జరుగుతున్నది," అన్నాడు ముర్రే. అంతా వెలితి పడుతున్నట్లు, ప్రతి ఒక్కదానిమీద వుండిన విశ్వాసం సన్నగిల్లుతున్నట్లు, చివరకు తాము పాటుబడే ధర్మంలోనూ, ధరించే దిరుసులోనూ, అన్నిటిలో యీ అపనమ్మిక యేర్పడుతున్నట్లు ముర్రే వివరించి చెప్పలేదు.

గంట పూర్తికాగానే, తిరిగి సైనికు లాశ్వికులైనారు. తిరిగి రాత్రి ప్రయాణం. ఆ రాత్రిపూట యెప్పుడో గానీ, వాళ్లు మళ్ళ పలాయనమైపోతున్న ఇండియన్ గ్రామాన్ని సమీపించగలిగారు. ముందు పోతున్నవారికి ప్రమాదం

రావుండ గలందులవుగాను అందరికంటె వెనుకగా పోతున్న ఇండియన్ల రక్షణ
శ్రేణితోటి కటిక చీకటిలో నగ్నఖడ్గధారా ప్రహారణలతో పోరుసలిపారు.

సలిపారే గాని పోరు, అది నిష్ఫలమైంది. పిచ్చి పోట్లాట, ఒళ్లు తెలియనిది, కన్ను దూరనిది. చెయిన్నీలు తిరిగి తప్పించుకొనిపోయారు. అశ్వికులు జీనులనుండి సోలి నేలమీదికి వ్రాలి, మంటలు రగిలించకుండానే, గుర్రాల సరసనే పడి గాఢమైన కునుకుతీశారు.

“న్యూయార్కు హెరాల్డ్” పత్రికా ప్రతివేదకుడైన జాక్సన్ చాలదూరం నుండి వచ్చాడేమో అలతతో నలతతో చిరాకెత్తి, ఒక్లహామాను తిట్టుకొంటున్నాడు. మెత్తటి పరుపులు, ఘాటైనబీర్, సరస సంభాషణలు - యివన్నీ వదలిపెట్టి ఒక్లహామాకు రావలసివచ్చింది. ఇంతకు ముందొకసారి యీ ప్రదేశానికి వచ్చివున్నాడు. అప్పుడు అరవైమైళ్ళు మజిలీ బండి ప్రయాణం చేయగా అనుభవించిన జీవన్నరకబాధ నప్పుడే మరచిపోయానేమో, అని తన మందబుద్ధిని తానే నిందించుకొనసాగినాడు. డార్లింగ్టన్‌లో ఏజంట్ మైల్స్‌గారి కచేరీ చావిడిలో కూర్చుని, మైల్స్ భార్య లూసీ అత్తమాటలు వింటూ కుర్చీలో చేరగిలబడి వున్నాడు: “నిజమండీ జాక్సన్‌గారూ, యిదేమియెండ? అసలిది వేసగి కానే కాదు. ముందున్నది ముసళ్ళపండగ అన్న సామెతగా అసలు వేసగి వచ్చినప్పుడు వుంటుంది మా పని” అన్నది లూసీ; “ఇప్పటి కంటె సెగ వుంటుందా?”, అని జాక్సన్ అడిగాడు.

“ఆ సెగకు పేరేలేదు. తడి అనే మాటేలేని వేడి,” అని ఏజెంటు మైల్స్ వివరించాడు.

జాక్సన్ అర్థం చేసుకొన్నట్లు తలవూపి, ముఖం తుడుచుకొన్నాడు. ఈ దంపతులు పాపం, చాలా సరళహృదయు లనిపిస్తుంది. రెండువేలమైళ్ళ పర్యంతం గోళ్ళు కూచిగా పెరిగిన చేతివ్రేళ్ళను విస్తరింపజేయగలిగిన న్యూయార్కు నగరమందలి పత్రిక ఒకటి యేమిచేస్తుందో, యేమి చేటుతెస్తుందోనని భయపడుతున్నట్లుంది. తానెప్పుడో నిశ్చయించుకొన్నాడు జాక్సన్, భూప్రపంచకంలో పదహారణాల దుష్టులగేవాళ్లెవ్వరూ లేరు, అని. అశేషాధికారం చేదాల్చి చెడుమార్గాలు పట్టి, అందరికీ చేటుతెచ్చేటట్లు సాధారణంగా చిత్రించబడే వ్యక్తి యథార్థవ్యక్తి కాడు. అంబేదలు, దద్దమ్మలు, స్వప్రయోజనపరులు, అల్పమనస్కులు, భయగ్రస్తులు - యిట్లాంటి రకాలు తామరతంపరగా యెక్కడబడితే అక్కడ యెదురౌతారు. కాని కర్తలేని చెడుగు—

మైల్స్ దంపతులు సరళహృదయులు. బ్రతుకుతెరువుకొరకు ఏజన్సీలో వుంటున్నారు. ఈ జీవితాధారమేపోతే, యిక వాళ్లు మిగలరు.

"వేసవిలో వుడుకు చిరాకెత్తిస్తుంది. అందుచేతనే సరిగా వేసవిలోనే మాకు చిక్కులు వస్తుంటాయి," అన్నది మెల్లిగా జాగ్రత్తగా ప్రస్తుతాంశానికి వస్తూ.

"ఓహో! అలాగా?," అన్నాడు జాక్సన్.

"పూర్వనాటి మనుషులకు తప్పులెన్నడం ఎంతో సులువు," అన్నది లూసీ.

"నిజం మీ అవస్థ వాళ్ళకేం తెలుస్తుంది?" అని జాక్సన్ సర్దినాడు.

"మాకెంతో సంకటంగా వుంటుంది. మేము చాడీలు చెప్పముకాని యిది బాగోలేదు, అది సరిపోలేదని చెప్పడానికి అన్నీ లోట్లున్నాయి."

"కావచ్చు. కాని ఎండవేడిమివల్లనేనా వాళ్ళు పారిపోయింది?" అని అడిగాడు మైల్స్.

"అనాగరకులు చేసే పనులను సరిగా బోధపరచుకోవడం చాల కష్టం. అప్పుడప్పుడు చంటిపాపలవుతుంటారు వాళ్లు—", అన్నాడు మైల్స్.

"మీరు నిజంగా నమ్మి చెప్పుతున్నమాటేనా యిది?" అని జాక్సన్ అడిగాడు.

"సందేహమేంలేదు" అన్నది లూసీ. "ఇంతెందుకు, నిన్నరాత్రి జాన్‌తోటి కిటికీల విషయం చెప్పారు. లోపలివాళ్ళు బయటికి తొంగిచూడడానికే కిటికీలు కాని, బయటివాళ్లు లోపలికి తొంగి చూడడానికి కాదని వాళ్ళకు తెలియదు పాపం. మా యింటిప్రక్క పోయేటప్పుడూ, వచ్చేటప్పుడూ పనిగట్టుకొని ఆగి, కిటికీ చువ్వలకు ముఖాల నదిమి, లోపలికి తొంగి తొంగిచూచే వాళ్ళు. ఇది తప్పు అని వాళ్ళకు బోధపరచలేము. అందుకనే వాళ్లు చంటిపాపలౌతారని జాన్ అంటున్నది" అని లూసీ చెప్పింది.

"కిటికీలనే యేమిటి? చాల చాల విషయాలలో వాళ్ళు అల్లరి తుంటరి పిల్లలవలె ప్రవర్తిస్తారు" అన్నాడు జాన్ మైల్స్.

"కావచ్చు, కాని వారి పలాయనానికి ఎండ పోడొక్కటే కారణమై వుండదు. ఎంత అజ్ఞానులైనా కావచ్చు, వేసగి అనేది ఇల్లు కట్టుకొని శాశ్వతంగా మఠం వేయదనే విషయం తెలియకపోతుందా?"

"వాళ్ళు మొండివాళ్ళు. ఇండియన్లందరూ అలాంటివాళ్ళు కారు. కొందరికి నచ్చచెప్పవచ్చు. కాని యీ చెయెన్నీ లున్నారే, తలబిరుసు మనుషులు; ఆత్మాభిమానం అతిశయించి దుర్గర్వంగా మారింది; పెడకట్టైలు. ఇది చేయమంటే అది చేస్తారు. దక్షిణాన వుండి పొండి, ప్రభుత్వం మీ కన్ని సదుపాయాలు కలిగిస్తుంది, అంటే ఊహూఁ, వల్లకాదు, ఉత్తరాన వుండి పోతామంటారు."

"మొదటి నుంచి ఉత్తరాన్నేగాదా వాళ్ళుండింది?"

"కావచ్చు. కాని వాళ్ళతోబాటు వచ్చిన యెన్నో యితర తెగలు యిక్కడే వున్నాయి కదా!"

"మైల్స్‌గారూ, నా మాటొకటి వినండి. ఈ వ్యవహారాన్ని అంతు తేల్చుకొందామని మాత్రమే నేను ప్రయత్నిస్తున్నాను. కాని మిమ్మల్ని యిరుకునపెట్టి, నింద మీమీద తోయడానికిమట్టుకు కాదు. వందల సంవత్సరాలనుండి తాము నివసిస్తున్న భూమి నంటిపెట్టుకొని బ్రదికే అవకాశం మన రాజ్యంలో అల్ప సంఖ్యాక వర్గానికి ఎందుకు చట్టరీత్యా లేదో, నా పాఠకులకు నేను స్పష్టంగా చెప్పాలి. మీ బాధ్యతకంటె, నా బాధ్యతకంటే, యీ ఏజన్సీ బాధ్యతకంటె కూడ యీసమస్య లోతైనదీ, జటిలమైనదిన్నీ. దాదాపొక వంద అల్పసంఖ్యాక వర్గాలు నివసిస్తున్న జాతి మనది. వీటినన్నిటినీ బంధించే రాజకీయసూత్రం ఒకటి వుంది. మానవులందరు జన్మతః సమానులు, అనేది సరేనా? కానైతే, యీ క్షణమందే బయళ్ళసీమలో సంయుక్తరాష్ట్రాల సేనలు చేస్తున్న పని యేమిటి? ఒక ఇండియన్ గ్రామాన్ని విధ్వంసించడంకోసం నలువైపులనుండి కమ్ముకొంటున్నవి. ఇండియన్లు చేసిన మహాపరాధం యేమిటి? తమ తాతముత్తాతలు పుట్టిగిట్టిన మాతృభూమిలో నిరుపద్రవ ప్రశాంతజీవనం గడుపవలెనని సంకల్పించడమే!"

"మీ రీ విషయంగురించి ఇండియన్ వ్యవహారాలశాఖవారితో యెందుకని ప్రస్తావించకూడదు? నే నెవణ్ణి? కొన్కస్కాగాణ్ణి. ఒక ఏజంటునంతే. ఇండియన్ తెగల నీ ప్రదేశానికి తీసుకొనిరావడం తప్పా ఒప్పా అని చెప్పగలిగిన తాహతు లేదు నాకు."

"సరేనండీ, కానీ - వాళ్ళీ ప్రదేశం వదిలి ఎందుకు పారిపోవలసివచ్చిందో. సెలవిచ్చారు కాదు. మీరు చెప్పిందంతా నిజమైతే, మీరు వాళ్ళను మస్తుగా మేపి నాగరకులను చేసివుంటే -"

"వాళ్ళనా? వాళ్ళు అనాగరకులు, ఆటవికులు," అన్నాడు మైల్స్.

"అయితే మీ పద్దు పుస్తకాలు చూడవలసివుంటుంది," అన్నాడు జాక్సన్ కటువుగా. "నే నడిగిన ప్రశ్న లంత సరళమైన వాటికే జవాబు చెప్పకపోతే -"

వృద్ధులైన మైల్స్ దంపతులు జాక్సన్ కేసి కళ్ళప్పగించి వెర్రిగా చూడసాగినారు. మైల్స్ విసుగుతో తల పంకించసాగాడు. లూసీ ఎటూ తోచక పిడికిళ్ళు బిగిస్తూ తెరుస్తూ వుండిపోయింది. చివరకు ఆమె జాక్సన్‌ను సంబోధించి, "నిజంగా మీరు నమ్ముతున్నారనుకోను మా గురించి -"

"నమ్మక తప్పనిదానిని నమ్ముతాను. మా పత్రిక మీ గురించి కఠినంగా వ్రాయదని ముందే చెప్పాను. చేతగాక కాదు, శక్తిలేక కాదు. మాకు పలుకుబడి లేకపోలేదు. ఈ విషయాన్ని శాసనసభ్యులే కాక, అధ్యక్షులు కూడ గుర్తించవలసివచ్చింది."

చాలసేపటివరకు ఎవరూ మాట్లాడలేదు. గోడ గడియారపు టిక్ టక్ ధ్వని, లూసీ కూర్చున్న త్రిప్పుడు కుర్చీ కిర్రు బుర్రులు తప్ప యే సవ్వడీ లేదు. తిరిగి ఆమే నిశ్శబ్దాన్ని ఛేదించి, "చెప్పు జాన్" అని భర్త నడిగింది.

"అవును. ఎట్లాగూ యివి బయల్పడక పోవు."

లూసీకి యేడుపు వచ్చింది. "నాకు యీ పని చేసుంటని మొదటే అనిపించింది. అధర్మం అనిపించింది. జాన్‌తో కూడా చెప్పాను. కాని ధర్మాధర్మాలను నిర్ణయించగలవా రెవరు?" అన్నది యేడుస్తూ.

"క్షమించండి. మిమ్మల్ని నొప్పించాను. విచారిస్తున్నాను" అన్నాడు జాక్సన్.

"ముగ్గురు పారిపోయారు మొదట" అని మైల్స్ వుపక్రమించాడు.

"చెయిన్నీలా?"

"అవును. ఆ గ్రామంవాళ్ళే. ఈపని ఏజన్సీ చట్టాలకు విరుద్ధమైనది. వీళ్ళను శిక్షించకుండా వదలిపెడితే, తాజెడ్డకోతి వనమెల్లా చెరిచినట్లు, మిగతా వాళ్లుకూడా పారిపోబూనుకొంటారని, మేకదాటు సామెతగా వుంటుందని గ్రహించాను. అందుచేత కులపెద్దను పిలిపించి, పారిపోయినవాళ్ళను తిరిగి అప్పజెప్పే వరకు, పదిమందిని ప్రూచీకత్తుగా కోటలో చెరపెట్టవలసి వుంటుందని చెప్పాను."

"మొదట పారిపోయిన ముగ్గురినీ పట్టుకొని తిరిగి అప్పజెప్పలేకపోయారా?"

"నేనల్లా అనుకోను."

"ఈ పదిమందిని టోర్టూగాస్ చెరకు పంపదలచారా?" మైల్స్ తల వూపాడు.

"అయితే వీళ్ళు బయలుదేరిం దెప్పుడూ?," అని జాక్సన్ అడిగాడు.

"పదిమందినీ నిర్బంధించడానికి సైన్యాలు ఇండియన్ శిబిరానికి వెళ్ళాయి. వాళ్లు హోవిట్జరునుకూడ తీసుకొనిపోయారు."

"ఇంతేనా మీరు చెప్పగలిగింది?"

"దాదాపు అంతే" అని మైల్స్ నిట్టూర్చాడు. "తతిమ్మా విషయాలు మీకు తెలియనివి కావు. చాలినంత తిండిలేదు. మలేరియా వ్యాపించినా, క్వైనైను లేదు, మందులు లేవు. నేను కొందరికి తిండి పెట్టాను. ఎవడు తినాలో, ఎవడు పస్తుండాలో నిర్ణయించడం ధర్మమా?"

జాక్సన్ ఏమీ బదులు చెప్పలేదు. మైల్స్‌లేచి, బల్ల సొరుగువద్దకు పోయి, పద్దు పుస్తకాలు తీశాడు.

సరఫరా లోట్లు యివి: గొడ్డుమాంసం ఏడు లక్షల పౌన్ల లోటు. కాఫీ మున్నైఅయిదువేల పౌన్ల లోటు. పంచదార డెబ్భయివేల పౌన్ల లోటు. ఉప్పు

ఊరిన పందిమాంసం ముప్ఫయివేల పౌన్లు లోటు. ధాన్యపుపిండి ముప్ఫయి నాలుగు లక్షల పౌన్లు లోటు—"

"ఇవన్నీ లోట్లా?"

"లోట్లుమాత్రమే" అన్నాడు మైల్స్ నిస్పృహోయుడై. "ఈ లెక్కలు పత్రికకెక్కితే నా వుద్యోగం వూడినట్లే, ఉద్యోగం ఉన్నా వూడినా, తిండి సరఫరామట్టుకు మారదు. ఎక్కడున్నావే గొంగళీ, అంటే వేసినచోటనే వున్నానన్నట్లుంటుంది."

"మనుషులు పొట్టలు మాడ్చుకొన్నారంటారు."

"కొందరు పస్తులున్నారు. మరికొందరు మలేరియా తగిలి చనిపోయారు. ఇంకా కొందరు బర్రెపాడకూడ లేనిచోట బర్రెలను వేటాడదలచి పోయారు. కాని నేనేం చేయగలను? ఎవరు తినాలో ఎవరు తినకూడదో నిర్ణయించాల్సిన బాధ్యత నామైబడింది. శక్తివంచనలేకుండా, ఆత్మసాక్షిగా పనిచేశాను. క్రిశ్చియన్ మతం పుచ్చుకొని కొంతకుకొంత, గుడ్డిలోమెల్ల మేలన్నట్లుగా నాగరికులైన ఇండియన్లపట్ల పక్షపాతం చూపక తప్పలేదు. ఆటవికులైన ఇండియన్లమీద ఎందుకు జాలిచూపాలి? కీచులాడడం, చిక్కులుపెట్టడంతప్ప మరేం ఘనకార్యం చేసినట్లూ వీళ్ళు?"

"మీరు చేసింది సబావుగానే వుంది" అన్నాడు జాక్సన్.

"మమ్మల్ని కోప్పడకండి. కటువుగా వ్రాయకండి" అన్నాడు మైల్స్. జాక్సన్ లేచాడు. సరేనన్నట్లు తలవూపుతూ, యిక ఈ వృద్ధదంపతులతో అట్టేసేపు మాట్లాడితే, తాను మెత్తబడవలసి వస్తుందని, వాళ్ళవైపు చూడకుండానే, బయటికి వచ్చేశాడు.

# జేతలూ - పరాజితులూ

## అక్టోబరు - నవంబరు 1878

ముర్రే, ఫిట్జ్ గెరాల్డ్, ట్రాస్క్ మాస్టర్సన్‌ల కందరికీ నిరాశ పుట్టింది. ఇండియన్లు తప్పించుకొనిపోయారని అందరూ అనుకొన్నారు. కాని నిరాశ చెందనివాడు జార్జి క్రూక్ సేనాని ఒక్కడే. దేశ పఠం ముందు పెట్టుకొనడమే యీ ధైర్యానికి కారణమైవుంటుంది. పఠంలో వంద మైళ్ళు ఒక్క అంగుళంగా కనుపిస్తాయి. తన పన్నెండు వేలమంది సైనికుల బహుముఖ పురోగతికి ఒక్క అంగుళమేమి పది అంగుళాల దూరమైనా కూడ యిమిడిపోతుంది. సొంత యింటి వెనుక కూర్చుని, పారిపోవడానికి నానా తంటాలు పడుతున్న చీమను గమనించి చూస్తున్న మనిషికి చీమ పారిపోజాలదనిపించినట్లే, క్రూక్ సేనానికి కూడ ఇండియన్లు పారిపోలేరనిపించింది.

సిడ్నీ, నార్త్ ప్లేట్, కియార్నీలనుండి దక్షిణాభిముఖంగా కేంద్రస్థానాన్ని చేరుకొంటున్న సేనలు పట్టుకారువలె వ్యాపించాయి. దక్షిణానికి వ్యాపించిన మూడు దీర్ఘబాహువుల కబంధుని కౌగిలినుండి చెయిన్నీలు తప్పించుకొనిపోలేరు. మరి, దక్షిణం నుండి ఉత్తరాభిముఖంగా ముర్రే సేన వస్తున్నది.

ఒకే ఒక్క నిష్క్రమణ మార్గం ఉత్తరానవుంది. దాన్ని కూడ మూసివేసి ఇండియన్లను దిగ్బంధం చేయాలని క్రూక్ సేనాని ఆలోచించాడు. ప్లేట్ నది మీదుగా నార్త్ ప్లేటునుండి సిడ్నీ వరకు గల నూటయాభై మైళ్ళ జాగా ఇండియన్లు పారిపోవడానికి అవకాశ మీయగలదు కనుక, ఎలుక కూడ దూరిపోలేనంతటి పకడ్బందుగా దానిని మూసివేయాలని క్రూక్ నిర్ణయించాడు. ఆ రెండు నగరాల నడుమ నదికి సమాంతర రేఖలో యూనియన్ పసిఫిక్ రైలుబాట వున్నది. క్రూక్ రెండు రైలుబళ్ళ నిండుగా సేనలను పంపాడు. ఒకటి సిడ్నీ నుండి తూర్పుగా పోవాలి; రెండవది నార్త్ ప్లేట్ నుండి పడమటగా పోవాలి. రెండింటికీ హోవిట్జరులున్నాయి. ఇవి చాలవనిపించి, ఓగల్లాలా అనేచోట రెండు అశ్వికదళాలను కూడ నిలిపాడు. ఇండియన్ల నిష్క్రమణ మార్గ ముండుకొన్న నూటయాభైమైళ్ళ జాగాకు ఓగల్లాలా కేంద్రస్థానం. ఈ అశ్వికదళాలు రేయింబవళ్లు సిడ్నితోటి, నార్త్

ప్లేట్‌తోటి, మరొక అరడజను బస్తీలతోటి తంతి తపాలా జరుపుతుండాలని శాసించాడు. చెయిన్నీలు ఎక్కడ పాదమూపినాసరే, వెంటనే అక్కడికి దూకి పడాలని క్రూక్ సేనాని ఆలోచన.

రైలుబాట కుత్తరాన, ప్లేట్‌నది ప్రవాహం తూర్పుగా తిరిగి భూమిలోకి చొచ్చుకొనిపోయి వున్నచోట, పదాతి దళాలను సర్వవేళలా యుద్ధసన్నద్ధంగా వుండమని శాసించి, నిలిపాడు. పగటిపూట, ఈ పదాతిదళపు గస్తీలు వంద మైళ్ల పర్యంతం విస్తరించుకొని, ఒకరినొకరు కలిసికొంటూ వుండాలని, రాత్రి పూట వాళ్ళు వేసే మంటలు హెచ్చరికలుగా కొండలందు, లోయలందు, బయళ్ళలోనూ, యిసుక తిప్పల మీదనూ ప్రజ్వలింపచేయాలని కట్టుదిట్టాలు చేశాడు. ఓగల్లాలా, సిడ్నీనగర ప్రజలు కొందరు వచ్చి గస్తీలసంఖ్యను పెంచారు. మంటలు మందగించకుండా యెగద్రోసేవారు. చిట్టచివరి పోరుకు ఉవ్విళ్లూరుతూ వుండేవారు.

తళతళలాడే తీగెచుట్టల మీదుగా దక్షిణంనుండి చెయిన్నీలొస్తున్నారోహో, అని కబురువెంట కబురు వచ్చింది. ఏ పశుపాలకుడో, గొర్రె మేపరో, ఏ మంద యజమానో యీ కబురుపట్టుకొని, నాలుక భూజానవేసుకొని, టెలిగ్రాఫ్ ఆపరేటర్లవద్దకు వెళ్ళి చెప్పేవారు. స్మోకీహిల్ అనేచోట పోరు జరిగిందని, రిపబ్లికన్ నది దక్షిణపుగట్టున ఇండియన్లు విడిసివున్నారని, మందలనుంచి జీవాలను విడమర్చి కాల్చి మాంసాన్ని ఒలిచారని, గుర్రాలు అపహరించారని, ఏవో నదీశయ్యా లలితగర్భాన యిండియన్ల జాడ ప్రస్ఫుటంగా కనిపించిందని, పొగ చేతివ్రేళ్ళవలె ఆకసాన్ని కబళింపజూస్తున్నదని, బయళ్ళసీమలో తారాభరనిశాసమయాన భేరీనాదాలవలె ఖురాగ్రఘట్టనలు వినిపించాయని టెలిగ్రాఫ్ ఆపరేటర్లు చిత్రాతిచిత్రవార్తలు పంపేవారు.

కాన్సాస్ రాష్ట్రపు వాయవ్యదిశలోనూ, నెబ్రాస్కా రాష్ట్రపు నైఋతిదిశా ప్రాంతంలోనూ గల మరుభూములలో జనలోక విలోకనానికి దూరమై పడి ముందుకు సాగిపోతూవున్న ఇండియన్ గ్రామాన్ని యావదమెరికన్ జాతి ఏకనేత్రమై గమనిస్తున్నది. ప్రభుత్వాధినేతలు యీ చిక్కు సమస్యను త్వరగా పూరించి ముగించవలెనని తాపత్రయపడుతున్నారు. పత్రికాసంపాదకులు యెటువీలయితే అటు మ్రొగ్గడానికి తయారైవున్నారు. ఎటుపోయి ఎటువస్తుందోననే సందేహం నిబిడీకృతమైన యీ కథాపర్యవసానంకొరకు పత్రికాపాఠకులు ఆత్రంగా యెదురుచూస్తున్నారు. కస్టర్ సేనానిని ఓడించిన ఇండియన్లమీద పగ తీర్చుకోవాలని యెగబడుతున్నారు. తమ మాతృదేశమని అనాదినుండి ఇండియన్లు ప్రియాతిప్రియంగా యెంచుకొనిన భూమిలోనుండి వారి స్మృతిని

కూడ, పాదనుకూడా నిర్మూలించి తుడిచిపెట్టవలెనని, అమెరికన్‌జాతిని భయభీతాహాలనుండి విముక్తిపరచవలెనని సంకల్పించుకొంటున్నారు.

ఇండియన్లు కాన్సాస్‌రాష్ట్రపు వుత్తరపు పొలిమేర నెప్పుడు దాటిందీ, దక్షిణ నెబ్రాస్కాలోని రిపబ్లికన్‌నది నెప్పుడు తరించిందీ అమెరికన్ జనతా లోకం తెలుసుకొంటూనే వున్నది. అప్పటివరకు ముర్రే ఆధిపత్యాన అశ్వికదళాలు రెండు వారిని తరుముకొని వెన్నాడాయి. అంతలో ముర్రే వారి జాడను తెలిసికోలేకపోయాడు. వారు ముర్రేకి అదృశ్యులు కావచ్చుకాని, నీలిదిరుసు తాల్చిన యితర సైనికులకుమట్టుకు అగోచరులు కాలేకపోయారు.

"రేపు, ఎప్పుడోచెప్పలేనుగాని, రేపు తప్పక చెయెన్నీలు ఈ ప్రాంతంలో ప్లేట్‌నదిని దాటబోతారని నమ్మకంగా తెలియవచ్చింది" అని సిడ్నీనుండి మేజర్ థార్న్‌బర్గ్, క్రూక్‌సేనానికి తంతికబురు పెట్టేడు.

ఆరాత్రే వాళ్ళు నదిని దాటారు కాని శిడ్నీదగ్గరా కాదు, నార్త్‌ప్లేట్‌వద్దా కాదు. ఈ రెండుప్రాంతాలకు సమీపమందే ఇండియన్లు నదిని దాటుతారని అందరూ అనుకొంటూ వుండినదానికి భిన్నంగా, తెలివిగా, తమకై అమర్చబడిన బోనుకు సరిగా నట్టనడుమ, ఓగల్లాలాకు రెండుమైళ్ళదూరాన, నదిని దాటి వెళ్ళిపోయారు. ఇసకతిన్నెలమీద ధగద్ధగాయమానమైన మణిపూసలవలె మంటలు మండుతున్నాగాని, వాళ్లు తప్పించుకొనగలిగారు. వలలో చిక్కుపడుతుందను కొన్న చేప తప్పించుకొనింది.

ఈ సంఘటన జరిగినతర్వాతనే, వాళ్ళు యెట్లా తప్పించుకొన్నారో ఆవైనం రవంత రవంత తెలిసి, చివరకు సమగ్రమైన కధగా కూడింది. గుర్రాలు దిగి, నడిపించుకొంటూ, ఓగల్లాలాకు యెదురుగా ప్లేట్‌నదిని సమీపించారు. బస్తీలోని దీపాలుకూడ కనుపించేటంత దాపుగా పోయారు. పలచటి పొడుగాటి పంక్తిగా, యిద్దరు ముగ్గురు ఒకటిగా, గుర్రాలను నెమ్మదిపరుస్తూ వాటి కేవేవో అచ్చికబుచ్చిక కబుర్లు చెప్పి, బుజ్జగిస్తూ, నడిపించుకొనిపోయారు. చల్లగా రైలుగట్టు యెక్కారు. సైనికుల రైలుబండి పెట్టెమీద కూర్చుని వుండిన ఒక పిల్లవాడు పాడుతూ పాడుతూ ఆపివేశాడు. గుర్రం సకిలింపు వినిపించిందని అన్నాగాని, యెవరూ ఖాతరు చేయలేదు. కాపలామంటల దగ్గర ఒక కుక్క హెచ్చరికగా మొరిగింది. కాని ఏదైనా తోడేలును చూచి మొరిగిందేమో అనుకొన్నారు కాపలావాళ్లు.

సర్కసులో మంచినేర్పరి బిగువైన తీగెమీద ఎట్లా నడుస్తాడో, అంత మెలకువతోటి రైలుబాటమీద ఇండియన్లు గుర్రాలను నడిపించారు. కాపలామంటల నడుమ వాళ్ళెంతో నెమ్మదిగా ఎంతో కష్టంమీద గుర్రాలను నడిపించినట్లు, అక్కడ యేర్పడిన మొద్దుబారినజాడ తెలుపుతుంది. అక్కడక్కడ ఇసకగుంటలు పడివుండటంబట్టి, ఎంతో ఓర్పుతోటి స్థిమితబుద్ధితోటి ఇండియన్లు

పండుకొని, సైనికులు వస్తారేమోనని యెదురుచూచినట్లుగా వుంది. ఒక మంటకు యిరవై గజాల దూరంలో పరాయివాళ్లున్నట్లు కనిపెట్టిన కుక్క ఒకటి మొరిగి, వాళ్ళవైపు పోయింది. అక్కడ పొంచివుండిన ఇండియన్ యోధుడు దానిని పొదివి పట్టుకొని, నోరుమూసి చంపి వుంటాడు. మరురోజు ఆ కుక్క వూపిరాడక చచ్చిపడి కనుపించింది. ఆ కుక్క యజమాని, "బిల్లీ! బిల్లీ! నీ పాడెగట్ట! ఎక్కడి కెళ్ళావే ?," అనీ, "తెల్లవారినదాకా పోయినదారి పట్టుకొని రాలేదు." అనీ అనడంకూడ ఆ ఇండియన్ యోధుడు వినివుంటాడు. ఒక మైలుదూరం యిట్లా నెమ్మదిగా నిశ్శబ్దంగా స్థిమితబుద్ధితో నడిచి పోయివుంటారు. ఆ తర్వాత గుర్రాలెక్కి, ఉత్తరానికి పరుగు లంకించుకొని వుంటారు. ఈ కథ విని, క్రూక్ వుగ్రనారసింహావతారమై మేజర్ థార్న్‌బర్గ్ తెలివితక్కువతనాన్ని తిట్టాడు. థార్న్‌బర్గ్ కుపితుడై, ద్వేషపూరితుడై, చెయిన్నీల వెంటబడిపోయాడు.

యావజ్జీవమూ మోయవలసిన శిలువ బరువు క్రింద క్రుంగిపోతున్నవానివలె ఇండియన్లు పోయిన దారిజాడనే అంటిపెట్టుకొని, ముర్రే ప్లేట్ నదిని దాటి, చెయిన్నీలను కబళించివేసిన యిసుక తిన్నెల మరుభూమిలో ప్రవేశించాడు. నదికి పన్నెండు మైళ్ళు వుత్తరాన, మేజర్ థార్న్‌బర్గ్ నడుపుతున్న అశ్విక దళాన్ని కలిసికొన్నాడు. ఇప్పుడు ఏడు వందలమంది సైనికులుగా పెంపొందిన యీ చిన్ని దండు, కలిసి నడువసాగింది. థార్న్‌బర్గ్ ఆధిపత్యానగల అశ్వికు లింకా చెక్కు చెదరలేదు. విసుగు వేసటలలోపడి నలుగలేదు. గడ్డాలు పెరిగి, కళ్ళు గుంటలుపడి, వళ్ళు హూనమైపోయిన ముర్రేగారి అశ్వికులు నూతన్నాగంతుకులకు విపరీత చిత్తసంభ్రమం కలిగించారు. "ఇక ఇక్కడినుంచి మీ పనిని మేము సాగిస్తాము. మీరు దూరభారపు ప్రయాణాలుచేసి మీ స్థావరం నుండి సుదూరానికి వచ్చారు. మీ సిపాయీలు విశ్రాంతి తీసికోవాలి. ఏమంటారు కెప్టన్" అని థార్న్‌బర్గ్ అడిగాడు, కాని ముర్రే కంటిచూపు థార్న్‌బర్గ్ నోటిని కట్టివేసింది.

సాయంకాలమయింది. ఒకచోట యిండియన్లు పోయినబాట రెండుగా చీలింది. ఒకబాట వుత్తరానికీ, మరొకటి ఏకాంత, విశాల భయంకరమైన యిసుక తిన్నెల మరుభూమిలోనికీ చీలిపోయాయి. చీలుదారులు మరి మొదలవుతా యనగా, యిండియన్ల మజిలీ చిహ్నాలు కనిపించాయి. థార్న్‌బర్గ్ కెప్టన్ ముర్రే వైపు చూచాడు. ముర్రే ఒక నిర్ణయానికి వచ్చాడు. "నేను వుత్తరంగా వెళ్ళి పోతాను, మేజర్ మీ కే అభ్యంతరమూ లేకపోతే" నన్నాడు.

థార్న్‌బర్గ్ భుజాలు విదిలించాడు. ముర్రేకి పిచ్చి పట్టిందనుకొన్నాడు. పిచ్చాడితో వాదోపవాదా లెందుకు? వింట్ నిట్టూర్పు విడిచాడు, కాని యేమీ యెదురు మాట్లాడలేదు. రెనోదుర్గంనుండి వచ్చిన అశ్వికదళాలు రెండూ, ఆరాత్రి

నూత్నాగంతుకులకు దూరాన కేటాగా మజిలీ చేశాయి. ఉదయాన వాళ్ళు వెళ్లిపోతుంటే థార్న్‌బర్గ్ సంతోషించాడుకూడా.

ఇసుక తిన్నెలలోనికి వెళ్ళిపోయిన బాటవెంబడి థార్న్‌బర్గ్ తన అశ్విక దళాన్ని నడిపించాడు. ప్రయాణం కష్టభూయిష్టమైనది. పురోగతి మందగించింది. గుర్రపుడెక్కలు యిసుకలో కూరుకొనిపోసాగినవి. గాలి తోలడమే తరువాయిగా పొరలు పొరలుగా తెరలు తెరలుగా లేచి పదనైన యిసుక సైనికుల ముఖాలమీద కెగిరివచ్చి శ్వాసకోశాలలో దూరసాగింది. ఇసుక బారినుండి ముఖాలను నోళ్ళను అడ్డుచేసికొని భయగంభీరులై నడువజొచ్చారు. అపరాహ్ణం చాల గడిచాక శిబిరం నెలకొల్పుకొనేటప్పటికి యిరవైమైళ్ళుంటే హెచ్చు పోలేకపోయారు. దిండ్లవలెవున్న చిట్టిచిట్టి యిసుకతిప్పలు చుట్టూవుండగా, వాటి నడుమనున్న పల్లపునేలమీద శిబిరం నెలకొల్పినారు. గాలిపోటునుండి కొంతకు కొంత రక్షణ లభించింది. సరిగా పచ్చికపట్టని తిప్పలలోనికి రవంత రవంతగా రక్తారుణ సూర్యబింబం ప్రవేశించసాగింది. సైనికులు భయాకులని స్తబ్ధులైనారు. భయంకరమైన నిశ్శబ్దం ఘనీభవించిన ఏకాంత ఘోరప్రదేశ మది. ఎడారి కాదు. పచ్చికబయలూ కాదు. జీవవస్తుచిహ్నలే లేవిక్కడ. పిట్టలజట్టుకూడ, అట్టిటు యెగురనైనా యెగురని, కీచురాళ్ళయినా సవ్వడిచేయని నిర్జీవప్రదేశ మది. ఇసుక దిన్నెలు దిన్నెలుగా నిరంతరంగా అనంతంగాచేరి, మానవ, పశు, పక్ష్యాది సకల జీవరాసిచే బహిష్కరించబడిన సముద్రసైకతతీర భూమివంటి దిది.

ఆ రాత్రి గాలికి లేచిన యిసుక నదివలె ప్రవహించసాగింది. ఉదయమైన తర్వాతకూడ యిసుక యింకా సుడి తిరుగుతూనేవుంది. సైనికులు దగ్గుతున్నారు. కేకరించి వుమ్మివేస్తున్నారు, బట్టలనుండి కాలి జోళ్ళనుండి యిసుకను విదిలించి వేస్తున్నారు. కాని అది యిందు గలదందు లేదని చెప్పవీలులేనంత సర్వాంతర్యామి అయింది. తినేతిండిలోనే కాక, చర్మ రంధ్రాలలోనూ, వళులలోనూ, పేరుకట్టింది. ఇండియన్లు పట్టిపోయిన దారి గుర్తులను యీ యిసుక దుమారం మాపివేసింది. గుర్రాలుకూడ భయసంభ్రమాలై, ఎన్నో దెబ్బలకుగాని కాలు కదపడంలేదు.

"నీటి విషయం జాగ్రతపడాలి కదండీ మేజర్ గారూ, మన దగ్గరవున్న నీరు అయిపోవస్తున్నది," అని థార్న్‌బర్గ్‌తోటి లెఫ్టినెంట్ బ్రాడీ ప్రస్తావించాడు.

"నీటియెద్దడి మనకే గాదు - వాళ్ళకు కూడా తప్పదుగా ?", అన్నాడు థార్న్‌బర్గ్, మాసిన జాడను పరీక్షించి చూస్తూ.

ఇండియన్లు పోయిన దిక్కుగానే ఆ రోజంతా అశ్వికులు పోయారు. ఒకచోట తిరిగి మకాం చేశారు. ఆఫీసర్లే స్వయంగా సైనికులవద్దకు వెళ్ళి, వాళ్ళ నీటి సంచులు అడిగి తీసికొని, తలా ఒక కప్పు నీటికంటె యెక్కువ యివ్వలేకపోయారు.

తెల్లవారింది. బిగిల్ మ్రోగింది. సూర్యుడు క్రమ క్రమంగా యెగుస్తున్నాడు. ఇసుకా పొగమంచూ కలిసి తెరలలె కన్పిస్తున్నాయి. సైనికులు నీటి రేషన్లు తీసుకొన్నారు, కుపిత మనస్కులై. తమ నీటి సంచులన్నీ మూటకట్టి మోత గుర్రాలమీద పడవేశారు. మేజర్ థార్న్‌బర్గ్, కెప్టన్ ఎలెక్ట్సన్‌తో కలిసి ఒక మూలకు పోయాడు. ఇద్దరూ చేరి దేశ పటాన్ని పరిశీలిస్తుంటే తతిమ్మా ఆఫీసర్లు వాళ్ళిద్దరిని చూస్తూ నిలుచున్నారు.

ఈ ఇసుకతిన్నెలసీమ గురించి కెప్టన్ ఎలెక్ట్సన్‌కు అంతో యింతో తెలుసు. ఒక నెలముందుదాకా అతను వుత్తరానవున్న రాబిన్సన్ దుర్గంలో వుంటూ వచ్చాడు. "మన మెక్కడ వున్నామో, తెలుసా, కెప్టన్?" అని థార్న్‌బర్గ్ అడిగాడు:

"నేరుగా పోతే మనం నార్త్‌ఫోర్కు చేరుకోగలం" అన్నాడు ఎలెక్ట్సన్.

"చిత్రపటాన్ని చూస్తే మీరు చెప్పింది సరిగానే వుంది. అది మనకు పడమటగా వుందా?"

"అనుకొంటాను. ఉత్తరపు మలుపు తిరుగుతుంది. మనం దక్షిణంగా వెళ్ళేటట్లయితే, నది తప్పక తగులుతుంది."

"ఇండియన్లు దక్షిణానికి పోవటంలేదుగా?"

"లేదు."

తామున్నచోటికీ రాబిన్సన్ దుర్గానికి నడుమగల నూటయాభై మైళ్ళ దూరాన్ని గురించి థార్న్‌బర్గ్ ఆలోచించసాగాడు. నూటయాభై మైళ్ళమేర కూడ అక్కరలేదు - యీ యెడారిసమంలో యీలోగానే మనుషులు చావగలరు. "ఈ చుట్టుపక్కల యెక్కడైనా నీటిజెల వుంటే, వాళ్ళు అక్కడికి పోయి వుంటారు" అన్నాడు థార్న్‌బర్గ్.

"ఉందొకటి. దానిపేరు 'క్రేజీరైడర్స్' వెల్. అంటే పిచ్చెత్తిన గుర్రపు రౌతు బావి. అది అంతుదొరుకుతుందో లేదో చెప్పలేను."

"ప్రయత్నం చేద్దాం" అన్నాడు మేజర్ థార్న్‌బర్గ్.

ఉత్తర పశ్చిమాలుగా తిరిగి ప్రయాణంసాగించారు. గుర్రంమీద గూని పడినట్లు వంగి, పెదిమలు బిగించి, క్రూక్ సేనాని పెట్టిన చీవాట్లు గుర్తుకురాగా, థార్న్‌బర్గ్ బాధపడసాగినాడు. గుర్రాలు ఎంతో కష్టంమీద నడుస్తున్నాయి, డొక్కలలో రౌతులు పొడిచిన పోట్లకు మామూలుకంటె కొంచెం వేగాన పోతున్నాయి. దట్టమైన దిట్టమైన యిసుక తెర లేచి సూర్యబింబాన్ని మ్రింగివేసింది. పెదిమలపైనీ, కమ్చీలపైనీ యిసుక వచ్చిచేరి పేర్పులు కట్టింది. గుర్రాల కాళ్ళు జారుతున్నాయి. ఇసకతిన్నెలు చిత్రవిచిత్రాకృతులలో మిలమిల మంటున్నాయి.

మధ్యాహ్నమయింది. ఎండిపోయిన గొంతులనుండి మురికిని కడిగివేయడానికి చాలిన నీరుకూడా లభించలేదు. సైనికులు సణుగుకొనసాగారు. చిల్లర

ఆఫీసర్లు వినిపించీ వినిపించనట్లు తిట్టుకొనసాగారు. కాని ఎవ్వరూ గొంతెత్తి మాట్లాడలేదు.

రాత్రి. నీటిజెల వున్నదో, లేదో! తుషారమువలె ఇసుక అంతరమందు వ్యాపించింది. నిప్పు రాజేయడాని కేమీ కనబడలేదు. బయళ్లసీమలో అడుగడుగునా కాలికి తగిలే ఎండుపేడకూడ యిక్కడ కరువైనది. చల్లబడిన రేషన్లతోటి, ఎండిపోయిన వుప్పుకండలతోటి, బిస్కట్లతోటి కష్టంమీద పొట్టలు నింపుకొన్నారేగాని దప్పిక అతిశయించింది.

మరురోజు ప్రొద్దుటికంతా గుర్రాలకు ఆకలి దప్పులు తీవ్రమైనవి, నీటిమీదనే ధ్యాస వుండడంవలన ఇసుకతిన్నెలమీద పొట్టిపొట్టిగా పలచపలచగా యెండి వరడైన పచ్చికనుకూడ మేయజూడలేదు. మధ్యాహ్న సమయానికి దిగి గుర్రాలను నడిపించుకొనిపోవలసినదని సైనికులకు థార్న్‌బర్గ్ ఆజ్ఞ చేశాడు. భయానకమైన పీడకలలోవలె యిసుకతో కసకసలాడే దేహాలను ముందుకు బరువుగా యీడ్చుకొనిపోతూ, అగుపడనిదానికొరకు వెదుకులాడసాగారు. ప్రతిచోటా ఆశాభంగమే. ఒక తిన్నెను దాటితే వెనువెంటనే అట్లాంటివి ఎన్నో వున్నాయి. ప్రతిదాని వెనుకా మెత్తటి యిసక పరుచుకొని వుంది.

చిట్ట చివరకు జెల కనుపించింది. నీరు తెల్లగా వుంది. కాని, చేదు విషం. అయినా త్రాగారు, గుర్రాలను త్రాగించారు. అందరూ జబ్బుపడ్డారు. ఆరాత్రే ఎనిమిది గుర్రాలు చనిపోయాయి.

ఇంతకూ, ఇండియన్ల పోవిడే తెలియలేదు.

మరుసటిరోజు, థార్న్‌బర్గ్ ఆశ వదలుకొని, తిరిగి దక్షిణాభిముఖుడై, సైన్యాన్ని నడుపసాగినాడు. ఇంతకుముందు ఎదురుగా ముఖాలమీదికి రయ్యిమని వచ్చిపడే యిసుక, యిప్పుడు వీపులమీదవచ్చి చేరుకొనసాగింది. గాడ్పు మంచువలె చల్లనై కరువజొచ్చింది. రాత్రులు మంటలు వేసికొనలేకపోయారు. ఎక్కువమంది జబ్బుపడినారు. ఇంకా కొన్ని గుర్రాలు చచ్చిపోయాయి. మిగిలినవి ఎత్తుబడినాయి. డెక్కలు పచ్చిపుళ్ళవలె నొప్పిపెట్టగా ఆపసోపాలుపడిగాని అడుగుదీసి అడుగు ముందుకు పెట్టలేకపోయాయి. మృత్యుసాన్నిధ్యానికి పోతున్న శవప్రాయుల పురోగతివలె సేనా పురోగతి కనుపించింది. మకాం వేయడం, మకాంయెత్తడం, తిరిగి మకాం, తిరిగి ప్రయాణం! తిండికూడ తరిగిపోసాగింది. సైనికులు కొందరు పసిపిల్లలవలె అస్పష్టంగా వాగసాగినారు.

నార్త్‌ఫోర్క్ సమీపించారు. నదీజలం; పచ్చిక, దూరాన ఒకయిల్లు యింటినుండి పొగగొట్టంద్వారా వెలువడే హిమప్రవాహం! అమ్మయ్య అనుకొన్నారు. పోతున్నప్రాణాలు కోలుకొనసాగినాయి. కాని అప్పటికే సైనికులు ముగ్గురు చచ్చిపోయారు.

ముర్రే ఒకవైపునుంచి డకోటా మరుభూములలోనికి లోలోతులకు చొచ్చుకొని ముందుకు పోతున్నాడు. తాము వేటాడుతున్న నరమృగాలు మట్టుకు నాలుగడుగులు ముందుగాపోతున్నాయని వాళ్లూ వీళ్ళూ చెప్పుతున్నారు. మరొకప్రక్క, ఇండియన్లుపోయిన బాట జాడ రెండుగా చీలినపిమ్మట, యిసుక తిప్పలలోనికి పోయిన చెయిన్నీలు పత్తాలేకుండా మటుమాయమయ్యారు. చెయిన్నీలు చీలిపోతున్నట్లు రుజువు లేకపోలేదు. కెనడా దేశీయుడైన ఫ్రెంచి వేటగాడొకడు, నల్లమల సీమనుండి తిరిగి వస్తూ, తాను చెయిన్నీలను చూచినట్టూ, వాళ్ళు ప్రయాణ భారంచేత నీరసపడిపోయినట్టూ, దాదాపు అందరూ చేరి నూటయిరవైమందికంటె అధికం లేనట్టూ, తెలియజేశాడు. సియోక్స్ జాతికి చెందిన ఇండియన్లు యిద్దరు, మీడ్ దుర్గానికి సంబంధించిన గస్తీ మనుషులు, యీ సంఖ్యనే నిర్ధారించి చెప్పారు.

కాని సైకత శ్రేణులలో అంతర్హితులైనట్టి యిండియన్లను గురించి కబురు గాని పికరుగాని పిసరంతైనా లేదు. ఆ భయంకర సీమవారిని లోగొని, ఘోర దారుణమైన ఆశ్రయం కల్పించి, చివరకు నిశ్శేషంగా అందరినీ దిగమ్రింగి వేసినట్లుంది.

ఇండియన్లపాలిటి యముడైన క్రూక్ సేనానికికూడ యీ తప్పిపోయిన వారెక్కడ వున్నారో తెలియలేదు. మూడవ ఆశ్వికసైన్యానికి చెందిన దళాలైదు యిసుక తిప్పలలోబడి గుర్రాలను బలవంతాన ముందుకు యీడ్చి నడిపిస్తూ, గాలించిగాలించి, వుత్తచేతులతో తిరిగి రాబిన్సన్ దుర్గానికి వచ్చేశాయి. కాని తిరిగి వారుబయలుదేరవలసి వచ్చింది. పేలను దుక్కేందుకు ఈర్పెన వెండ్రుకలలో దూర్చి తీసినట్లు, ఇండియన్ల అంతుపట్టేందుకు వీళ్ళు యిసుకతిన్నెల సీమనంతటినీ, ఒళ్ళంతా కళ్లుచేసుకొని, వెదికారు. సిడ్నీ నుండి ప్లేట్ నది మీదుగా వుత్తరానికి బయలుదేరిన ప్రతి సైనికపంక్తి, ఎడారిలోని చేదునీటిని రుచిచూడక తప్పలేదు. "చెయిన్నీల జాడేలేదు," అని తంత్రులు పునఃపునఃవార్తలందచేశాయి. "చెయిన్నీల పొడకూడాలేదు." దేశీయులకెత్తిన రక్తదాహాన్ని వుపశమింప జేయకలిగింది కొంతవరకే మార్పులేనివార్త. దేశం మరచిపోమొదలెట్టింది. ఇండియన్లు తామైనా వేటాడాలి - లేకుంటే వేటాడబడాలి - అప్పుడే వారిప్రాముఖ్యం, ఊరికే ఎక్కడో వున్నారనడం ఎవ్వరికీ ఆసక్తి పుట్టించదు. ఇసుకతిన్నెలకు అసలు ప్రాముఖ్యమేలేదు. అందులో చిక్కుపడిపోయిన వారికి అంతకంటెలేదు. అక్కడే వుండనీ!

ఈ లోపల కాన్సాస్ రాష్ట్రం తన జనసంఖ్యను తాను లెక్కించుకొన్నది. ఇప్పటివరకు చెలరేగిన పుకారులన్నీ అబద్ధాలని తేలిపోయింది. చెయిన్నీలు యే ఒక్క పౌరుణ్ణిగాని వధించలేదు. సరికదా బాధించనైనలేదు; యే యింటినీ తగులబెట్టలేదు. వాళ్ళు చేసిన దుండగాలు మహా అంటే, గుర్రాలను అపహరిం

పడం, జీవాలను తిండికోసం చంపడం; అంతేగాని నరహత్యలు, గృహదహనాలు లేవు.

కాని సరిహద్దులలోగల సైన్య స్థావరాలు ఇండియన్లను మరచిపోలేదు. క్రూక్ సేనాని అడుగడుగునా ముల్లుగర్రతో పొడుస్తూనే వున్నాడు. అన్వేషణ సాగుతూనేవుంది. రాబిన్సన్ దుర్గంనుండి దళం మార్చి దళం వెళ్ళి వెదకికూడ ప్రయోజనం శూన్యమయింది.

అటువంటి దళాలలో ఒకటి మూడవ అశ్విక సేనకు చెందినది, కెప్టెన్ జె. బి. జాన్సన్ నేతగాగలిగినది, అక్టోబరు మాసాంతమందు రాబిన్సన్ దుర్గాన్ని వదలి, మందగతిలో దక్షిణాభిముఖంగా నడిచింది. రెండు రోజులు రేయింబవళ్ళు ముందు వెనుకలు చూచుకుంటూ, ప్రతి లోయనూ, ప్రతి రాతిబీటనూ, ప్రతివృక్ష సంచయాన్ని గాలించింది. రెండవరోజు, అపరాహ్న ప్రారంభ సమయాన, ఉత్తరంనుండి చల్లటిగాలి తోలింది. దానితోబాటు విపత్సూచకమైన కారు మబ్బు మందకూడ చనుదెంచింది. చలికాలపుమంచు తాకిడి యిప్పుడే చల్లగా మొదలవుతున్నది. కెప్టెన్ జాన్సన్ గుర్రాన్ని ఆపినాడు. గాలి అతని బుగ్గను సోకింది. ఒళ్లు జలదరించింది. జాన్సన్ బుజాలెగురవేశాడు.

"తిరిగి పోవడమేనాండి ?" అని లెఫ్టినెంట్ ఎల్లెన్ అడిగాడు.

"అనే అనుకుంటున్నా" నన్నాడు జాన్సన్.

"దయ్యాలను వేటాడుతున్నా మనిపిస్తున్నది గాని, మనుషులనుకాదు" అన్నాడు ఎల్లెన్.

ఇంతలో సార్జెంట్ లాన్సీ వాళ్ళవైపు వచ్చిచేరాడు. ఎర్రటి ముఖం, గడ్డంవుంది. గాలి తగులకుండా చేతిని అడ్డంపెట్టుకొన్నాడు. "మంచు కురిసేటట్లుంది" అన్నాడు లాన్సీ.

"భూతాలవేట" అన్నాడు ఎల్లెన్ తిరిగి తన బుర్రకు తట్టినభావం పరవశుణ్ణి చేసిందేమో !

"నేనేమో స్నానంచేసేశాను" అన్నాడు లాన్సీ. మంచుకురవడం మొదలెట్టిన తర్వాత మరి స్నానంచేయనని అతని శపథం.

జాన్సన్ చూపు, ఎదురుగా కనుపిస్తున్న దానిమీదనే లగ్నమైవుంది. గూనుపడినట్లు ముంచుకొనిపోయిన దేహాలతోటి, గాలితగులకుండా యెత్తిన మెడ పట్టీలతోటి అశ్వికులు దీనులై కనుపిస్తున్నారు. వాళ్ళనుచూస్తే లాన్సీకి యేడ్పించ మనసవుతున్నది. "ఇంకా చలి మొదలు కాలేదు. రేపో మాపో తయారు" అన్నాడు. "పాపం, చలిమంటలు వేసుకొంటారేమో, యిళ్ళకు పొమ్మంసురూ ?" అని కెప్టన్‌గారితో అన్నాడు.

జాన్సన్ కేదో అవుపించింది. చూపునంతా కేంద్రీకరించి, దళాన్ని వెంట రమ్మని చేతితో సైగచేసి, గుర్రాని ముందుకు నడిపించాడు. ఎండ తగులకుండా కళ్ళకు చేయి అడ్డంపెట్టు కున్నాడు.

"ఏమిటండీ, అది ?"

జాన్సన్ జవాబు చెప్పలేదు. దళం నెమ్మదిగా సాగిపోయింది. దక్షిణాన పడమటా ఆకాశం నీలంగావుంది. ఉత్తరానా, తూర్పునా గోధుమవన్నెగా వుంది. పోను పోను యీ గోధుమవన్నె నల్లగామారి భూమితో కలిసిపోతున్నది. గగనం చీలికలయింది. కత్తి అంచువలె పదునైన గాలితాకిడికి సీతువు వగలాడి వలె వలపులు ఒలకబోస్తూ వుంది.

ఇప్పుడందరూ దానిని చూచారు. కాని ఏ ఒక్కరూ మాట్లాడలేదు. మొదట దీనిని రుజువుచేసుకోవాలి కాబట్టి అంతవరకూ మాట్లాడకూడదని ఒప్పందం చేసికొన్నట్లుంది. కలలో కనుపించే వైపరీత్యమేదో స్వాప్నికుణ్ణి ప్రబలంగా ఆకర్షించినట్లు, ఆ విపరీతదృశ్యం అశ్వికులను ఆకట్టివేసింది. కాని వాళ్ళు గమనవేగాన్ని పెంచలేదు. త్వరపడలేదు. మీదు మిక్కిలి, ఆ దృశ్యం క్రమేపీ స్పష్టతరమయ్యే కొద్దికీ, వారి పురోగతి మందగించ సాగింది. ఇంతలో ఆగిపోయింది.

"ఏమిటూవచ్చేది?", అన్నాడెవడోగాని.

అది ఆ ఒక్కని ప్రశ్నగాదు. అందరూచేస్తున్న ఆలోచనగాని! ఏదో ప్రతిధ్వని, భావనాశకలం! సహవాసమందలి అనుబంధాన్నీ, చలిమంటల వెచ్చదనమూ, తాము ధరించిన దిరుసువలన సంక్రమించిన ప్రమాదరాహిత్యాన్నీ, భద్రతనూ, బయళ్ళసీమలోని సేనాదళాలలో ఆఫీసర్లకూ సాదాసిపాయీలకూ నడుమగల సత్సంబంధాలనూ అనుభవించే సైనికులు అసహ్యమైన దారుణమైన దృశ్యాన్నిచూడగా, నమ్మశక్యంగా నంతటి రోతపుట్టింది. అదే యీ ప్రశ్న. కనుపిస్తున్నదేమిటో వాళ్ళకు తెలియకపోలేదు; రుజువులక్కరలేదనికూడ యెరుగుదురు; తమ అన్వేషణ పరిసమాప్తమయిందని కూడ తెలుసు.

పడమటినుంచి తమవైపుగా వస్తున్నది. చనిపోతూవున్న అడవి మృగం తిరిగి తన వునికిపట్టుకు తనను తానీడ్చుకొని యీడ్చుకొని వస్తున్నట్లుంది. స్త్రీలున్నారు, పురుషులూ శిశువులూ వున్నారు. రమారమి నూటయాభైమంది మొదట కనుపించినప్పుడు మనుషులనిపించ లేదు. వాళ్ళతోబాటు యాభై గుర్రాలున్నాయి. కాని అవి గుర్రాలుకావు. వాటికి వుండడానికి నాలుగు కాళ్లున్నాయికాని అశ్వికులకు పనికివచ్చే లక్షణాలేవీ లేవు. ఒకప్పుడు అవి జవనాశ్వాలేకాని యిప్పుడు వాటిని పరిహసించేందుకు గీయబడిన వికచిత్రాలైమని వున్నాయి. ఎముకలమీద తోలుతప్ప మరేమీలేదు. వాటి మీద, ఒకప్పుడు శిశువులనిపించే వస్తువులేవో యెక్కివస్తున్నది. ఉత్తరపు చలి

గాడ్పు కత్తికోతకు యెగురుతూ పడుతున్న చిరుగుపేలికల మూటలు గుర్రాల మీద వున్నవికాని శిశువు లనిపించడమేలేదు.

మిగతదళం నడిచి వస్తున్నది. గాలికిలేచి యెగురుతూవున్న పేలికలు నృత్యున్నృత్యం చేస్తున్నట్లున్నవి. గుంటలుపడిన కళ్ళు, గుంటలుపడిన బుగ్గలు, వేలాడుతున్న తోళ్లతొక్కలు — మాస్త్రే స్త్రీపురుషులనిపించరు. మామూలుగా ఇండియన్లు ధరించే వస్త్రాదికాలే ధరించివున్నారు. ఒకప్పుడిది జింకతోలు చొక్కాకాబోలు, ఇవి ఒకానొకనాడెప్పుడో మొకాసిన్ కాలిజోళ్ళు అయి వుండవచ్చు, తోలిరోజులలో యిది ఎర్ర, పసిమి, పచ్చవన్నెచారలుండిన గొంగళి కాబోలు ననుకుంటున్నారు అశ్వికులు. ఇసుక పేర్పులుగట్టిన చిరుగులు పూర్వం యేమైవుండేవో వాళ్ళకు అంతుచిక్కలేదు.

ఈ వచ్చేవాళ్ళు అసలెట్లావుండేవాళ్లో అశ్వికులకు బోధపడలేదు. చని పోయిన వానికళ్ళు రహస్యాలున్న యిళ్ళంటారు. ఈ వచ్చేవాళ్ళ కళ్లు నిశ్చలాలై వున్నాయి. కాని వాళ్లు నడుస్తున్నారు. నల్లటి కేశాలు వారివి రిబ్బన్లవలె, తమ గుడ్డపేలికలవలె, గాలికి చెదరిపోతున్నాయి. చాలమందికి కాలిజోళ్లులేవు. మరి కొందరు ధరించిన మొకాసిన్‌జోళ్ళు పేరుకుమట్టుకే, అవి యిప్పుడు యెండి అరిగిపోయిన తోళ్లముక్కలే. ఎంతో మెల్లగా వస్తున్నారు. అంతకంటే ముందుకు పోయే తీరులేదు. ఎందుకు నడుస్తున్నారు? మృత్యుశీతలమై అనంతవ్యాప్తమైన యిసుక యెడారిలో నిలువ తావులేదు, పలాయనమార్గంలేదు. వారు చెప్పక చెప్తున్న మూకకథ, ఆకలి, దప్పిక, కష్టము, నష్టము, బాధ - వీటిని గురించిన కథ, కాని ప్రగల్భాలులేని కథ! ఆశాశూన్యులై, వికలగాత్రులైకూడ ఆత్మగౌరవం చిత్తస్థైర్యం వారిలో అణుమాత్రమైనా తరిలిపోలేదని అశ్వికులు తొలిచూపు లోనే తెలుసుకొన్నారు.

మరీదగ్గరకు వచ్చారు. సమీపిస్తూ సమీపిస్తూవున్న ఆశవయాత్రలో మంద మైన కదలిక యేర్పడింది. అశ్వాసీనులైన పసిపిల్లలచుట్టూ గుమిగూడిన స్త్రీలు వెను దగ్గినారు. పురుషులు అర్ధవలయాకృతిగా రక్షావ్యూహంవలె తీరి ముందుకొగ్గినారు. చేతిలో తుపాకులు, రివాల్వర్లు వున్నాయి. వారి సాహసం కరుణాజనకమే కావచ్చుగాని తిరస్కారపూర్వకంకూడా. క్రమక్రమంగా మందగిస్తున్న నడక వున్నట్టుండి ఆగిపోయింది.

"మనం వేటాడుతుండిందిదే," అన్నాడు లెఫ్టినెంట్ ఎల్లెన్ ... లాన్సీ ఒళ్ళు జలదరించింది. "వీళ్ళేనా మొండిపోటరులు?" అన్నాడు కెప్టన్ జాన్సన్. అవునని తానెరుగునుగాని తెలిసిన దానిని నిర్ధారణ చేయాలని యీ ప్రశ్న వేశాడు.

కాని ఎవ్వరూ జవాబీయలేదు. గాలిపోటు తప్పి అలికిడి లేనేలేదు. గుర్రాలు కూడా కదలలేదు. ఇండియన్ల పిల్లా జెల్లా కూడా కిక్కురుమనలేదు. చలిగాడ్పును అశ్వికులు పూర్తిగా మరచిపోయినట్లుంది. జీనులమీద నిశ్చలగా

కూర్చుని ప్రతిమలవలె వున్నారు. జాన్సన్ ఏదో ఒకటి చేయాలి. తాను దళాధిపతి; తాను ఆలోచించి, నిర్ణయానికివచ్చి, క్రియకు పూనుకోవాలి. పన్నెండువేల మంది చేయలేనిపనిని తాను సాధించాడు. వెదుకబోయిన తీగ కాళ్ళకు చుట్టుకొన్నట్లు చెయిన్నీలు యెదురయ్యారు. వాళ్ళిప్పుడు తన బందీలు కాక తప్పదు. పారిపోలేరు, ప్రతిఘటించలేరు. మింగలేరు, కక్కలేరు. బుర్రలో ఆనందమూ గర్వమూ బలవంతాన కూడుకొని, జాన్సన్ గుర్రాన్ని ముందుకు అదిలించాడు. కాని పారితోషిక మేమీ లభించలేదు. తన సైనికులకూ, యిండియన్ జట్టుకూ నట్ట నడుమ ఆగి, తాను యీ అనంత సైకతసీమలో ఏకాకిగా వున్నట్లు నిస్సత్తువ పడినాడు. గాలి యిండియన్లవైపు కొడుతున్నది. కాని తన సైనికులకు కూడ తన మాటలు వినిపిస్తాయి. ఇరు దళాలకు నడుమ యిరవై గజాలవార మట్టుకే.

"హాల్లో, హాల్లో," అన్నాడు జాన్సన్. ఎవరు మీ కులపెద్ద?" అని వాళ్ళ ముఖాలకేసి చూచాడు. వాళ్ళు తొణకలేదు. అయిష్టమో, నిర్లక్ష్యమో, తిరస్కారమో యేమోగాని యే కదలికా లేదు. "హాల్లో! ఇంగ్లీషు మాట్లాడే వాళ్ళున్నారామీలో? తెల్లోడి బాస మాట్లాడేవాళ్లు లేరూ?"

గుర్రాన్ని సగం తన దళంవైపు త్రిప్పినాడు. సార్జెంట్ లాన్సీ తనవైపే చూస్తున్నాడు.

"జాగ్రత్తగా వుండడం మంచిది, కెప్టెన్" అన్నాడు లాన్సీ.

జాన్సన్ అశ్వికదళాన్ని చేరుకొని, గుర్రం దిగినాడు. ఎల్లెన్ గూడ దిగినాడు. భయంచేత నైష్ఫల్యంచేత జాన్సన్ మనస్సు బరువెక్కిందని, ఆభారాన్ని తాను కొంత పంచుకోనవలెనని ఎల్లెన్ అనుకొన్నాడు. కెప్టెన్ జాన్సన్‌కు అండగా నిలువవలెనని దగ్గరకు పోయి నిలుచున్నాడు. ఇద్దరిచూపులు ఇండియన్ల మీద వున్నాయి. కుదించుకొని చిన్నదై, నిరుష్టమై, వుత్తరపు మంచుగాడ్పులో అణగిపోయిన సూర్యబింబం పతనమౌతున్నది. దిగంతానవున్న కాలమేఘపంక్తి ఆకాశాన్ని దిగమింగివేయ జూస్తున్నది.

"వాళ్ళకు ఇంగ్లీషురాదు," అన్నాడు జాన్సన్ నిరాశతోటి. బహుశా నాటక మాడుతున్నారేమో, కొంపదీసి!"

"చుట్టుముట్టి, బంధించేద్దామా?" అన్నాడు ఎల్లెన్.

"తుపాకులు కాల్చడం సులువే. కాని యిటువంటి" వ్యవహారంలో జననష్టం కావడం నాకు యిష్టంలేదు."

"పోట్లాటకు పూనుకోవడమంటే ఎంత మూర్ఖపుపని అయిందీ వాళ్ళు అర్థంచేసికోగల రనుకొంటున్నారు మీరు".

"ఇప్పుడు యేది మూర్ఖపుపని అనే సమస్యే వుండదనుకొంటాను వాళ్ళకు. పరిస్థితులు యిట్లా విషమించినప్పుడు. మూర్ఖ మేమిటి, మరొకటి యేమిటి?"

అని జాన్సన్ తన సైనికులను చేరుకొన్నాడు. వారిలో యెవరికైనా చెయిన్నీ భాష తెలుసునేమో చెప్పవలసిందగా కోరినాడు. కొందరికేమో సియోక్స్ ఇండియన్లభాష అడపదడప వచ్చు. ఓ మహా కుర్రవాడొక్కడేమో చెయిన్నీ భాష కాస్తకూస్త తెలుసునన్నాడు. తనకు మూడు నాలుగు ముక్కలకంటె అదనం రాదని, అయినా ప్రయత్నించి చూస్తాననీ అన్నాడు. ఆ యిద్దరూ కలసి యిండియన్లవైపుగా నడిచారు.

"లొంగిపొండి", అన్నాడు జాన్సన్.

ఆ కుర్రవాడికి సరియైన చెయిన్నీ మాట దొరకలేదు. బానిసలుకండి, లేదా ఖైదీలుకండి, అనేందుకైతే మాటలున్నై కాని దీనికిలేవు. చెయిన్నీ భాష చిత్రమైనది. లొంగిపోవడమనే అర్థం, వేరువేరు వ్యక్తులకు సంబంధించి నప్పుడు, వేర్వేరు మాటలలో అభివ్యక్తమవుతుంది. తెల్లవాని లొంగుబాటుకు ఒక మాట, ఇండియన్ లొంగుబాటుకు మరొకటి. కుర్రవాని తటపటాయింపు చూచి, జాన్సన్ ఆలస్యాన్ని సహించలేక, "పోయి, మాట్లాడు" అని గద్దించాడు.

ఆ కుర్రవాడు పోలేకపోలేక ముందుకు నడిచిపోయి, ఇండియన్లకు వినిపించేటట్లు గొంతెత్తి ఏదో అరిచి చెప్పాడు. అన్న మాటలనే తిరిగి అన్నాడు. ధ్వని వాయువుద్వారా పరుగుతీసింది. కుర్రవాడు, ఇండియన్లనుండి తప్పుకొంటున్నాడు.

"మరొకటేదైనా చెప్పు", అని జాన్సన్ సూచించాడు. భాషావిరోధాల నన్నిటినీ కుప్ప కూల్చివేయాలనిపించింది. ఆలస్యంకూడదనుకొన్నాడు. ఇండియన్ల మనసులలో, చూపులలో కనుపించే మృత్యుశైత్యం తనకూ తన సైనికులకూ సంక్రమించగలదేమోనని భయంవేయసాగింది. తుపాను ముసురుదిగి పైబడబోతున్నది.

ఓ మహా కుర్రసిపాయి మరికొంత మాట్లాడాడు. ఈసారి ఇండియన్లలో సంచలనం సంభ్రమం కనుపించింది. తమలోతాము మాట్లాడుకొంటున్నారు. రొద పుట్టింది. ఇంతలో రొద ఆగిపోయింది. ముసలివాడొకడు ముందుకు నడిచి వస్తున్నాడు. పండు ముసలివాడు, ముదివగ్గు సరిగా నడువనైనా నడువలేడు—! యమయాతనల పాలైన యీ తెగలో యింకా ఇంతటివగ్గు బ్రతికి యెట్లా వుండగలిగాడని ఆశ్చర్యం వేసేటంతటి ముసలివాడు! నమ్మలేనంతటి ముసలివాడు! నేరుగా కుర్రసిపాయి దగ్గరకు వచ్చాడు. లలితలలితంగా, మందమందంగా, బాధబాధగా మాట్లాడసాగినాడు.

"ఏమిటీ అతనంటున్నది?" అని జాన్సన్ కుర్రసిపాయి నడిగాడు.

"నాకు తెలియడంలేదు. మనల్ని పొమ్మంటున్నట్లుంది. నిజంగా చెప్పలేను".

"లొంగుబాటు కమ్మని స్పష్టంగా తెలియచెయ్!"

"చెప్పాను. మనల్ని పొమ్మంటున్నాడు. తమల్నివదలి వెళ్ళమంటున్నాడు" వృద్ధుడు ఏదో మాట్లాడుతూనే వున్నాడు. ఒక్కొక్కసారి తన వెనక వున్న వాళ్లకేసి చూపుతాడు. మరోసారి దూరాన ముసురుకొంటున్న తుఫాను మబ్బులకేసి చూపుతాడు.

"తమల్ని వదలిపెట్టి పొమ్మంటున్నాడు" అని జాన్సన్‌తో చెప్పాడా కుర్రసిపాయి. "తమ యిళ్లకు వెళ్ళిపోతున్నారట. మనం వదలిపెట్టి పోవాలట వాళ్ళను—"

"ఇదిగో, అతనితో చెపుతావూ," అని మరేదో వివరించబోయి, జాన్సన్ ఠకీమని ఆగిపోయాడు. ఈ కుర్రాడు ఇండియన్లకేమీ చెప్పలేడనిపించింది. అవరోధం భాషా విషయమైనదే కాదు. మాటల అడ్డంకుల నేదోవిధంగా తొలగించవచ్చు. ఇండియన్లకూ తమకూ నడుమగల అవరోధం కాలసంబంధమైనది కూడాను. ఒక శకం, ఒక చరిత్ర, భూత వర్తమాన కాలాల నడుమగల బాధాకరమయిన అఖాతం! కాబట్టి ఇండియన్లతో మాట్లాడికూడ ఫలముండదనిపించింది. జాన్సన్ భుజాలెగురవేసికొని, కుర్రసిపాయిని తిరిగి వెళ్ళిపొమ్మన్నాడు. వృద్ధుడు యింకా అక్కడనే ఒంటరిగా పురాగంభీరుడై ఖిన్నుడై బాధాకరమైన దీర్ఘానుభవ విషాదభారం వహించి నిలిచి వున్నాడు.

"ఏమి చేయబోతున్నారు" అని లెఫ్టినెంట్ ఎల్లెన్ ప్రశ్నించాడు. ఆ ప్రశ్న నిజంగా కెప్టెన్ జాన్సన్‌కు వేసినట్టిది కాదు. తనకుతానై వేసుకొన్నది. తానే సమాధానం చెప్పుకోవాలి.

"చేయడమా?" అన్నాడు జాన్సన్, ఏమీ పాలుబోక సార్జెంట్ లానీ వైపు మళ్ళి, "సార్జెంట్ లానీ, కోటకు తిరిగిపోయి కల్నల్ కార్లటన్‌తోటి యీ వ్యవహారమంతా వివరించిచెప్పు. ఉన్నది వున్నట్టుగా చెప్పు. రెండుదళాలనూ యీ దౌర్భాగ్యులను తీసుకుపోవడానికి వేగన్లనూ నేను పంపమన్నానని చెప్పు. ఈ లోగా, మేం కాపుంటాం. తమంతట తామే లొంగుబాటయ్యేటట్లు చేయగలమేమో —" అన్నాడు జాన్సన్.

"హొవిట్జరు అక్కరలేదాండీ?" అని ప్రశ్నించాడు సార్జెంట్ లానీ.

"ఏవిటీ?"

"హొవిట్జరండి"

"నేను చెప్పమన్నదేదో చెప్పు."

"కల్నల్‌గారు హొవిట్జరును తీసుకుపొమ్మంటారేమోనండి. ఇండియన్ల వ్యవహారంవస్తే చాలు, ఆయన తుపాకుల విషయంలో ఎంత పట్టింపుగా వుంటారో మీ కెరగనిదికాదు. అది అక్కరలేదన్నారని చెప్పమంటారాండీ?"

"నేను ఏం చెప్పానో అది చెప్పు, సార్జెంట్ కల్నల్‌గారు పంపదలచుకొంటే పంపుకోనీ, గాని నీ పెత్తనం కట్టిపెట్టు సార్జెంట్" అన్నాడు జాన్సన్.

"చిత్తమండి."

"ఇక, బయలుదేరు" అన్నాడు కెప్టెన్ జాన్సన్. సార్జెంట్ లాన్సీ హాయూరూఢుడై వెళ్ళిపోయాడు. చేతితొడుగులు తీసివేసి, చలికి మొద్దుబారిన చేతులను వెచ్చచేసికొంటున్నాడు ఎల్లెన్. "చలి" అన్నాడు.

"ఊఁ?"

"చలి ఎక్కువవుతూవుంది - మంచు కురుస్తుందేమో."

"తూర్పువాట, మంచుకురిసేముందు గాలి వెచ్చబడుతుంది" అన్నాడు జాన్సన్.

ఇండియన్లు కదిలారు. సైన్యంనుండి తప్పించుకోవాలని కాదు. సరిగా వాళ్ళను దాటిపోయారు. అవసరానికి తయారై తుపాకులు చేదాల్చిన సైనికులు, గడచిపోయే ఇండియన్లనుజూచి, జాలి చెందారు. వెనువెంటనే, వెనుకకు తిరిగి నిలుచున్నారు. వృద్ధుడు నెమ్మదిగా ముందునడుస్తూ, మిగతవారిని నడిపిస్తున్నాడు. జాన్సన్ సైగ మేరకు, లెఫ్టినెంట్ ఎల్లెన్ ఆశ్వికులను ఇండియన్ల వెంట నడిపించాడు. గుర్రాలు తీరుబడిగా నడిచినై. అయినా, యిండియన్లు యింకా నెమ్మదిగా ముందు పోతుండినందున, జాన్సన్ పదే పదే గుర్రాలను ఆపించవలసి వచ్చింది. చెయిన్నీలలో మిగిలివున్న కాస్తసత్తువ నంతటినీ పూన్చి వుత్తరపు మంచుగాడ్పు కెదురొగ్గి నడిచారు. ఒక్కొకసారి నిస్సత్తువపడి, వూరికే నిలుచునేవారు. ముందు, దిగంతం భీకరంగా నల్లబారింది. మేఘాలు క్రమ్ముకుంటున్నై. వెనక, సూర్యాస్తమయ కాంతిలో తలలు ప్రస్ఫుటంగా కనుపిస్తున్న సైనికులున్నారు. బలువైన వున్నిదుస్తులు ధరించారు. మస్తుగా మేసి పుష్టిగా గుర్రాలున్నై. జాన్సన్‌జాలికి అంతులేదు." అయ్యో, మూర్ఖులు, పాపతి దౌర్భాగ్యులు!; అనుకొన్నాడు.

కాన్సేపటిలో ఇండియన్లు ఆగి విడిశారు. సైనికుల కెదురుబడిగా ఇండియను పోటుగలు బోర్లాపడుకొని, తుపాకులు గురిచూచి వున్నారు. ఇతరులు అవసరకార్యాలలో నిమగ్నులైనారు. బ్రతికిచెడిన భిక్షుకుడు, బాగా వున్న రోజులకు చెందిన చిట్టచివరి అమూల్యవస్తువు నేవిధంగా చూచుకొంటాడో, ఇండియన్లు తమ పిల్లలనా విధంగా ఆదరించసాగారు. తగిలితే యేమవుతుందో నన్నట్లు గుర్రాలనుండి జాగ్రత్తగా దింపి, బుజ్జగించ మొదలెట్టారు. సైనికులు యిదంతా చూస్తున్నారు. ఇండియన్ల విడిదికి పదిగజాల దాపువరకూ పోగలిగారు. ఆ మేరగాటితే, తుపాకులు మ్రోగగలవు. ఇండియన్ల పిల్లలు స్పష్టంగా కనుపిస్తున్నారు. తోళ్ళతిత్తులు - శిశువులుకాదు. ఊకదుపులు. కిలకిలలులేవు. చిరునవ్వులులేవు. కేరింతాలులేవు. నసుగుడుకూడలేదు. అర్థనగ్నశరీరులైన తలిదండ్రులు మిగుల్చగలిగినచిరుగు పేలికల బొంతలు చుట్టుకొన్న వామన మూర్తులవలె వున్నారు. యువకులూ, స్త్రీలూ కట్టెపుల్లలకోసం, ఎండుగడ్డికోసం

యిటూ అటూ తిరుగుతున్నారు. చెత్తచెదారమంతా పోగుచేసి, సంజవేళ, చిరు మంటలు వేశారు. వండుకోవడానికి మట్టుకు కాదు. తిండిదినుసులుంటేగదా వంటలు? మంటలచుట్టూ పిల్లలను కూర్చొనబెట్టారు. ఉత్తరపు మంచు గాలి పిల్లలకు సోకకుండా తామందరూ చుట్టూ గోడవలె చేరారు. వంటప్రయత్నాలేవీ లేకపోవడం చూచిన జాన్సన్ తాళలేకపోయాడు. నేరుగా సామానుమోసే గుర్రం దగ్గరకు పోయి, మూటవిప్పి, గట్టి బిస్కత్తులసంచి తీసుకొని, తిరిగి ఇండియన్లవైపు నడిచాడు. ఎదురుగా తుపాకులు భుజం గొల్పుతున్నాగాని; వాటిని లెక్కించక నేరుగా విడిదిని సమీపించి, సంచిని దించి నేలమీదపెట్టి, ఇండియన్ల దౌర్భాగ్యానికి సమ్మోహితుడైనట్లుగా తదేకంగా వారినే చూడసాగాడు. సంచిమూతి విప్పి, బిస్కత్తులుతీసి, చేతిలో కాస్సేపు పెట్టుకొని, తిరిగి సంచిలో వేశాడు. చీకటి పడుతున్నది. చీకటిలో ఇండియన్ల జీర్ణ స్వరూపాలకు విషాదమయగాంభీర్యమేదో వచ్చినట్లు అనిపించింది, జాన్సన్ వెనుకకుతిరిగిపోతూ, దేనినోఢీకొన్నాడు. ఎవరోకాదు, లెఫ్టినెంట్ ఎల్లెన్. ఎల్లెన్ క్షమాపణ నర్థించాడు. జాన్సన్ ఫర్వాలేదన్నాడు.

"ఇదంతా కలవరలేలేదండీ,?" అన్నాడు ఎల్లెన్.

"భయంకర వాస్తవంలాగుంది నామట్టుకు నాకు."

"తిండి తింటారావాళ్లు?", అని ఎల్లెన్ ప్రశ్నించాడు.

"తింటారేమో."

"మీకు అభ్యంతరమేదీ లేకుంటే, నీళ్ళడబ్బా యిచ్చిరానా వాళ్ళకు?" అని ఎల్లెన్ సాతురుడై సూచించాడు.

"నీకంత యిదిగావుంటే, యిచ్చిరా," అన్నాడు జాన్సన్.

ఎల్లెన్ గబగబపోయి, రెండు డబ్బాలలో నీళ్లునింపి, భుజాలమీద పెట్టుకొని తిరిగి వచ్చాడు." పోయి, అక్కడపెట్టి రానా.," అని అడిగాడు.

"భయంలేదు. పోయిరా!" అన్నాడు కెప్టెన్ జాన్సన్.

ఇంతలో చీకటి దట్టమయింది. గగనాన ఘోరమేఘాలు క్రమ్ముకొని, పశ్చిమదిగంతాన మిగిలివున్న మంద ప్రకాశ సూక్ష్మరేఖను మట్టుకు విడిచి, మిగతా జాగానంతటినీ ఆక్రమించాయి. లెఫ్టినెంట్ ఎల్లెన్ చీకటిలోపడి పోయాడు. గాలిపోరులో అతని పదపాత ధ్వనికూడ వినిపించలేదు. రాత్రి గర్భంనుండీలె అంతలో ఎల్లెన్ రావడం చూచి జాన్సన్ మనస్సు సంభ్రమించింది. "ఎల్లెన్" అని పిలిచి, అతని భుజంమీద చేయివేసి "అంతా సవ్యంగా నడిచిందా" అని అడిగాడు.

ఎల్లెన్ ముఖం నవ్వుతో విప్పారింది. "వాళ్ళు రొట్టె పుచ్చుకొన్నారు. కటిక చీకటి అయినా నన్ను అట్టే కనిపెట్టేశారు. వాళ్ళ పుణ్యమా అని కాల్చలేదు. నీళ్ళుకిందపెట్టి వచ్చేశాను" అన్నాడు. చలికీ, అదురుకూ ఎల్లెన్ ఒళ్లు వణకి

పోతున్నది. "ఈవేళ ఏం చేద్దాం?" అని అడిగాడు. "వాళ్ళను చుట్టుముట్టి పడు కొందాం" అని నిశ్చయించాడు జాన్సన్. "పారిపోజూస్తారనుకోను. కాని ఎందు కైనా మంచిది. ప్రతి మూడవ సిపాయీ రెండుగంటలసేపు గస్తీ తిరగాలని చెప్పు" అని ఆజ్ఞాపించాడు.

"ఈ రాత్రి మంచుపడ వచ్చునేమో" నన్నాడు ఎల్లెన్. మేల్కొని చీకటిలో పవళించిన ఎల్లెన్ యింతలోలేచి, భుజాలకు కంబళిని గట్టిగా చుట్టిపట్టు కొని, అగ్గిపుల్ల వెలిగించ ప్రయత్నించాడు. గాలికి చాల పుల్లలు ఆరిపోయాయి. చివరకు ఒక పుల్లకాస్త మండింది. ఆ వెలుగులో చేతి గడియారపు ముళ్ళ అంకెలు కనిపించాయి. రెండుగంటలు దాటింది. చుట్టూ సైనికులు నిదురిస్తున్నారు. వారిని దాటుకొని పోతుంటే, ఒక మానవాకృతి కనిపించింది.

"హాల్లో ఎవరక్కడ?" అని ప్రశ్నించాడు ఎల్లెన్.

"లెఫ్టినెంటుగారా?", అని జవాబు వచ్చింది. ఆ మనిషి పేరు గొగార్టి. గస్తీ తిరుగుతున్నాడు. చలిని తిట్టి, ఇండియన్లమీద శాపాలు కురిపించాడు.

"కెప్టన్ గారెక్కడ?", అని ఎల్లెన్ అడిగాడు.

గొగార్టికి తెలియదట. ఎల్లెన్ ముందుసాగిపోయాడు. నిద్రపోతున్నవాడి కెవడికో కాలు తగిలి వాడిమీద పడిపోయాడు. ఆ మనిషికి మెలకువవచ్చింది. నసుగుకొంటున్నాడు.

"కెప్టన్?"

"ఏమిటది?", అన్నాడు జాన్సన్.

"అక్కడ యేదో అలికిడి అవుతున్నది", అన్నాడు ఎల్లెన్.

"నిదరపోలేదేం, ఎల్లెన్, నువ్వు?"

"తవ్వుతున్నట్టుంది—"

"పిచ్చెత్తిందా యేం, నీకు? ఎందుకు తవ్వుతారువాళ్ళు నిసిరాత్రిపూట".

"నాకు తెలియదు".

"అయితే పోయి నిదరపో".

"కాని ఎందుకు తవ్వుతున్నట్టు?", అనుకొంటూ ఎల్లెన్ పడుకొని నిద్ర పోయాడు.

గట్టిగా బిగించిన మూతగల సీసావంటి భూప్రపంచం మీదుగా ఉదయం మొదలయింది. ఇంకా మంచు ప్రారంభించలేదు. కాని గగన మంతా మేఘ కంబళాలు కప్పుకొని వుంది. కలత నిదురనుండి జాన్సన్ మేల్కొన్నాడు. చలికి అవయవాలు బిగిసిపోయినై. తయారవుతున్న కాఫీ ఘాటువాసన హాయి గొల్పింది. ఉప్పూరిన పంది మాంసం, క్రొవ్వులో నానిన గట్టి బిస్కత్తులు, స్టాలింగ్ కాఫీ - తయారవుతున్నాయి. బొగ్గు మంటల వద్దకుపోయి, చెయున్నీల విడిదివంక ఒక మాటు చూచి, కళ్లునులుముకొని, రాత్రి ఎల్లెన్ విన్న త్రవ్వేడు

సవ్వడి గుర్తుతెచ్చుకున్నాడు. ఈ పరిస్థితులలో యిది సాధ్యమే కాదు. అస్థిపంజరాలు తోళ్లతిత్తులు రాత్రి నిద్రమాని, వలయాకృతిగా తాత్కాలిక రక్షాకుడ్యాన్ని నిర్మించారంటేనూ తుపాకిగుళ్ళు తగులకుండా ఆడవాళ్లకొరకు పిల్లవాళ్లకొరకు గుంటత్రవ్వినారంటేనూ, విశ్వసింపలేకపోవచ్చుకాని యదార్థం!

ప్రొద్దుటి తిండితింటున్నంతసేపూ, సైనికులచూపు యిక్కడలేదు. ఇండియన్లు చేసికొన్న రక్షణయేర్పాట్లు వింతగొలుపుతున్నవి. జాన్సన్ వాళ్ల విడిది చుట్టూ ప్రదక్షిణం చేశాడు. తమస్థితి నిరాశమయమై వున్నప్పటికీ, తమకు తిండి తిప్పలు లేకున్నప్పటికీ, ఇండియన్లు అప్పటికిప్పుడు తమ విడిదిని శత్రుదుర్గమం చేసికొని, పోట్లాటకు యెందుకు సన్నద్ధులు కావలసివచ్చిందో అతనికి బోధపడలేదు. తిరిగితిరిగి జాన్సన్ తనసైనికులవద్దకు వచ్చాడు. ఎల్లెన్‌ను సమీపించాడు. "ఇలాంటివి నేనెప్పుడూ చూడలేదు, కెప్టన్", అన్నాడు ఎల్లెన్ సాశ్చర్యంగా.

"అట్లాగా?"

"మళ్లీ వీళ్ళను లొంగదీయ ప్రయత్నిస్తారా, కెప్టన్?"

"మరేంచేయడం? దుర్గంనుంచి దళాలు వచ్చేంతవరకు, మనమేదో ఒకటి చేయకతప్పదుకదా!" అని జాన్సన్ నిన్న ఇండియన్లతో చెయిన్నీ భాషలో మాట్లాడిన ఓమహా కుర్రసిపాయివద్దకు పోయాడు. ఇండియన్ల రక్షాకుడ్యాల వద్దకుపోయి వారితో చెయిన్నీభాషలో మాట్లాడిరమ్మని ఎంతో సతపోరి చెప్పాడు. కాని అతను యిష్టపడలేదు.

"ఆయుధాలేవీ లేకుండా నేను పోలేనండీ" అన్నాడు. "వాళ్ళు వున్మాదపోళ్ళు. ఉన్మాదం లేకుంటే యీ విధంగా త్రవ్వకపుపని ఎవడైనా బుద్ధి వున్నవాడు చేస్తాడా?"

"ఏం ఫర్వాలేదు, నీకేం ముప్పురాదు" అన్నాడు జాన్సన్.

"ఏమోనండి. నేను దేనిని గురించి మాట్లాడుతున్నానో వాళ్ళకది బోధపడుతుందని అనిపించడంలేదండి" అంటూ నెమ్మదిగా కాళ్ళీడ్చుకొని పోయాడు. తనతోబాటు జాన్సన్‌కూడ తోడువస్తానని చెప్పినమీదటే అతను పూనుకొన్నాడు. దగ్గరకు, యింకా దగ్గరకు పోయాడు. తనకు తెలిసిన నాలుగు చెయిన్నీమాటలతో ఇండియన్లను లొంగిపోవలసిందని అరచి చెప్పాడు.

ఒక తుపాకి మ్రోగింది; గుండొకటి వాళ్ళ పాదాలముందు పడి మట్టిని లేవగొట్టింది. కుర్రసిపాయి కాలికి బుద్ధిచెప్పాడు. కాని జాన్సన్ సాదాసిపాయి కాదు; దళాధిపతి; నిర్ణయాలుచేయడం, అన్నీ తెలిసికోవడం అతని పని. తన హోదాకు భంగం కలుగకూడదు. తాను పారిపోతే, తన సైనికులముందు చులకన పడిపోతాడు. పారిపోకూడదు అనుకొని, ఇండియన్లకు వీపుత్రిప్పి నెమ్మదిగా హుందాగా తనవారివైపు నడచి వచ్చాడు. భయసంభ్రమాలకు నరాలు అల్లల్లాడిపోతున్నవి. సత్తువంతా దిగజారిపోతున్నది. ఏక్షణం వీపున తుపాకిగుండు

దూసుతుందోనని గుండె కంపరమెత్తుతున్నది. ఇంతలో అతనికి రక్షణగా లెఫ్టినెంట్ ఎల్లెన్, కొందరు సిపాయీలు పరుగెత్తి చేరుకొన్నారు. అతనిముఖమూ, చేతులూ చెమట ముద్దయినవి. ఇంత చలిలోనూ చెమటపట్టింది.

నోట మాటకూడాలేదు. నేరుగా మంటదగ్గరకుపోయి కప్పునిండా కాఫీ పోసికొని, గబ గబ నాలుగు గుటకలలో ఖాళీచేశాడు. వేడికాఫీ గొంతుకు తగిలి పోతుంటే హాయి అనిపించింది. భారం వదలిపోయింది. దళాలు వచ్చేవరకూ పూరకుండడం తప్ప, యిక చేయవలసిన దేమీలేదు. బొగ్గుతో వేసిన మంటలకు చలిపోవడంలేదు. కట్టెపుల్లలు యేరుకొనివచ్చి మంటచేయమని సైనికులను పంపాడు. ఈ సారి పెనుమంట చేశారు. జ్వాలలు లేచేకొద్దీ, మంచు పడ సాగింది. మంచుతాకిడికి ఇసక హుస్సు హుస్సు మని ధ్వనిచేసింది. గాడ్పు యింకా ఘోషిస్తూనేవుంది. దాని తాకిడి కత్తిఅంచువలె నిశితంగావుంది. గాలి పోడు వల్ల మంచు యిసకలో చొచ్చుకొని కలగలిసి పోయింది. మంటదగ్గర గుమికూడి చలికాచుకొంటున్న సైనికులకు కాడ, యిది ఘోరశిక్షకాగా, యిక దాదాపు దిగంబరులైన ఇండియన్ల అవస్థ దుర్భరం! తెల్లవాళ్ళకు యిది తెలియదు. తెలిసికొన ప్రయత్నించలేదు. హిమ హింసబారినుండి యేదోవిధంగా తమ శిరస్సులను కాపాడుకొంటున్న చిరుగుపేలికల మూటలవంటి ఇండియన్లను అప్పుడప్పుడూ సైనికులు చూస్తూనే వున్నారుగాని, దానిని గురించి యేమీ మాట్లాడుకొనలేదు.

సాయంకాలానికి రాబిన్సన్ దుర్గంనుండి మూడవ ఆశ్వికసైన్యానికి చెందిన దళం ఒకటివచ్చి చేరుకొన్నది. దీనికి అధినేత కెప్టన్ వెస్సెల్స్. అతనితోబాటు సార్జెంట్ లానీ కాకుండా, మరి ముగ్గురు సియోక్స తెగకు చెందిన ఇండియన్ మార్గదర్శకు లున్నారు. వాళ్ళందరికీ కాస్తోకూస్తో చెయిన్నీ బాసవచ్చు. ప్రొద్దు పొడిచేలోగా రెండు హోవిట్జర్లూ, మూడు రవాణా వేగన్లూ రాగలవని వెస్సెల్స్ కెప్టన్ జాన్సన్‌కు తెలియజేశాడు.

వెస్సెల్స్‌కు భావనాశక్తి తక్కువ. దూరం ఆలోచించలేదు. మంచు కురుస్తున్నట్లయితే, ఎక్కడైనా ఒదుక్కుంటాడు. లేకపోతే, గట్టి వున్ని దుస్తులు ధరిస్తాడు. ఆకలైతే తింటాడు. ఇతరుల చలిగురించి ఆకలిగురించి వీసమెత్తు ఆలోచనగాని సానుభూతిగాని లేనివాడు. తాను తప్ప తతిమ్మా వాళ్ళందరూ మరొక ప్రపంచానికి చెందినట్లు భావిస్తాడు. తనను గురించి తప్ప వేరొక చింతగాని ధ్యాసగాని లేదు. ఈ స్వార్థచింత వెస్సెల్స్‌కు సహజమైన గుణమే కాని తెలిసిచేసిన యెత్తుగడ కాదు. ఆదిమానవుని స్వార్థపరతకూ వెస్సెల్స్ స్వార్థ పరతకూ భేదంలేదు. ఆజ్ఞలను నెరవేర్చవలసివచ్చినప్పుడు, వెస్సెల్స్‌కు వెస్సెల్సే సాటి. తూచా తప్పడు. కాని యితర మానవుల వాంఛానిబిడ ప్రపంచాన్ని అవగతం చేసికోవలసివస్తే, వెస్సెల్స్ చిక్కువబడి, కొట్టుమిట్టాడి, తటపటా

యిస్తాడు. మనిషి మనిషికీ వేర్వేరు తరహాలుంటాయనీ, పుర్రెపుర్రెకూ బుద్ధులు మారుతుంటాయనీ అతనువూహా చేయగలేడు. అందరికీ ఒకే ఒక్క మూస సరిపోతుందనుకొంటాడు. సైనికోద్యోగి కవ్వడికి గాని వుండవలసిన సుగుణాలలో ఒకటి వెస్సెల్స్‌కు మస్తుగా వున్నది. అతనెప్పుడూ సంశయ రోగగ్రస్తుడు కాలేదు. తనమీద తనకు గురియెక్కువ. ఆత్మవిశ్వాసం కలిగిన చిత్త స్థైర్యమే అతని ప్రముఖలక్షణం. తామిప్పుడు ఎదుర్కొన్న పరిస్థితి జటిలమైనది. కాని వెస్సెల్స్‌కు యీ జాటిల్యమేమీ పట్టదు. అతనిది నేరైనచూపు, సూటైనబాట; సరళసుకరమైన పని. "పోయి, వాళ్ళను బంధించి వేద్దాం. వేగన్లు వచ్చేలోగా యీ పనిచేసివుంటే, వెంటనే తరలించుకొని వెళ్ళిపోవచ్చు", నన్నాడు కెప్టన్ జాన్సన్‌తోటి వెస్సెల్స్.

"మీరనుకొంటున్నంత సులభంకాదు" అని జాన్సన్ జవాబిచ్చాడు సాలోచనుడై.

"వాళ్లస్థితి గడ్డుగావుందని మీరేకదా అన్నారు?"

"వాళ్లకు తుపాకులున్నై. తుపాకులను ప్రేల్చడానికి గడ్డుపరిస్థితి అడ్డువస్తుందా? మరికాస్సేపు వీళ్లనిట్లే చుట్టుముట్టివుంటే, తమంతట తామే లొంగుబాటవుతారనుకొంటాను. అట్లాకాకుండా, మనం దెబ్బతీయ ప్రయత్నిస్తే, జననష్టం తప్పదు", అన్నాడు జాన్సన్.

"ప్రాణనష్టమేమీ లేకుండానే పోట్లాడవచ్చు, మంచు యిట్లాగే కురుస్తుంటే, తిరిగి దుర్గానికిపోవడం ప్రాణాలు తీస్తుంది?

జాన్సన్ భుజాలెగురవేశాడు. "హఠాత్తుగా వెల్లువ కంటబడిన తక్షణమే వీళ్లు లొంగుబాటు కావచ్చు".

"అవునేమో—"

"మీతోబాటు వచ్చిన సియోక్స్ మనుషులలో ఒకణ్ణి తీసికొనిపోయి, వాళ్లతో మాట్లాడిచూస్తాను", అన్నాడు జాన్సన్.

"మొండి పోటుదులతో మాట్లాడి ప్రయోజనముండదు".

"అయినా ప్రయత్నిస్తాను", అన్నాడు జాన్సన్.

సియోక్స్ తెగకు చెందిన ఇండియన్లలో ఒకణ్ణి తీసుకొని జాన్సన్ ఇండియన్లవైపు నడిచాడు. వాడిపేరు 'చింతాక్రాంతుడు'. ఇండియన్లతో మాట్లాడడానికి హడలి చస్తున్నాడు. తన తెగకూ, చెయెన్నీ తెగకూ వెనకమంచి సఖ్యముండేదనీ, తాను మిత్రుడై స్వకులస్తుడై వుండికూడ తెల్లవారితో జత కలిసినందుకు చెయెన్నీలు కోపగించి తనను కాల్చివేయ వచ్చుననీ, ఎట్లాగూ జాన్సన్ శత్రుకోటికి చెందినవాడు కనుకనూ, శత్రువులను ఇండియన్లు గౌరవిస్తారు కనుకనూ అతనికే ముప్పు కలుగబోదనీ, ఇండియన్లతోటి

మిత్రత్వంకంటె విరోధమే మేల్తరమైనదనీ, 'చింతాక్రాంతుడు' జాన్సన్‌కు భయపడుతూ భయపడుతూ నివేదించాడు.

"మురికి వెధవా, మాట్లాడువాళ్ళతో! లేకపోతే, డొక్క చీరుతాను కాచుకో," అని జాన్సన్ బెదిరించాడు.

తుపాకిగుళ్ళు తగులకుండా స్త్రీలకూ, శిశువులకూ రక్షణనిచ్చేందుకై ఇండియన్లు త్రవ్వుకొన్న గుంట సమీపానికి నడిచారు వాళ్ళిద్దరూ. కొందరు ఇండియన్లు లేచి నిలుచున్నారు. వాళ్ళలో ఆ ముదిపగ్గుకూడా వున్నాడు. మునుసాగి త్రోసుకొని వస్తున్న మంచుతెర వూపులో చిరుమొక్కలవలె వూగుతున్నారు అటూ యిటూ.

"మాతో పోట్లాడి లాభముండదని చెప్పు. చుట్టూ, సేనల్నున్నై. పారిపోవీలులేదు. లొంగుబాటు కావడమే వుభయతారకం. లొంగుబాటయితే, మస్తుగా తిండిపెట్టి, దుర్గానికి తీసికెళ్ళతాం. అక్కడ యిళ్లు యిస్తాం. చలిబారినుండి రక్షణ వుంటుంది. అలా కాకుండా కయ్యానికే కాల్దువ్వితే, మనుషులు అనవసరంగా చనిపోవలసివస్తుంది, అని చెప్పు," అన్నాడు కెప్టన్ జాన్సన్.

ఎదురురొమ్ముమీద చేతులు కట్టుకొని గొంతెత్తి అనువదిస్తున్న ఇండియన్ మాటలు మాటలవలె లేవు; వాఘ్గార పాటవలెవుంది. గాలి వెళ్ళబోస్తున్న శోకంలో యిది అంతర్లీనమైపోయింది. ముసలివాడు జవాబు చెప్పసాగినాడు. అతని మాటల తీరు ఎంతో మర్యాదా సూచకంగానూ, సాధుతాస్ఫోరకంగానూవుంది.

"ఆళ్ళీపాటికే చచ్చిపోయారంట" అని సియోక్స్ ఇండియన్ అనువదించాడు.

"ఇంటికి పోతున్నారంట, పోవాలంట, యింటిపట్టుకు చేరుకొని తీరాలంట" అతని మాటల వెనుక ఎక్కడోగాని కవిత్వమూ సంచలనమూ, శ్రవణపేయమైన పురాతన భాషలోని జటిల సౌందర్యమూ తొణికిసలాడుతున్నవి. "చచ్చిపోయారంట, వెళ్ళిపోవాలంట."

"చాలు, నోర్మూయ్! పెద్ద పెద్ద తుపాకులు వస్తున్నాయనీ, అవి చిత్రవధ చేస్తాయనీ వాళ్ళకు తెలియచెప్పు" అన్నాడు జాన్సన్. "ఈ పాటికీ చచ్చిపోయారంట, ఎట్టాగు యెళ్లిపోవాలంట, అని అనువదించి సియోక్స్ ఇండియన్ భుజాలెగురవేశాడు.

ఇండియన్లతో పోరు తప్పలేదు. దీనిని వెస్సెల్స్ నడిపినాడు. ఒక దళములో సగభాగం ఒకే ఒక్క దిక్కునుంచి కాలినడకను వస్తే, తమ తుపాకి గుళ్ళకు తామే గురి కావలసిన ముప్పువుండదు. చేతొడుగులు తీసివేసి, సైనికులు తుపాకులను గట్టిగా పట్టుకొనవలసి వచ్చింది. మంచు తాకిడికి వాళ్ళ చేతులు నీలివన్నెకు తిరుగసాగినవి. వెస్సెల్స్ ఈల వూదిన వెను వెంటనే సైనికులు వంగి, ఒదుగుకొని, పరుగెత్తసాగినారు. మంచులో కాళ్ళు

జారసాగినవి. దట్టమైన మంచుపొరలను చించుకొని చూపులు ముందుకు పరుపలేకపోతున్నారు. చెయిన్నీలు నిర్మించుకొన్న కందకం వాళ్ళ కగుపించనే లేదు. తెల్లటి జరీలాలెయున్న మంచు ముమ్మరంనుండి కూడ చెయిన్నీలకు సైనికుల నీలి దిరుసు ప్రస్ఫుటంగా కనుపించబట్టి, వాళ్ళ తుపాకులన్నీ ఒక్క పెట్టున సరిగా లక్ష్యాలను చూచుకొని ప్రమోగినై. ఈ దారుణాగ్ని వర్షానికి సైనికులు నిలువలేక, నెత్తురు లొలికిస్తూ, వెనుదిరిగి వెస్సెల్స్ వున్న చోటికి దౌడు తీశారు. కనుపించని విరోధిమీద తుపాకులను గురిచేయలేక పోయినందు చేతనే తిరోగమించక తప్పలేదు. వెస్సెల్స్ పొరపాటు నేర్చుకొన్నాడు. "ఇదేమి లాభంలేదు. ఫిరంగులు వచ్చేంతవరకూ ఆపుచేద్దాం", అని జాన్సన్‌తో అన్నాడు. తన ప్రయత్నం తాను చేశాడు. అది నిష్ఫలమైనది. జాన్సన్ తనను దెప్పిపొడువలేదు. వెస్సెల్స్ దృష్టిలో, గాయాలొక లెక్కలోనివి కావు; గాయపడినవాళ్ళుకూడా సైన్యంలో అంతర్భాగమే. తొడగుండా గుండుదూరి బాధపడుతున్న సిపాయిని ఓదార్చాడు వెస్సెల్స్. మరొక సిపాయి చేతియెముక విరిగితే, దానిని తిరిగి యథాస్థానానికి వచ్చేటట్లు సర్దడానికి శ్రమపడినాడు. జెడ్ హార్లీ అనే పసి సిపాయి తలలో గుండుదూరి చనిపోతే, సైనికులు మోసుకొని వచ్చారు. వెస్సెల్స్ చెక్కు చెదరలేదు. నోటుపుస్తకం విప్పి అందులో మృత సైనికుని పేరు యెక్కించాడు. జరిగినదానినిబట్టి ఇండియన్లను ద్వేషించనుకూడా లేదు. ఎర్రముండాకొడుకులు తెల్లవారేవరకూ మనల్ని వేధిస్తూనే వుంటారు అని నెమ్మదిగా అని, సాలోచనుడై, "బహుశా చలికి కొయ్యబారిపోతారేమో" నన్నాడు.

అర్ధరాత్రివేళకు, మంచు కురవడం ఆగిపోయింది. కాని గాలిమట్టుకు రొదపెట్టుతూనేవుంది. ఇంతలో పేగన్లూ, రెండు హొవిట్జర్లూ దుర్గంనుండి వచ్చాయి. అంతవరకూ వెస్సెల్స్ నిద్రపోలేదు. ఆతర్వాత ఫిరంగులను వుంచేందుకు యెత్తైన తిన్నెలు చేయించి, సరిగా గురిపెట్టి నిలిపించి, అవుటుగుండ్లు కూరించిగాని నిద్రపోలేదు.

కెప్టెన్ జాన్సన్ నిద్రలేచేసరికే, వెస్సెల్స్ లేచి, ఫిరంగులు ప్రేల్చే మనుషుల సన్నాహాలలో తల మునకలై వున్నాడు. తన పథకాన్ని జాన్సన్‌కు వివరించి చెప్పాడు. ఇండియన్ శిబిరముచుట్టూ వలయాకృతిలో సైనికులు నిలువాలట; ఫిరంగులు చెయిన్నీలమీద అవుటుగుండ్లు వర్షించాలట; యీ దెబ్బలకు వుక్కిరిబిక్కిరి కాక తప్పని మొండిపోటరులను సైనికులు లొంగదీయాలట.

"అక్కడ ఆడవాళ్లూ పసిపిల్లలూ క్రిక్కిరిసి వున్నారు. మగవాళ్ళు మహాఅంటే నలభై, ఏభైమంది వుంటారు" అన్నాడు జాన్సన్.

"మన మేంచేద్దాం? తప్పు వాళ్ళది!" అని వెస్సెల్స్ భుజా లెగుర వేశాడు.

"తిండితిప్పలు లేవు. మరొక్క రోజు కడుపు కాలినట్లయితే తమంతట తామే లొంగుబాటవుతారు."

"కల్నల్ గారు వాళ్ళను లోగొనమని అజ్ఞ చేశారు."

"ఆయనకు తెలియదు—"

"స్త్రీల గురించి, శిశువుల గురించీ, ఆయనకు తెలియదంటున్నారు? ఆయనకిది తెలియకపోలేదు. లోగొనమని అజ్ఞ. ఇదే ముప్పులేని దారి, అవుటు గుండ్లు చక్కగా పనిచేయగలిగినపుడు, అనవసరంగా మనం సైనికులనెందుకు బలి యివ్వాలి?"

జాన్సన్ అర్ధమనస్కతతో అంగీకరించాడు,

వెస్సెల్స్ పథకం ప్రకారం సైనికులు యిండియన్ల విడిదిని చుట్టుముట్టారు. గాడ్పుకూడ తగ్గింది. కాని అప్పుడప్పుడుమట్టుకు అబలవలె సత్తువలేని వూపులతో మంచుపిడచలను యెగురగొట్టి నర్తింపజేస్తూవుంది. ఇండియన్ల విడిది, చిల్లర కదలికలను తప్పిస్తే, ప్రశాంతంగా మాటు మణగివుంది.

వెస్సెల్స్ ఫిరంగులవద్ద నిలుచుని, సులోచనలద్వారా సైనికులను గమనించి చూస్తున్నాడు. జాన్సన్ సైనికులతోటి వుండిపోయాడు. సైనికులందరూ తమ తమ స్థానాలు చేరుకొన్నంతవరకూ వేచి, వారు యధాస్థానాలలో నిలిచినతోడనే యెత్తివుంచిన చేతిని తటిల్మని దించివేశాడు. ఒక ఫిరంగి వెళ్ళగ్రక్కిన మంటలూ పొగలూ మంచులో జరజర ముందువెనుకలకు దురుసుగా ప్రవహించాయి. అవుటు గుండు ఘోషపెట్టుతూ యిండియన్ల విడిదికి కొద్దిగా అవతలపడి, ప్రొద్దుటి యెండలో మంచునూ ధూళినీ పువ్వులువలె లేవనెత్తింది. ఫిరంగులపై అజమాయిషి పనిచేస్తున్న లెప్టినెంటు దిద్దుబాట్లు చేయవలసిందని ఆజ్ఞాపించాడు. ఇంతలో రెండవ హౌవిట్జరు గర్జించింది. సరిగ్గా విడిదినట్టనడుమపడిన అవుటు గుండు దెబ్బకు ఇండియన్లు ప్రకంపించి, సంచలించిపోయారు. దూరంనుంచికూడ వారికి తగిలినదెబ్బ బాధ, వారి ఆశ్చర్యమూ కనుపిస్తున్నాయి.

"ప్రేల్చు" అని వెస్సెల్స్ అరిచాడు. హౌవిట్జరు మళ్ళీ గర్జించింది.

ఈ దారుణ ఘాతానికి మాంసమూ, రక్తమూ, మానవ హృదయ సంభ్రమమూ వెల్లురేగినవి.

"ఇక చాలు ననుకొంటాను" అన్నాడు వెస్సెల్స్.

పండిపోయిన ముదివగ్గు మొట్టమొదట వెలికి వచ్చినాడు. చేతులు యెత్తిపెట్టుకొని, ప్రబద్ధలైపోతున్న అవుటుగుండ్ల అగ్నివర్షానికి తన రాచఠీవిని ధిక్కారధోరణిని బలిచేసి, బయలుదేరాడు. సైనికవలయం ముందుకు సాగి మూగింది. 'చింతాక్రాంతుడు' అనే పేరుగల సియోక్స్ ఇండియన్ మనిషిని వెంటబెట్టు

కొని కెప్టెన్ జాన్సన్ చెయిన్నీ వృద్ధనాయకునికి యెదురుపోయాడు. ఇంతలో మరిద్దరు ఇండియన్లు ముసలివానికి బాసటగా వచ్చారు. ఆ యిద్దరూ పొడగరులు, కృశీభూతశరీరులు, క్షుత్పీడితులు, శైత్యస్తంభితాంగులు. అనుపమానమైన అమానుష భయంకరమైన వారి కష్టసహిష్ణుత, ఓర్మి, జాన్సన్‌కు ఎవ్వరూ చెప్పకుండనే, అవగత మయింది. కెప్టెన్ జాన్సన్‌కు తన అల్పత్వం తెలిసివచ్చింది. అతనిగుండె కరిగింది. మాటలలో జాలి ద్రవించింది. "ఆశలన్నీ అడియాసలైనప్పుడు ధీరులు కూడ లొంగుబాటుకాక తప్పదు" అని జాన్సన్ అన్నాడు.

సియోక్స్ ఇండియన్ మనిషి యీ మాటలను చెయిన్నీ భాషలోనికి అనువదించాడు. వృద్ధుడు తలపంకించాడు. ముడుతలుతీరి, చలికి పగుళ్ళుబారిన అతని ముది బుగ్గలమీదుగా కన్నీరు ధారకట్టింది.

ఆళ్లే ఆడాళ్ళూ పిల్లోళ్ళూ గుండుదెబ్బకు అతమైపోయారంట," అని అనువాదకుడు జాన్సన్‌కు తెలియజేశాడు.

కెప్టెన్ జాన్సన్ గుండె స్తంభించింది. నోటమాట పెగలలేదు. ఎట్టకేలకు తన విచారాన్ని తెలియజేశాడు.

"ఇప్పుడు మీతో వచ్చేస్తారంట. ఇళ్ళకు పోరంట."

"అతని పేరేమిటో అడిగి కనుక్కో," అని జాన్సన్ మెల్లిగా అడిగాడు.

"బండకత్తి అంట. ఈ పక్కమాసిపేరు ముసిలికాకి. ఆ పక్కమాసి అడివి పంది. ఈళ్ళు కులపెద్దలు."

"కులపెద్దలు" అని జాన్సన్ తలపంకించాడు "తోడేలూ, అతనితో బాటుండిన మనుషులు యెక్కడున్నారో అడిగి కనుక్కో."

"ఇంటికి పోయారంట మొట్టమొదటగా రెండుగా చీలిపోయారంట. కొందరైనా ఇల్లు చేరుకోవచ్చునని యీ యెత్తు వేశారంట. ఒకపాయ యిటూ, యింకోపాయ అటూ పోయారంట. తానేమో యిసక తిన్నెల సీమలోకి చొచ్చుకొని పోయారంట. కుర్రాళ్ళను యెంటబెట్టుకొని తోడేలు వుత్తరం దిక్కు తరలి పోయాడంట. ఉత్తరంగా వుత్తరంగా పొలిమేరమీదుగా పోయాడంట."

"కెనడా సరిహద్దు మీదుగానా?"

"దాని మీదుగానో, లేకపోతే పౌడర్‌నది మీదుగానో తెలియదంట."

"తమ దగ్గరవున్న తుపాకులన్నిటినీ కట్టగట్టి తెచ్చియివ్వమని చెప్పు. అట్లాచేస్తే, తనజనానికి తిండిపెట్టుతామనికూడా చెప్పు" తుపాకులను లెక్కిస్తూ, "ముప్ఫయ్యేవున్నాయి. రివాల్వర్లు లేనేలేవు", అన్నాడు వెస్సెల్స్.

"ఉన్నవన్నీ యివేనేమో", నన్నాడు జాన్సన్.

"వాళ్ళదగ్గర రివాల్వర్లువుండి వుండాలి".

"ఇండియన్లకు రివాల్వర్లమీద మోజుతక్కువ".

"కావచ్చు, కాని వుండివుంటాయి. ఆడవాళ్ళను సోదాచేస్తేసరి."

"ఆడవాళ్ళనా ?" అన్నాడు జాన్సన్.

"ఏమయితే ? వీళ్ళు తెల్లవాళ్ళు కాదుగా ? ఇండియన్లుకనక ఫరవాలేదు".

జాన్సన్ సహించలేక, వెస్సెల్స్‌ను విడిచి వెనుకకు వెళ్ళిపోయాడు. వెస్సెల్స్ భుజాలెగురవేసి తుపాకులను తేరిపార చూచాడు. తానొక్కడే అధికారిగా వుండివుంటే, ఆడవాళ్లనుకూడా సోదాచేసివుండును. కాని జాన్సన్ వున్నంతకాలం యీ పప్పులు వుడకవు.

ఈ ఆలోచనకు స్వస్తిచెప్పి, తుపాకులమీద చీటీలంటించి మోపుకట్టమని వెస్సెల్స్ సైనికులకు త్తర్వు చేశాడు. సాయుధులైన గ స్త్రీల పర్యవేక్షణలో తిండి తింటున్న చెయిన్నీలకద్దకు నడిచిపోయాడు. వారి అవస్థ అతనికేమీ చలింప చేయలేదు. వారిప్రపంచమే వేరు, తనది వేరు. వారి బాధకూడ అతనికి బాహిరమైనది. గుంటలుపడిన బుగ్గలు, దిగబడిన కళ్లూగల యిండియన్ శిశువుకు కంటబడినప్పుడు వాళ్లు సహజంగా యిలాగేవుంటారనితప్ప వేరే ఆలోచన యేదీలేదు. తిండితిప్పలయిన వెంటనే వాళ్లను వేగన్లలోని కెక్కించమన్నాడు. బిడారు రాబిన్సన్ దుర్గానికి మంచులో బయలుదేరింది.

# స్వేచ్ఛ

## నవంబరు 1878 — జనవరి 1879

కార్ల్ షుర్జ్‌గారి కిదంతా ఒక్క చిటికెలో పని. "వాళ్ళు గెలిచారు - లేదా ఓటు దిన్నారు" అని ఒక్క కలంగీటు అతనిది సర్వం సమాప మన్నంతపని చేయగలదు. ఇక మిగిలిందంతా ప్రభుత్వ పరంగా సంతకం గెలికి పారవేయడమే. ప్రభుత్వమంటే మరేమిటో కాదు - చట్టం, వుత్తర్వు, రసీదు - యిదే ప్రభుత్వమంటేను. ఇంకా మాస్తే, సాయుధబలాలను సృష్టించడం, చిట్టి చిట్టి మనుషులను బ్రహ్మాండమయిన చదరంగం పలకమీద కదిలించడం, జనం ఓట్లు యిస్తున్నారు; జనం పేరులేకుండా సభలుగానీ, వాగ్వాదాలుగానీ, సమావేశాలుగానీ, మహాసభలుగానీ జరుగవు; కాబట్టే ప్రభుత్వం చట్టబద్ధమైనదనీ, ప్రజాతంత్ర సూత్రబద్ధమైనదనీ అనడం. అధ్యక్షుణ్ణీ, కాంగ్రెస్ అనబడే శాసనసభనూ ప్రజలు యెన్నుకొంటారు. అధ్యక్షుడు మంత్రివర్గాన్ని నియమిస్తాడు; కాని 'లాబీ' వర్గాలనబడే పలుకుబడి కలిగిన ముఠాలను యెవ్వరూ యెన్నుకోరు. అయితేనేమి, తలచుకోవాలేగాని 'లాబీ' వర్గాలు సాధించలేని కార్యముండదు. జనమేమో గ్రాంట్‌గారిని అధ్యక్షుడుగా యెన్నిక చేశారు. కాని ప్రభుత్వంలోని కుళ్ళుకంపు వారి నాసాపుటాలకు యెక్కలేదు. ప్రజలు, ప్రజలనబడేవారు యెక్కడవున్నారో యెవరికీ తెలియదు. ఎక్కడో వుండి వుంటారు. వారిలో కనీసం ఒకడితోనైనా కరస్పర్శ చేయకపోతే, ప్రజలనేవారున్నట్లుకూడ ప్రత్యక్ష సాక్ష్యమేదీ వుండదు. లేకపోవచ్చు. కానీ, ప్రభుత్వమనేది ఒక కళ. వట్టి కళమట్టుకే కాదు. అది ఒక శాస్త్రం. ప్రజలనబడేవారికి అంతుపట్టని చిత్రమైన వృత్తి.

తానే ప్రభుత్వమంటేను. తాను ఆంతరంగిక వ్యవహారశాఖాధిపతి, శాస్త్రవేత్త, వృత్తిజీవి, ఒకానొకప్పుడు గతమందు వీధులలో నిలిచి పోట్లాడినదిట్ట. ఇటీవలనే ఒక స్నేహితునితో తానిట్లాగన్నాడు: "వీధులలో బల్లలూ, కుర్చీలూ అవీ యివీ అడ్డంగా వేసి, వాటిని తత్కాలరక్షణకు వినియోగించి పోట్లాడడమనేది కుర్రతనపు అల్లరిపని. నేను దీనిని మరచిపోవాలని ప్రయత్నిస్తుంటే, పదేపదే యితరులు గుర్తుచేసి చికాకు పెట్టుతున్నారు." షుర్జ్ మెదడు యింకా వృద్ధిచెందలేదు.

"అల్పసంఖ్యాకవర్గాలుండడం సంకటహేతువు. అధికసంఖ్యాకవర్గాలున్నచోట అల్పసంఖ్యాక వర్గాలు తప్పనిసరి కాబట్టి ప్రజాతంత్రమనేది అర్థంపర్థంలేని గంద్రగోళం—"అనేంతవరకూ యింకా రాలేదు.

పట్టుబడిన చెయెన్నీలను తిరిగి దక్షిణానికి, ఓక్లహామాలోని ఇండియన్ ప్రదేశానికి, వాళ్ళ క్రొన్నెత్తుటిబాట యేర్పడిన వేలాది మైళ్ళ ప్రదేశంమీదుగా తీసికొనిరావలసినదిగా వుత్తర్వువ్రాసి, క్రింద సంతకం చేస్తున్నాడు. "లక్షోపలక్షల జనులున్న యీదేశంలో వీళ్లు మహాఅంటే నూటనలభైతొమ్మిదిమంది మట్టుకే"నని అనుకొని వుంటాడు. లేకపోతే, "అయిందేదో అయింది. ఇలాంటిది ముందు ముందు జరుగకూడదు" అని అయినా భావించివుంటాడు. కాని భావికాల మందు జరుగబోయేదానిని, యింతకంటె వుపద్రవకరమైన దానిని, వెయ్యిమైళ్ళ పచ్చికబయళ్ళ సీమమీదుగా పోషించినమున్నూర్గురు అనాగరికులైన ఆశ్వికులకుమారుగా, నల్లబారి అశ్రుసిక్తమైన మహా భూఖండం మీదుగా శత లక్షాధికులు పూనబోయే మహాప్రస్థానాన్ని కార్లషుర్జ కొంచెం కొంచెంగా, లీలలీలగా పనిబట్టగలిగాడు.

వాషింగ్టన్ నగరంనుండి డిసెంబరు మాసాంతంలో రాబిన్సన్ దుర్గానిక సందేశమొకటి వచ్చింది. దుర్గాధిపతి కెప్టన్ వెస్సెల్స్. పశ్చిమ సేనా ప్రధాన కార్యాలయమువారి పద్ధతి క్షణక్షణం మార్పుచెందేది. ఈసారి వచ్చిన మార్పేమిటంటే మూడవ ఆశ్వికదళాన్ని చీలగొట్టి, కల్నల్ కార్లటన్ ఆధిపత్యానగల ఎక్కువభాగాన్ని విడదీసి, దుర్గంలో రెండు నిండుదళాలనూ, ఒక దళంలో కొంతభాగాన్ని కెప్టన్ వెస్సెల్స్ ఆధిపత్యాన అట్టేపెట్టారు. కార్లటన్‌తోబాటు కెప్టన్ జాన్సన్‌కూడ వెళ్ళిపోవలసి వచ్చింది. ఇప్పుడు వెస్సెల్స్ అందరికంటె వున్నతాధికారి అయ్యాడు. ఆ తర్వాతస్థానం కెప్టెన్ పి. డి. వ్రూమ్‌కుదక్కింది. నిండుగాలేని దళానికి లెఫ్టినెంట్ జార్జ్ బాక్స్‌టర్ అధిపతికాగా, వెస్సెల్స దళపు సైనిక విధులను పర్యవేక్షించడానికి లెఫ్టినెంట్ ఎల్లెన్ నియమితుడైనాడు.

తనకు తలవని తలంపుగా వచ్చిన వున్నతపదవిని చూచుకొని వెస్సెల్స లోలోపల యెంతో మురిసిపోయాడు. తానిప్పుడు యీదుర్గంలో పరమాధికారి. ఈపదవి తాత్కాలికమే కావచ్చు. కాని ముందుముందు మహాదళాధిపతి కాగల అవకాశముంటుంది. పదవీవ్యామోహం వెస్సెల్స నరనరంలో జీర్ణించినగుణం. తన మీదతనకు యెనలేని నమ్మకమున్నది. తననుగురించి సందేహమేమీ లేదు. ముందు ముందు మంచిరోజులువస్తే, సందేహ సంశయాలన్నింటినీ నిశ్శేషంగా విధ్వంసం చేయ వీలవుతుంది. అతనిది క్రమబద్ధమైన ప్రపంచం. సైన్యంలోవుంటే ప్రపంచాన్ని మరింత క్రమబద్ధంచేయ వీలుంటుంది. కనుక అతనికి సైన్యంమీద ఎంతో యిష్టం. అతనికి కోపం కలిగించి చిందులు త్రొక్కించి శివమెత్తించే విషయాలు అత్యంతం అల్పమైనవి. సిపాయి దిరుసు సరిగాలేకుంటేనో, బత్తాను వ్రేలాడుతూ

వుంటేనో, కత్తి అంచుమీద తుప్పుపట్టినగుర్తు యేదైనా వుంటేనో, శుభ్రవస్త్రాలు ధరించి కవాతుచేస్తున్నప్పుడు మురికిమచ్చ కనుపిస్తేనో అతను ఆగ్రహోదగ్రుడవుతాడు. ఆలోచనాశక్తి అతనిలో పూజ్యముయినందు చేత, లేనివాటినికోరడు, వున్నవి బాగా వుండాలను కొంటాడు.

అతని సూచనను పురస్కరించుకొనే, కల్నల్ కార్లటన్‌గారు నూటనలభైతొమ్మండుగురు చెయిన్నీలను ఒక పాతబడిన కొయ్య కట్టడంలో కుక్కి కూరిపెట్టినాడు. ఆ కట్టడం పాడుబడింది. ఎలుకల పీడ యెక్కువ. ఆరడుగుల పొడవు. ఒకే ఒక్క యినుప కుంపటి, అందులోనూ శిథిలప్రాయమైనది, ఎందరిని వెచ్చపరచగలదు? ద్వేషబుద్ధితో చేసిన పనికాదిది. ఈ కట్టడంకంటె మంచిచోటు దొరకలేదు. అదిన్నీ గాక, యీ కట్టడాన్నయితే సులువుగా కాపలా కాయవచ్చును. రాబిన్సన్‌దుర్గం బలువైనది కాదు. శత్రువులు చొరకుండా దట్టంగా కొయ్యలు నాటి రక్షణార్థమై దడియేదీ కట్టబడలేదు. కొండమీదవుందీ దుర్గం. దీనికి దిగువవైపు ఒక యేరు పారుతుంది. చుట్టూ ఎటు చూచినా చిక్కగా చెట్లూ, పుట్టలూ బలంగా వున్నాయి. పేరుకుమట్టుకే దుర్గం. కానీ ఇక్కడ సైనికులుండే సాలలూ, మందుగుండు గిడ్డంగులూ కలగాపులగంగా గుమికూడివున్నాయి తప్ప తక్కిన రక్షణ యేర్పాట్లు తుపాకి గుళ్లు తగులకుండా త్రవ్విన గుంటలు, ఫిరంగులను నిలిపేందుకు కూర్చిన తిన్నెలు, తుపాకికన్నాలున్న కొయ్యసాలతప్ప ఎక్కువేమీ లేవు. ఈ ప్రదేశంలో ఇండియన్లకు కొద్దిపాటి సంచారస్వేచ్ఛ యిచ్చినా, సర్వకాల సర్వావస్థలలో చాలమంది సైనికులు కాపు కాయవలసి వచ్చేది. ఇప్పుడు వాళ్లకు యిచ్చిన కొయ్యయింటి విషయంవేరు. సాల వాకిలివద్ద ఒక కాపలామనిషి వుంటేచాలు.

దళంలో యెక్కువ భాగాన్ని వెంటబెట్టుకొని కల్నల్ కార్లటన్ నిష్క్రమించిన తర్వాతకూడ, వెస్సెల్స్ ధోరణిలో మార్పురాలేదు. ఉద్దేశపూర్వకమైన క్రౌర్యానికిగాని, జాలికిగాని అతనిలో తావులేదు. ఇండియన్లు ఇండియన్లే. ప్రస్తుతం వాళ్లనింకేమీ చేయవీలులేదు కాబట్టి తాను వాళ్ళమీద కాపు వుంచాడు. వాళ్ళున్న కొయ్యసాలలో చలి పరమాధికారి. ఉన్న యినుకకుంపటి వూడిపోయే స్థితికి వచ్చింది. అది వెలువరించే కొద్దిపాటి వెచ్చన ఆరడుగులు కాదుకదా, ఆరుఅంగుళాల మేరకుకూడ వ్యాపించలేదు. శీతకాలం గడిచేకొద్దికీ శీతోష్ణస్థితి జీరో మట్టానికి తగ్గిపోయింది. ఎప్పుడోగాని జీరోమట్టం కంటె యెక్కువ కావడం అరుదుకాగా, మామూలుగా ఆ మట్టానికింకా క్రిందికి దిగిపోసాగింది. సైన్యస్థావరంలో అదనపు కుంపట్లులేవు. ఎదురుతిరిగిన ఆటవిక పితూరీదారులను వెచ్చచేయడానికి అదనపు కుంపట్లు సరఫరా చేయవలసినదిగా పైవారికి మనవి పంపుకోవడమెందు కనుకొన్నాడు కెప్టన్ వెస్సెల్స్.

భాష పెద్ద అడ్డుఅయింది. ఇండియన్లబాధ మూగబాధ. మొండికిపడి చావు కెదురుతిరిగి పట్టుబట్టి పశుశక్తితో అమానుష సహిష్ణుతతో ప్రాణాలను యెగసన తోస్తున్నారు. చిరుగు పేలికలను కప్పుకొని చలిని ఆపజూస్తున్నారు. ఒకవేళ గట్టి బట్టలివ్వండని వెస్సెల్స్‌ను అడిగినా, అతనులేవని చెప్పివుండును. సైనికులకోరకు కొత్త దిరుసులు వస్తున్నమాట నిజమేగాని వీటిని ఇండియన్లకు యివ్వడమా? సైనికు లేమయ్యేటట్లు? వస్త్రములు తెచ్చి అమ్ముతున్నమాట కూడ నిజమే కాని, ప్రభుత్వ ధనాన్ని ఇండియన్ల గుడ్డలకు ఖర్చుచేసే అధికారం తన కెక్కడిది? ఓగల్లాలా అంత దూరప్రదేశంనుండి వాగన్లమీదనో, సామాను గుర్రంమీదనో మోపించి తేవలసివచ్చిన తిండి చాలీచాలదు. సైనికులే అర్ధాకలితో సతమతమవుతున్నది. మరి, యిండియన్లకు అడుగుకూడ మిగలదు.

శీతకాలపు బండబ్రతుకు దయాదాక్షిణ్యాలకు తావివ్వదు. ఇతర సైనికోద్యోగులందరికంటె, వెస్సెల్స్ కాస్తకు కాస్త తట్టుకొని నిలువబడగలిగినాడు. మునుపటికీ, యిప్పటికీ అతనిలో చెప్పుకోదగిన మార్పేమీరాలేదు. అతనెప్పుడూ యేదోఒకపనిలో తలదూర్చి యితర వ్యాపకాల కవకాశమేలేనంత పనిలో సతమత మవుతూంటాడు. ఒకటా, రెండా, వందా చిల్లరపనులు. పర్యవేక్షణ దనడే, రవాణా విషయాలు, సరఫరాసంగతులు, రిపేర్లు, కవాతు, గుర్రాల కసరత్తు, అంతాపనే! ఇంతపనికూడ అతనికొక లెక్కలోని సంగతి కాదు. తానొకమర. ఎంత ధాన్యరాశినైనా పిండిచేయగలదు. ఇది తన మామూలుపని, వుద్యోగధర్మం, తప్పించుకోలేనివిధి. ఇది తన కిష్టవ్యవహారం. పకడ్బందుగా క్రమబద్ధమై, గతితప్పని యీ శుద్ధజీవనం అతని ప్రపంచాన్ని సైన్యపద్ధతిలో పెట్టి బంధించింది; దానికి హద్దులనూ, ఆకృతినీ ప్రసాదించింది; యిటువంటి క్రమబద్ధమైన బ్రతుకే వుండకపోతే, మరియిక యీ సుగుణాలేమీ వుండవు.

వెస్సెల్స్ధోరణి యిది. ఇక తతిమ్మా వుద్యోగులది దీనికి పూర్తిగా విరుద్ధమైనది. క్షణం నిలువని పగళ్ళు, ఎంతకూ తెల్లవారని రాత్రులూ ఒకదానివెనుక మరొకటి, కాసింత మార్పయినా లేకుండా అనుక్రమిస్తున్నవి. రాబిన్సన్ దుర్గంలో స్త్రీలులేరు, సంగీతంలేదు, పుస్తకాలులేవు; పోకర్ కానీ, విస్ట్ఆటలు గానీతప్ప మరే యితర వినోదాలు లేవు. సైనికులలో చిరచిరలు, కొరకొరలు నానాటికీ యెక్కువవుతున్నాయి. చిన్నచిన్న విషయాలమీద వున్నతోద్యోగులు కుపితులై వాగ్వాదాలు పెంచుకుంటున్నారు. ఒకొక్కసారి కోపం గట్లుతెగి బయల్పడితే, వేరొకప్పుడు దినమంతా, వారాలపర్యంతమూ పక్కవాడితో మాట్లాడనొల్లని మౌనవ్రతాలు పూనడము, గుబుళ్ళమారి చేష్టలు పెంపొందడమూ, చివరకు చేయిచేయి కలపడమూ నిత్యవ్యవహారాలైనవి. వీటన్నింటినీ వెస్సెల్స్ లెక్కించలేదు. విసిరివేసినట్టు ఒంటిగావున్న సైన్యస్థావరాలలో ద్వేషరోషాలు ఒక్కపెట్టున హత్యకు దారితీయడం అతను పూర్వం చూచివున్నాడు.

క్రమబద్ధమైన తన పెత్తనాన్ని యివి భిన్నాభిన్నం చేయగలవని తా నెరుగును. కనుకనే యీ కొట్లాటలు, కోపతాపాలంటే అతనికి వచ్చినంతభయం. దుర్గం దాటి అడవిలో వేడుకలు జరపడానికి పో సాహసించిన వుద్యోగులను వాడలు గొట్టినాడు, అంతకంటె యెక్కువ వూహించలేడు. భోజనాలదగ్గర తానూ మాట్లాడడు, మాట్లాడుతున్నవారి ధోరణినీ కనిపెట్టడు.

ఇది యిట్లావుంది. అక్కడ యిండియన్లు నశిస్తున్నారు. అమెరికాలోని మహాశాద్వల తృణసముద్రాలలో ఒకనాడు విచ్చలవిడిగా తిరుగుబోతులై స్వేచ్ఛగా మసలిన అతులితాత్మ గౌరవపరులైన యిండియన్లీనాడు పరిదీనులై నిస్సహాయులై చావును సమీపిస్తున్నారు.

ఈ శీతకాలపు బందిబ్రతుకు మొద్దుతనాన్ని బ్రద్దలు కొట్టగలిగిన గొప్ప సంఘటన వాషింగ్టన్ నగరంనుండి వచ్చిన సందేశం. పనీపాటలేక బండబారిన వారికి క్రియోత్సాహాన్ని కల్పించింది. భోజనశాలలో దీని నందరికీ వినిపించాడు వెస్సెల్స్.

"వాళ్ళు తిరిగి వెళ్ళిపోబోతున్నారు" అన్నాడు.

"వెనక్కా?" సంభాషణ ఆగిపోయింది. కెప్టన్‌గారి ప్రకటనను విని అందరూ కళ్ళెత్తి చూచారు.

"మొండి పోటరులా?" అని ఆశ్చర్యం ప్రకటించా రొకరు.

"తిప్పిపంపుతారని నే ననుకొనే అనుకొన్నాను" అన్నాడు ఎల్లెన్. "ఇంత కంటె అవమానంలేదు."

"చాలాదూరం!" అని యింకొకరు యీలవేశారు. శీతకాలమంటేనూ, దుర్గమంటేనూ, శవాలవూరేగింపువంటి దినాలంటేనూ అందరికీ తల బట్టకట్టింది. చెయిన్నీలకు కాపుగా తిరిగి ఇండియన్ ప్రదేశానికి, క్షేమైన యెండలకు వెళ్ళగలిగితే బాగుంటుందని అందరూ ఆశించసాగారు.

"ఎవరెవరు పోవాలి? ఎప్పుడు ప్రయాణం?"

వెస్సెల్స్ భుజాలెగురవేశాడు. ఎప్పుడైనా, ఎవ్వరైనా అతనికి వచ్చేదేమీలేదు, పోయేదీలేదు. తానుమట్టుకు రాబిన్సన్ దుర్గంలోనేవుండి, చలికాలాన్ని సాగనంపాలి. తప్పదు. తాను దుర్గాధిపతి. వెలితిపడివున్న దళాన్ని వెంటబెట్టుకొని బ్రూమ్‌కానీ, బాక్స్టరైనాగానీ, ఇండియన్లను తోడుకొని పోవాలి. వాళ్ళు వెళ్ళిపోతే, గొడవలన్నీ విరగడైపోతాయి.

"ఈ వారమే పోవాలేమో నన్నాడు వెస్సెల్స్".

"వాళ్ళు ససేమిరా ఒప్పుకోరు."

"ఏమిటీ?"

"గొడవ చేస్తారంటావా?"

"పోవాలి," అన్నాడు వెస్సెల్స్. "మరి యేంచేస్తారు కనక ? వచ్చినట్లు పోవాలి."

చెయిన్నీలు చెరపెట్టబడిన వృత్తాంతాన్ని విని, తాను అనువాదకుడుగా నౌకరీ సంపాదించవచ్చుననే ఆశపెట్టుకొని హైన్‌రిడ్జ్‌నుంచి వచ్చాడు జేమ్సు రౌలాండ్ అనేమనిషి. అతనితల్లి చెయిన్నీ ఇండియన్ మనిషి. తండ్రి తెల్లవాడు సగం జీతమిచ్చి తిండీతిప్పలు చూచేపద్ధతిమీద కల్నల్ కార్ల్టన్ యితనిని పనికి కుదిర్చాడు. ఇప్పుడు అవసరం వచ్చింది కాబట్టి వెస్సెల్స్ అతనిని పిలిపించి సాలకువెళ్ళి బండకత్తినీ, యితర కులపెద్దలనూ భేటీకి పిలుచుకు రమ్మని చెప్పి పంపాడు. వ్రూమ్‌నూ, బాక్స్టరునూ తనకు తోడుగా రమ్మన్నాడు. ముగ్గురూ కలిసి, ఆఫీసులో కూర్చుని చుట్టలు త్రాగుతూ, కులపెద్దల రాకకొరకు యెదురు చూడసాగారు.

ఆఫీసు కిటికీనుండి సైనికుల కవాతు స్థలాన్ని, ఆ మీదుగా యిండియన్లు వుంటున్న పొడవాటి కొయ్య కట్టడాన్ని బాగా చూడవచ్చు. ఇంకా పైన, కురచబారిన పైన్‌చెట్లు పచ్చగా కొండలను శాఖలతో కప్పివేస్తున్నాయి. ఆకాశం మేఘావృతమై వుంది. సూర్యుడు వుండీలేడు. దారీతెన్నూలేని డకోటా ప్రాంతాలలో గాలివాన సన్నద్ధమవుతూ వున్నట్లుంది "మళ్ళీ మంచుపడుతుంది" అన్నాడు వ్రూమ్.

"పడేటట్లే వుంది చూస్తుంటే," అన్నాడు. వెస్సెల్స్, చుట్ట కొసకేసి పరీక్షగా చూస్తూ.

"అయితే మనం యెటూ కదల వీలుండదేమో ?"

వెస్సెల్స్ భుజా లెగురవేశాడు. "హవానా చుట్ట అంటే చాలా యిష్టం నాకు," అన్నాడు యింకా దానిని పరీక్షించి చూస్తూ.

"నేను వీళ్ళతోబాటు పోవలసివస్తే, మీకు మంచి చుట్టలు పంపుతాను".

"బాక్స్టరును పంపుదా మనుకొంటున్నానే," అన్నాడు వెస్సెల్స్. వ్రూమ్‌లేచి కిటికీవద్దకు పోయాడు. మహాకాయుడు, ఎఱ్ఱటివాడు యీవ్రూమ్.

కిటికీ అద్దాన్ని చేతితో తుడువసాగాడు. ఎఱ్ఱటి మాంసంతోటీ, తీగెల వంటి పసిమి వెండ్రుకలతోటీ చేయబడిన చాపవంటిది ఆ చేయి. అద్దాన్ని శుద్ధ పరిచిచూచి, "అదుగో, వస్తున్నారు," అన్నాడు వెస్సెల్స్‌తో.

"అబ్బ, ఎంతదూరం—", అన్నాడు బాక్స్టర్. అతను కుఱ్ఱవాడు, పలచటిమనిషి. తెల్లటి దుప్పటివంటి వెయ్యిమైళ్ళ దూరాన్ని ఎదురుగా కిటికీ గుండా చూస్తున్నట్లుంది అతనివాలకం.

"ముగ్గురు", అన్నాడు. "ఆ ముసలిపీనుగ యింకా యెట్లా బ్రతికివున్నాడో గదా !"

"ఇండియన్లు సంకల్పసిద్ధులు. ఇష్టమున్నంతకాలం బ్రతుకుతారు."

వెస్సెల్స్‌కు యీ సంభాషణ యేమీ రుచించలేదు. మంచు మీదుగా రౌలాండ్ వెంటవస్తున్న కులపెద్దలవైపొక్కసారి చూచి, తిరిగీ తన చుట్టను గురించి దీర్ఘాలోచన చేయసాగాడు.

"మనమైతే యీచలికి నీలుక్కొనిపోయివుండుం.' కాని వాళ్ళకిది లెక్కలేదు," అన్నాడు బాక్స్టర్. ముసలి కులపెద్ద కాళ్ళకు మొక్కాసిన్ జోళ్ళు ధరించాడు. వాళ్ళలో ఒకనికి పాదరక్షలేలేవు. "పశువులు", అన్నాడు బాక్స్టర్.

"నువ్వు త్వరగా ప్రయాణంకావడం మంచిది. మళ్లీ మంచు ముమ్మరం మొదలైతే, ప్రాణాలు తినేస్తుంది", అన్నాడు వెస్సెల్స్.

క్రూమ్ యిటుమళ్ళి, చల్లబారిన చేతులను రుద్దుకొంటూ, కుంపటీవద్దకు వచ్చాడు. కాలితో బాక్స్టర్ తలుపునొక్క త్రోపు త్రోశాడు. కుంపటిలో మరొక కట్టెవేశాడు. వెస్సెల్స్ తీరుబడిగా చుట్టపొగ పీల్చడంలో లీనమైపోయి వున్నాడు. ఇంతలో రౌలాండ్ తలుపు తట్టగా, "రండి — లోపలికి వచ్చేయండి" అని వెస్సెల్స్ అన్నాడు. బాక్స్టర్ తలుపు తీయగానే, బొచ్చుతలపాగా చేతిలో పట్టుకొని రౌలాండ్ మొదట ప్రవేశించాడు. అతని వెంటనే కులపెద్దలు ముగ్గురూ గుమికూడి వచ్చారు. గదిలోని వెచ్చనతగిలిన వెంటనే వెనుదగ్గారు. తలలు కొంచెం వంచుకొని వున్నారు. మిగతి యిద్దరికంటె ముసలివాడొక అడుగుముందుకు వేసి, చేతులు కట్టుకొని, భుజాలమీద వేసుకొన్న కంబళిముక్కను గట్టిగా పట్టుకొని, నిలుచున్నాడు. మిగతా యిద్దరికళ్ళు అతనిమీదనే నిలిచివున్నవి. వీరిని వెంటబెట్టుకొని వచ్చిన కాపలా మనుషులిద్దరూ బయట వుండిపోయారు.

కాలిమీద కాలువేసికొని, చుట్టపొగ గదిలో అంతా వ్యాపిస్తుంటే, వెస్సెల్స్ పాతబడిన తిరుగుడు కుర్చీలో కూర్చొని వున్నాడు. కులపెద్దలు ప్రవేశించినతోడనే, కుంపటినిచూపి "పోయి, చలికాచుకొండి" అని రౌలాండుతో "చలికాచుకొమ్మని చెప్పు" అన్నాడు.

వాళ్ళు మురికిపడి వున్నారు. ఆవిషయం వాళ్ళెరుగదురుకూడా. స్వతహాగా శుద్ధమైనజాతి కాబట్టి లోలోపల తమ మురికితనం గురించి తాము సంకటపడుతూ వున్నారు. చిరుగులలోనే గౌరవాన్ని నిల్పుకొని వున్నారు. దేహాలు గజగజలాడుతున్నాగాని, కుంపటి దగ్గరకువెళ్ళి చలిగాచుకోవడం పరువు తక్కువపని అనిపించింది. గది నడుమ కాలు మార్చి కాలిమీద నిలుచుంటున్నారు. వెస్సెల్స్ లేచి చుట్టలివ్వబోయాడు. వద్దన్నారు. "ఇది భేటీ కాబట్టి కరస్పర్శ చేసుకోవాలి. అందరితోటీ కరస్పర్శ చేయాలి తెలిసిందా ?" అన్నాడు వెస్సెల్స్.

రౌలాండ్ అనువదించాడు. వృద్ధుడి నేత్రాలు యింకా అశ్రుపూర్ణాలై వున్నాయి. సైనికోద్యోగులతో గట్టిగాకరస్పర్శ చేస్తుంటే ఊగిబిరిగిపోతున్నాడు. మిగత యిండియన్ నాయకు లిద్దరూ కదలనేలేదు, ముసలివానిమీద లగ్నాలై వున్న చూపులను త్రిప్పనేలేదు. వాళ్ళకు కంబళ్ళులేవు. చిరుగులుపడి నామ

మాత్రావశిష్టాలైవున్న జింకతోలు చొక్కాలనుండి వరాబులనుండి దాపరికం లేకుండా బక్కచిక్కినబళ్ళు వాళ్ళది కనిపిస్తున్నది.

వెస్సెల్స్ తిరిగి యథాస్థానాన వుపవిష్టుడై, చుట్టను చేతపుచ్చుకొని సాలోచనుడై పరికింపసాగినాడు. ఇండియన్లు వేచివున్నారు. కుర్చీ నొకచుట్టు గిర్రున త్రిప్పి వెస్సెల్స్ తన చూపులను యింటి కప్పుమీద లగ్నం చేశాడు ఎట్లా మొదలెట్టాలో తెలియలేదు. చెయిన్నీ పెద్దల సాన్నిధ్యం చివరకు అతనిని కూడ సంచలింపజేసింది. చిత్రవర్ణశోభితాలై, అనాగరక దర్పస్ఫోరకాలైన రకరకాల హంగులతో, యీకెల కుళ్ళాయిలతో, చేత డాలుతో భల్లాలతో, మహోజవనాశ్వాలనెక్కి బయళ్ళసీమలో చెయిన్నీలు నిరాటంకంగా తిరిగిన పాత రోజులు వెస్సెల్స్ కళ్ళకు కట్టసాగినవి. పోయినదానిని గురించి చింతిస్తున్నాడని కాదు, నేటికీ నాటికీ యెంత అంతరం, యెంత అధఃపతనం అనుకొన్నాడు. ఇంకా కప్పును కళ్ళప్పగించిచూస్తూ, "మనం నేస్తులమవుతాం - ఇకమీదట నేస్తం కడుదాం"అన్నాడు. తనమాటలు విని తన చెవులే నమ్మలేకపోయాయి. కాని తిరిగి ఆ మాటలనే వల్లించాడు. రొలాండ్ అనువదించాడు.

వృద్ధుని ప్రత్యుత్తరం విషాదమయమైవుంది. రొలాండ్ అనువదించాడు: "మీరు యిప్పుడన్నదేనంత తాను కోరేదికూడా. నేస్తమే కావాలంట. తాను ముసలాడంట. తనవైపు ఒకసూపు జూస్తేనే తానెందుకు నేస్తం గోరుతున్నాడో యిట్టే తెలిసిపోతుందట. తెల్లోళ్ళతో పోట్లాడటానికి కాదంట తన మానులను లేవదీసుకొనివస్తు! ఇంటికెళ్ళిపోయి ముప్పూతిప్పలేవీ లేకుండా బతకాలనేనంట."

"అవును" అన్నాడు వెస్సెల్స్. బాక్స్టనర్ పొగపీలుస్తున్నాడు. తన కుర్రతనం, పుష్టీ పోడిమీ, ఒంటివన్నెలనుచూచి అతనికెంతో పొగరు. ఫ్రూమ్ అరచేతికెంపును జాగ్రత్తగా పరీక్షించి చూచుకొంటున్నాడు.

"అవును. మనం కరస్పర్శం చేశాం. భేటీ జరుపుతున్నాం. మనకిప్పుడు తగాదాలేదు. నేస్తులమయ్యాం" అన్నాడు వెస్సెల్స్. రొలాండ్వైపు తిరిగి, "వాళ్ళతో చెప్పు—" అని యేదో మొదలెట్టబోయి, యింతలో కులపెద్దల వైపుకు మళ్ళి నేరుగా వారికి చెప్పసాగినాడు. "మీరుగానీ, మీ స్త్రీలుగానీ, పిల్లలుగానీ యిదంతా మంచిదికాదు. పారిపోతే యేమిజరుగుతుందో యిప్పుడు మీకు తెలిసివచ్చింది. చట్టమనేది ఒకటివుంది. మీరు చట్టానికి తల ఒగ్గాలి. అది వాషింగ్టన్నుంచి తయారై వస్తుంది. అక్కడ తెల్లపెద్ద నాయనగారుంటారు. ఆయననే అధ్యక్షు డంటాము. అతను మాట్లాడిన మాటలే చట్టాలంటే. మీ రెక్కడినుంచి పారిపోయి వచ్చేశారో అక్కడికి తిరిగిపొమ్మని ఆయన సెలవిచ్చారు. మీరు తిరిగి ఇండియన్ ప్రదేశానికి వెళ్ళి, మీకు కేటాయించిన జాగాలో హాయిగా నిరుపద్రవంగా జీవించాలి. మీరు నడవనక్కరలేదు. వేగన్ల కెక్కించి తీసికొనిపోతాము. మీకు సైనికులు తోడుగా వస్తారు, రక్షిస్తారు.

దారిభత్యాలు, తిండితిప్పలు గురించి భయపడకండి. మేమే మీకు అన్నివసతులూ యేర్పాటు చేస్తాము. మీలో యెవ్వరినీ అరెస్టు చేయము. కాని మీరు ఇండియన్ ప్రదేశానికి పోయిన తర్వాత, మీలో ఎవరెవరైతే నేరాలు చేశారో వాళ్లను స్వయంగా ఏజంటుగారే అరెస్టు చేస్తారు. న్యాయంగా విచారించి దోషులని తేలిన తర్వాతనే శిక్షలు విధిస్తారు."

క్రూమ్‌కు యీ చివరిమాటలు నచ్చలేదు. వెస్సెల్స్‌వైపు హెచ్చరింపుగా చూశాడు. కాని వెస్సెల్స్‌కు సూక్ష్మాలు తెలియవు. తన మనసుకు వచ్చిన విషయాలను దాపరికం లేకుండా తెలియజేశాడు. అయినా, యిండియన్లు కోరలుతీసిన నాగులుకదా, యీ నిర్ణయాన్ని ఎట్లా మార్చగలరు? చుట్టపొగను బాగాపీల్చి, రొలాండ్ అనువాదాన్ని వింటున్నాడు. ఇది సంభాషణ అనిగానీ, చెయిన్నీ భాష చిత్రమైనదనిగానీ అతని బుర్రకెక్కనే యెక్కలేదు. కుక్కమొరగడానికీ దీనికీ పెద్దతేడాయేలేదు అతని దృష్టిలో. పరాయి భాషలంటే ఎందుకో చెప్పలేని నిరసన. తన పురిటి గడ్డమీదనే తనదికాక వేరొకభాష మాట్లాడ్డమంటే మరీకోపం. ఇండియన్లు నడుమవచ్చిన పోకిరిమూక అనే అభిప్రాయం అతని మనస్సులో యేమూలనో వుంది. ఎక్కడినుంచో వచ్చారిక్కడికి. ఈ నేల వాళ్ళ అబ్బసొత్తుగాదు.

"వాళ్ళు దిగులుపడుతున్నారు," అన్నాడు రొలాండ్.

"నాకు అదేమీ అక్కర్లేదు వాళ్లేమన్నారో చెప్పు."

"ఉత్తినే తిరిగి పోవడమయితే; చాల కష్టపడవలసి వుంటుందని చెబుతున్నారు. గుడ్డపాతలు లేవంట. ఈ చలిలో చిరుగులు కప్పుకొని అంతదూరం యెట్లా పోవడం, అంటున్నాడు ముసలాడు. పనివాళ్ళు కొరడు గట్టుకొని పోతారట."

వెస్సెల్స్ భుజా లెగురవేశాడు.

"దక్షిణాన యేముంది తమకు? పస్తులూ, జ్వరాలూ వున్నవాళ్ళ వుసురు తీస్తాయట: భయంగా వుందంట - కొద్దిమంది జనంమట్టుకే ప్రాణాలు నిలదొక్కుకొని వున్నారంట. వాళ్ళుకూడా చచ్చిపోతే, కులం కూలిపోతుందంట."

"తిరిగి వెళ్ళక తప్పదు", అన్నాడు వెస్సెల్స్.

వృద్ధనాయకుడు నిస్సహాయతా సూచకంగా వెస్సెల్స్‌ను దిగాలుపడి చూచాడు. అనువాదకుడు సరిగా పనికిరాలేదు. దాట వీలులేనంత బ్రహ్మాండమైన స్థలావకాశం అనువాదంలో లోపించింది. ఈ విశాలమైన ఖాళీస్థలాన్ని తట్టుకొంటూ తడువుకొంటూ భర్తీచేయడానికి వృద్ధుడు బ్రహ్మప్రయత్నంచేశారు. కాని ఫలితంలేకపోయేసరికి, తనఅనుచరుల ఆశ్రయానికి తిరోగమించాడు. తమలో తాము గొంతుకలు తగ్గించి మాట్లాడుకొన్నారు. అందరిలోనూ పొడగరియైన వాడు ముసలివాని భుజాన్ని నెమ్మదిగా తట్టాడు. వృద్ధుడు తిరిగి సాశ్రు

నేత్రుడైనాడు. నిర్విణ్ణుడై దిక్కు తెలియక తిరిగి రౌలాండ్‌తో నిస్పృహతో మాట్లాడినాడు.

"తాము చచ్చిపోవాలనా అధ్యక్షుడి కోరిక ?"

వెస్సెల్స్‌కు ఈ నాటకపు అల్లరిచిల్లరి ధోరణి చిర్రెక్కించింది. గభీల్మని లేచి గదిలో యిటూ అటూ చర్రున తిరిగి, చుట్టను యిటూఅటూ వూపి నిలుపుతూ, "వెళ్ళిపోయి తీరాలి-అంతే. వాళ్ళకది సరిగ్గా తెలియచెప్పు" అన్నాడు.

"తిరిగిపోరంట."

"ఏమన్నావ్ ? పోరా ? పోరేం ?"

"లాభంలేదు. తమ సొంతనేల తమ పురిటిగడ్డ యిక్కడికి యిన్నూరు మైళ్ళలోనే వుంది. దానిని చేరుకోలేకపోతే, యిక్కడే వుండి చావనైనా చస్తారు. ఎప్పుడో చచ్చిపోయారు. సొంత యింటినుంచి సొంతసీమ నుంచి దూరమైనప్పుడే ప్రతిమనిషీ చచ్చిపోయినవాళ్ళలో జమ. బందిఖానాలో పడినప్పుడే అతని చావు మొదలవుతుంది. తమతో భేటీ జరిపినందుకు మీ మేలు మరవలేరంట. కానైతే అధ్యక్షునికి తమందరి చావే కావలసివస్తే, వున్నపళంగా యిక్కడే యావన్మందీ చచ్చిపోతారంట."

"వీల్లేదు చచ్చినట్టు తిరిగిపోవాలి" అన్నాడు వెస్సెల్స్ మొండిగా. "కొద్దిరోజుల్లో అంతా తయారవుతుంది. అప్పుడిక పోకతప్పదు."

సంభాషణ పెరిగింది. రెండుపక్షాల నడుమ చిక్కిన రౌలాండ్ యిరుకున పడి తెన్ను తెలియక దిగ్భ్రమచెందిన శిశువువలె, కొట్టుమిట్టాడినాడు. తిరిగితిరిగి మొదటికేవచ్చే యీ మాటలలో పసలోపించింది. వెస్సెల్స్‌కూ, యిండియన్ కులపెద్దలకూ నడుమ శతాబ్దాల అంతరముంది. శతాబ్దాల మొరియకీవైపున వున్న యిండియన్ కులపెద్దలు ఆకృతిలేని చాయలవంటివాళ్ళు.

వెస్సెల్స్ తిరిగీ కుర్చీలో కూలబడ్డాడు. చుట్టను వూపివూపి నిలుపుతూ, రౌలాండ్ వంకతిరిగి, "ఉత్తరువంటే, వుత్తర్వే, చట్టమంటే చట్టమే, యెదురుతిరుగ వీల్లేదు అనిచెప్పు. దక్షిణానికి పోవడానికి యిష్టపడినట్లయితే, అంతా సవ్యంగా వుంటుందనీ, నేస్తులుగా వుండవచ్చుననీ చెప్పు. అంతవరకూ, తిండిగాని నీళ్ళుగాని ఆపుచేస్తాననీ చెప్పు, యేమనుకొన్నారో యేనంటే," అన్నాడు.

రౌలాండ్ చెప్పిన పనిచేశాడు. కులపెద్దల ముఖాలలో కొంచెమయినా తొట్రుపాటు కనిపించలేదు.

"సాలకు తీసుకొనిపో, వీళ్ళను అన్నాడు వెస్సెల్స్."

వాళ్ళు వెళ్ళిపోయిన తర్వాత, "కానైతే వాళ్లను ఒప్పించి వుందును," అన్నాడు బాక్స్టర్.

"మాటలకేం కోటలు దాటుతై. వెయ్యిమైళ్ళంటే సామాన్యమా?", అన్నాడు వెస్సెల్స్.

"నిజమే మీరన్నది. కాని పస్తులుపెట్టితే వ్యవహారం ముదిరిపోతుండేమో"నని సందేహం వెలిబుచ్చాడు, క్రూమ్.

"ఎంతకాలమని కడుపు కాల్చుకొంటారు? రేపీపాటికి కాళ్ళబేరానికి రాక తప్పదు" అన్నాడు వెస్సెల్స్.

"ఈ సంగతి బయటకు పొక్కితే మన దుంపతెగుతుంది."

"ఎంచేత ?"

"పస్తులు మాడ్చడం బాగాలేదంతే."

"వాళ్ళు లొంగివచ్చిన వెంటనే దయజూపుతానన్నానుగా!"

" ఈ సంగతి బయటికెట్లా పొక్కుతుంది?" అని బాక్స్టర్ ఆశ్చర్యం ప్రకటించాడు. "భగవంతుడా, యీ నరకబిలంనుండి చిట్టెలుక కూడా దూరి పోలేదుగదా !"

* * *

దినం గడిచి వేరొకదినం జరుగుతున్నది. చెయిన్నీల ముట్టడి రాబిన్సన్ దుర్గరక్షకులపై కటికనల్లటి మేఘంవలె నెలకొన్నది. మొదటిరోజు యే గడబిడలూ లేవు. వెస్సెల్స్‌గారుచేసిన నిర్ణయం అందరికీ తెలిసిపోయింది. అందరి చూపులూ ఆ పొడవాటి సాలమీదనే నిలిచివుండినవి. వాకిలి కాపలామనుషులసంఖ్య పెంచబడింది. కట్టడం చుట్టూ గస్తీ మనుషులను నిలపడమైనది. ఒక్కొక్కడు గస్తీ తిరగవలసిన జాగా తక్కువైనది.

సైనికులలో అధిక సంఖ్యాకులకు యీగ వాలినట్లయినా లేదు. ఎదుటి వారి మనోగత సూక్ష్మాలను, వాంఛలను, ప్రేరణలను తెలిసికొనే శక్తిగాని, అలవాటుగాని లేనందుచేత సాదా సైనికులకు సూటి తత్వం అలవడింది. 'ఇండియన్లలో మహా మంచివాళ్ళెవరయ్యా' అంటే, యీ సైనికుల జవాబు, 'చచ్చి పోయినవాళ్ళు' అని వస్తుంది. వాళ్ళ ఆగ్రహావేశాలు చెయిన్నీలమీదనే వున్నవి. కాని ఆ అభాగ్యులను అణగద్రొక్కడానికి అధికారులు విధించిన నిర్బంధాల గురించి వీరిలో యే ఒక్కరూ కిమ్మనలేదు. బహు కొద్దిమంది మాత్రమే చెయిన్నీల దుస్థితిని చూచి జాలిపడ సాగినారు. ఇండియన్లేగాని, మరెవ్వరేగానీ, తోటి మానవుల కడుపులు కాల్చడమనేది వీరికి ఘోర చర్యగా కనుపించింది. తమకూ ఆలుబిడ్డలున్నారు. ఒంటి రంగు గోధుమవన్నె అయినంతమాత్రాన, ఆకలి దప్పులుండకపోవు. ఇటువంటి కరుణాళువులుకూడ విపరీతాలోచనలు చేయసాగినారు. ఇండియన్ల బాధ చూడలేరుకాబట్టి వారి పీడ ఎంత త్వరగా విరగడైతే అంత మంచిదపించింది. ఇండియన్లు నివసిస్తున్న పొడవాటి కొయ్యసాల వారికి కంటకప్రాయమైంది. దానిని శపించసాగారు. ఇటువంటివాళ్ళకు ముక్కోపాలూ, మౌనాలు, గునగునలు, తగవులూ పెచ్చుపెరిగినవి. వాళ్ళలో యిద్దరు జేమ్స్‌లిస్బీ, ఫ్రెడ్‌గ్రీన్ అనేవాళ్ళు కత్తులతో కుమ్ముకొన్నారు. గ్రీన్ నెత్తురు

మంచులో పేర్పులు కట్టింది. అన్గస్ మెక్‌కల్ అనే సిపాయిసార్జెంటు కసురు తిరిగి కొట్టివేశాడు. అతని చేతికి సంకెళ్ళువేసి శిక్షామందిరంలో బంధించారు. అప్పుడప్పుడు ఫెళ్ళున బ్రద్దలై బయల్పడజొచ్చిన యీ దురాగ్రహం వెనుక అల్పత్వం, మొరకుతనం మామూలు వ్యవహారం కాసాగింది. ఈ అరాచక ధోరణుల కన్నింటికీ వెస్సెల్స్ ఒకే ఒక్క విరుగుడు ప్రయోగించేవాడు. క్రమ శిక్షణను దినదినం మరింత కఠినంచేయడ మొక్కటే అతనికి పరిష్కార మార్గంగా కనుపించింది. బయళ్ళ సీమలో పనిచేసి యెంతో అనుభవం గడించిన సార్జెంట్లు అసలే కఠినులు, యిప్పుడు మరీ కఠినులై దాదాపు ఉన్మాదావస్థకు దగ్గరగా వచ్చారు. కదిలిస్తేచాలు, సార్జెంటు లాన్సికి బుస్సుమని కోపం రాసాగింది. సుత్తులవంటి పిడికిళ్ళను మరే యితర ఆలోచనలేకుండా ప్రయోగించసాగాడు. అసలే ముక్కోపాలు పిడిగ్రుద్దులు పెచ్చుపెరుగుతున్నప్పుడు, త్రాగుడు జతచేరితే, పరిస్థితులు వశం తప్పిపోగల వని భయపడి, యెవ్వరికీ సారాయి సరఫరాచేయవద్దని వెస్సెల్స్ వర్తకులతో గట్టిగా చెప్పాడు. మామూలు త్రాగుడు లేకపోయేసరికి, సైనికులు మరింత బరితెగి మితితప్పిపోయారు.

రెండవరోజున, యిండియన్లలో దాహబాధ యెక్కువయిన చిహ్నాలు కనుపించాయి. కిటికీచువ్వల కంటుకొన్న మంచును గీరితీసీ, తలుపుతీసి చేయి బారచాపి అందినంతవరకూ మంచును జవిరిలాగి, కొంతకుకొంత దాహాన్ని వుపశమింప జేసుకొన్నారు. ఎవ్వరినీ గుమ్మందాటి అడుగు పెట్టనీయకుండా పహారావాళ్ళ కత్తులు అడ్డునిలిచాయి. పెనుగుల నట్టిపెట్టిన యింటివలె తయా రయింది ఇండియన్లు వున్న సాల.

వెస్సెల్స్ తగ్గలేదు. తా ననుసరించిన పద్ధతులు సమంజసాలనే అతని అభిప్రాయం. ఇండియన్లపట్ల అతనికి చికాకేగాని ద్వేషభావం లవమాత్రమైనా లేదు. రోజుకు మూడుసార్లు రొలాండ్‌ను వారివద్దకు పంపి, యిప్పటికైనా తప్పు సరిదిద్దుకోవలసిందని కబురు పెట్టేవాడు. మొదటిరోజు, కుంపటిలో వేసి చలిగాచు కొనేందుకు పుల్లలువుండినై కాని మరురోజు వాటినికూడ పంపలేదు. అర్ధమన స్కత అతనికి సరిపడదు. చేసినపని యేదేగాని సగం సగంచేసి వదలకూడదు.

రెండవరోజు, రొలాండ్ వచ్చి, దయవుంచి తనను యిండియన్లవద్దకు మరి పంపవద్దని మొరపెట్టుకొన్నాడు. "అక్కడ నరకంగావుందండీ - ఘోరమండీ-"

"జంకుగా వుందా?," అని అడిగాడు వెస్సెల్స్.

"అది కాదండి. వాళ్ళు తెగించినారండీ కెప్టెన్‌గారూ. శివమెత్తిపోతున్నా రండీ. తుపాకులుకూడ వున్నట్లుందండీ."

"నీకు మతిచెడింది. ఎక్కడ్నుంచి వచ్చాయి తుపాకులు వాళ్ళకు?"

"నాకేం తెలుసండీ? మీరు లొంగదీయకముందే తుపాకులను విరిచి ఆడ వాళ్ళ దగ్గర దాచిపెట్టి వుండవచ్చు. ఆడవాళ్ళదగ్గర రివాల్వర్లుకూడా వుంటాయి. ఏంతలేదన్నా, వాళ్ళవద్ద ఐదు తుపాకులన్నా వుంటాయనుకొంటానండీ."

"నీకు మతిచెడింది. అనుమానంలేదు. ఎంతచెడినా వాళ్ళ మనిషివేకదా, మీ కందరికీ యిదేరోగం—వున్మాదం!"

రొలాండ్‌కు పౌరుషం వచ్చింది. "సరేనండీ, పొమ్మంటే యిప్పుడే పోయి వస్తాను. కాని నిజంచెప్పవలసివస్తే, వాళ్ళున్నది నరకమంటే నమ్మండి. బయటికీ రారు, వెనక్కూపోరు. అక్కడే అక్కడే చచ్చిపోతారు. ఇది ఖాయం?"

పిల్లల విషయం కాస్త ఆలోచించి చూడమని లెఫ్టినెంట్ ఎల్లెన్ మనవి చేశాడు. "పాపం, పాలపాపలు పస్తుమాడుతుంటారు. మీ పద్ధతులను విమర్శిం చడం లేదండీ, మీరు సర్వాధికారు లిక్కడ, మీరే పుణ్యం కట్టుకోవాలి."

"నేనుమాత్రం కటికవాణ్ణా? అందరినీ మేపాలనేవుంది. కాని నేనేం చెయ్యను. వాళ్ళు కోరుకొన్నదేగా యీ అవస్థ?" అన్నాడు వెస్సెల్స్.

"కాని పెద్దలుచేసిన నిర్ణయాలకు నోరూవాయీ లేని పిల్లలెట్లా బాధ్యు లండీ?"

"ఇండియన్లు—"అని వెస్సెల్స ప్రారంభించాడు.

"భగవంతుడా, ఇండియన్లుకూడ మనుషులేనండి! పసిపిల్లల పొట్టలు మాడుస్తూ, ఇండియన్లపేరుతో తప్పించుకోలేరు సుమండీ".

"లెఫ్టినెంట్, మితిమీరుతున్నావు. నీ వెధవ వ్యవహారం నువ్వుచూచుకో గాని పెద్ద విషయాలలో తలదూర్చకు", అన్నాడు వెస్సెల్స్. కాని ఎల్లెన్ నాటిన అభిప్రాయం వెస్సెల్స్‌లో పాతుకొని పోసాగింది. చీకాకు పరచసాగింది. చిట్టచివరకు రొలాండ్‌ను పిలిచి, పిల్లలను బయటికి పంపించివేయమని చెప్పిరా", అన్నాడు. "తిండిపెట్టి కాపాడే బాధ్యత మాదనికూడ చెప్పు".

కాని రొలాండ్‌పోయి, వివర్ణవదనుడై, తల పంకిస్తూ తిరిగివచ్చాడు. ఆలోపల ఘోరనరకంగా వుందన్నాడు.

"పిల్లలను పంపివేయ యిష్టపడలేదా?"

"అందరంకలిసే చచ్చిపోతామన్నారు. చుట్టూకూచొని దిగాలుపడి చూడ సాగారు నన్ను. భగవంతుడా, ఎంత కటికచలిగా వుందక్కడ! ఒక్కరిప్రక్క ఒకరు ఒదుగుకొని ఒకరినొకరు కరచుకొని కూర్చుని, అట్టే చూడసాగారు".

థెర్మామీటరును చూస్తే శీతోష్ణస్థితి జీరోస్థాయికంటె ఆరుడిగ్రీలు తక్కువగా వుంది.

"రేపీపాటికి కాళ్ళబేరానికి వచ్చితీరుతారు", అన్నాడు వెస్సెల్స ధీమాగా.

కాని మరుసటిరోజు మృత్యుగీతికల నాలపించసాగినా రిండియన్ ఖైదీలు. మనుష్యుల దేహాలనేకాక, ఆత్మలనుకూడ కప్పివేసిన నిశ్చల భయంకరమయిన

గట్టి పెంకువలె, నీరస సమాధివలె యీ పొడవాటి సాల వుండింది నిన్న. అప్పుడే పరిస్థితి దుస్సహంగా వుండింది. మరి యిప్పుడో, దుస్సహాతిదుస్సహమైంది. దుర్గంలో ప్రతికిడకూ మూలకూ ప్రాకిపోయింది యిండియన్ల యేడుపుపాట. వాళ్ళవద్ద పిల్లనగ్రోవికూడ వున్నట్టుంది. అప్పుడప్పుడు యీ విలాపమయ మృత్యుగీతికల భయంకర సంగీతానికి జతగా మంద్రస్వరంలో వేణునాదంకూడ వినిపించసాగింది. దైవోపహతమైన మహాజాతికి యిది చిట్టచివరి భరతగీతి.

సైనికుల చిత్తస్థయిర్యాన్ని యీ యేడుపుపాటలు దెబ్బతీశాయి. ఇండియన్లు వున్న కట్టడందరికికూడా సైనికులు పోసాహసించలేకున్నారు. దానివైపు చూడటానికికూడ జంకుతున్నారు. నవ్వులాటలు, కేరింతాలు ఎక్కడికక్కడ ఆగిపోయాయి. పోట్లాటలుకూడ తగ్గిపోయాయి. ప్రాణాలలో భయందూరింది. ఒక అగ్గిరవ్వచాలు, యీ వ్యవహారమంతా భగ్గుమని పోగలదని వెస్సెల్సుకూడ గ్రహించాడు. భోజనశాలలో ఆఫీసర్లు మాట్లాడుతూ మాట్లాడుతూ ఠకీమని ఆపివేస్తారు. ఎవరో ఏదో అంటారు. మరెవరో సమాధాన మిస్తారు. ఇంకొకరు అదికూడా చేయరు. మొదటిమనిషి వేసినప్రశ్న అట్లాగే నిలిచి, నిశ్శబ్దంతో జతచేరుతుంది. అందరి చెవులూ దేనినో వింటునైన్న.తింటూనే వుంటారు. చివరకు ఎవడో ఒకడు, "యీ చావుపాటలు మానివేయరేం? చావనైనా చచ్చారు కారు!" అంటాడు.

"అవును, మానివేయరేం?"

"తాము చనిపోతున్నామని తెలిసినప్పుడే వాళ్ళవి ఆలాపిస్తారు," అంటాడింకొకడు.

"ఏడవలేకపోయావ్? నోర్ముయ్!"

ఇంకా ఆలకిస్తూనే వుంటారు. సంభాషణ అప్రశస్త విషయాలమీదికి, అసందర్భాల మీదికి మళ్ళుతుంది.

"మంచు—"

"మంచుపడేటట్లుంది."

"ఉత్తర—"

"ఏమో నాకు తెలియదు. ఇంత చలివుంటే మంచు కురవదనుకొంటాను."

"ఇంతకంటె చలివుండబోదు."

"మహా తెలిసినట్టు!"

మిగత ప్రపంచంనుండి విడివడి ఒంటిగా దీవులవలె తాముంటున్నట్లుంది. తూర్పునాటిని గురించి ప్రస్తావించడమే లేదిప్పుడు. స్త్రీలను గురించి, కుటుంబాలను గురించి, తాము రుచిచూచిన పసందైన వంటకాలను గురించి, చూచిన మంచి నాటకాలు గురించి, చదివిన మంచిపుస్తకాలు గురించి, నాగరికత పెచ్చు

పెరిగిన స్థలాలలో పెంపొందే వుత్తమ సహవాసాలను గురించి - అసలు మాట్లాడడమే మానివేశారు.

చివరకు ముద్దుబారిన వెస్సెల్స్ నరాలకుకూడ యీ జబ్బు వ్యాపించింది. గతంలో తాను యిక్కడ పరమాధికారి. కాని నేడు అతనుగూడ దిగ్భ్రమచెంది ఎటుతోచక పాలుబోక డీల్పడివున్నాడు. రెండురోజులబట్టి వినిపిస్తున్న విలాప గీతికలను సహించలేకపోతున్నాడు. ఈ వ్యవహారాన్ని ఏదోవిధంగా ఫైసలా చేసివేయాలని నిశ్చయించుకొన్నాడు. రొలాండ్‌ను చేరబిలిచి, "తిరిగి అక్కడికి పోయిరావాలి, తెలిసిందా ?" అని గద్దించాడు.

రొలాండ్ తల పంకించాడు.

"దారి పొడుగునా తన్నుతూనైనా నిన్నక్కడికి చేరుస్తాను జాగ్రత్త!"

"నేను బతికి బయటపడి రాలేనండీ," అని రొలాండ్ విన్నవించుకొన్నాడు.

"ముయ్‌నోరు! చచ్చినట్టు బ్రతికి బయటపడతావు. మురికి వెధవా, ప్రాణాలంటే అంత తీపేం? జీతమిచ్చి, తిండి పెట్టుతుంటే, పనీబాటా లేకుండా కులుకుదా మనుకొన్నావా? చచ్చినట్టు వాళ్ళ దగ్గరకుపోయి, భేటీకి కులపెద్దలను వెంటబెట్టుకొని రాకుంటే చూడు యేం చేస్తానో."

"వాళ్ళ దగ్గర తుపాకీ లున్నాయండీ."

"ఫిరంగులుండనీ, శతఘ్నులుండనీ నాకు లెక్కలేదు. కాని నువ్వుమాత్రం పోయి కులపెద్దలను తీసుకురావాలి."

విధిలేక రొలాండ్ ఇండియన్లు వున్న సాలలోకి వెళ్ళాడు. అతను స్వయంగా చూచిన విషయాలను తర్వాత వెస్సెల్స్‌కు నివేదించాడు. కటిక చల్లటి నేలమీద ముడుక్కొని చచ్చిపోతున్న యిండియన్లు, చావు కప్పేసిన ముఖాలు, పసిపిల్లల వుబ్బిన పొట్టలు, యెండుకొనిపోయిన అవయవాలు, అందమైన మెత్తని గుండ్రని ఒంటి మాంసం ఎముకలంటా దించుకొని, కుంచుకొని పోయిన స్త్రీలూ, యువకులూ, భార్యలూ, తల్లులూ, తండ్రులూ, అప్పచెల్లెళ్లూ, అన్నదమ్ముళ్ళూ, అందరూ శైత్య హింసాకాండకు లోనయ్యారు. కష్టమే యెరుగని, తలవంపులేలేని మహాజాతి యొక్క ఆత్మజ్యోతి చివరకు అవమానాలతో కొడిగట్టి కొండెక్కబోతున్నది.

రొలాండ్ ముగ్గురు కులపెద్దలను తోడ్కొని వచ్చాడు. ఆ ముగ్గురిలో మొదట వచ్చిన ముసలివాడు లేడు కాని అతనితోబాటు వచ్చిన ఆ యిద్దరూ, క్రొత్తవాడొకడూ వున్నారు: అడవి పందీ, ముసలికాకీ 'గట్టి ఎడమచేయీ' అందరూ పెద్దనాయకులే. కాని అర్థంలేని పేళ్ళు. ఇండియన్ల నామధేయాలంత పిచ్చివి మరెక్కడా వుండవు.

"'బండకత్తిని పంపడానికి వల్లకాదన్నారండీ," అని వెస్సెల్స్‌తో చెప్పాడు రొలాండ్. "అతను కులపెద్దట—తమకు కన్నతండ్రితో సమానమట. తాము చచ్చిపోయేటప్పుడూ అతనినిచూస్తూ చచ్చిపోవాలట. కనకనే యిక్కడికి పంపలేదు."

"భేటీకని చెప్పలేదా ?"

రొలాండ్ భుజా లెగురవేశాడు." ఈ వచ్చినవాళ్ళు తిరిగి వస్తారని వాళ్ళకు నమ్మికలేదండీ. ముద్దుపెట్టుకొని వీడ్కోలిచ్చి పంపారు. వాళ్ళపరిస్థితి అంత దారుణంగా వుంది."

వెస్సెల్స్ తన కార్యాలయంలో తిరుగుడు కుర్చీలోకూర్చుని చుట్ట త్రాగుతూ, నిష్పాక్షిక న్యాయపరత్వం కనుపించేటట్లు ముఖమూ, కంఠస్వరమూ మార్చుకొన ప్రయత్నిస్తున్నాడు. చనిపోతూవున్న ఆ మూడు భయంకరాకృతులు అతనిముందు నిలిచాయి. ఒళ్ళు గజగజలాడు తున్నప్పటికీ, తాము ధరించిన చిరుగు పేలికలతోనే పరువు ప్రతిష్ఠలు నిలుపుకొన జూస్తున్నారు. కాని వాళ్ళు తెగించివున్నారు. ఆ గదిలో ఫ్రూమ్, యిద్దరు సైనికులూకూడ వున్నారు. ఇండియన్ కులపెద్దలనుంచి వీలయినంత దూరంపోయి నిలుచున్నాడు రొలాండ్.

"నీళ్ళు నమలడ మేమీలేకుండా, నేరుగా ప్రస్తుతాంశానికివచ్చి వెస్సెల్స్ మాట్లాడ మొదలుపెట్టాడు. మొండితనం ఎంతపనిచేసిందో చూడండి. చట్టానికి తలఒగ్గడమనేది ఎంత మంచిపనో యిప్పటికయినా తెలిసి వచ్చిందనుకొంటాను. మీపట్ల నాకు ద్వేషభావం లేనేలేదు. మీవాళ్ళదగ్గరకుపోయి, బయటికివచ్చి దక్షిణానికి పోయేందుకు సిద్ధపడమని చెప్పండి. అదిమీకు ఒప్పుదల అయిన వెంటనే మీకు అన్నపానాలు అమరుస్తాను."

రొలాండ్ గొంతు రొలాండ్‌దికాదు. ఇండియన్లదైపోయింది. తన పూర్వీకుల స్వేచ్ఛాప్రియత్వం యిప్పుడు తలవని తలంపుగా, అప్రయత్నంగా సంక్రమించి నట్లయింది. "దక్షిణంలేదు,గిక్షిణంలేదు. ఎప్పటికీ పోరు. అది కలలోని మాట. కావలిస్తే చంపుకోండి. అంతేగాని—"

చుట్టను పళ్ళమధ్య బిగించిపట్టి, తొణుకుబాటు యేమీలేకుండా, "యీ యెర్ర లంజకొడుకులికి బేడీలు వేయండి," అన్నాడు వెస్సెల్స్ ప్రక్కనేవున్న సైనికులతో.

ఇండియన్లకు అతని మాటలు బోధపడలేదు. అతనేదో ఒరిగిస్తాడని వాళ్ళకు ఏకోశానా ఆశలేదు. ఏదో మంచిరాగలదని ఉత్సుకతలేదు. నిరామయంగా పురా గర్వ గంభీరులై అతని నట్టే గమనించి జూస్తున్నారు. ఒక్క అంగుళమైనా కదలలేదు. సైనికులు వెనుతగ్గి, ఇండియన్ కులపెద్దలను నిస్సహాయులను చేయడానికై తుపాకుల నెత్తారు. పిస్తోలు పెట్టుకొనే తోలుసంచి మూతినివిప్పి ఫ్రూమ్ సిద్ధంగావున్నాడు.

"అరెస్టు చేశామని చెప్పు వాళ్ళకు," అని కఠినంగా, కర్కశంగా అన్నాడు వెస్సెల్స్.

రౌలాండ్ అనువదించ సాగినాడు. కాని ఆవరకే ఇండియన్లు జరిగిన విషయాన్ని గ్రహించి వేశారు. ముంచుకొని పోయిన ముఖాన పెద్దమచ్చగలిగిన మనిషి, అసామాన్యమైన దేహపుష్టి గలవాడు చప్రయన కత్తిని లాగాడు. మరొకడు సైనికునిమీద విరుచుకు పడినాడు. కాని తుపాకి మడమతో సైనికుడు ఇండియన్ తలపుర్రెమీద బలమైన దెబ్బకొట్టాడు. ఈలోపల కత్తిచేదాల్చినవాడు తన భాషలో ఏదేదో అరుస్తూ, రెండవసైనికుని మీదికి ఒక్కుదుటున దూకాడు. సైనికుడు వెనుదగ్గినాడు. గదియావత్తూ గంద్రగోళ మయింది. తుపాకిని ప్రేలిస్తే యేమిముప్పు వస్తుందోనని భయపడి, ఆ సైనికుడు కత్తిపోట్లకు చేతినడ్డంపెట్టి ఆచుకొనసాగినాడు. ఈ లోపల ఫ్రూమ్ మెల్లిగా యిండియన్ వెనకచేరి, తుపాకి మడమనెత్తి సుత్తిదెబ్బ కొట్టినాడు అతని తలమీద. వెస్సెల్స్ తన రివాల్వరు బయటకులాగి, మూడవ ఇండియన్ పెద్దను బంధించ చూచినాడు. కాని తనకూ, ఆతనికీ నడుమ సైనికులూ, ఫ్రూమ్‌వున్నారు. ఫ్రూమ్ కొట్టిన మనిషి పడిపోయాడు. అతని తలపగిలి నెత్తురులోడ్చ సాగింది. రెండవ పెద్దను గురిచేసి వెస్సెల్స్ తన రివాల్వరును ప్రేల్చినాడు.

కాని అది గురి తప్పిపోయి, గదిని ప్రతిధ్వనింప జేసింది. దుర్గమంతా యిప్పుడు హఠాత్తుగా మేల్కొన్నట్లయింది. ఫ్రూమ్ ఇండియన్ పెద్ద వైపు మళ్ళి అంగలు వేశాడు కాని, అతను ఫ్రూమ్‌ను ప్రక్కకునెట్టి వేసి, అమానుషత్వం ప్రదర్శించి, కిటికీ నెక్కి బయటికి దూకేశాడు. కిటికీ అద్దమూ, చట్రమూ అతనితోబాటే బయటపడి పోయింది. మంచుమీద నాలుగు పొర్లికింతలుపెట్టి, సత్తువ పూన్చిలేచి, తన జనమున్న యింటికేసి పరుగు లంకించుకొన్నాడు. ఈ పరుగు చక్కగా, నేరుగా లేదు. మెలికలు మెలికలుగా తిరిగినట్లుంది. పారిపోతున్న వానికి గురిపెట్టి వెస్సెల్స్ తన రివాల్వరులోని గుండ్లన్నిటినీ ప్రేల్చివేశాడు. కాని పిస్టలు గుండు అంతదూరం పోలేదు. తుపాకులు తాల్చి సైనికులు ఆ కిటికీ వద్దకు వచ్చేటప్పటికే, ఆ ఇండియన్ గమ్యం చేరుకొన్నాడు. అడ్డువచ్చిన కాపలామనిషిని త్రోసి ముందుకుపోయాడు.

దుర్గం నానా హంగామా అయింది. ఫ్రూమ్ సైనికులను నెమ్మది పరచాలని పోయాడు. పడిపోయిన ఇండియన్ పెద్దకు బేడీలు తగిలించమని వెస్సెల్స్ సైనికుల కాదేశించాడు. ముఖంమీద మచ్చ కలిగిన యిండియనుకు అప్పుడప్పుడే స్పృహ రాసాగింది. కత్తికోసం చేతులతో తడుమసాగాడు. కత్తి అతని కందకుండా వెస్సెల్స్ దానిని కాలితో తన్నివేశాడు. రెండవవానికి సంకెళ్ళు వేస్తున్నంత కాలం, యితనికి రివాల్వరు గురిపెట్టి వెస్సెల్స్ నిలుచున్నాడు. గాయపడిన

సైనికుడు నెత్తురు కారుతున్న చేతిని అదిమిపట్టుకొని, చికిత్సాలయానికి వెళ్ళి పోయాడు.

* * *

ఇటూ అటూ అనంతమై, అంతులేనంత వున్నతమై, వూపిరి తిరగనీయని ఒక మహోద్యమం యెదురయినప్పుడు ఎట్లాగుంటుందో, వెస్సెల్స్ స్థితి అట్లాగుంది. ఈ గోడ పడనైనా పడదు; తెరిపి యివ్వదు. ఆ సాయంకాలం భోజనశాలలో కూడ యీ గోడ అతనికి యెదురయింది. మనుషుల ముఖాలలో కనుపించసాగింది. సైనికులు తనను ముఖాముఖి చూడలేక, చూపులు మరొక వైపుకు మరలిస్తున్నారు. వాళ్ళు తింటున్న తీరులోగూడా యీ గోడ ప్రత్యక్షమవుతున్నది. గబగబ తినలేకున్నారు. నోటిలోముద్ద దిగడంలేదు. తిండివంక తేరిపార జూస్తున్నారు. నీళ్లూ, కాఫీ త్రాగడంకూడ తామెన్నడూ యెరగనట్లుంది. ఎక్కువ తినలేకపోతున్నారు. ఎక్కడ తిండి అక్కడే వుంది. గిన్నెలు చెక్కు చెదరలేదు. పారవేయవలసి వస్తుంది. కెప్టన్లూ, ప్రథమశ్రేణి లెఫ్టినెంట్లూ, ద్వితీయశ్రేణి లెఫ్టినెంట్లూ, యితరఉద్యోగులు, సైనికులు అంతా ముఖాలు వేలవేసి వున్నారు. చాలమంది పసివాళ్ళు. కొద్దిమంది నడిమిప్రాయంలో వున్నారు. నూటయాభై మందిని పస్తులుబెట్టి చంపడమంటే యేమిటో ఎవరికీ తెలియదు. తెలిసికోవాలని ఆదుర్దా కూడా లేదనేకులకు.

“అమ్మయ్య! ఆ పాడుచచ్చిన పాటలు ఆపేశారు”, అన్నాడొకడు. అందరూ చెవులప్పగించి ఆలకించారు. గ్రూమ్ చుట్ట ముట్టించాడు. ఎవరో హాస్యమాడ ప్రయత్నించి, అంతా చెప్పాడు కాని ఒకరూ నవ్వలేదు. మాటా మంతీ లేకేలేదు. బల్లదగ్గరనుంచి ఎవరూ కదలమెదలలేదు.

“తలుపులు బిగించి వేశారు. తలుపుతీయాలని జెన్కిన్స్ నానాతంటాలు పడ్డాడు”, అన్నాడు బాక్స్టర్.

వెస్సెల్స్ తలవూపాడు. వాళ్ళకు తిండిపెట్టవలసిందని చెప్పడానికి ఎవరికీ దొమ్మలు లేకపోయాయి. నిర్ణయాన్ని మార్చుకోవడమంటే తనలోని మూలపదార్థాన్ని దేనినో ధ్వంసం చేసికోవడమే ననుకొన్నాడు వెస్సెల్స్. ఆత్మహత్యతో సమానమనిపించింది. మిగతావాళ్ళకు వేరే పిచ్చి. “వాషింగ్టన్‌నుంచి వచ్చిన ఆజ్ఞలు” శిరసావహించడమే వారికి సమస్తం! మంచుపేరిన దుర్గమ భయంకర స్థలంలో, బయటివారితో సంబంధమే లేనివిధంగా విడివడినట్లున్న స్థలంలో పడివుండికూడా, భ్రమను నమ్ముకొని బ్రతుకుతున్నారు.

“వాళ్ళకు తుపాకులున్నట్లుంది. రోలాండ్ యీ విషయమై గట్టిగా నమ్ముతున్నాడు”, అన్నాడు ఎల్లెన్.

“మొదట నేను ఆడవాళ్ళను సోదాచేయిస్తానయ్యా అంటే, జాన్సన్ మూతి ముడుచుకొన్నాడు. లేకపోయేవుంటే—”, అని ఆలోచిస్తున్నాడు

వెస్సెల్స్. ఎల్లెన్ మాటకు జవాబుగా," "ఆఁ? ఒకటి రెండు కంటె అదనం వుండబోవు", అన్నాడు.

ఒకటి రెండు రోజుల్లో ఎట్లాగూ ప్రతిఒక్కడూ చావబోతున్నాడు. తుపాకులుండి యేంలాభం, లేక యేంనష్టం? అని ప్రతి మెదడూ ఆలోచించ సాగింది.

"ఆ సంకరముండాకొడుకు కల్లలపుట్ట."

"కావచ్చుకాని భయమెక్కువైనందుచేత, యీ విషయమై నిజమే చెప్పి వుంటాడు."

పోకర్ ఆడుదామన్నా రొకరు. ఉత్సాహమే లేకున్నా, విస్ట్ ఆడడానికి నలుగుర్ని కూర్చోన ప్రయత్నించాడు ఫ్రూమ్. ఎవరో తలుపు తెరిచి, థర్మా మీటరును చూచారు. పాదరసం జీరోమట్టానికి నాలుగు డిగ్రీలు చూపిస్తూవుంది.

"చలి—"

"రేపు వాళ్ళపని పట్టుదాం పోయి" అన్నాడు వెస్సెల్స్, తన మాటలలో తనకే నమ్మకంలేక.

"జీరోకు నాలుగు తక్కువ" అన్నా రెవరో అనవసరంగా.

"లెస్టర్ ఎట్లా వున్నాడు?" అని ఎల్లెన్, కత్తిదెబ్బతిన్న సైనికుని విషయమై అడిగాడు.

"ఫరవాలేదు. పాపం, బలమైన దెబ్బతగిలింది. చీముకూడకుంటే త్వరలో కోలుకొంటాడు."

భోజనశాల విడిచి పోలేదే ఒక్కరూ. ఫ్రూమ్‌తోబాటు విస్ట్ ఆడడానికి మనుషు లెవరూ రాలేదు. అట్లాగే కూర్చుని, ఎంగిళ్ళు యెత్తుతుంటే చూస్తూ వుండిపోయారు.

ఆ సాయంకాలం రాకాసుధాకరుడు తెల్లటి వెన్నెల కురియ సాగినాడు. గగనం నిర్మేఘంగావుంది. లక్షాధిక నక్షత్రాలు వ్రేలాడగట్టిన కారునల్లని ఉండిలాగుంది నింగి. తొమ్మిదిగంటల రాత్రిలోకూడ పిండిఆరబోసినట్లున్న వెన్నెలలో కూర్చుని కళ్ళకేమీ నొప్పిలేకుండానే పత్రిక చదువుకోవచ్చు. అసలే అచ్ఛంగావున్న వెన్నెల మంచువల్ల యితోధిక ధవళితర మైంది. దూరాన వలయాకృతిగా తీర్చిదిద్దినట్లున్న కొండలు, మంచుమునుగు ధరించిన పైన్ వృక్షాలు, దృశ్యరామణీయకాన్ని హెచ్చింప చేస్తున్నవి.

దూరాన ఎక్కడో తోకమీద కూర్చుని పున్నమిచంద్రునివైపు మోరెత్తి ఆశాభంగంవల్ల కలిగిన హృదయావేదననంతా కూర్చి తోడేలొకటి మొరుగసాగింది. అన్నికడలనుంచీ రకరకాల వాసనలు దాని నాసాపుటానికి తగులసాగినవి. నర వాసన, గుర్రంవాసన, తిండివాసన, తనకు బాగా అలవాటైన ఇండియన్లవాసన— యిన్ని వాసనలు ఒక్కసారి తగిలి దానిని తికమక పెట్టసాగినవి. ఈ మొరుగుడు

విని, వంటవాడు రెండుకుక్కలను దానిమీదికి పంపించాడు. అది తిరిగి చిక్కని నల్లని పైన్ వృక్షసమూహంలోనికి వెళ్ళిపోవలసివచ్చింది. చలి గూడుకట్టుకొన్న సాలలలో గుర్రాలు వూరకే సకిలించసాగినవి.

గస్తీ మనుష్యులు నిశ్వసించినప్పుడంతా పొగ వెలికివచ్చి తీగెలు తీగెలుగా అల్లుకొని పోసాగింది. వ్యాపారి పెందలకడనే తన కోట్టు మూతపెట్టి, ఓమహా నుంచి వెలువడే వార్తాపత్రికను చదువుకోసాగినాడు. సైనికులు కొందరు తమ సాలలలో పేకలు ఆడుకొంటున్నారు. కొందరు పాచికల ఆట ఆడుతున్నారు. కొందరు చవకబారు నవలలు చదువుతున్నారు. కొందరు సామానుకు మెరుగుపెట్టుతున్నారు. మరికొందరు, యేటూ తోచక పెందలకడనే నిద్రపోయారు. సార్జెంటు లాన్సీకి చిగురువాచి నొప్పి పెట్టసాగింది. రెండు రాత్రులనుంచీ కంటికి కునుకేలేదు. అందుచేత కళ్లు ఎర్రబడ్డాయి. కప్టన్ వెస్సెల్స్ చుట్ట తాగుతూ, పక్కవారి ఆటను తిలకిస్తున్నాడు. ఫ్రూమ్ ఝోరుగా ఆడుతూ, బాగా గెలుపందుతున్నాడు. లెఫ్టినెంట్ ఎల్లెన్ కూర్చుని వాళ్ళ అమ్మకు జాబు రాస్తున్నాడు. సైన్యంలో చేరిననాటినుంచీ, ఏ దినానికాదినం జరిగిన విషయాలన్నింటినీ పూసగ్రుచ్చి అమ్మకు జాబు రాయడం అతనికి అలవాటయింది. ఎన్నో సూక్ష్మాంశాలనన్నిటినీ గుదిగ్రుచ్చుతాడు. ఎంతో ఆప్యాయంగా రాస్తాడు. తన తల్లి కళ్లకు తన బ్రతుకంతా కట్టినట్లుండాలి. ఫ్లానెల్‌లో దిరుసు వేసుకొన్నాడు. మోకాళ్ళవరకూ మేజోళ్ళు రెండుజతలు వేసుకొన్నాడు. క్రిందేమో ప్రత్తి మేజోళ్ళు, వాటిపైన వుల్లెన్ మేజోళ్ళువున్నాగాని చలివేస్తున్నది. తూర్పునాట చలిఒకరకం, యిక్కడ యింకొకరకంగా వుంటుంది. ఇక్కడ చెమ్మ తక్కువ. కనుక ఆరోగ్యానికి ఏమీ దెబ్బతగలదు. ఈవేళ మంచు పడుతుందనుకొన్నారుగాని పూర్ణచంద్రుడు ప్రత్యక్షమయ్యాడు. వెన్నెలకు తాళలేక తోడేళ్ళు మొరుగుతున్నాయి. ఇది మామూలు తోడేళ్ళజాతికి చెందినదికాదు. ఇవి కొంతకుకొంత సాధువులు. ఎవ్వరికీ ముప్పు కలిగించవు. గుంటనక్కలకంటె పెద్దవేమీకావు. దొంగిలించడం, పారవేసిన మాంసంమీదపడి కడుపు నిండా మెక్కడంకంటె యివి చేసే సాహసాలు లేవు. ఇండియన్లనుగురించి ఆమె భయపడనక్కరలేదు. బయళ్ళసీమలో యిక పోట్లాటలే వుండవు. సోపుగింజలను గురించి కప్టన్ ఫ్రూమ్‌తో తాను మాట్లాడినాడు. పడిశాలకు యిది చెప్పతోదగిన విరుగుడుకాదని తన అభిప్రాయం. కాని ఆమె కిది చాల యిష్టం. ఇక్కడ అంత సులువుగా పడిసెం పట్టదు. గాలిలో చెమ్మ తక్కువ.

◆ ◆ ◆

మరురోజు రొట్టెలకు కావలసిన పిండి పిసికిపెట్టాడు వంటమనిషి. ఇనుప కుంపటి ప్రక్కనే కొయ్యతొట్లలో వేసిపెట్టాడు. వాటిపైన తడిగుడ్డలు పరిచాడు. కప్టన్ వెస్సెల్స్‌గారి బంటుతో కలిసి ఫ్రెంచివారిని గురించి వాదోపవాదాలు

మొ. లెట్టాడు ఆ యిద్దరికీ ఫ్రెంచివాళ్ళంటే అరికాలిమంట. కాని ఫ్రెంచి మనిషిని ఒక్కణ్ణికూడ చూడనేలేదు. ఆ తర్వాత చైనా దేశపు వంటవాళ్ళను గురించి మాట్లాడుకొనసాగారు.

ఇండియన్లు వుంటున్న బందిఖానాను కాపలాకాస్తున్న గస్తీ సిపాయీలు చలిని తిట్టుకొనసాగినారు. పాదరసం ఎక్కుతున్నదా, కిందికి పోతున్నదా అనే వితర్కం మొదలయింది. జీరో మట్టానికంటె పది డిగ్రీలైనా తక్కువ వుంటుందని ఒకడంటే, ఐదు డిగ్రీలు తక్కువైనతోడనే శీతోష్ణ స్థితిలో మార్పులు వచ్చినా ఎవ్వరూ తెలిసికోరని యింకొకడన్నాడు. ఐదు తక్కువైనా, ముప్పై డిగ్రీలు తక్కువైనా ఒక్కటేనట. చలినిగాని వేడినిగాని కొంతవరకే మనుష్యులు అనుభవించగలరు అన్నాడు. ఆ పైన సర్వం జగన్నాథమవుతుందట. దీనికి అందరూ ఔనంటే ఔనన్నారు.

ఆ రాత్రి తొమ్మిదిగంటల వేళప్పుడు రాబిన్సన్ దుర్గం యీ తీరునవుంది.

ఇండియన్ల బందిఖానాను చుట్టూ గొలుసు లంకెలవలె గస్తీ తిరుగుతున్న సిపాయీలలో ఒకనికి పదిగంటల సమయమప్పుడు యేదో చిత్రమైన అలికిడి విన వచ్చింది. పిస్తలును గెలుక్కుపెట్టినట్లుండిందని తర్వాత తర్వాత అతను గుర్తు తెచ్చుకొని చెప్పాడు. భయంకరమైన నీరవ నిశీథిలో చీమ చిటుక్కుమన్న సవ్వడికూడ దూరదూరాలకు పోగలుగుతుంది. ఆ గస్తీ సిపాయిపేరు పీటర్ జాఫిసన్. తనకు ఆవలిభాగాన్ని కాపలా కాస్తున్నవాడు వచ్చినదాకా నిలుచుని, అతనువచ్చి చేరాక, యిద్దరూ కలిసి బందిఖానా కిటికీలలో ఒకదానివద్ద క్షణం సేపు నిలుచున్నారు.

ఈ కిటికీలకు తలుపులు లోవైపున వున్నవి. లోపలివారు యిలు దాటి రాకుండానే లోపలనుండి కిటికీ తలుపులు బిగించుకొనే యేర్పాటున్న యిలాంటి యిళ్ళు అమెరికన్ సరిహద్దులో మామూలు. శత్రు దుర్గమాలు కావాలని కూడ యీ నివాస గృహాలను అమర్చి కట్టు కొంటారు. 'గట్టి ఎడమచేయి' అనే కుల పెద్ద వెస్సెల్స్ కార్యాలయంనుండి పారిపోయి తన జనాన్ని చేరుకొన్న వెంటనే, ఇండియన్లు వాకిలి, తలుపూ, కిటికీ తలుపులూ బందుచేసి, తిరిగి తెరవడమే మానివేశారు.

బయల్పడుతున్న అలికిడి నాలకిస్తూ, గస్తీ సిపాయీలిద్దరూ సాలకు మరీ దగ్గరగా నడిచారు. వీళ్ళిద్దరినీ చూస్తూ యితర గస్తీసిపాయీలు ఆగి నిలుచున్నారు. మొదట వినిపించిన చప్పుడువంటిదే తిరిగి వినిపించింది. కొయ్యగోడను అనేకులు లోపలినుండి నెట్టుతూ తొప్పుతున్నట్లు అనిపించింది. కిటికీ అద్దం ఒకచోట పగిలిపోయివుండడం చూచి, జాఫిసన్ సహచరుడు లూక్‌పర్డీ తుపాకిని లోనికి దూర్చి కిటికీ కానించి నెట్టాడు. అది కొద్దిగా సందిచ్చింది. చూస్తే, లోపలివాళ్లు బందులేసినట్లు లేదు. గట్టిగా అదిమి పట్టుకొని వున్నట్లుంది.

ఇదేదో కుంభకోణం అనిపించి, "లోపల ఏదో జరుగుతున్నట్టుందిరా" అన్నాడు జాఫిసన్. కిటికీ తలుపులకు తుపాకి మడిమ నానించి పద్ది నెట్టివేయ సాగినాడు. మరొక గస్తీ సిపాయి కూడా వచ్చి వీరికి జతకలిశాడు. తలుపులు వీపాన్చి నిలుచున్నవాళ్ళు గస్తీసైనికులవంక జాగ్రత్తగా చూడసాగారు.

తర్వాత యెవ్వరూ స్పష్టంగా సంబద్ధంగా వివరించి చెప్పలేనంత హఠాత్తుగా ప్రస్తుతవిషయాలు ఘటిల్ల మొదలయ్యాయి. ప్రతి కిటికీ క్రింద గుర్రపు జీనులను, చిల్లరసామానులనువేసి ఇండియన్లు మెట్లు యేర్పాటు చేసుకొన్నట్టు తర్వాతగాని తెలియలేదు. ఉన్నట్టుండి వాకిలితలుపూ, దానితోబాటు కిటికీ తలుపులూ అన్నీ ఒక్కసారి బారలుగా తెరుచుకొన్నాయి. కిటికీలు, అద్దమూ, చట్రమూ అన్నీ తునాతునకలైపోయాయి. ప్రతిఖాళీ జాగాగుండా ఇండియన్లు బయటికి మంచుపేరిన నేలమీదికి దూకసాగినారు. నమ్మశక్యం కానంతటి నరాల సత్తువతోటి మొదట మగవాళ్ళుదూకారు. తర్వాత స్త్రీలూ, పిల్లలూ జరజర జారి కొందరు, మగవాళ్ళు దించగా కొందరు, వ్రేలాడి దూకి కొందరు బయటపడినారు. మొట్టమొదట నేలకుదూకిన పదుగురు ఇండియన్లకైనా తుపాకు లున్నాయి; పిస్టళ్ళున్నాయి. ఇతరులు ఏవివీలైతే ఆ ఆయుధాన్ని తయారుచేసి కొనే వచ్చారు. ఇనుపకుంపటి కాళ్ళైనా, కట్టెలైనా, రాళ్ళైనా, పేళ్ళైనా, కత్తులేనా, రకరకాల ఆయుధాలు వున్నాయి.

వెంటనే పద్ది ప్రేల్చబోయాడు కాని, సరిగా అతని ముఖానికి నేరుగా పిస్టల్ ప్రేలింది. కిటికీ కెదురుగా మంచులో కుప్పకూలి పోయాడు. తొలి దెబ్బకే ఒక ఇండియన్ను జాఫిసన్ బలిగొన్నాడు. కానిమరొకరు వచ్చి యెత్తి అత తలకొట్టారు. జాఫిసన్ లేచి, కొయ్యగోడకు వీపాన్చి తుపాకిని ప్రేల్చసాగినాడు. గస్తీలలో చచ్చిపోయింది ఒక పద్దియే. ఆ దారినుంచి కొందరు తప్పుకొన్నారు. మరికొందరు ఇండియన్లపిడుగు దాడికి స్తంభించిపోయారు.

సైనికులు కవాతుచేసే బ్రహ్మాండమైన ఖాళీజాగాలో పడి, చెయిన్నీలు శక్తి వున్నంతవరకూ పరుగెత్తసాగినారు. పరుగెత్తలేని పసివాళ్ళనూ, ముసలి ముదకా వాళ్ళనూ యెత్తుకొని, చెట్లు గుబురు గుబురుగావున్న ఏటివైపు, ఆశ్రయం కొరకు, జలంకొరకు పరుగెత్తిపోయారు.

ఈ ప్రేల్పు చప్పుడు విని యెక్కడి సైనికు లక్కడ కలవరపడి లేచారు. పళిద్దామని కోటు బొత్తాములు విప్పుకొంటుండిన వెస్సెల్స్, రివాల్వర్ నెగిరి అందుకొని, కవాతు స్థలంవైపు పరుగెత్తాడు. పోకర్ ఆట ఆడుతుండిన సైనికోద్యోగులు యెగిరిపడి లేచి పరుగుతీశారు. ఈపాటికే ఒక నిద్రపోయిన సైనికులు లోదిరుసులోనే తుపాకులు చేదాల్చి వచ్చేశారు.

పచ్చని వెన్నెలలో ఏర్పాటుచేసిన నాటకరంగంవలె మంచుతో తెల్ల బారిన కవాతుస్థలం కనుపించింది. దానిలోబడి చెయిన్నీలు పారిపోతున్నారు.

సైనికుల కేమి, వుద్యోగుల కేమి యిదే భారతవిముక్తి తరుణం! ఘోర భయంకర మైన ఇండియన్ల పీడ విరగడైపోయే తరుణ మిదే! తాము 'స్వేచ్ఛ' అని పిలిచే రెండక్షరాలకు అమూల్యమైన, అసాధారణమైన విలువ నిచ్చి అందులో తమ ఉన్మాదాన్ని కుప్పించిన అపవిత్ర జనుల సంపర్కం యీ క్షణమే అంతరిస్తుంది!

ఎటుబడితే అటు తుపాకులు ప్రేల్చసాగినారు. మంచుతో తడిసిన కొత్త పెట్టే వెన్నెల శైత్యాన్ని మించిన హృదయశైత్యంతో, నిష్కారుణ్యంతో, అమానుష దురాగ్రహంతో, బంకమట్టితో చేసిన పావురాల ప్రతిమలను కాల్చి లక్ష్యశక్తిని పెంపొందించుకొనజూచే వారివలె, మనుషులను కాల్చి వేయసాగినారు. తుపాకి గొట్టాలు వుడుకెత్తి చేతులను మంటలెత్తించి నంతవరకు తుపాకులు ప్రేల్చారు. తెల్లటి మంచులో నల్లగా కనుపిస్తున్న యిండియన్లు చిరుగుపేలికల మూటలవలె కుప్పకూలి, విలవిల తన్నుకొని, పొర్లిపొర్లి, చనిపోతున్నారు. ఆలోచనలేదు, లక్ష్యంలేదు, విచక్షణలేదు, జాలి లేదు - యీ సైనికులు ఐదేళ్ళవాళ్ళనూ, పదేళ్ళవాళ్ళనూ ఎనభైఏళ్ళవాళ్ళనూ హతమార్చి వేస్తున్నారు. పారిపోయే ఆడవాళ్ళను ఆపి, గాయపడి మంచులోపడి మూలుగుతూ ప్రాకి ముందుకుపోయే వారిగుండెలలో తమ తుపాకులలో సీసాన్ని, పోసివేస్తున్నారు. చలినీ వలినీ మరచిపోయి, కాళ్ళకు పాదరక్షలైనా లేకుండా, ఇండియన్లవెంట పరుగులుతీసి, ఎక్కడైనా ఏదేనొక మానవాకృతి కదులుతున్నా, బ్రతికివున్నట్లు కనిపించినా, నిలిచి దానివుసురు తీస్తున్నారు.

తుపాకులూ, రివాల్వర్లూ వూని మొట్టమొదట దూకిన చెయిన్నీల అగ్రశ్రేణి యీ లోపల ఏరు చేరుకోగలిగింది. చేరుకొన్న వెంటనే మంచుమీద పడి, చేతులతోటీ, తుపాకులతోటీ మంచును పగులగొట్టి లేవనెత్తి చేతబట్టుకొని, వెనుకనుంచి తుపాకుల ప్రేల్పులు దగ్గరబడుతున్నా గాని, త్రాగిత్రాగి, గట్టు చేరుకొని, సైన్యాలను అడ్డుకోజూచారు. ఈ లోపల యితరులు యేటిలోపలికి దిగి, నీటికొరకు యెగబడి పోసాగారు. మొత్తానికి ఏభైమంది ఏటిలోకి దిగ గలిగారు.

వెస్సెల్స్, వ్రూమ్, అర్ధనగ్నశరీరులైన సిపాయీల వెల్లువను వెంటబెట్టు కొని మిగిలివున్న యీ చెయిన్నీల వెంటబడ్డారు. వెస్సెల్స్‌కు ఒక చేతిలో ఖాళీ రివాల్వరు వుంది. మరోచేత ఖడ్గంవుంది. రివాల్వరు నటూ యిటూ వూపుతూ, పిచ్చెత్తినట్లు పొలికేకలు పెట్టుతూ, ఏటిలోకి దిగినాడు. అతనిగుండెలలో నిప్పు మండుతున్నట్లుంది. మెదటిలో జ్వాలరేగుతున్నట్లుంది. ఈవెలుగులో, తనకు మొట్టమొదటిసారి వచ్చిన ఆధిపత్యం ఘోరపరాజయంపాలుకావడం అతను చూడగలిగాడు. ఈ అధికారం కొందరు ఖైదీలను తనచేతబెట్టింది. వాళ్ళను గురించి తనకు చేరిన వుత్తర్వులను పాటించలేకపోవడమే కాకుండా, వారిని పారిపోనివ్వడం మహాపరాధం! తన తప్పును, వైఫల్యాన్ని గుర్తించిన వెంటనే

అతనిలో రాక్షసకోపం పెల్లుబికింది. తర్ఫీదు, శిక్షణ, పెరిగిన తీరూ, చదివిన చదువూ, నిగ్రహమూ - యివన్నీ పటపట పగిలి తునాతునకలై పోయాయి. ఉన్మాదమూ, ఉద్రేకమూ, ఆగ్రహమూ - యివే మిగిలాయి యిప్పుడు.

ఏటిలోబడి ముసలివాడొకడు శిశువునెత్తుకొని పోతున్నాడు. ఒకే ఒక్క ఖడ్గ ప్రహారానికి ముసలివాడు తెగిపడిపోయాడు. అతని ప్రక్కనవున్నవాడెవడో గాని ఆశిశువును ప్రేల్చివేశాడు. ఏరుదాటి గట్టెక్కారు. అక్కడ యిద్దరు ఇండియన్లు చేత కత్తులతో నిలబడి, ముందుపోయే తమ జనం తప్పించుకొనునుగానని, సైన్యాన్ని కొంచెంసేపు ఆటకాయించడానికి సిద్ధపడివున్నారు. వెస్సెల్స్‌ను వెనకపరచి, సైనికులు దూసుకొని ముందుకు పోయారు. ప్రేలుస్తూనే వున్నారు. నిలబడివున్న ఇండియన్లలో ఒకడు కూలిపోయాడు. రెండవవాడు, నెత్తురు కాలవలు కట్టిన దేహాన్ని యెట్లోగాని నిలద్రొక్కుకొని, కత్తిని వూపుతున్నాడు. ఫ్రూమ్ కత్తిని అతని ఒంటిలో గ్రుచ్చిలాగాడు. మరికొంచెందూరాన యింకొక మొండి పోటరి క్షతగాత్రుడై నేలమీదపడి మృత్యుగీతిక నాలపించుకొంటు న్నాడు. ఖాళీ రివాల్వరును ప్రేల్చాడు వెస్సెల్స్. అతని వెనకనున్న సైనికులు చనిపోతున్నవాని ఒంటిలోకి పది పన్నెండు తూటాలైనా ప్రేల్చారు.

ఆరుగురు స్త్రీలూ, యిద్దరు మగపిల్లవాళ్ళూ ఒకరి నానుకొని ఒకరుగా మంచుమీద పండుకొని, కాలుకదపలేనంత నీరసపడి వున్నారు. ఒక స్త్రీ తన మృతశిశువును అదిమిపెట్టుకొని వుంది. ఆడవాళ్ళు ఆర్గురూ, పిల్లవాడొకడూ నెత్తుటిమడుగు కట్టినంతవరకూ సైనికులు ప్రేలుస్తూనే వున్నారు. రెండవ పిల్లవాడు జరిగి జరిగి పొదచాటుకుపోయి నక్కి కూర్చున్నాడు. వెస్సెల్స్ కొందరు సైనికులతోకూడ వాడి జాడబట్టిపోయాడు. పది పన్నెండు గజాల అవతల పెద్ద బీటవుంటే, అందులో ఒదిగి కూర్చున్నాడు. సైనికుడొకడు పైకెత్తిన తుపాకిని వెస్సెల్స్ నెట్టివేశాడు. మరొక సిపాయి వాంతులు చేసుకోసాగినాడు. వెస్సెల్స్ ఆ పిల్లవాణ్ని బయటికి లాగివేశాడు. పదకొండు పన్నెండేళ్ళుంటాయి. గడ గడ వణుకుతున్నాడు. వెక్కి వెక్కి యేడుస్తున్నాడు. భయాతిశయంవల్ల ఏవేవో ప్రలాపిస్తున్నాడు.

మూర్ఛ జబ్బువంటి భయంకారావస్థ గడిచిపోయింది. నెత్తురు మనస్సుల లోని పిచ్చికోపాన్ని కడిగివేసింది. రాబిన్సన్ దుర్గపు సైనికులు అలసిపోయారు; ప్రాణం మొత్తినట్లయింది. చల్లబడిపోయారు. ఆ కుర్రవాడిచుట్టూచేరి, ఓదార్చ సాగినారు, భయాలుడుప ప్రయత్నించారు. వాడి నెత్తుకొని దుర్గానికి తీసికొని పోయారు.

వెస్సెల్స్ చలిబారిపోయాడు. ఒళ్ళింకా కంపిస్తూనే వుంది. కడుపులో యేదో కెలుకుతున్నట్లుంది. ఎప్పుడో ఆగిపోయిన తుపాకి ప్రేల్పుడు యింకా

చెవులలో గింగురు మంటున్నది. గాయపడినవారి మూల్గులు తప్ప యిప్పుడు దుర్గంలో మరే అలికిడీ లేదు.

అతని చుట్టూవున్న సైనికులు మాటా పలుకూ లేకుండా చనిపోయిన యిండియన్ల నెత్తుకొని, కోట్యాలసాలకు తీసుకొనిపోయి గోడకు మొద్దుల నాన్చి నట్లు ఆన్చి పేరుస్తున్నారు. మరికొందరు గాయపడిన స్త్రీలను చేయిచ్చి నడిపిస్తున్నారు. పిల్లలను మోసుకొని తెస్తున్నారు. గాయపడినవారికంటె చనిపోయిన వాళ్ళే చాల యెక్కువమంది. డజన్లుడజన్లు శవాలు వచ్చి పడుతున్నాయి గాని అంతున్నట్లు లేదు.

వెస్సెల్స్ చికిత్సాలయానికి వెళ్ళాడు. అక్కడ డాక్టర్ క్లాన్సీ విరిగిన అస్థులనూ, చిరిగిన మాంసాన్నీ తిరిగి కూర్చడానికి ప్రయత్నిస్తున్నాడు. అతను పొట్టి మనిషి. బట్టతలవాడు. లోదిరుసుమీద షరాయి వేసుకొని, కాళ్ళకు పైజామలు తగిలించి, పనిచేస్తున్నాడు. చేతులకూ గుడ్డలకూ నెత్తురు మరకలు పడ్డాయి. మోచేతి దాపులో విస్కీసీసా వుంది. వేదన సూచించే ముఖాలతో ఇండియన్లు పడివున్నారు. పురుషులు కిక్కురుమనడంలేదు. గాని, పసివాళ్ళు బాధతోనూ, అనుభవించిన దారుణ స్వప్నస్మృతులతోనూ, కలవరపడి మెల్లిగా యేడుస్తున్నారు. స్త్రీలు మూల్గుతూ, వెక్కివెక్కి యేడుస్తున్నారు.

"తెగ త్రాగి కూడ ఫలితముండదు", అన్నాడు వెస్సెల్స్.

"త్రాగుడా?", అని డాక్టరు అతనివైపు ఒకమాపు చూచి, తర్వాత అతను అక్కడ వున్నగదికూడ గమనించలేదు.

"తప్పత్రాగికూడ ప్రయోజనముండదు అంటున్నాడు వినిపించిందా ?"

"నాశనమవుతావు, వెస్సెల్స్, నువ్వు!" అన్నాడు డాక్టరు.

"నోర్ముయ్ !"

తిట్టినతిట్టు తిట్టకుండా, పెట్టినశాపం పెట్టకుండా, డాక్టరు వెస్సెల్స్‌ను చెడతిట్టాడు. కాస్సేపు నిలుచుని విని, వెస్సెల్స్ వెళ్ళిపోయాడు.

తిరిగి వచ్చేటప్పటికి, ఏటిలో పడివున్న యిండియన్లను మరికొందరిని యెక్కించుకొని రావడానికి వెళ్ళిన వేగను వచ్చివేసింది. శవాలు చలికి కొరడు బారివున్నై. అక్కడనుంచి వెస్సెల్స్ భోజనశాలకు వెళ్ళేటప్పటికి, ముఖాన్ని చేతులతో కప్పుకొని, లెఫ్టినెంట్ ఎల్లెన్ ఏడుస్తూ కూర్చుని వున్నాడు.

"ఇదేమీ లాభంలేదు," అన్నాడు వెస్సెల్స్.

ఎల్లెన్ కదలనైనాలేదు.

"భగవంతుడా! మగవాడివిగా, ఎల్లెన్ ! బడికిపోయే బుడతడివా నువ్వు? ఆఫీసరువి ! లే, ఎల్లెన్ లే!" అన్నాడు.

ఎల్లెన్ నెమ్మదిగా లేచాడు "సరేనండి !"

"నీ గదికివెళ్ళు. పోయి నిదురపో హాయిగా. విశ్రాంతి పుచ్చుకో."

"సరేనండి."

ప్రొద్దుటికి అంతా బాగుంటుంది, నా మాటవిని నిద్రపో."

"సరేనండి."

బల్లదగ్గర కూర్చుని వెస్సెల్స్ చుట్టత్రాగాడు. మనస్సంతా వ్యాకులంగా వుంది. బయటి చలినుంచి ఫ్రూమ్‌లోపలికి వచ్చాడు. కాళ్ళు దిమ్మెసలవలె ధింధిమ్మని త్రొక్కుతూ వచ్చాడు. వచ్చీరావడంతోటే, చేతొడుగులు లాగి పారేశాడు. బెజ్జంపడిన గాలిసంచివలె కనుపించాడు వెస్సెల్స్‌కు.

"ఎల్లెన్ కనుపించాడు," అన్నాడు ఫ్రూమ్, వెస్సెల్స్‌ను చూస్తూ వెస్సెల్స్ యిచ్చిన చుట్ట తీసికొని కూర్చున్నాడు.

"భగవంతుడా!", అన్నాడు.

"ఎందుకు?", అని వెస్సెల్స్ అడిగాడు.

"ఇప్పటికి అరవై ఒక్కరు. ఇంకా వస్తున్నై శవాలు. గాయపడ్డవాళ్ళు కొందరు గుటుక్కుమంటారేమో!

"అరవై ఒక్కరు", అని వల్లించాడు వెస్సెల్స్. ఫ్రూమ్ చుట్టపొగ పీల్చి గుప్పు గుప్పున వదులుతున్నాడు నిరామయంగా.

"దక్షిణానికి పొమ్మంటే ఎందుకు పోయారుకారు?", అన్నాడు వెస్సెల్స్. ఫ్రూమ్ పొగత్రాగుతూనే వున్నాడు.

"అరవై ఒక్కరు", అన్నాడు వెస్సెల్స్ తిరిగి.

"ఆడవాళ్లెక్కువ", అని ప్రకటించాడు ఫ్రూమ్. కాస్సేపు వూరకే వుండి, "పారిపోయిన మూకావుంటే, వాళ్ళకు తుపాకులున్నై. తెల్లవారుతూనే లేచి వాళ్ళను పట్టి తీసుకురావాలి", అన్నాడు వెస్సెల్స్.

"అవును. కానీ మనం పోయేటప్పటికే కొరడుబారి చచ్చిపోయి వుంటేనో?"

"ఏమైనాకాని, మనం ప్రొద్దుటే బయలుదేరాలి."

"సరే".

"నువ్వు యిక్కడేవుండు. బాక్స్టరును వెంటబెట్టుకొని పోతాను."

"అట్లే కానీయండి", అని, ఫ్రూమ్ భుజాలెగురవేశాడు.

కాస్సేపు ఎవరూ మాట్లాడలేదు. చివరకు ఫ్రూమ్, "లోపలికి పోదామా?" అని అడిగాడు.

"అప్పుడే కాదు. రిపోర్టు రాయాలి."

రిపోర్టు పూర్తిచేసి, వెస్సెల్స్ తన మందిరానికి వెళ్ళి, విస్కీ బాగా సేవించి, నిద్రపోజూచాడు. కాని నిద్ర రాలేదు. గుడ్డలు కూడ విప్పకుండానే పడుకొన్నాడు. కళ్ళముందు చీకటిలో రకరకాల బొమ్మలు, వాస్తవాలైనంత స్పష్టంగా అగణ్యంగా కనుపించసాగాయి. లాభం లేదు. రబ్బరుకోటు వేసికొని,

కనుపించే బొమ్మలను పొరద్రోలుతూ, బయటికి మంచులోకి పోయాడు. గుబగుబ చెమటపోసింది.

ఇంకా శవాలను వేసికొని వస్తున్న వేగను కనుపించింది. తల ఒకరూ కాళ్ళొకరూ పట్టుకొని శవాలను సైనికులు విసరివేస్తున్నారు.

"ఎందరు?" అని ప్రశ్నించాడు.

చికిత్సాలయం గవాక్షాల ప్రక్కనుంచి నడిచిపోసాగాడు. ఇండియన్లు అప్పుడాలపించిన మృత్యుగీతికలు జ్ఞాపకం వచ్చినపుడు పుట్టిన బాధకు యిప్పటి బాధ యిబ్బడిగా వుంది. ఏదో ఒకటి చేస్తేనేతప్ప, మనస్సు నెమ్మదించదు అనుకొన్నాడు.

లెఫ్టినెంట్ బాక్స్టర్ కనుపించాడు. తనకు నిద్రపట్టకుండా వుందని బాక్స్టర్ చెప్పాడు.

"అట్లాగా-", అన్నాడు వెస్సెల్స్.

"ప్రధాన కార్యాలయంనుంచి ఏమైనా కబురు వచ్చిందాండీ?"

"ఇంకా యేమీ రాలేదు. నాకు తెలియదు. ఇప్పుడే రిపోర్టు పంపేశాను."

"పత్రికలలోకి యెక్కుతుందాండీ యిది?"

"తప్పదనుకొంటాను. పత్రికలవాళ్ళు తెలిసికోలేని రహస్యాలుండవు."

"నాపేరు కూడ పేర్కొన్నారనుకొంటాను-ఏమండీ?"

వెస్సెల్స్ తల వూపాడు. మానవహృదయంలో ఎన్నికోట్ల పొరలుంటాయో తెలిసికోవడం అతని బ్రతుకులో యిదే మొదలు. ఈ చిత్రవధతోటి బాక్స్టరు పేరు చేరిస్తే పరిస్థితులు యేవిధంగా పరిణమించగలవో, యేయే దుష్ఫలితాలు చేకూరగలవో తలచుకోవడానికి కూడ భయమేస్తున్నది.

"చేయక తప్పలేదు", అన్నాడు.

"బాక్స్టర్ తల వూపుతూనే వున్నాడు. భయపడిపోయిన పసిబిడ్డవలె వున్నాడు. కొయ్యలసాలకేసి చూపు సారించడానికి కూడ జంకు పుట్టుతున్నది.

"మనవాళ్లెందరు దెబ్బతిన్నారు?", అని వెస్సెల్స్ అడిగాడు. తాము ఇండియన్లతో యుద్ధం చేసినట్లూ, అందులో తమవారిని కూడ చాలమందిని ఇండియన్లు హతమార్చినట్లు చూపించాలి. లేకుంటే, చనిపోయినవాళ్లందరూ ఇండియన్లే అయితే, యిది యుద్ధమనిపించుకోదు, చిత్రవధ అనిపించుకొంటుంది.

"ఒక్కరు", అన్నాడు బాక్స్టర్.

"ఒక్కరా?"

"ఒక్కగానొక్కరే. కొయ్యలసాల దగ్గర, పేరుపర్డీ. గుండెలర్డీ. పేరుపర్డీ. గుం దూరిపోయింది."

"ఒక్కరేనా, ఒక్కరేనా", అన్నాడు వెస్సెల్స్, నమ్మశక్య." మ్మశక్క నమ్మశక

"నాకు నిద్రపట్టలేదు. అలసిపోయాను. నిద్రపోలేను", అన్నాడు బాక్స్టనర్.

"గాయపడిన వాళ్ళయినా వుండాలి. గాయాలు తగిలి వుంటాయి. వాళ్లు తుపాకులతో పోట్లాడారు కదా!"

"ఐదుగురికి గాయాలు తగిలాయండి. స్మిత్తూ, ఎవరెట్సూ బతకరేమో నండీ. వైద్యశాలకు వెళ్ళమంటే వెళ్ళారు కారు. నెత్తురు కారుతున్నాగాని, ఏటివైపే పోయారండీ మొదట్లో" నన్నాడు.

"అబ్బ! చాలుగానీ మానుకో!" అని వెస్సెల్స్ నిట్టూర్పు విడిచాడు.

"క్షమించండి, సర్"

"ఫర్వాలేదు ఫర్వాలేదు, తప్పునాదే."

"నేను యింకొకటి అనుకొన్నాను—"

"పోనీలే," అన్నాడు వెస్సెల్స్.

బాక్స్టనర్ నిలిచినచోట నిలువలేక పోతున్నాడు. తత్తర బిత్తరగా వున్నాడు. వెస్సెల్స్‌కు భయం మొదలయింది. "ఇప్పుడే ఆ ముఠా జాడబట్టి పోదాం," అన్నాడు.

"రేపు పొద్దుట—"

"ఇప్పుడే బయలుదేరుదాం," అన్నాడు వెస్సెల్స్.

*　　　*　　　*

వెస్సెల్స్, బాక్స్టనర్ తమతమ దళాలను వెంటబెట్టుకొని తెరువన్నే బయలుదేరారు. సియోక్స్ ఇండియన్ మనిషి ఒకడు దారిచూపుతున్నాడు. రోలాండ్ కూడా వస్తున్నాడు. వాళ్ళిద్దరితోనూ వెస్సెల్స్ ముందుండి పోతున్నాడు. బాక్స్టనర్ అందరికంటే వెనకవున్నాడు. మాటా పలుకూ లేకుండా సైనికులు గంటల పర్యంతం స్వారీచేశారు.

దుర్గానికి కొన్ని మైళ్ళదూరాన, ఏటిమంచులో మాయబడిన మొండి పోటరి ఒకడు పడివున్నాడు. మూడుచోట్ల గాయాలు తగిలివున్నాయి. గుండు దెబ్బ ఒకటి తలకుకూడా తగిలింది. ఇంతమోచైన గాయాలతో బాధపడుతూ యింతదూరం రాగలగడం చాలా అద్భుతమైన విషయం. అతనిని పూడ్చిపెట్టి, కాస్సేపు మకాంవేసి, ప్రొద్దుటి తిండి వండుకొని తిని, మళ్ళీ బయలుదేరారు.

ఒకచోట, ఇండియన్లు పట్టినజాడనుండి, రక్తసిక్తాలైన పాదముద్రలు ముగ్గురివి వేరొకదారి పట్టడం కనుపించింది. ఈ నెత్తురు జాడను అనుసరించి పైన్ చెట్ల గుబుర్లగుండా మూడుమైళ్ళు నడిచారు. ఇంతలో ఒక తుపాకి ఫెళ్ళున మ్రోగి ప్రేలింది. ఎక్కడివాళ్ళు అక్కడ ఆగిపోయారు. ఆ దెబ్బకు ఒక సిపాయి చేయి విరిగిపోయింది. వెంటనే గుర్రాలు దిగి, ముందుకు తుపాకులు ప్రేలుస్తూ ప్రాకి ప్రాకి ముందుకుపోయారు. కాని యెదుటివైపునుంచి స్వల్ప

విరామాలతో క్రమానుబద్ధంగా మొండిగా తుపాకి ప్రేలుతూనే వుంది. రెండు గంటలసేపు యీ విధంగా సైనికులు పైన్ చెట్ల గుబురులోనికి తమ తుపాకులలోని సీసాన్ని వర్షించసాగినారు. చిట్టచివరకూ, ఆ యెదిరి తుపాకీ నీరసమైపోయింది. సైనికులు ముందుకు ముందుకు ప్రాకుతూ, కాస్సేపు ఆగి చూస్తూ, గుమికూడుతూ వున్నారు. "తూటాలు అయిపోయాయి, అనుకొంటాను," అన్నాడు వెస్సెల్స్. పైకి లేచి సైనికులు అతని వెంటనే నడిచారు. ఇండియన్ యోధుడు చచ్చిపడివున్నాడు. కనీసం పది పన్నెండు తూటాలైనా తగిలి వుంటాయి. అతని శవం వెనుక, స్త్రీ లిద్దరు కొరడుబారి చచ్చిపడివున్నారు. చనిపోతూవున్నారని గ్రహించి వారికి యే విపత్తూ కలుగకుండా వుండేందుకు అసలు దారి తప్పించి, యిక్కడికి తీసుకొనివచ్చి వుంటాడేమో!

ఆరోజు రాత్రి వాళ్ళు మజిలీ చేశారు. మంచు పడసాగింది. ఈకలవలె సన్నగా పలచపలచగా పడింది మంచు. కాని యిది చాలు, చెయిన్నీలు పోయిన బాట జాడను తుడిచిపెట్టడానికి. తెల్లవారినతర్వాత, తిరిగి బయలుదేరారు. గుర్రాలు దిగి వాటిని నడిపించుకొంటూ, ఏటికిద్దరి కొందరూ, అద్దరి కొందరూ చీలిపోయి జాడను తిరిగి కనిపెట్టడానికి నానాతంటాలుపడి, చాలమైళ్లు వృథాగా నడిచారు. ఆ రోజుగాని, ఆ మరసటిరోజుగాని వారి శ్రమ ఫలించలేదు. మూడవ రోజుకు గాని మంచుజడి తగ్గలేదు. పేరిన మంచు కుంచుకొని పీల్చుకొని మురికి మురికిగా నీళ్ళుగా కరిగిపోయింది. నేల మెత్తబడింది. గుర్రాల డెక్కలు దిగబడసాగినవి. తొలివేసవిలోని పసందైన వెచ్చన వెల్లివిరిసింది. తిప్పలూ కొండలూ గడచి వచ్చారు. చూపు పోగలంత మేర అపారమైన బయళ్ళు ఎదురైనాయి. ఇదే వయోమింగ్ సీమ పొలిమేరలో వచ్చిపడ్డారు.

విసిరికొట్టినట్లు ఒంటరిగా బిక్కుబిక్కుమంటున్న పసులమంద యజమాని యింటిగదిలో నాగరికత కనుపించింది. నీలిపొగ గగనాని కెగబ్రాకుతూ వుంది. సైనికులకు ప్రాణం లేచివచ్చినట్లయింది. పరమపవిత్రభావం వంటిది యేర్పడింది. నెత్తురు చిందించిన చేతులు వాళ్ళవి. పోకిరిపనులు చేస్తూ తిరుగుబోతులైపోయి, చివరకు యింటికి తిరిగి వస్తున్న కుర్రవాళ్ళవలె వున్నారు. అందరికంటె ముందుండి వెస్సెల్స్ ఆ యింటిని సమీపించి, యజమానికోసం అరచి పిలిచాడు. మురికిబారిన తువ్వాలుతో చేతితడి తుడుచుకొంటూ, చిరునవ్వుకొంటూ, వచ్చాడు యింటి యజమాని. అవిసె నారవంటి తలలుగల పిల్లవాళ్ళిద్దరు చెరిఒక కాలు పట్టుకొని వచ్చారు.

"ఖులాసా, సిపాయ్ ?", అంటూ తల వూపాడు.

అతని భార్యకూడ వెలికి వచ్చింది. మంచి ఒడ్డూ పొడుగూగల విగ్రహం, నీలికళ్లు. చేదలు పట్టుకొని బావిదగ్గరకుపోయి నీళ్ళు చేదసాగింది.

"హాయిగా వుంది యిప్పుడు మంచు లేకపోతే," అని నవ్వుముఖంతో అన్నాడు యజమాని.

"వేసవిలాగే వుంది," అన్నాడు వెస్సెల్స్.

"ఈ కాలంలో యిలాగ వుండడం నే నెప్పుడూ యెరగను. రాబిన్సన్ నుంచా, సిపాయ్?"

అవునన్నట్లు వెస్సెల్స్ తలవూపాడు.

"కొండల్లో యెండబాగుందా?"

"చచ్చే చలి."

"అవునవును. నిన్నా మొన్నా యిక్కడకూడా చలి ఘోరుగా వుండింది."

"ఈ చుట్టుపట్ల ఇండియన్లేమైనా అవుపించారా?" అని అసలు విషయానికి వచ్చాడు వెస్సెల్స్. బాతాఖానీతో కాలయాపన చేయ వీలులేదు.

"నా మందను కాచేవాడున్నాడే, వాడేదో చూశానని చెప్పాడు. వాడు చెప్పినదాన్నిబట్టి ఏదో బ్రహ్మాండమైన హడావిడిగా వుందనుకొన్నాను."

"ఇండియన్లేనా?"

"నువ్వనేవాళ్లే కావచ్చు. చూడ్డానికేమీ సయించలేదట వాడికి. వాడు తాగివుండినా డనుకుంటావేమోనయ్యా, అదేమీ లేదు. వాడన్నాడుకదా —"

"పోనీలెండి, దానికేమి? ఎంతమంది" అన్నాడు.

"అంత తొందరెందుకయ్యా? చూసింది నేనుకాదుగా! వాడులేదూ—"

"ఎందరట?" అని కట్టెవిరిచినట్లు అన్నాడు వెస్సెల్స్.

"సరేనయ్యా సిపాయిదొరా, విను ఇరవైమంది వుంటారని అంచనా వేశాడు. తక్కువకూడా వుండవచ్చు."

"నడిచి పోతున్నారటనా?

"ఆఁ నడిచే!"

వెస్సెల్స్ మరి అక్కడ ఆగలేదు. అందరూ దక్షిణంగా హుటాహుటిని దౌడెత్తించారు. పాపపరిహారార్థం మరింత పాపంచేయడానికి, చేసిన విధ్వంసాన్ని పూర్తిచేయడానికి కృతనిశ్చయులయ్యారు. వయోమింగ్ సీమలోనికి చొరబారి, నల్లమల సీమబాట పట్టిపోయి, సాయం సమయానికి క్లిఫ్‌స్టేషన్ అనే మజిలీ చేరుకొన్నారు. అక్కడ సేకరించిన విషయాలు నమ్మదగినట్లున్నాయి. నరకలోకపు దుర్భర దృశ్యమొకటి యెదురైనట్లు, ముష్టివాళ్ళ ఉత్సవ యాత్రవలె దీనాతిదీనులు కొందరటు వెళ్ళిపోయినట్లు తెలియవచ్చింది. విశ్రాంతి తీసుకొందామని సైనికులు గుర్రాలజీనులు వదిలిస్తున్నారు. ఈ వార్తను విన్నదే తడవుగా వెస్సెల్స్ తిరిగి గుర్రమెక్కి కూర్చున్నాడు. సైనికులు కిక్కురమనలేదు. నసుగులాడలేదు. ప్రశ్నకూడా వేయలేదు. వదిలిస్తున్న జీనులను తిరిగి

బిగించి వాళ్లు యావన్మందీ దీక్షాబద్ధులైనట్లు గుర్రాలెక్కిన నీరవ విధానం చూడ భయంగొల్పింది.

మజిలీ స్థలానికి కొద్దిమైళ్ళదూరం పోయేటప్పటికే చెయిన్నీలు వేసుకొంటున్న మంటలు కనుపించాయి. వేట సమాప్తం కాబోతున్న దనిపించింది. త్వరితగతిని పోయి ఆ నరమృగాలను తుదముట్టించడానికి వెస్సెల్స్ మనస్సొప్ప లేదు. నెమ్మదిగా యింకా నెమ్మదిగా మునుసాగిపోయారు. మెత్తటి పచ్చికమీద పడి డెక్కలు సడిచేయడములేదు.

కాని చెయిన్నీలకు డెక్కల త్రొక్కిడి వినిపించివుంటుంది. బర్రె ఒంటలతో చేసిన మంటలను సైనికులు సమీపించేసరికి, అక్కడ ఒక పిట్టకూడా లేదు. సైనికులు అక్కడే కొంతసేపు వుండిపోయారు. ఈలోపల దారిచూపడానికి వచ్చిన సియోక్స్ ఇండియన్ మనిషి కొంతదూరం ముందుకువెళ్ళి, జాడ మీద వంగి, లేచి, యింతలో తిరిగి వచ్చేశాడు.

"ఎక్కడున్నారు వాళ్ళు?" అని వెస్సెల్స్ అడిగాడు.

"ఆవైన, బర్రెలు పొర్లే రొంపిగుంటలో వున్నారు."

వెస్సెల్స్ మనస్సు నిశ్చలంగా వుంది. తనకెంతో ముదిమి, అలసట, వేసటా పైబడినట్లు అనిపించింది. ఏదోవిధంగా ఎక్కడో ఒకక్కడ పడి నిద్ర పోవాలనిపించింది. బాక్స్టర్‌ను పిలిచి, "వాళ్ళను చుట్టుముట్టుదారి, తెలిసిందా? చుట్టూ సైనికుల్ని నిలుపు. ఎక్కడా సందు వుండకూడదు. అక్కడే పడుకొని నిద్రపొమ్మను. ఎవరెవరి స్థానాలలో వాళ్ళుండితీరాలి. బురదా? బురదాలేదు గిరదాలేదు. ఎవరెవరి స్థానాలలో వాళ్ళను నిలిపి అక్కడే నిదరపొమ్మను. సైనికుల వెనకవైపు యిరవైమంది గస్తీవాళ్ళు తిరిగేటట్లు యేర్పాటుచెయ్. ఒకరినొకరు చంపుకొనేటట్లు వుండకూడదు. తుపాకితూటాలు తగులుతాయేమో, గుర్రాలను దూరంగా తీసుకొనిపొమ్మను. నీ గుర్రం నీ దగ్గరే వుంచుకో. నాది నా దగ్గరే వుంటుంది. మిగతవాటి కన్నిటికీ జీనులు విప్పి దూరంగా తీసికొనిపొమ్మను. ఏం, తెలిసిందా?" అన్నాడు.

తెలిసిందన్నట్లు బాక్స్టర్ తల ఆడించాడు. నిలుచునే వెస్సెల్స్ నిద్ర పోతున్నట్లుంది. సైనికులను వలయాకారంగా తీర్చి నిలిపినతోడనే, కంబళి పరచుకొని, జీను తలగడగా పెట్టుకొని, క్షణంలో గాఢనిద్రపోయాడు.

తెల్లవారకమునుపే మేల్కొని, జీనుమీద తలవుంచి, సూర్యోదయాన్ని తిలకించసాగినాడు. వేకువ మంచుతెరలు ఒత్తిగిల్లాయి. బర్రెలుదొర్లే రొంపిగుంట స్పష్టంగా కనుపించసాగింది. దాని అంచు ఏటవాలుగావుంది. అక్కడయెక్కడో బురదలో వుంటారు చెయిన్నీ లిరవైచిల్లరమంది. ఏమీ అలికిడి లేకపోవడంబట్టి ఖాళీగుంటను చుట్టుముట్టి మూర్ఖపుపని చేశామేమో అనిపించింది. గుంట అవతలి గట్టు చాలాదూరానవుంది. గస్తీమనుషులు అల్పప్రమాణాలతో కనుపిస్తున్నారు.

సైనికులు ముడుక్కొని పడుండి నిదురిస్తున్నారు. ఈ వలయంనుండి యేదీకూడా తప్పించుకొని పోయివుండదు.

లేచి, ముడుచుకొనిపోయిన కండరాలను సాగదీసి, నిద్రిస్తున్నవారి ప్రక్కనే నడువసాగినాడు. ఇంతలో దుందుభి వూదేవాడు కనుపించాడు. ఒక క్షణంగా దుందుభి స్పష్టంగా మ్రోగసాగింది. ఇప్పటికీ రొంపిగుంటలో యే అలికిడీ లేదు. సైనికులు తిండి తినసాగినారు. సియోక్స్ ఇండియన్ మనిషిని పిలిపించి "అక్కడ వున్నారన్నావుగదా, నిజంచెప్పు, వున్నారా వాళ్లక్కడ?" అని గద్దించాడు వెస్సెల్స్.

అతను భుజాలెగురవేసి, "జాడ గుంటలోకి పోయింది. గుంటదాటిపోలేదు అందుకని వాళ్ళు అక్కడే వుంటారనుకొన్నాను."

"అన్ని వైపులనుంచి ముందుకు నడుద్దాం" అని వెస్సెల్స్ బాక్స్టర్‌తో చెప్పాడు.

"ప్రమాదం కాదా?"

"తుపాకులను కిందికివంచి పేల్చమని చెప్పు."

"వాళ్ళతో మాట్లాడిమాస్తే బాగుండదండీ?," అన్నాడు బాక్స్టర్.

"వాళ్ళతో మాట్లాడడమా?"

"ఆ జాతివా డిక్కడే వున్నాడు గదా!"

"భగవంతుడా! వాళ్ళా లొంగిపోయేది! చావాలని కోరుకొంటారు తప్ప యీ యెర్రముండా కొడుకులకు కావలసింది మరేమీ లేదు—చావు!"

"సంప్రదింపులు విఫలమైన తర్వాతనే కాల్పులు సాగించవలసి వచ్చిందని పైవాళ్ళకు తెలియచేయాలి కదండీ?"

వెస్సెల్స్‌కు యిప్పుడు తెలివివచ్చింది. ఆలోచిస్తూ, కాలిప్రేలిని బురదలో గ్రుచ్చ సాగినాడు. "మాట్లాడుతాను. తప్పదు."

రొలాండ్‌ను వెంటబెట్టుకొని పోయాడు. అతను వణకిపోతున్నాడు. భయాన్ని దాచిపెట్టుకోలేకపోయాడు. "ఇది పిచ్చి పని, నేను చెబుతున్నాను, యిది పిచ్చిపని" అని దారిపొడుగునా కల్లిస్తూ నడిచాడు.

"వాళ్ళను పిలువు," అన్నాడు వెస్సెల్స్.

తల విదిలించినట్లు వూపి, ముందుకు ప్రాకిపోయి, అందమైన శ్రావ్యమైన చెయిన్నీ భాషలో గొంతెత్తి ఏదో అరిచాడు. రొంపిగుంట అంచున ఠీవుగా లేచి నిలుచున్న చెయిన్నీ పురుషుని చూచేటప్పటికి వెస్సెల్స్ అబ్బురపడిపోయాడు. శవాకృతి ఎదురైనట్లుంది. ఆ మనిషి మంచి పొడగరి. ఎముకలుతప్ప ఆ దేహానికి మరే హంగులూలేవు. సగం ఒంటికి గుడ్డలేదు. వెస్సెల్స్‌వైపు ద్వేషంతోటిగానీ, పశ్చాత్తాపంతోటిగానీ చూస్తున్నట్టుగా లేదు. మాటల కతీతమైన హఠాదాశ్చర్యం తప్ప ఆ చూపులలో మరేమీలేదు.

ఆది చెప్పమనీ, యిది చెప్పమనీ రొలాండ్‌కు చెప్పనక్కరలేకుండా పోయింది. మొండిపోటరి వెలువరిస్తున్న నిట్టూర్పులనూ, మాటలనూ అనువదించి చెప్పమని కూడ అడుగనక్కరలేకపోయింది. రొలాండ్ తత్తరపాటుతో తిరిగి వెస్సెల్స్‌ను చేరుకొన్నాడు. వెస్సెల్స్ గుండెనిబ్బరం కూడ దెబ్బతినసాగింది. రొంపిగుంటనుంచి రయ్యిమని వచ్చిన తుపాకిగుండు అతని కాళ్ళముందే పడి బురదను రేగగొట్టింది. వెనక్కు తిరిగి బుద్ధిచెప్పసాగినాడు. నిలుచుని చూస్తున్న సైనికులు ఇండియన్లను దెబ్బతీయడానికి కదిలారు. వెనకనుంచి పరంపరగా వచ్చి పడుతున్న తుపాకి తూటాల విషయమే యెరగనట్లుగా, యెదురువస్తున్న సైనికులు వచ్చేవరకూ, ఆగి నిలుచున్నాడు. వాళ్లు వచ్చి చేరుకోగానే, తిరిగి గుంట వైపు మళ్ళి, అందరితోపాటు ముందుకు పో మొదలెట్టగానే, తలమీద ఏదో బలమైన దెబ్బతగిలింది. బురదలో కుప్పగూలిపడినాడు. ముఖమంతా బురదమయమయింది. ఇంతలో యిద్దరు సైనికులు వచ్చి లేవనెత్తి పక్కమీద పండబెట్టారు. చేతులు బారచాపి కళ్లుమూసుకొని పడుకొన్నాడు. పుర్రెకు తగిలిన గాయాన్ని తుడిచి కట్టుకట్టారు. సైనికుల దాడిని ఇండియన్లు తిప్పికొట్టారు. బాక్స్టర్ వచ్చి వెస్సెల్స్ శయ్యప్రక్క నిలుచున్నాడు. గాయం గురించి పదే పదే ప్రశ్నించసాగాడు. "బలమైన గాయమా?" "ఏమీ లేదు మహానుభావా! సైనికులవద్దకు పో, పుణ్యముంటుంది. లెఫ్టినెంట్, వెళ్ళిపో!" అన్నాడు వెస్సెల్స్.

"మళ్ళీ దాడి చేయమంటారా?"

"మొదటి దేమయింది?"

"మనవాళ్ళు యిద్దరు చనిపోయారు. ఏడుగురికి గాయాలు."

"కాల్పులు సాగిస్తూవుండండి. తుపాకులు వంచి కాల్చమని చెప్పు."

ఆ పగలంతా కాల్పులు సాగుతూనే వున్నాయి. రొంపిగుంట చుట్టూ బురద పోగుపడింది. అపరాహ్నమయింది. అంగుళమంగుళంగా సైనికులు పురోగమిస్తూ ప్రేల్చసాగినారు. కొంచెంకొంచెంగా, యిండియన్ల తుపాకుల ప్రోత తగ్గిపోసాగింది. చిట్టచివరకు పూర్తిగా ఆగిపోయింది.

పశ్చిమాన సూర్యబింబం పతనముఖం పట్టింది. ఇంకా సైనికులు ప్రేలుస్తూనే వున్నారు. దుందుభిప్రోత వినిపించిన తర్వాతనే, యిది ఆగిపోయింది. ఉన్నట్టుండి, నమ్మవీలులేనంతటి దివ్యప్రకాంతి విశాలమైన బయళ్ళలో వ్యాపించింది. గగనసీమలనుండి పక్షుచాలనాన దిగి రొంపిగుంటమీద యెగురుతున్న గ్రద్ద సర్రునతిరిగి పైకియెగిరిపోయింది. నిమిషాలు గడిచాయి. సూర్యుడు దిగ్గరేఖ మీద నిలుచున్నాడు. బంగరువున్నికంటి మబ్బొకటి సూర్యబింబాన్ని ఆక్రమించింది. ఇంతలో బాక్స్టర్ లేచి నిలుచున్నాడు. ఆతనివెంబడి యితర సైనికులు కూడా ఒకరొక్కరుగా లేచారు. తూచినట్లున్న క్రమగతితో యీనాట

యాత్రికులంతా రొంపిగుంటవైపు నడువసాగారు. తుపాకులను గట్టిగా పట్టుకొని ఏమిజరుగుతుందోనని మెలకువతో పోయారు.

ఏమీ జరగలేదు.

గుంట అంచున వలయాకృతిగా తీరి నిలుచున్నారు కొంతసేపు. వలయం యింతలో చెదిరి సడలిచ్చింది. సైనికులు ముఖాలింకొకవైపుకు త్రిప్పివేసుకొన్నారు. చెరొకప్రక్క చేరిన సైనికుల అండతో వెస్సెల్స్ వచ్చాడు. అతనికి దారి యిచ్చారు. రొంపిగుంట అంచుననిలుచుని, యిరవైరెండు మానవశవాలను తిలకించాడు. సూర్యుడు పరమపదించాడు. చల్లటి తెమ్మెర వీవసాగింది. లలిత, కోమల, సాధుసుందర నిశీధిని చనుదెంచింది.

# ప్రస్థాన సమాప్తి

## జనవరి 1879 - ఏప్రిల్ 18, 19

1879 వ సంవత్సరం జనవరి 18 వ తేదీన వెలువడిన "న్యూయార్క్‌-హెరాల్డ్" పత్రికలో ఆంతరంగిక వ్యవహారశాఖవారి దృక్పథం తేటతెల్లమయింది.

"కార్యదర్శిగారైన షుర్జ్ యీ విషయం గురించి మాట్లాడ నిరాకరించారు," అనే ఒక్క-వాక్యం యీ దృక్పథాన్ని అమెరికన్ జాతికి తెలియపరచింది. దేశచరిత్రకు సంబంధించిన దుమ్ము క్రమ్ముకొన్న కాగితాలు కూరిన మేజా సొరుగులలో చేరి యీ సంఘటన యింత తేలికగా మరుగుపడిపోయింది. ఆంతరంగిక వ్యవహారాల శాఖాధ్యక్షుడైన షుర్జ్ యీ విషయాన్ని గురించి మాట్లాడ నిరాకరించాడు! జర్మనీదేశాన పుట్టి, 1848 విప్లవంలో నిలిచిపోరాడి, అనేకులైన జర్మన్లవలె దేశంవిడిచి పారిపోయి అమెరికాకు వచ్చిన షుర్జ్, ప్రాతఃకాల గగన ఫలకంమీద జాజ్వల్యమానంగా వెలుగొందే "స్వేచ్ఛ" అనే పదాన్ని అప్పుడూ ఆ తర్వాతా తిలకించి మనస్సు వుప్పొంగిన షుర్జ్, ఆశామయ భవితవ్యమందు ఘనతచెందే సూచనలు కనిపిస్తున్న తొలినాళ్ళలో అమెరికా బాల్యావస్థలో వచ్చిచేరిన షుర్జ్, స్వాతంత్ర్య సందేశాలను తన దేశీయులకు మాతృ భాషలో ప్రవచించిన షుర్జ్, స్వచ్ఛమానవుడైన అబ్రహాం లింకన్‌తో పరిచయం కలిగిన షుర్జ్, అధ్యక్షుడు కావలెనని లింకన్‌కొరకు నడుము బిగించి పోరాడి, ఆ మహనీయుని స్నేహం సంపాదించిన షుర్జ్. అంతర్యుద్ధ కాలమందు సమాఖ్య పక్షానచేరి పోరాడడానికై స్పెయిన్‌దేశ రాయబారి పదవిని వదలుకొనివచ్చిన షుర్జ్, గెట్టిస్‌బర్గులో నెత్తురు కాలువలుచూచిన షుర్జ్-యితనేనా అతను? అనుమానంలేదు. వాడేవీడు! పత్రికా ప్రతినిధులువచ్చి కూర్చుని వున్నారని తెలిసి, "వారిని పంపించివేయు"మని అన్నదీ, యీ విషయాన్ని గురించి వివరణ అడిగినప్పుడు "నేను ఏమీ చెప్పవలచుకోలేదు" అన్నదీ యితనే. రాబిన్సన్ దుర్గంనుండి వచ్చేవార్తల విషయ మేమంటారు, అని అడిగినప్పుడూ, అదేజవాబు!

కెప్టన్ వెస్సెల్స్ పంపుకొన్న నివేదికను తిప్పి తిప్పి, తిరిగి తిరిగి చదువుకొన్నాడు. పితూరీ, తిరుగుబాటు, అవిధేయత అన్నమాటల అర్థం బోధపడకపోయినంతవరకూ, చదువుకొన్నాడు. బల్లదగ్గర కూర్చున్నవాడు లేవనేలేదు. మధ్యాహ్నం దాటింది, అపరాహ్ణం సాగిపోయింది, సాయంత్రం అయింది; కిటికీగుండా యింతవరకూ కనుపించిన చెట్టుకొమ్మలు యిప్పుడు కనుపించడం కూడాలేదు. గుమాస్తా మళ్ళీ లోపలికివచ్చి, మరొక పాత్రికేయుడు వచ్చి వున్నాడని చెప్పాడు.

"వాళ్ళ నందరినీ పంపించి వేయమని చెప్పానుగా!"

"జాక్సన్ గారండీ!"

"నాకిప్పుడు తీరిక లేదు."

"పోనంటున్నాడండీ. మీరు తీరేవరకూ కూర్చుని వుంటాడట. ఇది మీ చేతి కిమ్మన్నాడు—షెర్మన్ సేనానితో తాను జరిపిన ఇంటర్వ్యూ నకలట యిది!"

షూర్జ్ తల పంకించాడు. "కాచుకొని కూచోడమంత పనికిమాలిన పనిలేదని చెప్పు. నేను ఏమీ చెప్పదలచుకోలేదు."

"మీరు అన్నదే చెప్పిచూస్తాను" అని గుమాస్తా వెళ్ళిపోయాడు.

జాక్సన్ గుమాస్తాచేతికిచ్చి పంపిన కాగితాన్ని కొంతసేపటిదాకా షూర్జ్ ముట్టుకోనేలేదు. ఇంతలో సులోచనాలు తుడుచుకొని ముక్కుమీద పెట్టుకొని చదువ మొదలెట్టాడు. పైన జనవరి 16 వాషింగ్టన్ అని వుంది.

"ఇటీవల చెయిన్నీలు చేసిన పితూరీని గురించి 'హెరాల్డ్' పత్రికలో వెలువడిన వార్తలకంటె, యుద్ధశాఖవారికి అసలంగా యేమీ తెలియదు అని షెర్మన్ సేనాని చెప్పాడు. అప్పుడే రాత్రి భోజనం ముగించుకొని, కేపిటల్‌లో జరుగబోయే హెన్రీ మెమోరియల్ కవాతులను తిలకించడానికి పోబోతూ వుండినాడు.

'చెయిన్నీల చిత్రవధ గురించిన కథ యావత్తూ చదివారన్నమాట" అని మా విలేఖరి షెర్మన్ సేనాని ప్రశ్నించాడు.

"చిత్రవధ, చిత్రవధ! చిత్రవధ అని ఎందుకండీ పిలుస్తారు మీరు దీనిని? చెప్పినమాట వినకుండా, యెదురుతిరిగి, జిత్తులమారి వేషాలువేసి, నమ్మకద్రోహాని కొడిగట్టే యిండియనులు కొందరు మన సైన్యాల పట్టువిడిపించుకొని పారిపోయారు. ఈ పితూరీపని జయప్రదం కావడానికి దౌర్జన్యానికి కూడ పూనుకొన్నారు. వాళ్ళకు జరిగిన ప్రాయశ్చిత్తం చేసిన నేరానికి తగిందే. ఈ మహాపరాధాన్ని మెత్తమెత్తటి మాటలతో మన్నించ చూడటంకంటె తెలివి తక్కువ వుండదు.'

" 'మీరన్నది నిజమే కేమోకానీ, సేనానిగారూ! చెయిన్నీలు పట్టు విడిపించుకొని పారిపోవడానికి కారణంగా బలవత్తరపరిస్థితులు కొన్ని వుండి వుంటాయేమో?'

" 'ఆ ప్రశ్నకు జవాబు సులభం. రాబిన్సన్ దుర్గంనుండి ఇండియన్ ప్రదేశానికి చెయిన్నీలను పంపివేయవలసిందని ఉత్తర్వు పంపాం. వాళ్ళు దీనికి ససేమిరా ఒప్పుకోలేదు. ప్రతిఘటించారు. ఎదురుతిరిగారు. పారిపోయారు. మేము పంపిన వుత్తర్వులను అమలుజరపడం క్రూక్ సేనాని విధి. సేనలలో అవిధేయతవుంటే సైనిక క్రమశిక్షణ నాశనమైపోతుంది: మన జాతిలో నైనైతే సహించలేమో, దానినే యిండియన్లు చేస్తుంటే చూస్తూ వూరుకోగలమా? వల్ల కాదు. వీలులేదు. ఏమైనాగానీ ప్రతిఘటించడానికి తలపడ్డారు ఆ తుంటరి వెధవలు. వాళ్ళు ఆడిందంతా ఆట, పాడిందంతా పాట అయితే ప్రభుత్వ మెందుకు? ఇందరుకాదు. యింకనందరు యెత్తివచ్చినా, ప్రభుత్వం చిత్తుచిత్తు చేస్తుంది. కాబట్టి విషమపరిస్థితులకు అనుగుణమైన విషమచర్యలే అవలంబించడం జరిగింది."

"ఇండియన్ ఏజంటు పక్షపాతమే ఇండియన్లను రెచ్చగొట్టిందని మీకు తెలియదా యేమిటి?"

"అలేమీలేదు. రాబిన్సన్ దుర్గంనుండి తమకోసం కేటాయించబడిన ప్రదేశానికి వెళ్ళిపోయి రావలసిందని చెయిన్నీలను ఆజ్ఞాపించాం. ఈ ప్రయాణాన్ని నడిపించమని సైన్యాధికారులకు తెలియజేశాం. కాని వాళ్ళు పోమన్నారు. మరేం చేయడం? వాళ్ళనుంచి యేలాంటి ముప్పూ రాకుండా లందులకు ముందుగా అవసరమైన జాగ్రతలు తీసుకొన్నారు అక్కడి అధికారులు. కాని యివి పకడ్బందుగా లేవు కాబట్టే మన సైనికులకూ ఇండియన్లకూ కొట్లాట జరిగింది."

ఈ యింటర్వ్యూ కొసముట్టలేదు. మధ్యలో ఆగిపోయింది. అనుమానాలు మలగూడాలూ లేకుండా శుభ్రపడిన మనస్సుతో షెర్మన్ సేనాని యిల్లువిడిచి పోవడానికి తొందరపడుతూ, కోటుధరిస్తున్నట్లుగా షుర్జ్ వూహించుకొన్నాడు. మొదట్లో షెర్మన్‌గారి నిశ్చింతనుచూస్తే అసూయపుట్టింది. తర్వాత ఆశ్చర్యం కలిగింది. చివరకు భయంవేసింది. ఇంటర్వ్యూ నకలును కళ్ళప్పగించి చూడ సాగాడు.

గుమాస్తాకోరకు గంట కొట్టాడు. అతను వచ్చినవెంటనే, "జాక్సన్ గారన్నావే, అతనింకా కూర్చునేవున్నాడా?" అని అడిగాడు.

"పోనని చెప్పాడండీ."

"మంచిది. లోపలికి రమ్మనిచెప్పు," అన్నాడు షుర్జ్.

జాక్సన్ అడుగుమీద అడుగువేసుకొంటూ లోనికివచ్చాడు. అతని వికారమైన కోలముఖాన ఏ కదిలికా లేదు. ఒదులు ఒదులుగా వున్న గుడ్డలు నలిగిపోయి

వున్నాయి. కార్యదర్శిగారు ఆసనంచూపి కూర్చోమన్నంతవరకూ నిలబడి వుండి పోయాడు.

"పొగ త్రాగండి," అంటూ షుర్జ్ చుట్టలపెట్టెను ముందుపెట్టాడు. జాక్సన్ చుట్టతీసికొని, కొన కొరికివేసి, షుర్జ్ వెలిగించి అందించిన అగ్గిపుల్లతో ముట్టించాడు. పొగ గట్టిగా దమ్ముపీల్చినాడు.

"మీరు రీమధ్య లేరు. ప్రయాణాలంటే బాగా యిష్టమా?," అన్నాడు షుర్జ్.

"పెద్దబాధ," అని జాక్సన్ జవాబు చెప్పాడు.

"అరె? అవునులెండి. కొందరు యిల్లు వదలకూడదు, యింకొందరు ప్రయాణాలు చేస్తుండాలి, తప్పదు. వెయ్యిమైళ్ళు రైలుప్రయాణం చేసినంత కంటె చుట్ట ఒక్కటి యెక్కువ విలువయిందని నేననుకుంటాను. మీరో?"

"నేనున్నూ."

"ఇండియన్ ప్రదేశానికి పోయివచ్చారా?" అని అడిగాడు షుర్జ్.

"ఆఁ!"

షుర్జ్ నిట్టూర్పు వదిలాడు. "స్వల్పవిషయాలను గురించి ఆర్భాటం చేయడం మంచిదికాదు. ఒక విషయం ముగింపయితే మరి లేవనెత్తడం బాగుండదు. మరిచిపోవాలి. ఏమంటారు?"

"నిజమేనేమో," అన్నాడు జాక్సన్.

"ఈ యింటర్వ్యూ—", అని మొదలుపెట్టాడు షుర్జ్.

"అంతరంగిక వ్యవహారాల కార్యదర్శి ఏమీ చెప్పదలచుకోలేదట, అన్నారే!"

"కాని మీరు దీనిని అచ్చువేయకూడదు".

"అచ్చువేయక తప్పదండీ!"

"వద్దువద్దు—అచ్చువేయవద్దు", అని పట్టుపట్టాడు షుర్జ్.

"షెర్మన్‌గారిని గురించి నేను యేమైనా అనుకోవచ్చు గాని ఆయన కపటికాదు. ఆయన నమ్మకాలు తప్పేగానీ, కాకపోనీ, ఆయన నిష్కపటి."

షుర్జ్ అతనివంక తేరిపారజూచాడు. "రాబిన్సన్‌దుర్గాన జరిగిన విషయాలు మరచిపోవడానికి ఆరునెలలు, లేకుంటే ఆరువారాలు పట్టుతుంది. కాని మూలసిద్ధాంతాలలో తప్పయినది ఏదీ ఆచరణలో ఒప్పు కాజాలదని షుర్జ్‌గారు ప్రవచించిన సూత్రాన్ని ఎవరైనా ఎన్నటికైనా మరచిపోగలరా?"

"మీకేం కావాలి?" అని నెమ్మదిగా అన్నాడు షుర్జ్.

"ఈ విధంగా బరితెగి మాట్లాడుతున్నందుకు నన్ను మెడబెట్టి గెంటించాలి" అన్నాడు జాక్సన్ వేళాకోళానికి. తనను చులకన చేస్తున్నట్లనిపించి, కార్యదర్శిగారికి కొద్దిగా కోపం వచ్చింది.

"ఏంకావాలి మీకు?" అన్నాడు షుర్జ్.

"కార్యదర్శిగారు యీ వ్యవహారంగురించి వివరణ యివ్వాలి. దానిని నేను పత్రికకు పంపితే, నా శక్తిని మెచ్చి పై వుద్యోగం యిస్తారు."

"నేనేమీ చెప్పదలచుకోలేదు."

జాక్సన్ లేచి నిలుచున్నాడు. వాకిలిదాకా పోయి, అక్కడ ఆగి, వెనక్కు తిరిగి, కార్యదర్శిగారివైపు చిత్రంగా చూచి, "షుర్జ్‌గారూ" అన్నాడు నెమ్మదిగా.

"ఇండియన్లు చచ్చిపోయారే అని జాలి వొలకడంలేదు నాకు. ఇది మనకు మామూలైపోయిందేగా! గాని రాబిన్సన్ దుర్గంలోనివారు తుపాకులను ఒక్క ఇండియన్లమీదనే కాదు, మీమీదా, నామీదాకూడా గురిపెట్టారని తెలుసుకోండి" అంటూ నిష్క్రమించాడు.

ఒక్క గంటసేపయిన తర్వాత, షుర్జ్ కాగితంమీద కలంపెట్టి రాయసాగాడు. ఇంకా ప్రాణాలు నిలుపుకొని, వుచ్చులు తప్పించుకొని, నూటయాభై మంది ఇండియన్లు వుత్తరాన ఎక్కడో వున్నారు. క్రూక్ సేనానికి షుర్జ్ పంపిన లేఖ ఓటమిని ఒప్పుకోనకుండానే ఒప్పుకొన్నట్లుగావుంది. అది వ్రాయడం పూర్తి చేసేటప్పటికి తాను మహావృద్ధుడైపోయినట్లు, వేసటచెందినట్లూ అనిపించింది. తాను అల్పుడనని గోచరించింది. గుమాస్తాను పిలిచి "ఈవేళే పంపించు. మరి, నేను యింటికి పోతాను," అన్నాడు.

చీకటిలో పడి నెమ్మదిగా యింటికి నడిచిపోయాడు. ఆరు వారాలలోనో, ఆరుమాసాలలోను, నెబ్రాస్కా రాష్ట్రంలోని రాబిన్సన్ దుర్గంలో దుర్ఘటిల్లిన చిత్రవధ విషయం ఏ ఒక్కడికీ గుర్తుండబోదనిపించింది. యుగయుగాలనుంచి తమదై వుండిన సుదూర సీమలో నూటయాభైమంది అనాగరిక ఆటవికులు తిరిగి కాపురాలు నెలకొల్పుకున్నా పోయేదేమీ వుండదనిపించింది

అందరూ ఒకయెత్తు, ముర్రే ఒకయెత్తు. అందరికీ గొడవ వదిలిపోయింది కాని ముర్రేకు వదలలేదు. జనవరి మాసంలో రాబిన్సన్ దుర్గంనుంచి వచ్చిన వార్తలు విన్నాడు. ఫిబ్రవరిలో. రొంపిగుంటలో జరిగిన చిట్టచివరి పోరు జరిగిన తీరంతా చెవులప్పగించి ఆలకించాడు. అందరూ వెస్సెల్స్ తెలివినీ, తెగువనూ మెచ్చుకొంటున్నారు. ఈ వుదంతాన్ని వివరించి చెప్పడం ముగించిన లెఫ్టినెంట్ ముర్రేవైపు తిరిగి, "మీరూ చేతులుకలిపారుగా, వాళ్ళతో? గట్టి సరుకేకదూ అది, కెప్టెన్?" అని అడిగాడు.

"అవును -"

ముర్రేముఖం నిశ్చలంగావుంది. దేనిలోనూ అతనికి ఆసక్తివున్నట్లులేదు. బల్లవద్దనుంచి లేచి వెళ్ళిపోవడంచూచి, లెఫ్టినెంట్ భుజాలు విదిలించి, తిరిగి కథ చెప్పుకొనిపోసాగాడు.

తొమ్మిది వారాలనుంచీ యిక్కడ కిరోాఫ్ దుర్గంలో వుంటున్నాడు ముర్రే. తోడేలుతో బోయిన ముతా జాడను వెంబడించి వెంబడించి నల్లమలల సీమలోనికికూడ పోయాడు. కాని అక్కడ జాడ మరి కనుపించలేదు. అంతూ పొంతూలేని ఆ పచ్చటి కొండసీమలో, అగణ్యమైన లోయలలో, కాకికూడా దూరలేని కారడవులలో ఎక్కడవున్నారో యిండియన్లు! శీతకాలపు మంచు ముమ్మరం మొదలు కాకమునుపే వీరి అంతుపట్టాలంటే వ్యవధి చాలదు సరి కదా, మానవమాత్రులకు సాధ్యంకాబోదు. ఇంతలో ఇండియన్ ప్రదేశంనుండి కల్నల్ మిజ్నర్, ఆశ్వికదళాలను తిరుగు ప్రయాణంకమ్మని వుత్తర్వు పంపాడు. కాని, తనను మైల్స్ సేనాని ఆధిపత్యానికి బదిలీచేయవలసిందని ముర్రే తంతి కబురు పెట్టాడు. అనుజ్ఞ కాగానే, తన సైనికులను విడిచిపెట్టి, మాంటానా రాష్ట్రం లోని కిరోాఫ్ దుర్గానికి వచ్చేశాడు.

వింట్ వద్దనుండి ముర్రే వీడిపోవడం చిత్రంగా వుండింది. ముర్రే ఎక్కువ యేమీ మాట్లాడలేదు. ఎప్పుడెప్పుడు వీళ్ళను విడిచిపెట్టి పోదామా అని త్వరపడసాగినాడు. వింట్ వ్యాకులుడైనాడు. మామూలు వీడ్కోలు మాటలే వాడినాడు.

"సరే, సరే," నన్నాడు ముర్రే, దరహాస వదనంతోటి "నేను వెదుకు తున్న వస్తువు అక్కడికి దాపులోనే వుంటుంది కాబట్టి నాపని సులువు కావచ్చు," అన్నాడు.

మంచు చుట్టూ పేరుకొన్న కిరోాఫ్ దుర్గంలో ముర్రే తొమ్మిది వారాల నుంచి వుంటున్నాడు. ఎంతో కాల మనిపించింది. బ్రతుకు మొద్దుబారిపోయింది. దుర్గాధిపతులతో సంబంధ బాంధవ్యాలు పెట్టుకోనేలేదు. నేస్తులెవరూ లేరు. అక్కరలేదు. ఏకాంతమే కావాలి. దేనిలోనూ ఆసక్తిలేదు - చెయిన్నీలను గురించి తప్ప. చెయిన్నీలు కనుపించిన తర్వాతకూడ వారినేమీ చేయవద్దని చిట్టచివరకు పైనుంచి వుత్తర్వులు అందగానే, ఆ కొద్దిపాటి ఆసక్తీ వుత్సుకత కూడా అంత రించి పోయింది.

*　　*　　*　　*

అంతవరకూ అన్నీ పుకార్లేగాని చెయిన్నీలను గురించి నిఖరమైన వార్తలు ఏప్రిల్‌లోనే దుర్గానికి చేరసాగినవి. పౌడర్ నదికేసి యిద్దరు మార్గదర్శకులను వెంటబెట్టుకొని పోయివుండిన లెఫ్టినెంట్ క్లార్కుకు చెయిన్నీలు తగిలారు. పౌడర్ నది గట్టున, క్లార్కును వెంబడించిన సియోక్సు తెగ యిండియన్ దారి చూపుడు మనుష్యులు చెయిన్నీలను కలిసి మాట్లాడినారనీ, క్లార్కుతో భేటీకి 'తోడేలు' ఒప్పుకొన్నాడనీ, దుర్గానికి కబురు వచ్చింది.

ఇండియన్ల వెంటబడి ముర్రే సాగించిన వేట గుర్తుకురాగా, మైల్‌కి సేనాని ముర్రేను పిలిచి, "చిత్రంగా వుందికదూ కెప్టన్, వాళ్ళు ఎట్టకేలకు

సామానికి రావడం? నిన్ను వేధించి సాధించి చిట్టచివరకు ఎట్లాదిగివచ్చావో మాశావా?" అన్నాడు.

"నా కేమీ తెలియదు. ఇళ్ళకు పోవాలని మాత్రమే వాళ్ళు కోరుకొన్నది. అదనమేమీ కోరుకొనలేదనుకొంటాను నా మట్టుకైతే నేను."

"నిజమే. స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను గురించి అనాగరికులున్నంత పట్టింపు మనకు లేదు."

"అంతేనేమో," అన్నాడు ముర్రే.

"ఇకముందు యేంచేయదలచుకొంటున్నావు కెప్టెన్?"

"ఏమీలేదు. ఉద్యోగానికి రాజీనామా యివ్వాలనిపిస్తున్నది. సైన్యాన్ని వదలివేస్తాను."

"అదేమిటి కెప్టెన్? ఎన్నాళ్ళనుంచో రాటుదేరిన యోధుడివి. మరొక విధంగా అనుకోకపోతే, నేనొకమాట అంటాను. నీటబాసిన తామర పూవులాగ బాధపడవలసి వస్తుందేమో!"

"కావచ్చు."

"ప్రమోషను విషయమై నే నేదైనా సిఫార్సు చేయవలసిన అవసరమైతే, తప్పక-"

"వద్దండీ, సర్; వద్దు. మీ సహృదయతకు కృతజ్ఞుణ్ణి. కాని నేనీవరకే నిశ్చయించుకొన్నాను, క్షమించండి."

*　　*　　*

గత అక్టోబరు మాసంలో 'తోడేలు' అగ్రనాయకుడు కాగా, నూటయాభై మంది ఇండియన్లు, స్త్రీ పురుషులు, బాల, వృద్ధులు కెప్టెన్ ముర్రేని, క్రూక్ సేనానిని తప్పించుకొని, ప్రపంచపు చూపుకందక, స్వేచ్ఛను తమకు ప్రసాదించిన మాటల నుల్లంఘించిన కార్ల్ షుర్జ్ గారికికూడ అంతుపట్టక, పారిపోయారు. ఉత్తరం యింకా ఉత్తరం వెళ్ళిపోయారు. మిక్కిలి నదులలో తాము పట్టిపోయిన బాట శత్రుదృగ్గోచరం కాకుండా, మంచు కురుసునడిచి దానికి స్వాగతవచనాలు పలుకుతూ, వెనుదిరిగిపోయే అలవంటి తమ తికోగతిని మంచుదుప్పటితో కప్పివేస్తూ, చిట్టచివరకు కన్న కలలు ఎదురైనట్లు ముందు నిలిచిన పచ్చటి కొండల వంగిన బుజాల గోడలను దర్శించగలిగారు.

భూవివరంలోనికి పోయే నక్కవలె నల్లమలలలో ప్రవేశించారు. తమ ప్రియాతిప్రియమైన స్థలాన్ని వెదుకుకొంటూ యింకా లోలోతులకు పోయి పోయి, ఎట్టకేలకు దానిని చేరుకొన్నారు. ఇరువైపుల రాతలుపు లున్నట్లుగా మూసికొనిపోయిన లోయ. ప్రపంచంతో సంబంధమే లేని లోయ. తరుగుల్మలతా సమృద్ధ సుందరమైన లోయ. ఆశ్రయదాత రక్షాగృహం యిదే! పచ్చిక తివాసీ యిదే! పనులకు కావలసినంత మేపచ్చి

బలిపించే పచ్చిక! తెగబలిసిన ఎలుగుబంట్లకూ, దుప్పులకూ ఆలవాలమైన సీమ. కనడా దేశమందలి హిమావృతాలైన మరుభూములనుండి యెగిరివచ్చే అడవి బాతులు యిక్కడే వ్రాలుతాయి! చిట్టెలుకలపుట్ట. ఉడతల కాటపట్టు. ఇదే తాము స్వప్నించిన ఫలమయ సంపన్నమయ మనోజ్ఞసీమ!

ఇక్కడ కుదుటుకొన్నారు. రోజులు వారాలై, వారాలు నెలలైనవి. చివర కూచిమొన కలిగిన తమ తోలు గుడారాలచుట్టూ మంచు గుట్టలు పడసాగింది. పరుగెత్తుతూ తాము మాసాల తరబడి సాగించిన ఘోర పోరాటం మనస్సులనుండి మాసిపోసాగింది. మంచుగోడలు పెట్టిన హిమావృత పర్వత పంక్తి పెట్టని కోటలై పరిరక్షిస్తున్నాయి. పిల్లలు పుట్టుతున్నారు. తల్లుల పాలిళ్ళు జీవధారపోసి పెంచుతున్నాయి. ఎదిగిన పిల్లలు మంచులో ఆడుకొంటూ దానిని భస్మప్రాయ మొనరిస్తున్నారు. భస్మంకలె వుండిన ఎర్రదుమ్మూ; మాడిన పస్తులు, కుంచిన మలేరియా జ్వరాలు, నాగరికతకు ప్రతినిధులైన దారుణదానవ స్వభావులు, దరోవిర్ధతులు — వీటినన్నిటినీ మరచిపోయారు.

అందరికీ యీ మరపురాలేదు. అసలు గూడెంలో వుండిన ముహ్నాగ్గురు యిచ్చి పుచ్చుకోలు పెళ్ళిళ్ళవల్ల ఏక కుటుంబీకులు కాని ప్రస్తుతం 'తోడేలు' నాయకుడై వున్నజట్టులో, అన్నదమ్ములు అక్కచెల్లెళ్ళకోసం, తలిదండ్రులు కన్నబిడ్డలకోసం, బిడ్డలు తల్లిదండ్రులకోసం బెంగ పెట్టుకొని ఎదురు తెన్నులు చూస్తూ రోజులు లెక్కించుకొంటున్నారు. వాళ్ళకా దారుణచరిత్ర ఎట్లా మరుపు వస్తుంది!

ఎదురు జూస్తూన్నారు. పొగాకును భద్రపరచి నిక్షేపించుకొంటూ పొగ పీలుస్తున్న 'తోడేలు', తమను యింతవరకూ రక్షించిన మంచు గుట్టలను చూచి, కల్లోలపడ సాగినాడు. వసంతర్తువు పర్వత ద్వారాలను తెరచి, ప్రపంచాన్ని తొంగిచూడనిస్తుంది కదా, తిరిగి వుచ్చులు పన్నుతారేమో విరోధులు! గాలిమారి, వసంతాగమన చిహ్నాలు కనిపించినదే తడవుగా, గుడారాలు దించి, తిరిగి ప్రయాణం కట్టమని తన ఆత్మీయుల నాదేశించాడు. గమ్యమేదో ఆతనికే తెలియదు. ఇంకా వుత్తరాభిముఖులై పోతే, తమకంటె ముందే సియోక్స్ ఇండియన్ తెగ 'ఎద్దు' పెత్తనాన పోయి చేరుకొన్న 'కనడా' అనే కల్పనా కథల సీమకు పోగలమని 'తోడేలు' ఆలోచన చేశాడు.

పర్వతాల నతిక్రమించి, పౌడర్ నదికి వాయువ్యదిశగా పురోగమించారు. ఇక్కడే వాళ్ళు, లెఫ్టినెంట్ క్లార్కుకు దారి చూపడానికి వచ్చిన సియోక్స్ ఇండియన్ మనిషిని కలిసికొన్నది! ఇక్కడే వాళ్ళకు, కార్ల్‌షుర్జ్ చేసిన నిర్ణయం మొట్టమొదట తెలిసింది! ఇక నిర్భయం! ఇక స్వేచ్ఛ! నిరాటంకమైన పూర్ణమైన స్వేచ్ఛ!!



# అనుబంధం

## రచయితను గురించిన విషయాలు

హోవర్డ్‌ఫాస్ట్ 1914 లో న్యూయార్కున జన్మించాడు. అతని తండ్రి వడ్రంగి. యంత్రోత్పత్తి వస్తువుల ముమ్మరంవల్ల తండ్రి వృత్తి అణగారిపోయింది. ఏడేళ్ళ ప్రాయంలోనే ఫాస్ట్ కాయకష్టానికి అలవాటు పడిపోయాడు. చుట్టల ఫ్యాక్టరీలోను కసాయి దుకాణంలోను పనిచేశాడు. చిన్ననాటి నుంచి కళాప్రియుడు. ఈ చిల్లర వుద్యోగాలకు స్వస్తిచెప్పి, చదువు మొదలు పెట్టాడు. ఉన్నతపాఠశాలలో విద్య ముగించిన తర్వాత, "నేషనల్ ఎకాడమీ ఆఫ్ డిజైన్"లో చేరాడు. కొంతకాలం శిక్షణ పొందినమీదట, ఈ రంగంలో తనకు వుజ్జ్వలమైన భవిష్యత్తు వుండబోదని గ్రహించి, చరిత్ర పరిశోధనవైపు చూపు మరల్చాడు. క్రమక్రమంగా రచనా వ్యాసంగంలోకి చొరబారినాడు. పదిహేడేళ్ళ వయసులోనే మొదటినవల పూర్తిచేశాడు. కాని దానివల్ల ధనమేమీ లభించలేదు. ఇంతలో అమెరికాలో వ్యాపించిన ఆర్థిక సంక్షోభం ఫలితంగా తయారయిన లక్షాధిక నిరుద్యోగుల సేనలో కలిసి, దక్షిణాదికి యెగబడిపోయాడు. ఈ దుర్దశలో ఫాస్టుచేసి విడిచిపెట్టని వుద్యోగమంటూ ఏదీలేదు. బట్టలు వుతకడం దగ్గరనుంచి ఆనకట్ట కట్టడంవరకూ గల వివిధ క్షుద్రవుద్యోగాలను చేయవలసివచ్చింది. కాని యీ కాలంలోనే ఫాస్ట్‌మనశ్చక్షువు విప్పారింది. హృదయవైశాల్యం అతిశయించింది. తోటికష్టజీవులపట్ల సహానుభూతి యేర్పడింది.

1933 లో మొట్టమొదటి కథ ప్రచురించాడు. 1934 లో 'పాపలు' వెలుగుచూచింది. 1935 లో బ్రెడ్‌లోఫ్ స్కాలరుషిప్ సంపాదించాడు. 1936 లో అన్ని యితర పనులను వదలిపెట్టి రచనారంగంలో పూర్తిగా దూరాడు. 1939 లో ఓక్లహోమా రాష్ట్రంలోని ఇండియన్ రిజర్వేషన్‌లోవుండి, యీనవలకు యితివృత్తాన్ని సేకరించాడు. తర్వాత అన్‌వేంక్విష్డ్, స్పార్టకస్, ప్రౌడ్ అండ్ ది ఫ్రీ, సైలాస్ టింబర్మన్ వంటి నవలలూ, అమెరికన్ గత చరిత్రకు, ముఖ్యంగా స్వాతంత్ర్యయుద్ధదశకు సంబంధించిన కథానికలూ, పీక్‌స్కిల్ వుదంతంవంటి సమకాలిక ఘటనలకు సంబంధించిన వ్రాతలు, ఒకటి రెండు నాటకాలు,

బహుకొద్ది పద్యాలూ వ్రాశాడు, అంతేకాదు. అంతర్యుద్ధకాలానికి సంబంధించిన నీగ్రో జనుల జీవితవిషయాలను పరిశీలించి 'ఫ్రీడంరోడ్' అనే నవలనూ, అసమాన దేశాభిమాని, స్వాతంత్ర్యభావ ప్రచారదక్షుడు, నిర్భయుడు, ప్రజాతంత్రవాదీ అయిన టాంపేన్ గురించి "సిటిజన్ టాంపేన్" అనే నవల వ్రాశాడు. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలంలో, యుద్ధభోగట్టా కార్యాలయంలో చేరి, సైనిక, రాజకీయ విషయాలనుగురించి అనుదినం వ్యాఖ్యానాలుచేసేవాడు. ఈ వ్యాఖ్యానాలను లండన్‌కు ప్రతిరోజూ ఫోన్ చేస్తే, అక్కడ బి. బి. సి., వివిధ భాషల్లోకి తర్జుమాచేసి యూరపు ఖండాంతర నానాదేశాలకు ప్రసారం చేసేది. యుద్ధానంతరం పెల్లు లేచిన సమ్మె వెల్లువను గురించి ఫీచర్ కథలను ప్రకటించాడు. చికాగో నగర కార్మిక సమస్య గురించి మరొక పుస్తకం వెలువడింది.

అబ్రహాం లింకన్, థామస్ జఫర్సన్, వాల్ట్ విట్మన్, టాంపేన్‌లవంటి ప్రజాతంత్రవాదుల చాలులోనివాడు ఫాస్ట్. తన బ్రతుకులో యెన్నడూ నమ్మిన సిద్ధాంతాలను మార్చుకోని గుండె దిటవుకలవాడు. సామాన్య అమెరికన్ల మనస్సులకు, అమెరికా ప్రజాతంత్ర సంప్రదాయాల మలుపులకు, ఫాస్ట్ రచనలు ప్రాణవంతాలైన నిలువుటద్దాలు. కనుకనే అమెరికాలో రెండవ పక్షమైన ధనస్వాములకు ఫాస్ట్ రచనలు గంగవెర్రులెత్తిస్తున్నాయి. పెద్ద పెద్ద ప్రచురణ సంస్థలు వీటిని బాయ్‌కాట్ చేస్తున్నాయి. ఇటీవలనే ఒక సంస్థ, ఫాస్ట్ నవల నొకదానిని ఆరులక్షల ప్రతులు ముద్రించి, నష్టమనిగాని యెంచని భయవిహ్వలతకు లోనై, తగులబెట్టించినట్లు వార్త. ప్రభుత్వ వర్గాల దృష్టిలోకూడా ఫాస్ట్‌పితూరీదారు. అందుచేతనే యిటీవల కొన్ని మాసాలపాటు ఆయన చెరపట్టబడినాడు. ఈ ఆంక్షలనూ నిర్బంధాలనూ లెక్కించక, ఫాస్ట్ ప్రజాతంత్ర ధ్వజం చేదాల్చి విశ్వమాన్యు డయ్యాడు.

హోవర్డ్‌ఫాస్ట్ కీర్తిని చిరస్థాయి చేయగల్గినవి ఆయన రచించిన అమెరికన్ చరిత్రాత్మక నవలలు. "చరిత్రను గురించి హోవర్డుఫాస్టు రచించేకొద్దీ, దాని అంతర్యాలు, లోలోతులు యితోధిక విశాలాలై, గభీరాలై, యదార్థాలై కనుపిస్తాయి" అని డరోథీ కాన్‌ఫీల్డ్ వ్రాసింది. ఆయన నవలలలో ఉద్రేకాలు త్రొక్కిసలాడుతాయనీ, ఉత్సాహాగ్ని ప్రజ్వలిస్తుందనీ, నిత్యనూతన సృజనాశక్తి ఎప్పటికప్పుడు ప్రస్ఫుట మవుతుందనీ ఆర్విల్ ప్రెస్కాట్ వ్రాశాడు. అమెరికన్ గత చరిత్ర తిరిగి యీ నవలలో యథాతథంగా జీవిస్తుంది. అందుచేతనే విమర్శకులు యావన్మందీ అమెరికన్ చరిత్రాత్మక నవలాకారులకు తలమానికమని ప్రస్తుతించారు.

ఈ నవలను గురించి "శాటర్‌డే రివ్యూ ఆఫ్ లిటరేచర్"లో సమీక్ష చేస్తూ, "గంతువేసి అందుకొని, అచ్చమైన ఆనందంకోసం ఉద్రేకంకోసం చదువ

వచ్చు"నని ఆలివర్ లా ఫార్జ్ 1941 జూలై 26 సంచికలో వ్రాశాడు. ఇందులో వర్ణింపబడిన కథా విషయాలలో ఒక్కటి అబద్ధమైనా లేదని ఫాస్ట్, ఈ నవలకు మలిపలుకులో వ్రాశాడు. కెప్టెన్ ముర్రే పాత్ర ఒక్కటే తాను కల్పించానని మిగత పాత్ర లందరూ అప్పుడు జీవించి, తాను వర్ణించిన విధంగానే ఈ వ్యవహారంలో పాల్గొన్న వ్యక్తులనీ, అన్నాడు.

స్ట్రూథర్‌బర్ట్ వ్రాసిన "పౌడర్ రివర్" అనే గ్రంథం చదువుతూవుంటే, యీ కథ క్లుప్తంగా తగిలింది. వెంటనే ఫాస్టుకు ఆసక్తి యెక్కువయింది. సమస్త మానవ చరిత్రలోనూ అపూర్వమైన భయంకర పోరాటం యిందులో యిమిడి పోయిందనీ, దీని వివరాలు సేకరించగలిగితే, వ్యక్తి స్వేచ్ఛ నిమిత్తమై మానవుడు శతాధికావరోధాల నెదుర్కొని సలిపిన మహాసాహస సంగ్రామ కథ విష్వార కలదనీ ఫాస్ట్ ఆశించాడు. పరిశోధన కుపక్రమించాడు. అబద్ధాల పుట్టలు, కల్పనా కథలు- ఆధారాలులేని ఆరోపణలు, దూషణలు నాటి పత్రికలలో కనుపించ సాగినవి. ఇట్లా కాదనుకొని, యీ కథా వృత్తాంతం ఎక్కడ ప్రారంభమయిందో ఆ చోటికి — అంటే, ఓక్లహోమా రాష్ట్రంలోని చెయిన్నీ తెగ ఇండియన్ల రిజర్వేషనుకు ప్రయాణంకట్టాడు. కాని అక్కడ వుండిన వృద్ధులు, యీ కథా విషయాలన్నీ మనసులో గాఢంగా ముద్రింపబడికూడ, యింగ్లీషు భాషలో వివరించలేకపోయారు. కాని వారు జ్ఞాపకం చేసికొని చెప్పిన విషయాలే యీ నవలా రచనలో యెక్కువగా వుపకరించాయి. ఓక్లహోమా విశ్వవిద్యాలయం వారూ, యింగ్లీషు చదువులు సాగిస్తున్న కుర్రకారు యిండియన్లూ కొంతకు కొంత సాయపడ్డారు. జార్జ్ బర్డ్ గ్రిన్నెల్ చెయిన్నీల ఆచార వ్యవహారాలను గురించి వ్రాసిన గ్రంథ విషయాలుకూడ రచయిత యథేచ్ఛగా వాడుకొన్నాడు.

ఆనాటి అమెరికన్ పత్రికలు కొన్ని, 'న్యూయార్క్ హెరాల్డు' వంటివి యథార్థాన్ని కప్పిపెట్టాయి. పదుగురాడినమాట చెల్లినన్నాళ్ళూ చెల్లింది. కాని యిన్నాళ్ళకు, జరిగిన వాస్తవాన్ని తిరిగి అమెరికన్లకు ఫాస్టు చూపకలిగినాడు. ఆనాడు మున్నూర్గురు చెయిన్నీ యిండియన్లు స్వేచ్ఛ నభిలషించి మహాప్రస్థానం చేశారు. "ఈనాడు ప్రపంచమంతటా జనులు శత లక్షాధికులు స్వేచ్ఛకొరకు మహాప్రస్థానాన్ని ప్రారంభిస్తున్నారు," అని మలిపలుకులో ఫాస్టు వ్రాసిన మాటలతో శెలవు తీసుకుంటాను.

గూడూరు
మే 1956

కె. వి. రమణారెడ్డి
అనువాదకుడు.



## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | AAL02D130 | Date | 2/10/21 |
| Front Cover | yes | Back Cover | NO |
| Blank Pages | CT, 6, 8, 12, 54, 80, 142, 164, 190 | | |
| Missing Pages | NO | | |
| Prepared | Lakshmi | Scanned | Lakshmi |
| BOOK SIZE | H 8.0 W 5.1 | Pages | 240 |

